

# విజయవిలాసానుశీలనము




ఆచార్య కలిదిండి వెంకటరామరాజు

భాషాప్రవీ , యం.ఎ., పిహెచ్.డి.

ఆంధ్రజనహృదయ కేదారములలో మధుర శృంగార రసామృత
వాహినిని చమత్కార విన్యాసరమ్యముగా ప్రవహింపఁ జేసిన
చేమకూర వేంకటకవికి భక్తిపురస్సరముగా సమర్పింపఁబడిన
మదీయ పద్యప్రసూన మాలిక :

శా॥ సారోదారగభీరభావకలనాశయ్యా చమత్కారరే
ఖారాజద్రసవైభవస్ఫురదసంఖ్య శ్లేషలవ్ జాతివా
ర్తారమ్యంబుగ నాయితంపఱచి నృత్యద్భారతీపాదమం
జీర ప్రేంఖితకింకిణీ ఘుమఘుమ స్ఫీత ధ్వని ప్రౌఢిమల్
చూరంబెట్టిన చేమకూర కవిరాజున్ గొల్చి యాంధ్రత్వసం
స్కారం బున్నిలఁబెట్టుకోఁదలఁతు వాక్కాంతానుకంపావిధిన్

# అభినందనము

ఆచార్య తూమాటి దొణప్ప,
ఎమ్.ఎ.,పి.ఎచ్.డి;డి.లిట్.
ప్రిన్సిపాల్,
యూనివర్సిటీ కాలేజి,
నాగార్జున విశ్వవిద్యాలయము,

నాగార్జుననగర్
1-9-'83

ఆచార్య కలిదిండి వెంకటరామరాజుగారు చిరకాలంగా మాకు హితులు; సన్నిహితులు. సంస్కార ప్రతిపత్తి, గురుకులక్లిష్టమైనవ్యుత్పత్తి, వినయసుందరమైన శీలసంపత్తిముప్పేటగా మూర్తికట్టిన సరస సాహిత్య సత్యవ్రతులు శ్రీ రాజుగారు. అటు పాశ్చాత్యవిమర్శనరీతులను, ఇటు ప్రాచ్యసాహితీ విశ్లేషణపద్ధతులను సమపాళంగా సానపట్టి సమన్వయ పరచుకున్న సారస్వత పట్టభద్రులు.

చేమకూర వెంకటకవి "చేమకూరపాకానపడ్డ" దన్న అభాణకానికి నోచుకున్న సాహితీస్రష్ట. పరిపాలనాదక్షుడుగా, విద్యావినోదదీక్షితుడుగా, సాహితీ సమరాంగణ సవ్యసాచిగా పేరుపొందిన అపరకృష్ణరాయలు తంజాపుర రఘునాథరాయులను కృతిపతిగా చేసుకోగలిగి "వాక్ప్రియమరూఢి నీయంతవాఁడెఁకేడి" అన్నశతపత్రం పొందిన ధన్యమూర్తి చేమకూర వెంకటకవి.

చేమకూరవారి రచనలలో విజయవిలాస ప్రబంధానిది ప్రథమస్థానం. తాపీ, వేదం, దీపాలవంటి సాహిత్యవిమర్శనాశిల్పులను ఆకట్టుకోగల్గిన మహితకవితామూర్తి ఈ ప్రబంధము. దీనిపై చేయివేయని ఆధునిక విమర్శకులులేరు. ఇందలి రసోచిత నిబంధననుచూచి, తలయూచిమెచ్చని మనీషులూ లేరు.

ఆనాటి చారిత్రికనేపథ్యాన్ని సంభావించి, ముద్రితా ముద్రితప్రతులను అనుశీలించి, పూర్వ పరిశోధకుల సృష్టిని పరిశీలించి, తమ ప్రతిభా వ్యుత్పత్తులను జోడించి, ఈ సిద్ధాంత వ్యాసాన్ని రూపించి ఆంధ్ర విశ్వ విద్యాలయమునుంచి పిహెచ్.డి పట్టాన్ని సాధించిన ఉత్తమ పరిశోధకులు శ్రీరాజుగారు.

"ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా" అని చేమకూర వెంకన్న కొందరు దుర్ముఖుల పలుకులకులికిఅన్నాడుగాని అన్ని గురుకులాలకు, అన్నికులాలకూ చెందిన శేషుప్రిమతులంపరియూ శ్రీరాజుగారి యీ కృషిని మెచ్చి తీరుతారు. ఇది ఆచారోక్తి కాదు.

చారిత్రకనేపథ్యాన్ని సవదరించడంలోను, ఇతి వృత్త నిర్మాణాన్ని విశ్లేషించడంలోను, కావ్యనామౌచిత్యాన్ని సమర్థించడంలోను, కవితా శిల్ప రీతులను సమీక్షించడంలోను, జాతివార్తా చమత్కార ప్రకారాలను నిరూపించడంలోను, శృంగార భంగిమలను వింగడించడంలోను, సమకాలిక సామాజికాదిస్థితిగతులను ప్రదర్శించడంలోను, పాఠాంతర పరిష్కార పద్ధతులను పరికల్పించడంలోను - అందునా యిందు నా అనిపేరుపేర చెప్పడమెందుకు — ఈ సిద్ధాంత వ్యాసమందంతటా శ్రీ రాజుగారి కైవాడం కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది.

జ్ఞాన తీర్థం అపారం, అగాధం. తీర్థికుల ప్రజ్ఞాప్రాభవాలనుబట్టి దాని అనుపానులు ఆవిష్కరించబడుతుంటాయి. అందుకే "వ్యాఖ్యా బుద్ధి బలాపేక్షా" అన్నారు పెద్దలు. సకలగుణసంవర్ధనమైన శ్రీరాజుగారి శబ్దార్థ దాంపత్యం పెద్దలమదికెక్కిన వాచస్పత్యం. "కిం విదగ్ధమనసామగోచరః". చేమకూరపాకాన్ని సకల తత్త్వార్థ శ్రీకంగా వార్చి వడ్డించిన శ్రీరాజుగారి హస్తవాసికి హార్దికాభినందనలు.

# నివేదనము

విజయవిలాసప్రబంధము నాత్మకవితా సుందరీ విజయవిలాసముగా తీర్చిదిద్ది చేమకూర వేంకటకవి దక్షిణాంధ్ర యుగ కవులలో నగ్రగణ్యుఁడై నాఁడు. తెలుఁగు ప్రాంతమునకు దూరముగా తమిళనాడు నడిబొడ్డున నున్న తంజావూరులో సహృదయ సార్వభౌముఁడైన రఘునాథనాయకుని యాస్థాన కవివర్యుఁడై తెలుఁగునుడికారపు సొంపును, తెలుగు సాహిత్య మాధుర్యమును నటు తమిళులకు, నిటు తెలుఁగువారికిని తన విజయ విలాస రమణీయ రచనారూపమున నందించి రసికజన హృదయములను స్పందింపఁజేసిన మాన్యకవివరుఁడితఁడు. ఇతని కవితా విశ్వరూపమున కొట పట్టైన విజయవిలాస ప్రబంధమును సమగ్రముగ పరిశీలించి, యవతారికాంతర్గత చారిత్రకాంశములను, కృతి కర్త, కృతి భర్తల జీవిత విశేషములను సప్రమాణముగ వివరించి ప్రతి పద్య చమత్కృతిశోభలరారు నీ ప్రబంధ శిల్ప సౌందర్యమును, జాతివార్తాది విశేషములను నీ గ్రంథమున నిరూపించుటకు ప్రయత్నించితిని.

తంజావూరు, మద్రాసు, తిరుపతి, హైదరాబాదు, ఏలూరు, రాజమహేంద్రవరము, కాకినాడ, వాల్తేరు మున్నగు పట్టణములందలి గ్రంథాలయములలోనున్న ముద్రితాముద్రిత ప్రతులు; జూలూరి అప్పయ్యశాస్త్రి, వేదము వేంకటరాయశాస్త్రి, తాపీ ధర్మారావు, బులుసు వేంకటరమణయ్య మొదలగు పండిత ప్రకాండులీ విజయ విలాసముపైఁ జేసిన వ్యాఖ్యానాదిక రచనలు మొదలు సంచిగా పరిష్కృత సమీక్ష రీతినిందు తలస్పర్శముదా సాగించియున్నాను. ఇందు ప్రథమభాగమున చారిత్రికనేపథ్యము. ద్వితీయ భాగమున ప్రబంధానుశీలనమును సంతరించియున్నాను.

పరిశోధనచేయుటకు నాకనుమతినిచ్చియేతత్సారస్వత విమర్శనాత్మక కృషిని ప్రోత్సహించిన యాంధ్ర విశ్వవిద్యాలయము వారికి కృతజ్ఞతాంజలి. నా పరిశోధనకు సూత్రధారిత్వము వహించి. ప్రజ్ఞాపాటవాలు ప్రతిస్పందించునట్లు సముచిత సూచనలు చేయుచు నీ సిద్ధాంతవ్యాస నిర్మాణమునకు సహృదయతతో సహకరించి తమయమూల్యాభిప్రాయముల నొసఁగిన యాచార్య శ్రీ తూమాటి దోణప్పగారికి నా కృతజ్ఞతాపూర్వకాభివందన మందారములు.

నా పరిశోధన కార్యక్రమమునకు నైతిక బలమును చేకూర్చి యీ సాహితీ విమర్శనాత్మక వ్యాసంగమునకు సమధిక ప్రోత్సాహ ప్రోద్బలములను చేకూర్చిన చింతలపూరి నారాయణరాజు కళాశాల పాలక వర్గమునకు నాటి యధ్యక్షులు కీ॥శే॥ శ్రీ గాదిరాజు జగన్నాథరాజుగారికి నాస్మృత్యంజలి; నేటి యధ్యక్షులు శ్రీ గోకరాజు రంగరాజుగారికి, కార్యదర్శులు శ్రీ గొట్టుముక్కల సీతారామభద్రరాజుగారికిని నా కృతజ్ఞతాపూర్వక నమస్సుమములు.

నా పరిశోధనకవసరములైన వసతులు సమకూర్చి ముద్రితాముద్రిత గ్రంథావళిని చూచుట కనుమతినిచ్చి సౌజన్యముతో సహకరించిన తంజావూరు సరస్వతీమహల్ గ్రంథాలయము, మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము, అడయార్ లైబ్రరీ, తిరుపతి శ్రీవేంకటేశ్వర యూనివర్శిటీ ఓరియంటల్ రీసెర్చి ఇన్‌స్టిట్యూట్, శ్రీ వేంకటేశ్వర యూనివర్శిటీ గ్రంథాలయము, హైదరాబాదు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్సు లైబ్రరీ, ఉస్మానియా యూనివర్శిటీ లైబ్రరీ, కృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయము రాజమండ్రి గౌతమీ గ్రంథాలయము, రాళ్లబండి సుబ్బారావు రీసెర్చి ఇన్‌స్టిట్యూట్, కాకినాడ పరిషద్గ్రంథాలయము, ఆంధ్రాయూనివర్శిటీ లైబ్రరీ మున్నగువాని యధికారానధికార వర్గములకు నా కృతజ్ఞతాంజలి,

నా పరిశోధనకుపయోగపడిన గ్రంథములకు, వ్యాసములకును కర్తలైన సహృదయ సారస్వతమూర్తులందరికిని నా వందనములు.

ఈ గ్రంథ సుందరముద్రణకు సహకరించిన మిత్రులు శ్రీ V.V.S. శివరామకృష్ణయ్యగారికి, ఆదర్శ ప్రింటర్స్ యజమాని శ్రీ పాల్‌రాజు గారికిని నా అభినందనలు. ముద్రణతోపాటు నా గ్రంథ భారతీ నవోదయ రేఖల నాకర్షణీయముగ తీర్చిదిద్దిన సదయులైన, ఉదయినీ ముద్రణాలయ యజమానులైన పెన్మెత్స రామచంద్రవర్మకు, నతనిసోదరులకు నా కృతజ్ఞతాపూర్వకాభినందనలు. నా పరిశోధన కనుకూల వాతావరణమునేర్పఱచి, సహనశీలములో నడుగడుగున సహకరించిన నా సహధర్మచారిణి శ్రీమతి వర్ధనమ్మకు నాయాశీః కుసుమములు.

— రచయిత

# విషయానుక్రమణిక

# కవిజీవితాదికములు

దక్షిణాంధ్రయుగకవీశ్వరులలో చేమకూర వేంకటకవి యగ్రగణ్యుఁడు. అతనికి వేంకటరాజు, వెంకటప్ప, వెంకన్నయను వ్యావహారిక నామాంతరములు గానవచ్చుచున్నవి. క్రీ శ 1614–1633 సం. ల నడుమ తంజావూరు రాజ్యమును పరిపాలించిన రఘునాథనాయకుని యాస్థానకవివర్యుఁడు. సారంగధరచరిత్రవిజయవిలాసములను నుత్తమ ప్రబంధములను రచించి యతఁడు కవియు, పండితుఁడు, సరసుఁడు నైన యాప్రభువర్యుని మన్ననలనందుకొనినాఁడు, కమనీయకవితావిన్యాసములకు, పరాకాష్ఠదశలో చిత్రింపఁబడిన శృంగారరసభంగిమలకును నాటపట్టుగ తన విజయవిలాసప్రబంధరాజమును తీర్చిదిద్ది యా కవితల్లజుఁడు విశిష్టవిఖ్యాతితో విలసిల్లినాఁడు. ఆరసవత్కావ్యకన్యను చేఁబట్టి రఘునాథుఁడు ధన్యుఁడైనాఁడు.

వేంకటకవి తన విజయవిలాసాశ్వాసాంత పద్యములలో "చేమకూరలక్ష్మణామాత్యతనయ............"అని చెప్పికొనుటనుబట్టి యతఁడు లక్ష్మణామాత్యుని కుమారుఁడని తెలియుచున్నది. తనగ్రంథములందెచ్చటను తన కులగోత్రాదులను ముచ్చటించియుండలేదు. తమ గ్రంథపీఠికలలో నాత్మవంశచరిత్రలను నాతివిస్తరముగ చెప్పికొనుటయాంధ్రకవుల సత్సంప్రదాయము. తన విజయవిలాసపీఠికలో రఘునాథనాయకుని యుత్తమ గుణగణములతో పాటతని వరవంశక్రమవర్ణనచేసిన యాకవీంద్రుఁడేలనో యాత్మవంశవర్ణన చేసికొనలేదు "వేంకటకవి శూద్రుఁడని చరిత్ర పరిశోధనవలన తెలియుచున్నది"[1]యని వేదము వెంకటరాయశాస్త్రిగారొక సందర్భములో చెప్పియున్నారు కాని యాచరిత్ర పరిశోధనారీతిని తెలిపియుండలేరు "చేమకూర వేంకటకవీంద్రుని కులమేదో చరిత్రశోధకులిప్పటికిని నిర్ణయింపలేకున్నారు",[2] అని యాశాస్త్రి

---

1 సారంగధరచరిత్ర విజ్ఞప్తి–వేదము వెంకటరాయశాస్త్రిగారు–1910 సం॥

2 విజయవిలాస విజ్ఞప్తి వేదము–వెంకటరాయశాస్త్రిగారు–1911 సం॥

గారే మఱొక సందర్భములో పేర్కొనియున్నారు. శాస్త్రిగారి యీయభిప్రాయములు రెండును పరస్పరవిరుద్ధములుగనున్నవి. కుల విషయమున వేంకటకవి కొంత కళంకముగలవాఁడనిజనశ్రుతినిబట్టియేకాక యితర ప్రమాణములనుబట్టికూడ తెలియుచున్నది.

పూర్వమొకప్పుడు బుచ్చివెంకనునొకకవి వెంకటాద్రిరాయుని యాస్థానమునకేగినపుడాప్రభువు "బుధజనాటవ్యటన్వ్యంకు బుచ్చివెంకు" అని పేర్కొనఁగా మఱియొకఁడు

కం. కొంకక తమరాడినపలుకది
బొంకేలగు వేంకటాద్రిభూపాలక యీ
న్వ్యంకేల? వానికింగల
అంకేయి వ్వోటపసిలుపరసవంతమగున్

అని నిందాగర్భితముగపలికినాఁడట. దానికి సమాధానముగ బుచ్చివెంకుకవి

ఉ. పన్నినసత్ప్రబంధమున బాగుననోగునుజూడకేసుచే
మన్ననమాలి మాకులముమాటఁ దలంతురె? చేమకూర వెం
కన్నకు లోపమేమి? కులమూకవినానకు? వేంకటాద్రిరా
జన్న గణించి మీరలు దయామతిఁ బ్రోచినఁ జాలదేయిటన్?[3]

అను పద్యమును సరసచాటుధారలో చెప్పినాఁడట. బుచ్చివెంకు తన కులనైచ్యమును సమర్థించుకొనుటకీపద్యములో చేమకూర వేంకటకవి నుదాహరించుటనుబట్టి వేంకటకవికూడ నీచకులస్థుఁడని తోచును.

ఆ వెంకటాద్రిభూపాలుఁడు రఘునాథునకు సమకాలికుఁడుగ భావింపఁబడుచున్నాఁడు. అతఁడు 16వశతాబ్దముపూర్వార్థముతరువాత కృష్ణానదీతీరమునందలియమరావతిని రాజధానిగఁ జేసికొని కొంత తెలుఁగుదేశమును పరిపాలించినట్లు తెలియుచున్నది.[4] దీనినిబట్టి

3 చాటుపద్యరత్నాకరము పుట 162

4 చాటు పద్యమణిమంజరి పుట 46

మాకమ్మప్రభువు 16వ శతాబ్దపు తుది భాగములోను, 17వ శతాబ్దపు తొలిభాగములోను వర్ధిల్లినట్లు భావింపనగును. ఆ సన్నివేశమునుబట్టి బుచ్చివెంకుచేమకూర వేంకటకవియును సమకాలికులైయున్నట్లూహించవచ్చును. వేంకటకవి రఘునాథనాయకునకు తనవిజయవిలాస కృతిని సమర్పించినసందర్భమున చెప్పినపద్యములనుబట్టి యతని కులస్థితిగతులు కొంతవరకు ఊహించుటకవకాశములభించినది. "కృతిరత్నంబున్ కేవల భక్తినికానుకగానిచ్చెద"[5] అని, "నాపాలిటిరామభద్రుఁడని బంగరు పూవులఁ బూజచేసి........సత్కృతికానుకచేసి"[6] అని, నా పాలిటిరామ భద్రుఁడని బంగరు పూవులఁ బూజచేసి....... సత్కృతికానుకచేసి"[6] అని "ప్రబంధములెన్నియేని మీపేరిటనంకితంబిడిన బిడ్డల నెందరఁ బేరుపెట్టినన్ దీరునె మీఋణంబు"[7] అనియు వేంకటకవి కడువినమ్రభావముతో కృతజ్ఞతా సూచకముగ తనప్రభువును ప్రశంసించుటలో నతనికులహీనస్థితి కొంత ధ్వనించుచున్నది. రాజును దేవునిగాభావించి, బంగరుపూలతో పూజచేసి యతనికి తనకృతినిభక్తి పూర్వకముగా సమర్పించుట, తనతనయులకా రాజ పేరుపెట్టి తనఋణమును దీర్చుకొనుట యనునాటియాత్మగౌరవముగలనియోగిబ్రాహ్మణకవులకుతగని పనులు బ్రాహ్మణులయందపారభక్తి తాత్పర్యములుగల రఘునాథుఁడు బ్రాహ్మణకవిచేనట్టివ్రాఁతల వ్రాయించుకొనుట పొసఁగదు. వేంకటకవి తానైయర్థించి రఘునాథనాయకునకు తనకావ్యమునంకితముగావించినాఁడు. ఈ విషయము

గీ. కలనయిన మిమ్ముఁగాకన్యుఁగొలువనంటి
కృతులొకరికీను మీకెయంకితములంటి[8]

5 వి. వి పీఠిక ప 34

6 వి. వి. పీఠిక ప 38

7 వి. వి. పీఠిక ప 39

8 వి. వి పీఠిక ప 48

అను పద్యమునుబట్టి తేటపడుచున్నది. ఈ సన్నివేశముగూడనతనికుల హీనస్థితిని కొంతవఱకు సూచించుచున్నది. మఱియు

గీ. క్షత్త్ర ... మ్మెకద నీకుఁగలది మొదలఁ
దమ్ములు సుతుల్ హితులుగూడ మమ్ముఁగొలిచి
తిపుడు కృతియను జెప్పి మాకింపొనర్చి
తౌకటఁగా దన్నిటను బ్రయోజకుఁడవీవు.

అను పద్యమునుబట్టి యతఁడు రఘునాథునిసేవకవర్గములోనొకఁడని స్పష్టపడుచున్నది. ఆకవీంద్రుఁడు శూద్రకులజుఁడను విషయము కొంతవఱకు నీపద్యములో ధ్వనించుచున్నది. అతఁడు శూద్రకులస్థుఁడని, రఘునాథుని సేనానాయకులలో నొకఁడై శౌర్యధైర్యములతో నారాజేంద్రుని జైత్రయాత్రిలలో పాల్గొనెడివాఁడని, తనసరసప్రబంధమునారసికరాజవతంసునకునంకితముగావించి యతనిరసతరంగితహృదయమునకానందమును చేకూర్చినాఁడనియు నాపద్యమునుబట్టి తెలియుచున్నది. అసలు "క్షత్త్రధర్మమ్మె.........." అను పద్యము తంజావూరు TMSS సమగ్రతాళపత్రిప్రతిలో (M.253) కానరాదు. వేంకటకవి స్వయముగ రఘునాథుని యుద్ధములలోపాల్గొని యావీరవరుని శౌర్యధైర్యములనుప్రత్యక్షముగఁ జూచి యతని సమరవిజయాత్మకవీరగాథలను సూచించు "సమరనిశ్శంక రఘునాథసాహసాంక"10 యను మనోహరమకుటముతో నిరర్గళకవితాధారలో నేడుసీసపద్యములనేకధాటిగారచించి యారాజశేఖరుని విఖ్యాతవిజయములకక్షరనీరాజనముపట్టినాఁడు. తనకులహీనస్థితిని తెలుపుటకిష్టములేక కాఁబోలు వేంకటకవి తనవిజయవిలాసావతారికలో తన వంశమును వర్ణింపకుండ విడచినాఁడు. తిరుపతివేంకటకవులు తమ కలగూరగంపలో

9 వి. వి. పీఠిక ప 51
10 వి. వి. పీఠిక ప 40—46

చ. విజయవిలాసకర్తసువివేకి మహాకవి యన్యజాతికిన్
ద్విజనకు నుద్భవించిన సుధీతిలకుండు........

అను పద్యములో వేంకటకవిజన్మరహస్యమును వెల్లడించుటకు ప్రయత్నించినారు, అన్యజాతియనఁగా నిచ్చట శూద్రజాతియని వారి యభిప్రాయము. కానివారట్లు చెప్పుటకాధారములెవ్వియో తెలియరాకున్నవి. నాయుళ్లలోనిప్పటికినిచేమకూరవారున్నారని, వేంకటకవికూడ నావంశములోనే పుట్టియుండుననియు తాపీధర్మారావుగారు చెప్పియున్నారు.[11] తన గ్రంథములందలి యాశ్వాసాంతగద్యములలో తనతండ్రి పేరు మాత్రముచెప్పి తల్లి పేరు చెప్పకుండుట, తన గ్రంథావతారికయందెచ్చటను తనకులమును పేర్కొనకుండుట, శూద్రుఁడగు కృతిభర్తకతఁడు నమస్కరించుటయునతనికులహీనస్థితిని సూచించుచున్నవి.

చేమకూర వేంకటకవి తన విజయవిలాసాశ్వాసాంత గద్యములో తాను లక్ష్మణామాత్యతనయుఁడనని చెప్పికొనియుండుటనుబట్టి యతఁడు నియోగిబ్రాహ్మణుఁడై యుండునని శిష్టా లక్ష్మీకాంతశాస్త్రిగారూహించియున్నారు.[12] ఆమాత్యశబ్దవ్యవహృతులగునాంధ్రకవులు సాధారణముగ నియోగులైయుండుట యీ యూహకొకబలమైనయాధారముగఁగానవచ్చుచున్నది. కాని యతఁడట్టి బ్రాహ్మణకులస్థుఁడే యైనచో తనకులగోత్రాదులను సగర్వముగ చెప్పికొనియుండెడివాఁడే, అతఁడు నిజముగ నమాత్యవంశమునకుచెందినవాఁడేయైనచో తన నామమునకుకూడ నమాత్యశబ్దమును చేర్చుకొనియుండెడివాఁడే. అతనికట్టియమాత్యవ్యవహారమున్నట్లెచ్చటను కానరాదు. ఒకొక్కప్పుడితరకులజులు కూడ తమరాజనీతివైశారద్యమునుబట్టి మంత్రి

11 విజ్ఞాన సర్వసము, సం, 3, పుట 1109

12 తంజావూరు తెలుఁగు కవులు-శిష్టాలక్ష్మీకాంతశాస్త్రి-పుట 58

త్వమును నెరపినపుడు వారినికూడ నమాత్యులని వ్యవహరించుటకలదు, అందుచేత నమాత్యశబ్దవ్యవహారము బ్రాహ్మణకులనిర్ణయమునకు బలీయసాధనము కాఁజాలదు. సాధారణముగ బ్రాహ్మణకవులనే గుర్తించునప్పకవి తనలక్షణగ్రంథములో వేంకటకవివిజయవిలాసము నుండి కొన్నిప్రయోగములనుదాహరించి యుండుటనుబట్టి యతఁడు బ్రాహ్మణుఁడని నిర్ణయించుట యుక్తియుక్తము కానేరదు. లాక్షణికుల కట్టిపాక్షికదృష్టి నంటఁగట్టుటపాడిగాదు. అప్పకవి యొకవేళ యతనిని బ్రాహ్మణుఁడని భావించియున్నచోనది యతని భ్రమయేకాని చారిత్రక దృష్టితో చేసికొనిన నిర్ణయముకానేరదు. కృష్ణదేవరాయలు, బుద్ధారెడ్డి మున్నగు బ్రాహ్మణేతరకవులప్రయోగములనుగూడ ప్రామాణికము లుగ గుర్తించినయప్పకవికట్టియసంస్కారదృష్టినంటగట్టుట భావ్యము కాదు. వేంకటకవియొక్కతండ్రి పేరునకమాత్యపదమును జేర్చినంత మాత్రమునతఁడు నియోగిబ్రాహ్మణుఁడనుటకవకాశము లేదని యాచార్య శ్రీ కె. వి. ఆర్. నరసింహముగారు తమ దక్షిణాంధ్రవాఙ్మయ చరిత్రలో పేర్కొనియున్నారు. అతఁడు నియోగిబ్రాహ్మణుఁడని, క్రీ. శ. 17వ శతాబ్దిమధ్యకాలమునాటివాఁడని ప్రసాదభూపాలుఁడు చెప్పియున్నాఁడు.[13]

అతని విశిష్టప్రయోగాత్మకశైలిని బాగుగ పరిశీలించినచో వేంకటకవి యాంధ్రదేశీయుఁడని స్పష్టపడును. "ఈఁదాడన్నను మదనుఁడు కోఁడాఁడనువాఁడు"[14] అని యతఁడు ప్రయోగించిన సామెతలో నతని దేశీయతాముద్ర స్పష్టముగఁగానవచ్చుచున్నది. ఈదాడు కోడాడను గ్రామములు కృష్ణామండలములోని నందిగామకు నాలుగైదు యోజనముల దూరములోనున్నవి. నందిగామసీమలో నేటికినీసామెతను వాడుచున్నారు. వేంకటకవి నందిగామలో పుట్టి, పెరిగి పెద్దవాఁడై కమనీయకవిత్వమల్ల నేర్చి జీవికకొఱకై తంజావూరు వెళ్లి రఘునాథ

13 ఆంధ్రవిజ్ఞానము–ప్రసాదభూపాలుఁడు–సంపుటము 2, పుట 1115
14 వి. వి –ద్వి. ఆ., ప. 192

నాయకునాశ్రయించి యచ్చట స్థిరపడినట్లూహింపనగును. అతఁడు గోదావరీమండలవాసియని కొందఱు పేర్కొనియున్నారు. గానియట్లనుటకు తగినయాధారములు కానరాకున్నవి. "వాసవిత్రిదండి వేసము వేసి" అనియర్జునుని సన్యాసివేషమును విశిష్టాద్వైతమతసంప్రదాయానుగుణముగ వర్ణించుటనుబట్టి యాకవీంద్రునకుఁగల విశిష్టాద్వైతమతాభిమానము వెల్లడియగుచున్నది. రఘునాథభూపాలునకుఁగూడ నామతము నందట్టిప్రత్యేకాభిమానము కలదు.

"కులదేవతనుదెచ్చి నిలిపిరిమాణిక్య చకచకల్ గలపెండ్లిచవికెదండన్........"[15] అను సీసపద్యమునందు వర్ణింపఁబడిన సుభద్రార్జునుల వివాహపద్ధతి శూద్రవివాహవిధానమును పోలియున్నది గనుక నట్టి వర్ణనచేసిన వేంకటకవికూడ శూద్రుఁడై యుండునని యూహించవచ్చును. వేంకటకవి సైనికోద్యోగియై వీరపరాక్రమసాహసకార్యములలో రఘునాథనాయకునకు తోడ్పడియుండునని, యందువలననే తనకృతియందుయుద్ధవర్ణనలను పెక్కింటిని చేసినాఁడని, తనరాజువలె తానును కత్తితో కదనవిజయమునుగడించి సాహితీకదనవిజయముగూడ నెఱపుటకు కలమును చేపట్టినాఁడని, కులముచేత నమాత్యుఁడు కాకపోయినను వృత్తిచేత మంత్రియై, ధర్మముచేత శాస్త్రము నవలంబించియుండునని, యతనిపై కులముతక్కువతనమునాపాదించి నను గుణాఢ్యమునకు భంగము కలుగలేదని, యొకకవియొక్క గుణగణములు లెక్కించునపుడతని కావ్యగుణాతిశయమును మన్నించవలెనే కానియతని కులజాతిమతవివక్షతలతో పనిలేదని, "వాఙ్నియమరూఢినీయంతవాఁడెకేడి" యని యాత్మప్రభువర్యునిమన్ననలనందుకొనిన ధన్యజీవియనియు[16] శ్రీ యండమూరి సత్యనారాయణరావుగారు తమసరసవాఙ్గాలములో నాకవీంద్రునిగూర్చి చక్కఁగ చెప్పియున్నారు.

15 వి. వి.—ప్ర. ఆ., ప 95

16 శారదాధ్వజము—యండమూరి సత్యనారాయణరావు—పుటలు 209, 210, 211

వెంకటకవి తల్లిదండ్రులు సత్సంతాన కాంక్షతో సూర్యభగవానునారాధించి యాప్రత్యక్షదైవానుగ్రహముచేత నతనిని తనయునిగఁ బడసినారు. కనుకనే రఘునాథనాయకుఁడు "సామాన్యుఁడవే? సూర్యవర ప్రసాదివిజ్జగతిన్"[17] అని మనోహరవాగ్ధోరణిలో ప్రశంసించినాఁడు. మరియు నాసూర్యభగవానుని యనుగ్రహవిశేషముచేతనే తనకు కవితాశక్తిలభించినట్లు "ఇది సూర్యనారాయణవరప్రసాదలబ్ధ సారస్వత సుధాసారజనిత యశోలతాంకూర చేమకూరలక్ష్మణామాత్య తనయ...." అని విజయవిలాసాశ్వాసాంతగద్యములో సవినయముగ పేర్కొని యున్నాఁడు. తన విజయవిలాసకావ్యమును క్రీ. శ. 1620 ప్రాంతమున రఘునాథనాయకునకంకితము గావించియుండును. అప్పటికి వేంకటకవి వయస్సు దాదాపేఁబది సంవత్సరములుండియుండును. ఆ కృతిసమర్పణము నాటికతని తమ్ములు, సుతులు, హితులును రాజోద్యోగములు చేయుచున్నట్లు "తమ్ములు సుతుల్ హితులుగూడ మమ్ముగొలిచి" యని రఘునాథునినోటినుండి వెలువడిన వాక్యమునుబట్టి తెలియుచున్నది.

తనకు విద్యాగురువున్నట్లు వెంకటకవి యెచ్చటను పేర్కొని యుండలేదు. తనకు సూర్యనారాయణవరప్రసాదమువలన సారస్వత వైభవము లభించినట్లు సారంగధర చరిత్ర, విజయవిలాసాశ్వాసాంత గద్యములలో పేర్కొనియున్నాఁడు. కనుక నతఁడు ప్రసిద్ధ గురుపద్యుల కడకావ్యశాస్త్రాదివిద్యలనభ్యసించలేదని తేటపడుచున్నది. సారంగధర చరిత్రములోని "సదారాధితబుధసమాజ" అను పద్యమునుబట్టియతనికి పండితసమాజము నారాధించెడి సదభ్యాసమున్నట్లు తెలియుచున్నది, అట్టి బుధసమాజమును నిరంతరమారాధించుటవలన, కృష్ణాధ్వర్యాది సరసకవీంద్రసాహచర్యమువలన, కవియు, పండితుఁడు, రసికుఁడు, పరిపాలనాదక్షుఁడునైన రఘునాథనాయకునిసేవించుటవలన, నన్నింటికి మించిన వాగ్దేవీకటాక్షవీక్షణముచేతను వేంకటకవికి కమనీయకవితా

17 వి. వి. పీఠిక—ప. 49

శక్తియలవడినట్లూహింపనగును. శ్రద్ధతో దీక్షాయుత కృషి చేయుట వలన నతని కవితా ప్రతిభ పతాకస్థాయినందుకొనినది. అట్టి దృఢదీక్షయు కవితా క్రమ పరిణామస్థితియు నతని రెండు గ్రంథములను పరిశీలించినచో తెల్లమగును. తన తొలి రచనయైన సారంగధర చరిత్ర కరుణావిల కథా యుతము, రసాభాస వర్ణనాత్మకమునై యుండుటవలన రాజుయొక్క, పండితులయొక్కయు మెప్పులను పొందలేక పోయినాఁడు. అటుపైనా కవీంద్రుడు ద్విగుణీకృత దీక్షతో తన సర్వశక్తులను కేంద్రీకరించి విజయవిలాసమును సరస శృంగారభంగిమలకు, మనోహర కథా సన్నివేశములకు, జాతివార్తా చమత్కారములకు, శ్లేషయమకాదులకు, వటవర్ణనలకు సాటపట్టగునట్లు తీర్చిదిద్ది కవిపండిత ప్రశంసలనందుకొనినాఁడు.

వేంకటకవి భోగినీకులజుఁడని కొందరు వాదించియున్నారు. లక్ష్మణామాత్యునకు భోగకాంతయందు జనించినాఁడని వారియభిప్రాయము. సారంగధర చరిత్రలో రాజరాజనరేంద్రునకు చెందిన రత్నాంగి, చిత్రాంగి యను సుందరీ మణులను వర్ణించుచు వేంకటకవి చెప్పిన "కలరాయిలరాయనికిం గులసతి రత్నాంగి భోగపుటిలశిరోజా తిలకము చిత్రాంగియునన, నెలజవ్వను లిరువురంబుజేందునిభాస్యల్"[18] అను పద్యములో చిత్రాంగిని భోగినీ కాంతగ చిత్రించినాఁడు. మరియు నామెను చంద్రునితోపోల్చి యామె కళంకశీలమును సూచించినాఁడు. వేంకటకవి భోగినీ తనయుడైనచో నామెనట్లు చిత్రించియుండఁడని భావింపనగుఁను. అతని గ్రంథములందలి యాశ్వా సాంత గద్యములలో నతఁడు లక్ష్మణామాత్య తనయుఁడుగ పేర్కొనఁబడుట యా వాదమునకు ప్రతికూలముగ కానవచ్చుచున్నది. మరియు నతని వంశమునకు చెందిన చేమకూరప్పరాజు ద్వాత్రింశన్మంత్రుల చరిత్రలో పేర్కొనఁబడుటచేత నతనిని నియోగికులస్థునిగ కొందరు భావించు

18. సారంగధర చరిత్ర — ప్ర. ఆః ప. 6

చున్నారు. కాని వేంకటకవి తన తండ్రి నామమును పేర్కొనిన సందర్భములో "లక్ష్మణార్య" యనియున్నదో లేక "లక్ష్మణామాత్య" యనియున్నదో స్పష్టముగ చెప్పలేము "లక్ష్మణార్య" యనియతఁడు పేర్కొనగా లేఖకులు ప్రత్యంతరములను వ్రాయునపుడలవాటునుబట్టి "లక్ష్మణామాత్య" యని వ్రాసియుందురని యూహించుటకుకూడ నవకాశముకలదు. మరియు నమాత్యశబ్దమును నియోగికులసూచకముగవాడుచున్నారుకా్ని యాశబ్దవ్యుత్పత్తిని పరిశీలించినచోనట్టిభావన సమంజసమైనది కాదని తోచును సహవర్తత ఇత్యమాత్యః[19] అనువ్యుత్పత్తిన్ని కొందరు చెప్పియున్నారు. కూడనుండువాఁడని యర్థము. అనఁగారాజుకూడనుండువాఁడని యభిప్రాయము. ''అమాశబ్దస్సహార్థేనిపాతః అమా-మంత్రిణా సహవర్తత ఇత్యమాత్యః[20] అని లింగయసూరి దీని వ్యుత్పత్తిని చెప్పియున్నాఁడు. అనఁగా నాలోచనతోనుండువాఁడని యర్థము. ఈ వ్యుత్పత్తులనుబట్టి చూచినచో నమాత్య శబ్దము కేవలము నియోగి కులమునకు మాత్రమే పరిమితమైనది కాదని తెలియుచున్నది. విద్యావివేకసంపన్నత్వము, ధీపటిమయుఁగలవారెవరైనను మంత్రులు కావచ్చును. వేంకటకవి నియోగియేయైనచో ''క్షత్రధర్మమెకదనీకు కలదిమొదల" అని రఘునాథ నాయకుఁడతనిని గూర్చి చెప్పియుండఁడు. అతఁడు మొదట క్షత్రియ ధర్మావలంబకుఁడు. అనంతరదశలో కవితావ్యాసంగము చేసినాఁడు. మరియు తంజావూరు సరస్వతీమహల్‌లో, మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారములో, తిరుపతి ప్రాచ్యలిఖిత పుస్తకపరిశోధనాగారములో, కాకినాడ యాంధ్ర సాహిత్య పరిషద్గ్రంథాలయములోను కానవచ్చు విజయవిలాస తాళపత్ర ప్రతులు కొన్నిటిలో నీ కవీంద్రుని నామము ''చేమకూర వేంకటరాజు"

19. చేమరకూర వెంకటకవి – తాపీ ధర్మారావు – విజ్ఞాన సర్వస్వము – సంపు – 4 పుటలు 1108, 1109.

20. అమర కోశము – లింగాభట్టీయము – ద్వి. కాం. పు. 470

అని పేర్కొనఁబడినది. నా మాంతమందు వాడఁబడిన రాజ శబ్దమునుబట్టి యతఁడు క్షత్రియుఁడై యుండునని భ్రమపడుటకుఁగూడ నవకాశము గలదు, కాని యాధికారిక ప్రతిపత్తినిబట్టి క్షత్రియేతరులనుగూడ రాజులని వ్యవహరించుట పరిపాటియైనది. నాటి తంజావూరు మధుర నాయక ప్రభువులు క్షత్రియేతరులైనను పరిపాలనాధికారమునుబట్టి రాజులుగనే వ్యవహరింపఁబడిరి. అట్టి సన్నివేశములలో రాజశబ్దము పౌరుషమునకు, పరాక్రమమునకు, ముఖ్యాధికారమునకును చిహ్నముగ వాడఁబడినట్లు కన్పట్టును. అట్టే "చేమకూర వేంకటరాజు" అనుచోట వాడఁబడిన రాజ శబ్దము క్షత్రియకుల సూచకముకాదని, యతని యధికారమునకు, శౌర్య ధైర్యములకు, క్షత్రియ ధర్మావలంబకత్వమునకును సూచకముగ వాడఁబడినట్లు గ్రహింపనగును. అతఁడు తండ్రియింటి పేరుతో వ్యవహరింపఁబడియుండుటనుబట్టి భోగినీ తనయుఁడుకాఁడని తెలియుచున్నది. భోగినీ తనయులు తల్లుల యిండ్ల పేర్లతో వ్యవహరింపఁబడుదురు. వేంకటకవి నాయుడు కులమునకు చెందినవాఁడని తాపీ ధర్మారావుగారూహించియున్నారు. నాయుళ్లలోనిప్పటికిని చేమకూరవారు కానవచ్చుచున్నారు.

వేంకటకవి కులగోత్రాది చరిత్ర తెలిసికొనుట కూహతప్ప యితరాధారములుకానరావు. అతడు భట్రాజై యుండునని కొందరూహించియున్నారు. అట్లనుటకుఁగూడతగిన యాధారములుకానరాకున్నవి. "చేమకూర" యనునింటి పేరుతోనిప్పటికిని కొన్ని తెలగ కుటుంబములున్న కారణమున నితఁడు తెలగకులమునకు చెందిన వాఁడని కొందరు భావించుచున్నారు. కుల గౌరవముతో కవితా గౌరవమును ముడిపెట్టిన సమయములో కొందరు కవి పండితులతని సరసకావ్య మాధుర్యము నాస్వాదింపలేక కేవలము కుల నైచ్యమునుబట్టి యతని కవిత్వమును విమర్శించియుందురు. ఆ దుర్విమర్శకు వేంకటకవి కొంత వెతచెంది.

చ॥ శ్రీపయివట్ట్రమాఁకులు చిగిర్ప వసంతుఁడు తారసోపగుం
ఫిత పదవాసనల్ నెఱప మెచ్చక చంద్రుఁడు మిన్నునంబ్రన
న్మితయు సౌకుమార్యముఁగవంబడతాల్ గరఁగంగఁజేసె, వే
గతరచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా[21]

21 వి. వి. ప్ర. ఆ., ప. 145

అను మనోహర పద్యరూపములో వసంత చంద్రులను వర్ణించు నెపముతో తన మానసిక వ్యథను వ్యంజింపజేసినాడు. ఆమహితాత్ముని వ్యధిత హృదయమునుండి వెలువడిన యాపద్యరత్నమా మహాకవియొక్క కావ్య హారములో ముఖ్యమణివలె భాసించుచున్నది. అతడే కులమునకు చెందిన వాడైనను రసవత్కవితా గుణాతిశయమునుబట్టి దాక్షిణాత్యాంధ్రకవులలో నతనికి మించిన కవిమణియొకడు లేడని చెప్పవచ్చును. రఘునాథ నాయకుని యాస్థాన కవిశేఖరుడుగ పరిగణింపబడినాడు.

"చేమకూర వేంకటరాజును గూర్చిన వివరాలు మనకట్టే తెలియవు. తనకు క్షత్రియ ధర్మమే మొదటకలదని రఘునాథరాయలు తన్నుగూర్చి అన్నట్లు విజయవిలాస పీఠికలోనే వ్రాసుకొనడంలో వీరు క్షత్రియులైనా కాకపోయినా క్షత్రి ధర్మాన్ని అనుసరించినవారని, ఆ కుటుంబం వారంతా రఘునాథరాయల ఆశ్రియంలో ఆ ధర్మ నిర్వహణ చేసినవారని, ఈయన అపనులతోపాటు కృతికూడా ఇచ్చాడని తెలుస్తుంది "ఏయంతవాడికేడి? అని అంతటి రాజకవిరాజుతో అనిపించుకున్న వేంకటరాజు కవనంలోని నవనీతం మనకు దక్కినందకు సంతోషించాలి అందలి సారస్యం ఎంతో కొంత సమాస్వాదించే శక్తి సంపాదించుకోవాలి"[22] అని విద్వాన్ విశ్వంగారు విజ్ఞతా పూర్వకముగ వ్రాసియున్నారు. 17వ శతాబ్దమునుండి బ్రాహ్మణేతర కవుల ప్రాబల్యమతిశయింపజొచ్చినది. బ్రాహ్మణేతర కవులతో పురుషులతోపాటు స్త్రీలుకూడ సమాన ప్రతిపత్తిని పొందుటయొకవిశేషము. ఈ విశేషములను కొన్నిటిని శ్రీ వేలటూరి వెంకటరమణయ్యగారు సూచించియున్నారు [23]

వెంకటకవి మహావీరుడై రఘునాథునియనేక జైత్ర యాత్రలలో పాల్గొని యావీరరాజవరుని విజయపరంపరలకు ముక్కలి దోహదము

22 విజయవిలాసము (Published by Andhra Pradesh Sahitya Academy Hyderabad — పీఠిక – విద్వాన్ విశ్వం

23 వాఙ్మయవ్యాసమంజరి—వేలటూరి వెంకటరమణయ్య—ద్వితీయ భాగము 7వ వ్యాసము

చేసినాడు. ఆ రాజేంద్రుని ధైర్యసాహసాది గుణగణములను తన మనోహర కవితాధోరణి యందు సహజసుందరముగ వర్ణించినాడు. విజయ విలాస వతారికా పద్య ప్రభావమువలన రఘునాథుని విజయ విలాసములకు కీర్తిప్రతిష్ఠలకు నజరామరత్వములు సిద్ధించినవి.

సారంగధర చరిత్రలో నా కవి తల్లజుని కవితాసుందరి తన తొలి రూప రేఖలను తీర్చిదిద్దుకొనినది. తనవలెనే వరప్రసాది యైన సారంగధరుని వృత్తాంతమును కావ్య రూపములో కూర్చవలెనను కోరిక యతనికి కలిగినది. ఆ కోరికయే యతని ప్రథమ కావ్యరచనాత్మక ప్రయత్నమునకు నాంది యైనది. సారంగధరుని యుత్తమ గుణ గణములు సాత్త్విక ప్రవృత్తి యాదర్శ భావసపంత్తియు నతనికినచ్చినవి. గౌరన రచించిన నవనాథ చరిత్ర యందలి సారంగకథ నాధారముగఁ జేసికొని వేంకటకవి తన సారంగధర చరిత్ర వస్తు నిర్మాణము చేసినట్లు తోచును. సారంగధర చరిత్ర యాశ్వాసాంత గద్యములో "సదారాధిత (సమారాధిత) బుధ సమాజ" అనియు విజయ విలాసాశ్వాసాంత గద్యములో సారస్వత సుధాసార జనిత యశోలతాంకూర......వినయధురీణ సకలకళాప్రవీణాచ్యుతేంద్ర రఘునాథ భూపాలదత్త హస్త ముక్తాకటక విరాజమాన........." అనియును పేర్కొని యుండుటనుబట్టి సారంగధర చరిత్ర రచనాకాలము నాటికి విజయ విలాస రచనాకాలము నాటికి నతనికీర్తిప్రతిష్ఠలలో, సంస్కార బలములో వినమ్ర స్వభావములో, కళాప్రావీణ్యమున, రాజసన్మానములోను తారతమ్యములు కానవచ్చుచున్నవి. సారంగధర చరిత్ర రచనాకాలము నాటి కతనికి కేవలము బుధజన సమారాధనాత్మక సంస్కారము మాత్రము కానవచ్చుచున్నది. విజయ

విలాస రచనా కాలము నాటికతఁడు కవితామృత ధారాజనిత యశో లతాంకురుఁడు, వినయధురీణుఁడు, సరస రఘునాథ భూపాల సన్మానితుఁడు నైనాఁడు. సారంగధర చరిత్రలో నతని కవిత్వము, సామాన్యస్థాయిలో సాగినది. విజయవిలాసమునం దసమానస్థాయిలో సాగినది. ఇది యతని కవితాపరాకాష్ఠదశకు శాశ్వతచిహ్నము. విజయ విలాస రచనా కాలము నాటికి వేంకటకవి జాతి వార్తా విశేషములను, ప్రతిపద్య చమత్కారభంగిమను వెలయింపఁగల సామర్థ్యమును సంపాదించినాఁడు. దీనినిబట్టి సారంగధరచరిత్ర యతనితొలిరచన యనియు విజయవిలాసము మలిరచన యనియు తెలియఁగును.

వేంకటకవియొక్క సారంగధరచరిత్ర నాధారముగఁ జేసికొని యతని యనంతరము శాణాల శంభుదాసుఁడు సారంగధరచరిత్రను ద్విపద కావ్యముగ సంతరించినాఁడు. ఆతని పద్యచ్ఛాయ లనేకము లిందుఁ గానవచ్చును. ఈ విషయమును

ద్వి: భువిలోన సారంగభూపాలు చరితఁ
గవితామహత్త్వంబు గల చామకూర
అప్పన్న చెప్పిన యా ప్రకారముగఁ
జెప్పితి శాణాల శంభుదాసుండ

అను పద్యములో స్పష్టముగ చెప్పియున్నాఁడు. వేంకటకవి సారంగధర చరిత్రలోని పద్యము లనేకములు శంభుదాసుని సారంగధరములో ద్విపద రూపము లు దాల్చినవి. మొత్తముమీఁద నీ ద్విపధ సారంగధర చరిత్రపై వేంకటకవియొక్క సారంగధర చరిత్ర ప్రభావ మధికముగ నున్నదని యంగీకరింపక తప్పదు. కాని శంభుదాసుఁడు పై పద్యములో "చామకూర అప్పన్న" అని పేర్కొనుట వలన సారంగధర చరిత్ర కర్తృత్వ విషయమున సందేహించుట కవకాశ మేర్పడినది. దీనినిబట్టి సారంగధర చరిత్రకర్త చేమకూర వేంకట కవి కాఁడని; చామకూర అప్పన్న యనియు కొందరు వాదించి

యున్నారు. శంభుదాసుఁడు పొరపాటున 'అప్పన్న' యని పేర్కొని యుండును. లేదా వేంకటకవిని 'అప్పన్న' యని కూడ వ్యవహరించెడివారని భావింపచ్చును. కొందరిని వారి సహజనామములతోఁ కాక ' ప్పన్న' యని పిలుచునలవాటు నేటికిని కలదు. మొత్తముమీఁద వెంకటరాజు, వెంకటప్ప, అప్పన్న, వెంకన్న, యనునవియతనినామాంతరములుగ భావింపనగును.

ముప్పది యిద్దరు మంత్రులను పేర్కొనిన యొక సీసమాలిక కలదు అందు "నీడఁ ద్రొక్కెడు వేళ నెరి నర్థి కభిమతం బిప్పించెఁ జేమకూరప్ప రాజు" అను నొక పాదములో చేమకూర అప్పరాజు పేర్కొనబడినాఁడు. మరియు

క. అనుదినము నీడఁ ద్రొక్కఁగ
నొనరఁగ సురభూజమీయఁ డొక కాసైనన్
దినదినము సుకవిజనులకు
ఘనయము శ్రీ చేమకూర యప్పన యిచ్చున్.

అను పద్యములో చేమకూర అప్పన పేర్కొనఁబడినాఁడు. ఈపద్యములు చాటుపద్య మణిమంజరి మొదటి భాగములో నుదహరింపఁ బడినవి. ఈ పద్యములో పేర్కొనఁబడిన యప్పనయు, సారంగధరచరిత్రకారుఁడుగ పేర్కొనఁబడినయప్పనయు భిన్నులుగ భావింపనగును. ఆ యిరువురు భిన్నులని దీపాల పిచ్చయ్యశాస్త్రిగారు కూడ చెప్పియున్నారు. (సా. చ. పీఠిక దీ. పి. శాస్త్రిగారు, పుట1)

సారంగధరచరిత్ర. ముద్రితప్రతులయందు గాని, తాళప్రతుల యందు గాని, యవతారిక కానరాదు. ఆశ్వాసాద్యంత సన్నివేశములలో నెందు రఘునాథ ప్రశంసాత్మకములైన పద్యములు కొన్ని కావచ్చును. కాని యతని విజయవిలాసములోఁ గూడ కానవచ్చుచున్నవి. ఆ పద్యములు కొని. కానవచ్చును.

ఆ పద్యములు సారంగధరచరిత్ర రచనా సందర్భంలో రచింపబడినవి కావనియు, దశాంతరములో లేఖకులు ప్రత్యంతరములు వ్రాసిన సందర్భములో విజయవిలాస పద్యములనే యందు చేర్చి యుందురని భావించుట సమంజసము. మద్రాసు ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము నందలి యొక తాళపత్ర ప్రతిలో నాలుగాశ్వాసములును, ప్రత్యాశ్వాసాద్యంత సన్నివేశములలో నీశ్వర స్తుతిపరములైన పద్యములు కొన్ని కానవచ్చుచున్నవి ఇట్టి యాశ్వాసవిభజనతోను నీశ్వర స్తుతిపర పద్యములతోను, గూడి యున్న యొక శిధిల ప్రతి తమకు భారతీ తీర్థలో లభించినట్లు[24] తాపీ ధర్మారావు గారు చెప్పియున్నారు. ఈ పద్యములను బట్టి సారంగధర చరిత్ర యాశ్వాసాంకిత మని కొందరు భావించు చున్నారు. మరి కొన్ని మద్రాసు ప్రతులలో[25] నొక తంజాపూరు ప్రతిలోను, ప్రారంభదశలో నీశ్వర స్తుతిపరమైన వృత్తమొకటి, వాగ్దేవీ స్తవ రూపములో నున్న వృత్తమొకటి, గణపతి స్తవరూపములో నున్న కంద మొకటి. పూర్వకవి స్తుతిపరమైన సీస పద్య మొకటియు కానవచ్చుచున్నవి. ఈ తాళపత్ర ప్రతులలో రఘునాథ నాయక ప్రశంస కానరాదు. వీనినిబట్టి సారంగధరచరిత్ర రఘునాథుని కంకితము చేసి యున్నచో విజయవిలాస పీఠికలో పేర్కొని యుండెడివాఁడే. తొలుత సారంగధరచరిత్ర యేకాశ్వాసఘటిత మని తోచును.

'సారంగధర - పుట్టుక' లో సర్వము-ను ఏకాశ్వాసమే. గ్రంథ మెవ్వరికిని అంకితము చేయఁబడకయు, అందువలననే ముందు వెనుకల కొరవలు పూరింపఁబడకయు, నిలిచిపోయినది.. కాలము గడవను గడవను వ్రాయసగాండ్రు దాదాపు 700 పద్యముల గ్రంథము ఏకలాగున చదువుల విసుపు పుట్టించునని కాబోలు, ఎవరి యిష్టము

24. భారతి : విభవ సంవత్సర చైత్రమాస సంచిక

25. ఓ. యమ్. లైబ్రరీ నం. 13-10-20, 14-3-4, 14-19-4

వచ్చి నట్లు వారు ఆశ్వాస విభాగముచేసి వ్రాసికొన్నారు. ఆశ్వాసాద్యంతములు ఏ పద్యములు లేక బోసిగా నుండుట కిచ్చగింపక ఒకరు విజయవిలాసపు పద్యముల నందుఁ జేర్చినారు. వేరొకరు స్వవిరచితములైన ఈశ్వరాంకిత పద్యములతో, ఆతావులను బూరించినారు. ఇంకొకరు వేంకటకవియే ఆ గ్రంథమును రఘునాథుని కంకితము చేసినట్లుగా విజయ విలాస పీఠిక పద్యములలో " అచ్యుతేంద్ర రఘునాథుఁ డెన్నఁగన్ " అను పద్యము వెంట,

గీ. అనుచు హారువులు భావముల్ ననుచు రీతి
ధరఁ దెలంగెడు సారంగధర చరిత్రి
మతులమతిఁ గూర్చి ఘనుల సమ్మతుల నేను
కొన్క గావింప మది వేడుకను దలంప

అను పద్యమును జేర్చి గ్రంథమును సాగించినారు " [26]
అని శ్రీ దీపాల పిచ్చయ్య శాస్త్రి గారు సారంగధర చరిత్రి యొక్క యాశ్వాస స్థితిగతులను గూర్చి, పీఠికా పద్య పరిస్థితులను గూర్చి యాశ్వాసాంత పద్యములను గూర్చియు, సవివరముగఁ దెలియఁ జేసినారు. ఈ యభిప్రాయములను ఆచార్య కే.వి.ఆర్. నరసింహము గారు తమ దక్షిణాంధ్ర వాఙ్మయ చరిత్రలో సమర్థించి యున్నారు. విజయవిలాసమునందు ద్వితీయాశ్వాస ప్రారంభములోఁ జెప్పఁబడిన 'శ్రీ ధుర్య శౌర్య......' అను కందపద్యము సారంగధర చరిత్ర ప్రథమాశ్వాస ప్రారంభ పద్యముగ పేర్కొనఁబడినది. ఇందు ప్రథమాశ్వాసాంతమున వాడఁబడిన

మ. సరసాగ్రేసర...

క. తరుణీ మన్మథ . ...

తోటకము . అతు లాగమ శాస్త్ర.

అను పద్యములు మూఁడును విజయ విలాస ప్రథమా శ్వాసాంత

26. జి.శా.టీకా సహిత సా.చ.పీఠిక పుట - 8

మున నున్నవే. మరియు విజయవిలాస తృతీయాశ్వాస ప్రారంభ మున నున్న "(శ్రీ) జానకీ మనోహర..." అను కంద పద్యమే యిందు ద్వితీయాశ్వాస ప్రారంభ పద్యముగా పేర్కొనఁబడినది. సారంగధర చరిత్ర ద్వితీయాశ్వాసాంతమున కానవచ్చు

శా. దాక్షిణ్యాకర మూర్తి...

స్రగ్విణి. దుగ్ధవారాశి విద్యోత...

అను పద్యములు రెండును విజయవిలాస ద్వితీయాశ్వాసాంత పద్యములే. మరియు నిచ్చటి 'యాచకకవి నుత' అను కంద పద్యము విజయ విలాస ప్రథమాశ్వాసాంత పద్యముగ కానవచ్చును. ఇందలి ప్రథమాశ్వాస ప్రారంభ పద్యమే తృతీయాశ్వాస ప్రారంభమునఁగూడ కన్పట్టుచున్న

విజయ విలాస ద్వితీయాశ్వాసాంతమున నున్న "కలహారంభణ..." అను కంద పద్యము తృతీయాశ్వాసాంతమున నున్న "శ్యేళగళైక" "అరాతి క్షమా..." అను నుత్పలమాలా భుజంగప్రయాత పద్యములే సారంగ ధర చరిత్ర తృతీయాశ్వాసాంత పద్యములుగ పేర్కొనబడినవి.

ఇట్లు కార్య కారణ భావముతో పరిశీలించినచో సారంగ ధర చరిత్రము రఘునాథునికే యంకితము కావింపఁబడినదని ప్రచారము చేయుటకు విజయవిలాస పద్యములనే సారంగధర చరిత్రలోఁ జేర్చి నట్లు సవిష్టపడుచున్నది. మొత్తము మీద వేంకటకవి తన సారంగధర చరిత్ర నెవరికి నంకితము గావింపకుండ విడచినట్లు తోచును.

బాణాల శంభుదాసుఁడు కూచిమంచి తిమ్మకవి, పరశురాముఁడును వేరువేరుగా రచించిన ద్విపద సారంగధర చరిత్రలు సముఖము వేంకట కృష్ణప్పనాయకుని గద్యసారంగధరచరిత్ర, సిద్ధనగౌడు రచించిన సారంగ ధరచరిత్ర యక్షగానము గేయసారంగధరచరిత్ర 27 చింతా దీక్షితులు

27. వసకాడ సన్న్యాసి—సాలెవాడు విశాఖపట్టణం జిల్లా మనువాడ గ్రామవాసి. సారంగధర చరిత్రను గేయ రూపమున పాడినవాడు

గారు ప్రకటించిన స్త్రీల గేయసాహిత్యమునకు చెందిన సారంగధర చరిత్ర పాటలు నాంధ్రసాహిత్యములో సారంగధర చరిత్రకున్న సమున్నత స్థానమును, సర్వజనానురంజక స్వభావమును వేనోళ్ల చాటుచున్నవి. సారంగధరుని కరుణామయ గాథకు వేంకటకవి యొక్క యమృతలేఖినీ సరస సంస్పర్శ వలన నమరత్వము సిద్ధించినది. ఆంధ్రసాహితీ సుందరి కది యమూల్యాభరణముగ నలరారినది.

వేంకట కవి యొక్క ద్వితీయ రచన విజయ విలాసము. తన సర్వకవితా శక్తులను కేంద్రీకరించి యా కవీంద్రుఁ డీ కృతిని దిద్ది తీర్చినాఁడు. అతని కవితా పరాకాష్ఠ దశకు, శైలీ పరిపక్వస్థితికి, చతుర చమత్కార విన్యాసములకు, శ్లేష యమక శేముషీ ధురంధరమునకు, జాతీయ ప్రయోగ చాతుర్యమునకు, నుదాత్త రసపోషణకు, ప్రముఖ పాత్ర చిత్రణాత్మక ప్రతిభకు, నీ రమణీయ కావ్యరాజ మాటపట్టుగా నలరారుచున్నది. సకల సరస కవితా గుణాధిక్యముచే, నిది దక్షిణాంధ్ర యుగ ప్రబంధములలో నగ్రగణ్యమైనది. సారంగధర చరిత్ర కంటె నిది యన్ని విధముల మిన్న యనిపించుకొనినది. అతని కవితాప్రౌఢిమ యిందు పతాకస్థాయి నందుకొనినది. రసాభాసయుతము కరుణామయగాథా సహితమునైన యతని తొలి రచన రసికుల నందరిని మెప్పింప లేకపోయినది. రెట్టించిన పట్టుదలతో తన కవితాశక్తి నంతను ధారవోసి రసోజంచితముగ మలిరచన చేసి యందరిని మెప్పించినాఁడు. విజయవిలాస కవితా పారమ్యమునకు మురిసి రసిక ప్రభువరేణ్యుఁ డగు రఘునాథ నాయకుఁడు "చేమకూర పాకమునఁ బడినది" యని మెచ్చుకొనినాఁడు. ఆ రఘునాథుఁడే తత్కృతనాథుఁడు. సకల కళాప్రవీణుఁడైన యీరాజశిఖామణిని కవిత్వము చెప్పి మెప్పించుటు సామాన్యమైన విషయము కాదు. కనుకనే "ఇఁక శక్తు లెవరయ్యా రఘునాథ భూప రసికాగ్రణికిన్ జెవిసోఁకఁ జెప్పఁగన్" [28] అని నవిన

28. వి. వి. పీఠిక. ప. 31

యముగ చెప్పిన వాక్యము లోనట్టి రాజ కవీంద్రునకు శ్రోత్రపర్వ ముగ, హృదయ రంజకముగను. కవిత్వము చెప్పగల శక్తి తనకే యున్నట్లు ధ్వనింపజేసినాడు. అతని విజయవిలాస కవితా విశ్వరూప మునకు ముగ్ధుడై ముక్తాకటకాది విభూషణములతో నా కవిరా జును సన్మానించినాడు. కలలోనైన నా రఘునాథ నాయకుని దప్ప మరియొక ప్రభువును గొలువనని తాను రచించిన కృతులను నా రాజేంద్రునకే యంకితము గావింతునని ప్రతిజ్ఞ చేసినాడు. తదను గుణముగ తన విజయవిలాసము నా నాయకాగ్రణికే యంకితము గావించినాడు. ఆకవీంద్రుని వాక్పరిపాలనాదక్షతకు కమనీయకవితా పాటవమునకును, మెచ్చి యా రఘు నాథభూపాలుడు - వాఙ్మయమ రూఢి యుండా కవికి సాటియైనవాడు మరొకడు లేడని భక్తి విశ్వా సము లతని సొమ్ములని యతడు సూర్య వర ప్రసాద సంపన్నుడని ప్రతి పద్యము నందును చమత్కార మొలికింప గల చతురుడు క్షితిలో నతని మార్గ మెవరికిని రాదని యతడన్నిటను ప్రయోజకుడనియును సుధా మధురోక్తులతో నాదరించి మంజుల పదార్థములను భూరి భూషణాంబరములను కరితురగాది నానా నోత్కరములను నిచ్చి యా వేంకటకవిని సత్కరించినాడు. 29 కనుకనే యా కవీంద్రుడు తన విజయవిలాసములో వీలు చిక్కినప్పుడెల్ల నవ్యాపదేశరూపమున కృతజ్ఞతాసూచకముగా నా రాజేంద్రుని సంస్మ రించినాడు. అట్టి యుదాత్త కావ్యరచన చేసి యద్వితీయ రాజసన్మా నము నంది వేంకటకవి ధన్యుడైనాడు.

29. వి. వి. పీఠిక పుట- 48 నుండి 62

# కృతిపతి వంశచరిత్ర

నవనవోన్మేష ప్రతిభాసమన్వితులైన యాంధ్రనాయకరాజులు సకలసంపద్భరితము, కావేరీతీరసారకేదారసమంచితమునైన తంజాపురీ మహీమండలమును క్రీ. శ. 1532 నుండి 1673 వరకు (దరిదాపుగ నొకటిన్నర శతాబ్దుల కాలము)[1] పరిపాలించి, సాంఘిక రాజకీయ సారస్వతరంగములలో నిరుపమసేవలు చేసి, తమ సరసభావజాలముచే ప్రజాహృదయముల నాకర్షించి, చెరిగిపోవని చరిత్ర పుటలలో శాశ్వత స్థానము నాక్రమించినారు. తొలిదశలో వీరు విఖ్యాత విజయనగర ప్రభువర్యులకు సామంతులుగ నుండెడివారు. కాలక్రమమున తమ శక్తియుక్తులను పెంపొందించుకొని మలిదశలో మాన్యప్రతిపత్తిగల స్వతంత్రపాలకులుగ వరవిక్రమాతిశయముతో వర్ధిల్లిరి. విజయనగర రాజకుటుంబముతో బంధుత్వము గలిగియున్న కారణమున, సరస హృదయులు, విశాలభావసంపన్నులునైన కారణమునను స్వతంత్రప్రతిపత్తితో విలసిల్లిన సమయమునందుఁగూడ వీరు విజయనగరప్రభువులపై నెలకొన్న తమ విమలవిధేయతాగుణమును విస్మరింపలేదు.

తంజాపురాంధ్రనాయకరాజ్యము విజయనగర సామ్రాజ్య దీపపు కడపటి మెరపని చెప్పవచ్చును. విజయనగర ప్రభువుల నన్నివిధముల ననుకరింప ప్రయత్నించి సంకల్పసిద్ధినొందిన సామంతరాజులలో తంజాపురాంధ్ర నాయకరాజు లగ్రగణ్యులు. వీరు బహుభాషాకోవిదులు, కవులు, కవి పండిత పోషకులు, నిరతాన్నదాన దీక్షాధురంధరులు, భక్తిభావాంచిత హృదయులునై యుండిరి. వీరు చతుర్థకులజులైనట్లు నాఁటి శాసనములనుబట్టి, ప్రబంధములనుబట్టియు తెలియుచున్నది.

తంజావూరు ప్రాంతము చోళరాజ్యములో నొకభాగము. విజయనగర యువరాజైన కుమారకంపనుఁడు తనతండ్రియైన బుక్క

1 The Nayaks of Tangore - Vriddhagirisan, Chapter-I, P. 1.

రాయల ఆజ్ఞచొప్పున మధురపై దండెత్తినప్పుడు తంజావూరు ప్రాంతమునుగూడ జయించినాఁడు. అప్పటినుండి మధుర తంజాపురప్రభువులు విజయనగరరాజుల ప్రతినిధులుగ రాజ్యపాలన చేసినారు. తంజావూరులోనున్న బృహదీశ్వరాలయముయొక్క దక్షిణ కుడ్యముపై క్రీ॥ శ॥ 1455 లో రెండవ దేవరాయలు వేయించిన శాసనమునుబట్టి, యీ పట్టణముయొక్క దక్షిణదిగ్భాగములోనున్న యలగేశ్వర పిళ్లెయూర్ ఆలయములో క్రీ॥ శ॥ 1532 లో, నుత్తరవీధియందున్న రాజగోపాలదేవాలయములో క్రీ॥ శ॥ 1539 లోను నచ్యుతరాయలు వేయించిన శాసనములనుబట్టియు విజయనగరప్రభువుల తంజాపురాధిపత్యము ధృవపడుచున్నది.[2]

1. __చెవ్వప్పనాయకుఁడు :__ తంజాపురాంధ్రనాయక రాజ్యమునకు చెవ్వప్పనాయకుఁడు తొలిప్రభువు. అచ్యుతరాయలు విజయనగర సామ్రాజ్యమును పరిపాలించిన సమయములో చెవ్వప్పనాయకునకు క్రీ॥ శ॥ 1535 ప్రాంతమున తంజాపురాధిపత్యము లభించినది. అచ్యుతరాయలు కృష్ణదేవరాయల సవతి సోదరుడు. నరసింహరాయలకు నాగలాంబ, యోబాంబిక యను భార్యలిరువురు గలరని, కృష్ణదేవరాయలు నాగులాంబ తనయుఁడని, యచ్యుతరాయలోబాంబికా తనయుఁడనియు శాసనాధారములనుబట్టి తెలియుచున్నది.[3] విజయనగరరాజులు చోళ పాండ్యరాజ్యములను జయించినతరువాత నచ్యుత రాయల కాలమువరకు నేకఖండికగనే పరిపాలించినారు. కృష్ణదేవరాయల ప్రతినిధియైన విశ్వనాథనాయకుఁడు మధురలోనుండి చోళ పాండ్యరాజ్యములను పరిపాలించినాఁడు. కృష్ణదేవరాయల సోదరుఁడగు నచ్యుతరాయలు తన భార్యయగు తిరుమలాంబయొక్క సోదరి

---

2. The Aravidu Dynasty of Vijayanagar - father Heras - P. 172
3. The Unamanjeri and the Kaladi plates of Achuta, the British Museum plates, Bevinahalli grant of Sadasivaraya and the portuguese chronicler, Nuniz.

యగు మూర్తిమాంబను విశ్వాసపాత్రుఁడు, సర్వసమర్థుఁడునైన చెవ్వప్పనాయకునకిచ్చి వివాహము చేసిన సందర్భములో చోళరాజ్యమును స్త్రీధనముగనిచ్చి, దానికి చెవ్వప్పను రాజప్రతినిధిగ నియమించినట్లు తెలియుచున్నది.[4] చెవ్వప్పనాయకుఁడు క్రీ॥ శ॥ 1549 లో సముసరు మశీదులో నొక రాతి స్తంభముపై వేయించిన శాసనములోని తొలి శాసనముగ పరిగణింపబడుచున్నది. ఇదియే యతని ప్రథమ పరిపాలన సంవత్సరమని కొందరభిప్రాయపడియున్నారు. అచ్యుతరాయలు క్రీ॥ శ॥ 1541 లో మరణించినాఁడని, యంతకుముందే తంజావూరు నాయక రాజ్యస్థాపన జరిగియుండునని యూహింపబడినది[5] చెవ్వప్పనాయకుఁడు శా॥ శ॥ 1471 లో వేయించిన సముసరుపల్లి శాసనమును బట్టి యా నాయక రాజ్యస్థాపన క్రీ॥ శ॥ 1549 లో జరిగినట్లు శ్రీ కుప్పుస్వామిశాస్త్రిగా రూహించియున్నారు.[6] చోళరాజ్య పరిపాలనాభారమును నిర్వహించుటకు సర్వసమర్థుఁడైన ప్రతినిధిని పంపవలసిన తరుణములో తనకు విధేయుఁడు, విశ్వాసపాత్రుఁడు, నా ప్తబంధువునైన చెవ్వప్పనాయకుని రాజప్రతినిధిగ నచ్యుతరాయలు క్రీ॥ శ॥ 1532 లో తంజావూరునకు పంపినాడని, యదియే నాయక రాజ్యావతరణ వత్సరమనియు శ్రీ వి. వృద్ధగిరీశన్ గారు పేర్కొనియున్నారు.[7] ఆ సన్నివేశము క్రీ॥ శ॥ 1535 లో జరిగినదని శ్రీ కురుగంటి సీతారామయ్యగారు చెప్పియున్నారు[8] ఆ రాజ్యస్థాపన సదాశివరాయల కాలములో జరిగినదని

---

4. Sources of Vijayanagar history— S. Krishna Swamy Aiyangar, P. 323
 Catalogue raisonne—Taylor, III, P. 176
 రఘునాథాభ్యుదయము-రామభద్రాంబ 6, 11
5 The Aravidu dynasty of Vijayanagar—Haras, P. 173
6. Tanjore Gazetteer, O. C., P. 4
7. The Nayakas of Tanjore, P. 23
8. తంజావూరి ఆంధ్రనాయక చరిత్రములో చూపబడిన యాధారము-
 Epigraph 271 of 1907 from Tiruvidaimarudur.

శ్రీయుతులు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, నేలటూరి వేంకటరమణయ్యగారును, రఘునాథాభ్యుదయ పీఠికలో సోపపత్తికముగ నిరూపించియున్నారు. మధుర నాయక రాజ్యావతరణము, విశ్వనాథనాయకుని పరిపాలనయు క్రీ॥ శ॥ 1529 లో జరిగినట్లు మధురనాయకుని కాధిపత్యమునుండి చోళరాజ్యమును విడదీసిన కొలదికాలముననే తద్రాజ్యాధిపత్యము చెవ్వప్పనాయకున కప్పగింపఁబడినదనియును ప్రొఫెసర్. సత్యనాథయ్యరుగారు చెప్పియున్నారు.[9]

అచ్యుతదేవరాయలు తంజావూరు రాజ్యమును చెవ్వప్పనాయకునకు స్త్రీధనముగ నిచ్చెననుటకు కావ్యవర్ణనాత్మకప్రమాణములు తప్ప శాసనప్రమాణములు లేనికారణమున నావాదమును ప్రొఫెసర్ కె వి. ఆర్. నరశింహముగారు తమ దక్షిణాంధ్రవాఙ్మయచరిత్రలో త్రోసిపుచ్చినారు. చెవ్వప్ప మహావీరుఁడని తంజావూరు రాజ్యమును తన పరాక్రమమునుబట్టి సాధించినాడనియు యజ్ఞనారాయణదీక్షితుఁడు వర్ణించియున్నాఁడు.[10] కాని యీ యభిప్రాయమునకుఁదగిన శాసనాధారములు కానరావు. విజయనగర ప్రభువుయొక్క యాదరాభిమానపూర్వక సహాయసంపత్తివలన నతఁడు తంజాపుర రాజ్యాధిపతియై యుండునని చరిత్రకారు లూహించినారు.

గోవిందదీక్షితుఁడను కన్నడబ్రాహ్మణుఁడు బాల్యదశలోనే హస్తసాముద్రిక, జ్యోతిషాది శాస్త్రములలో పండితుఁడై తన పదునేడవయేటనే విజయనగరమునకు వచ్చినాఁడని, యచ్యుతదేవరాయలతని పాండితీపటిమకు మెచ్చి యతనిని తన యాస్థానమున కాహ్వానించి గౌరవించినాఁడని, యనంతరమొకనాఁడనాథుఁడుగ తిరుగుచున్న చెవ్వప్ప యా దీక్షితునకు తటస్థపడఁగా నతని భాగ్యరేఖలనుబట్టి

9. The Nayakas of Madura, P. 52
10. సాహిత్యరత్నాకరము, 111-1 శ్లో.

యతఁడు భవిష్యత్తులో నభివృద్ధికి రాఁగలఁడని యెంచి యతనిని విజయ నగర ప్రభువుకడకు తీసికొనివెళ్లి పరిచయము చేయఁగా నారాజేంద్రుఁ డతనిని తన యాస్థానములో తాంబూలకరండవాహునిగ నియమించి నాడని, కాలక్రమమున నాప్రభువర్యునితో పరిచయ మధికమై యుద్ధ రంగములలో నతఁడు ప్రదర్శించిన శౌర్య ధైర్య సాహసములనుబట్టి యారాజుయొక్క యాదరాభిమానములకు పాత్రుఁడై నాఁడని, యనం తర మచ్యుతరాయల మరదలైన మూర్తిమాంబ యతనిని ప్రేమించిన దని, యటుపై రాయలా యిరువురికి వివాహముచేసి యా చెవ్వప్పను తంజావూరు ప్రాంతమునకు గవర్నరుగా నియమించినాఁడని యతఁడు తంజావూరు వెళ్లినపుఁడు గోవిందదీక్షితుని తనవెంట తీసికొనివెళ్లి నాఁ డనియు పరంపరాగతమైన యొక కథనుబట్టి తెలియుచున్నది. ఈ సంఘటన క్రీ॥ శ॥ 1540 లో జరిగినట్లూహింపఁబడినది. ఈ విషయవిశే షములను శ్రీ ఎస్. కె. వెంకటేశ్వపంతులుగారొక వ్యాసములో పేర్కొనియున్నారు.[11] ఈవిషయమును యజ్ఞనారాయణదీక్షితుఁడు గూడ ప్రస్తావించియున్నాఁడు.[12]

చెవ్వప్పనాయకుని తండ్రి శూద్రతిమ్మఁడు లేక తిమ్మప్పనాయ కుఁడని, తల్లి వయ్యాంబ లేక బయ్యాంబిక యనియు రుక్మిణీపరిణయము నందు చెప్పఁబడినది.[13] చెవ్వప్ప తండ్రియు, తాతముత్తాతలును శౌర్య ధైర్యములు గలవారై విజయనగరరాజులకడ సేనానాయకులుగ నుండెడివారని యూహింపఁబడుచున్నది. అతనికి చినచెవ్వ, చెవ్వ భూపతి, చెవ్వభూపయను వ్యవహారములు గలవు. తమిళమునందు శిరుశెవ (Siru Seva) యను వ్యవహారము గలదు. ఈ వంశమునకు

11. "Govinda Dikshita and his time"— Journal of Andhra Historical Research Society, Vol. II - Part II
12. సాహిత్య రత్నాకరము _ పీఠిక _ పే. 2
13 రుక్మిణీపరిణయము (రాజచూడామణి దీక్షితు), 111, 34.
cf. Ep gnd. XII, P 343, Note 3, S. K. Aiyangar, Sources of Vijayanagar, history, P. 284-5

మూలపురుషుఁడు కృష్ణనాయకుఁడని, యతని కుమారుఁడు తిమ్మప్ప నాయకుఁడని, యతని సతీమణి బయ్యాంబిక యని, యా దంపతులకు పెదచెవ్వ, చినచెవ్వ, పెదమల్ల చినమల్లురను నల్గురు తనయులు గల్గిరనియు విజయరాఘవనాయకుఁడు పేర్కొనియున్నాఁడు.[14] ఈ వంశ కర్తయైన కృష్ణనాయకునకు నతని తనయుఁడగు తిమ్మప్పనాయకునకు నడుమ మరియొక తిమ్మప్ప యున్నాఁడని, యతని భార్యపేరు గోప మాంబ యనియు విజయరాఘవనాయకు నాస్థానకవయిత్రియగు రంగా జమ్మ తన యుషాపరిణయ మన్నారుదాసవిలాసగ్రంథములందు పేర్కొన్నది. ఆ నాయకరాజుల నామె మన్నారుగోత్రీకులనుగా పరిగణించినది. తిమ్మప్పనాయకుఁడు తొండమండలములోని నెడుంగున్రము అను గ్రామము నివాసస్థలముగాఁ గలవాఁడని, చెవ్వప్పనాయకుఁ డతని కుమారుఁడనియు శాసనములనుబట్టి తెలియుచున్నది.[15] తిమ్మప్ప నాయకుఁడు కృష్ణదేవరాయలకడ ద్వారపాలకుఁడుగ నుండెడివాఁడని, రాయల రాయచూరు దండయాత్రలో పాల్గొనినాఁడనియు నొక కృష్ణదేవరాయల శాసనమునుబట్టి తెలియుచున్నది.

చెవ్వప్పనాయకుఁడు తంజావూరుకోట వెలుపలి ప్రదేశమందొక పెద్దచెరువు త్రవ్వించినాఁడు. ఆ పట్టణప్రజల మంచినీటి యవసరములు దీర్చుటకై లోపలిభాగమున నిర్మింపఁబడిన శివగంగతటాకమునకా చెరువునుండి నీటిసరఫరా చేయుటకుఁదగిన యేర్పాట్లు చేసియున్నాఁడు.[16] చిరస్మరణీయమైన యతని కృషికి చిహ్నముగ నేటికి నా చెరువతని పేరిట "చెవ్వప్పసేరి" (చెప్పసేరి) యని వ్యవహరింపఁబడుచున్నది తంజావూరులో క్రొత్త శివగంగ కోటను నిర్మించినాఁడు. తిరువన్నామలై దేవాలయమునకు పదునొకండంతస్థుల మహోన్నత గోపురమును

14. రఘునాథ నాయకాభ్యుదయము – పే. 9, 206 నుంచి 216 పే.
15. రుక్మిణీపరిణయము–రాజచూడామణి దీక్షితుఁడు–111–34
16. యజ్ఞనారాయణదీక్షితుఁడు–సాహిత్యరత్నాకరము, ఆ. 111, 3.

కట్టించినాఁడు. వృద్ధాచల కాంజీవర దేవాలయములకు సువిశాల ప్రాకారములను గట్టించినాఁడు.[17] తిరుపతి శ్రీశైల దేవాలయశిఖరములను బంగారపు రేకులతో కప్పించినాఁడు. తనరాజ్యములో పవిత్రమైన కావేరీనది కిరుప్రక్కలనున్న శైవ వైష్ణవ దేవాలయములకు నిష్పాక్షిక బుద్ధితో గ్రామములు, రత్నాభరణములు మొదలగువానిని దానము చేసినాఁడు. అతఁడు ఫకీరులకు చేసిన భూదానమునుబట్టి యతని పరమత సహనము, దాక్షిణ్యస్వభావమును వ్యక్తములగుచున్నవి.[18] తిరువన్నామలై దేవాలయమునకు గ్రామదానము, నొకసత్రమునకు కొంత భూదానమును చేసినట్లు శాసనములనుబట్టి తెలియుచున్నది.[19] అతని ధార్మికక్రియాకలాపములను చెంగల్వకాళకవి తన రాజగోపాలవిలాసములో ప్రశంసించియున్నాఁడు.

తంజావూరు నాయకరాజుల హృదయవీథులందు సహనశీలము గూడుకట్టుకొని కాపురము చేసినది. బౌద్ధాలయములకు, మసీదులకును వారు చేసిన దానములు వారి పరమతసహనమునకు పరమ నిదర్శనములు.[20]

చెవ్వప్పనాయకుఁడు విజయీంద్ర తీర్థశ్రీపాదుఁడను ప్రసిద్ధ మధ్వాచార్యునకు క్రీ॥ శ॥ 1574 లో నరివిలిమంగలమను నొకగ్రామమును దానముచేసినాఁడు. అతని సహాయసంపత్తులు పరదేశీయులైన పాశ్చాత్త్యులకుఁగూడ లభించినవి. చెవ్వప్ప పరిపాలన ప్రారంభమైనపుడుగాని యింతకు కొంచెము ముందుఁగాని పోర్చుగీసువారు వ్యాపా

17. వి. వి. అవతారిక, పే. 3, 10 పే.

18. Samusaru Mosque inscription, at Tanjore, in 1549 A. D.

19. Inscriptions 421 of 1928 and 27 of 1925 dated S. S. 1497 (1575 A. D.)

20. Epigraph 292 of 1927 dated 1597 A. D; from Kumbakonam and an inscription 425 of 1924 found on the wall of Sumsarupalli mosque in Tanjore.

రారము దక్షిణభారతమునకు వచ్చి నాగపట్టణమునందు స్థిరనివాస మేర్పరచికొనియుందురు. చెవ్వప్పనాయకుఁడు వారికి రక్షణకూడ కల్పించి తన దేశమునందు వారు వ్యాపారము చేసికొనుట కనుమతినిచ్చి వారి ప్రస్తుతికి పాత్రుఁడైనాడు.[21] అతఁడు క్రీ॥ శ॥ 1532 నుండి 1563 వరకు మొ త్తము 31 సం॥లు పరిపాలన చేసినాఁడు. ఇతఁడు తన యువ సానదశలో మహామేధావియైన గోవిందదీక్షితుని మంత్రిగా నియమించి నాఁడు. ప్రతిభాశాలియైన యీ దీక్షితుఁడే యచ్యుతప్పనాయకునికడ, రఘునాథనాయకునివద్దను మహిత విశ్వాసపాత్రుఁడైన మహామంత్రిగా, పరిపాలనాదక్షుఁడుగాను వర్ధిల్లి తంజాపురరాజ్యవికాసమునకు తోడ్పడి నాఁడు. శేషజీవితమును ధార్మిక కార్యకలాపములతోఁ గడిపి చివరికి క్రీ॥ శ॥ 1580 లో పరమపదించినాఁడు. ప్రసిద్ధచరిత్రకారులగు కురుగంటి సీతారామయ్యగారు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారును నీయభిప్రాయ ముతో నేకీభవించియున్నారు.[22] ఇతఁడు 1550 ప్రాంతమున రాజ్యాధి కారమునకువచ్చి 1580 లో మరణించియుండునని డా॥ కె. వి. ఆర్. నరసింహముగారూహించియున్నారు. నిడదవోలు వెంకటరావుగారు కూడ నిట్లే (1550 నుంచి 1580) చెప్పియున్నారు. అతఁడు క్రీ॥ శ॥ 1572 వరకు మాత్రమే జీవించియున్నాఁడని టి. ఎస్. కుప్పుస్వామి శాస్త్రిగారు చెప్పియున్నారు. తండ్రి జీవించియుండగనే కుమారునకు రాజ్యము నప్పగించు సత్సంప్రదాయము తంజావూరు నాయకరాజు లందు మాత్రమే కన్పట్టును.

చెవ్వప్పనాయకుని పరిపాలన విక్రమసంవత్సరముతో నంత మొందినట్లు కుంబకోణశాసనమునుబట్టి తెలియుచున్నది.[23] శాలివాహన శక సంవత్సరము 1502 (క్రీ॥ శ॥ 1580) ఆ విక్రమసంవత్సరమునకు

21. Life of St. Xavier.

22. తంజావూరి ఆంధ్రరాజుల చరిత్రము—వేటూరి ప్రభాకరశాస్త్రిగారు

23. Ep. Coll, 292 of Kumbakonam, Tanjore District

సరిపడుచున్నది. కనుక నతఁడు క్రీ॥ శ॥ 1580 లో పరమపదించినట్లు నేలటూరి వేంకటరమణయ్యగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారును తెల్పియున్నారు.[24]

అచ్యుతదేవరాయలు తనకు తంజాపురాధిపత్యమిచ్చినందులకు కృతజ్ఞతాసూచకముగ తన తనయునకారాజవర్యుని నామము నే (అచ్యుతప్పనాయకుఁడు) పెట్టినాఁడు.

ఆ మహానాయకుని జేగీయమానకీర్తికి చిహ్నములైన ఘన కార్యములకు గోవిందదీక్షితుఁడు తన సంగీతసుధాపీఠికాశ్లోకములలో కమనీయకవితారూపమున నీ క్రిందివిధముగ కైవారములు పట్టినాఁడు.

శ్లో॥ కర్ణాట సింహాసనకార్యధుర్యః పరాక్రమాక్రాంత పరావనీపః
శోణాద్రినాథస్యస చెవ్వభూపా నిర్మాయ చత్వార్యపిగోపురాణి
ప్రాకారపంక్తీ రథమంటపాని తటాకదివ్యోపవనానిభూయః
గ్రామాననేకా నుపకంఠసీమ్నా దత్వావిచిత్రాణిచభూషణాని
రథా ననేకాన్ విరచయ్యరమ్యాం శ్చక్రేమహారాజవిభూతిమస్య
న కేవలం శోణగిరీశ్వరస్య కైంకర్యమేవం కృతవాన్ సభూపః
ఏకామ్రనాథస్య చదీర్ఘశైల నివాసినశ్చాపి రఘూద్వహస్య
వృద్ధాచలేశస్య సమస్తమేతత్ ప్రాకారముఖ్యంవ్యతనోర్విశేషాత్
శ్రీశైలనాథస్యచ వేంకటాద్రినివాసినః పద్మవిలోచనస్య
హైమం విమానం విరచయ్యహర్షా దన్యచ్చకైంకర్యమసావతానీత్
చోళేషుకింబహునా నరేంద్ర స్థానేషు సర్వేషుహరేర్హరస్య
ప్రాకారసౌధప్రముఖాననేకాన్ నిర్మాయ ధర్మాన్ ముముదే
నరేంద్రః
మహీసురాన్ కించమహాగ్రహారైః అహర్నిశం సాదరమన్నదానైః
దానైరనేకైరపిభక్తిపూర్వం సంప్రీణయామాస సచెవ్వభూపః

24. ర. నా. పీఠిక, పే. 25.

## 2. అచ్యుతప్పనాయకుఁడు

చెవ్వప్పనాయకుని కుమారుఁడైన యచ్యుతప్పనాయకుఁడు తండ్రి మరణానంతరము క్రీ॥ శ॥ 1580 లో తంజావూరు సింహాసనము నధిష్ఠించినాఁడు. అచ్యుతప్ప తనతండ్రియవసానదశలో యువరాజుగ తండ్రితోఁ కలిసి క్రీ॥ శ॥ 1560 నుండి తండ్రి మరణించువరకు నఁగా క్రీ॥ శ॥ 1580 వరకును రాజ్యపాలన చేసినట్లూహింపఁబడుచున్నది.[25] ఇతనికి చినచెవ్వాచ్యుతుఁడని, చెవ్వప్పాచ్యుతుఁడనియు నామాంతరములు గలవు. ఇతని భార్యపేరుగూడ మూర్తిమాంబయే.[26] ఇతని యొక్క, యితనికుమారుఁడైన రఘునాథనాయకునియొక్కయు పరిపాలనా సమయములందు మహామంత్రిగనున్న గోవిందదీక్షితుఁడు పరిపాలనా యంత్రాంగనిర్వహణమునందు, స్వదేశీయ విదేశీయవిధానములను రూపొందించుటలో, తంజాపుర రాజ్యాభివృద్ధియందును వహించిన ప్రముఖపాత్ర ప్రశంసనీయమైనది. మాధవవిద్యారణ్యుఁడు విజయనగర సామ్రాజ్యమును దిద్దినట్లు గోవిందదీక్షితుఁడు తంజాపురరాజ్యమును తీర్చిదిద్దినాఁడు.

అచ్యుతప్పనాయకుఁడు తండ్రి మరణమునకు పూర్వమే యువరాజైనట్లు తెలియుచున్నది.[27] క్రీ॥ శ॥ 1577 లో పరిపాలనాబాధ్యత స్వీకరించినట్లూహింపఁబడినది.[28] ఇతఁడు క్రీ॥ శ॥ 1577 లో కంసాళ్లకు భూదానము చేసినట్లు తంజావూరు బృహదీశ్వరాలయముయొక్క రెండవ గోపురమునకు చెందిన దక్షిణప్రాకారముపై వేయించిన శాసన మతని తొలిశాసనముగ పరిగణింపఁబడుచున్నది.[29] అచ్యుతప్పనాయకుని శాసనములు క్రీ॥ శ॥ 1563 నుండి కన్పట్టుటచేత కొంచమించుమించుగ

25. The Nayaks of Tanjore—Vriddhagirisan, P. 35.
26. Sources of Vijayanagar Histories, S. K. Aiyangar, P. 285
27. సాహిత్యరత్నాకరము.
28. The Aravidu Dynasty of Vijayanagar—Hiras, P. 287
29. A short history—Kuppuswamy Sastry, P. 5

నా సమయముననే యతఁడు యువరాజైనట్లు, శా॥ శ॥ 1518 (క్రీ॥ శ॥ 1596) దుర్ముఖినామసంవత్సరమునందతఁడు వేయించిన శాసన మతని కడపటిశాసనమైనట్లు నూహింపఁబడుచున్నది.[30] ఇతఁడు సరసహృదయుఁడై తంజావూరురాజ్యమును ప్రతిభాసమన్వితస్థాయిలో సుదీర్ఘ కాలము పరిపాలించినాఁడు. తండ్రితోఁ కలిసి 20 సం॥లు, తాను స్వతంత్రముగ 33 సం॥లును మొత్తము 53 సం॥లు పరిపాలించినాఁడు. చిన్ననాఁటినుండి రంగనాథుని భక్తుఁడుగ రాణకెక్కినాఁడు. పరమతసహనమును ప్రదర్శించిన పరిపక్వహృదయుఁడు. శివ విష్ణ్వాలయములకు, విజయీంద్రతీర్థమధ్వాచార్యునకును నీ రాజవర్యుఁడు చేసిన దానముల వలన నితని సర్వమతసమానదృష్టి, విశాలభావసంపత్తియు వ్యక్తము లగుచున్నవి. ఆత్మవివేకముతో త్వరితగతిని నిర్ణయములు తీసికొని, వాని నమలుపరచుచు కడు సామర్థ్యముతో పరిపాలనమును నిర్వహించినాఁడు. తండ్రివలె నితఁడును విజయనగరప్రభువులకు విధేయుఁడై రాజకీయ సాంఘికాదికార్యకలాపములలో వారికి హృదయపూర్వకముగ సహకరించినాఁడు.

తాళికోట యుద్ధానంతర మితరనాయకరాజులలో స్వాతంత్ర్యభావములు తలలెత్తినను తంజావూరు నాయకరాజులలోమాత్ర మట్టి యవిధేయగుణము కానరాదు. విజయనగరరాజుల విజయపరంపరకు వీరు కారకులైరి.

17వ శతాబ్ద ప్రారంభదశలో నచ్యుతప్పనాయకునకు పోర్చుగీసు వారికిని వైరుద్ధ్యము ప్రారంభమైనది. నాగపట్టణమువద్ద నితఁడు పోర్చుగీసువారిపై సాధించిన విజయ మీవిషయమును సూచించుచున్నది. పరాశికలు (పోర్చుగీసువారు) జాఫ్నావాసులను పీడించుచున్న కారణమున జాఫనీయప్రభువుయొక్క యభ్యర్థనముపై నచ్యుతప్ప నాయకుఁడు పోర్చుగీసువారితో యుద్ధము చేయవలసివచ్చినది. సామా

30. Ep. Coll, 10 of 1904.

న్యప్రజలను క్రైస్తవమతము పుచ్చుకొనునట్లు చేయుటకై వారవలంభించిన పద్ధతులు, ప్రజాపీడనాది దారుణచర్యలును రాజాగ్రహమునకు కారణములైనవి.

అచ్యుతప్పనాయకుఁడు శత్రువులనణచుటకు కొన్ని యుద్ధములు చేసినను మొత్తముమీద నతని పరిపాలనాకాలము సుఖశాంతుల కాలవాలమైనదని చెప్పవచ్చును. రసార్ద్రహృదయుఁడై రమణీయకళాపోషకుఁడుగా రాణకెక్కినాఁడు. ఆదాయములో చాలభాగము ప్రజోపయోగ కార్యక్రమములకు వెచ్చించినాఁడు. కొన్ని నూతనదేవాలయములను నిర్మించినాఁడు. పాడుపడిన దేవాలయములను బాగుచేయించినాఁడు. తనతండ్రి నిర్మించిన తిరువన్నామలై దేవాలయ గోపురమునకు సువర్ణకలశముల నమర్చినాఁడు. తిరువిడైమరుదూరులోని శివాలయమున కొక గ్రామదానము చేసినాఁడు. మాయవరము తాలూకాకు చెందిన మూవలూరులోని మార్గసహాయేశ్వరాలయమునకు కొంత భూమిని దానముచేసినాఁడు. చిదంబరములోనున్న తిరుమలస్థానదేవాలయమునకు దక్షిణార్కాటు మండలమునకుఁజెందిన తిరువెంకలము అను గ్రామమును దానముచేసినాఁడు.[31] కాంజీవరములోని యొక దేవాలయమునకై దుగ్రామములను దానముచేసినాఁడు[32] తంజావూరి కంసాళ్లకిచ్చిన పన్నులరాయితీని క్రీ॥ శ॥ 1577 లో నితఁడు వేయించిన శాసనము సూచించుచున్నది.[33] శ్రీరంగమునందలి మహావిష్ణ్వాలయమున కతఁడన్నిటికన్నఎక్కువదానములు చేసియున్నాఁడు. ఆస్వామి గర్భాలయమునకు బంగారపు విమానమును చేయించినాఁడు. ఆ దేవదేవునకు రత్నమయకనకకిరీటమును, మణిమయకవచమును, రత్నఖచితసింహాసనమును బహూకరించినాఁడు. ఆ యాలయమునకు

31. Record 416 & 423 dated in the year 1566 A. D. for the merit of the Vijayanagara King, Tirumalaraya.
32. Record No. 380.
33. Record No. 22 of 1897.

పూర్వపశ్చిమోత్తరదిగ్భాగములందున్నత గోపురములు నిర్మించి యష్టమప్రాకారము, ననేకమంటపముల నేర్పరచి పారమార్థికఖ్యాతి నార్జించినాఁడు. ఆదేవాలయసమీపమున నొక సుందరోద్యానమును పెంచి కావేరీనదికి సోపానములు కట్టించినాఁడు. అతఁడు ప్రతిసంవత్సరము తులాపురుష హిరణ్యగర్భదానములు చేసినట్లు తెలియుచున్నది[34] ఏటేట నతఁడు రామేశ్వరదేవాలయమును సందర్శించి దానికి గోపురములు కట్టించినాఁడు. మాయవరము, తిరువిడై మరుదూరు, కుంభకోణము, తిరుపాడియనుచోటులందు కావేరీనదిలోనికి దిగుట కనుకూలముగ సోపానసమూహముతోఁగూడిన పుష్యమండపములను నిర్మించినాఁడు.[35] నిత్యము వేయిమంది బ్రాహ్మణులకు సంతృప్తికరమైన సంతర్పణ చేసెడివాఁడు. తిరువాడికి సమీపమున కావేరీనది కానకట్టకట్టించి తనరాజ్యములో చాలభాగమునకు సస్యానుకూలముగ నీటిపారుదలవసతులు కల్పించినాఁడు. కాళహస్తి, తిరుపతి, చిదంబరము మొదలగు పుణ్యక్షేత్రములందలి దేవాలయములలో ననేక పూజలు, పారమార్థికసేవలును చేసినాఁడు.[36]

క్రీ॥ శ॥ 1600 లకు కొన్నిసంవత్సరములు ముందుగానే యచ్యుతప్పనాయకుఁడు రాజకీయవ్యవహారములనుండి విరమించినట్లు యాన్క్వెటిల్ డుపెర్రన్ (Anquetil duperron) వ్రాసినట్లు ఫాదర్ హీరాసు చెప్పియున్నాఁడు.[37] మరియు నా రాజాలస్యముగ ప్రపంచమును పరిత్యజించి మరణమునకు సిద్ధపడినాఁడని క్రీ॥ శ॥ 1597 వ సం॥నకు కొంచెము ముందుగా తంజావూరు రాజ్యముగుండా ప్రయాణముచేసిన ఫాదర్ పిమెంటా చెప్పియున్నాఁడు. ఇతని యభిప్రాయమును ఫాదర్ డూజారిక్ అంగీకరించియున్నాఁడు.[38] అచ్యుతప్పనాయకుని రాజ్యపరి

34. Inscription No. 426 of 1924
35. రుక్మిణీపరిణయము, పే. 343
36. A short history—Kuppuswamy Sastry, P. 6-7
37. The Aravidu Dynasty of Vijayanagar—Father Heras
38. Dujarric, 1, P. 648

త్యాగము, అతని కుమారుడైన రఘునాథనాయకుని సామ్రాజ్య పట్టాభిషేకోత్సవము 1597 లో జరిగియుండునని వీరరాఘుపండితుఁ డూహించి యున్నాఁడు. పిమెంటా డూజారిక్ లుగూడ నీయభిప్రాయము నే వ్యక్తము చేసియున్నారు. ఈసందర్భములో రఘునాథాభ్యుదయములోఁ జేయఁబడిన వర్ణన దీనికి సరిపడుచున్నది. అవసానదశలో నారాజేంద్రుఁడు సతీసమేతుఁడై శ్రీరంగము వెళ్లినట్లు, నచ్చట నతఁడు పరమపదించఁగ నతని పెబ్బదిమంది భార్యలును సహగమనముచేసి నట్లును ఫాదర్ పిమెంటా, ఫాదర్ డూజారిక్ అనువారలు చెప్పి యున్నారు.[39]

ఇతఁడాలస్యముగ మరణించినాఁడని, మంచిగంధపుచెక్కలతో మండుచున్న యతనిచితిపై నతని 370 మంది భార్యలును సహగమనము చేసినారనియును కొందరు క్రైస్తవమతప్రచారకులు చెప్పి యున్నారు.[40] అచ్యుతమంగళము శాసనమే రఘునాథనాయకుని పేర్కొను తొలిశాసనముగ పరిగణింపఁబడుచున్నది.[41] అనంతరదశలో వెలువడిన లాల్‌గుడి శాసనములో రఘునాథనాయకగోవిందదీక్షితులు పేర్కొనఁబడినారు.[42] ఇట్టి శాసనాధారములనుబట్టి, జెసూట్‌ఫాదర్ల యుత్తరములనుబట్టియు రఘునాథనాయకుఁడు క్రీ॥ శ॥ 1600 నుండి పరిపాలనాబాధ్యత వహించినట్లు తెలియుచున్నది. రాజ్యాధికారము రఘునాథున కప్పఁజెప్పవలెనని గోవిందదీక్షితుఁ డచ్యుతప్పనాయకునకు సలహాయిచ్చినట్లు సాహిత్యరత్నాకరమునుబట్టి తెలియుచున్నది. రఘునాథనాయకున కతనితండ్రి క్రీ॥ శ॥ 1614 లో రాజ్యాధికారము నప్పఁ జెప్పినట్లూహింపఁబడుచున్నది. క్రీ॥ శ॥ 1589 కి కొంతముందుగ నతఁడు యువరాజైనట్లు తెలియుచున్నది.[43]

39. Vriddhagirisan—The Nayaks of Tanjore—P. 58.
40. Father Coutinho wrote from Chandragiri on July, 17,1600A.D
41. Achyutamangalam inscription No. 412 of 1925 of Tanjore Dt.
42 Record No. 151 of 1928 from Lalgudi, dated 1600 A. D.
43. The Nayakas of Tanjore (By Vriddhagirisan) P. 61.

వ్యాపారార్థము డచ్చివారు నాగపట్టణమునకువచ్చి యొక మిల్లును స్థాపించుటకు ప్రయత్నించినపుడు వారి నచ్యుతప్పనాయకుఁడు ధైర్యసాహసములతో తరిమివేసినాఁడు.[44] నాగపట్టణములో నొక క్రైస్తవాలయమును నిర్మించుకొనుటకు ఫాదర్ పిమెంటా కనుమతి నిచ్చినాఁడు. ఇతఁడు మహామండలేశ్వరుఁడుగ కవల్కుదురుశాసనములో ప్రశంసింపఁబడినాఁడు[45] పెనుగొండను వశపరచుకొనుటకు విజయనగరప్రభువుచేసిన యుద్ధములో సహకరించుటకై యచ్యుతప్ప నాయకుఁడు తనకుమారుఁడైన రఘునాథనాయకుని పంపినాఁడు.

అతఁడు వృద్ధుఁడైనకారణమున రాజ్యాధికారమును తనకుమారుఁడైన రఘునాథున కప్పఁజెప్పి శేషజీవితమును ప్రశాంతముగా శ్రీరంగములోఁ గడపినాఁడు. రఘునాథుని పట్టాభిషేకోత్సవమును మంత్రివర్యుఁడైన గోవిందదీక్షితుఁడు శాస్త్రోక్తముగ జరిపించినాఁడు.[46] రఘునాథనాయకుఁడే యచ్యుతప్పనాయకుని పెద్దకుమారుఁడన్నట్లు గోవిందదీక్షితుఁ డతనికే పట్టముగట్టినాఁడు.

శ్లో. అము మద్భుతాకృతి సమంవిలోకయన్
అశరీర వాక్యమపిచాను చింతయన్
ఉచితం తయూరథ తనూజముర్వరా
రమణశ్చకార రఘునాథ భూపకిమ్.

అను సాహిత్యరత్నాకరశ్లోకమునుబట్టి రఘునాథునకొక యగ్రజుఁడున్నాఁడని, యతనిని విడిచి సమర్థుఁడైన రఘునాథునకే తండ్రి పట్టముగట్టినాఁడనియును చాగంటి శేషయ్యగారు చెప్పియున్నారు.[47]

44 Canto VI, V 68
45. In a much damaged and dateless record No. 298 of 1911 on a stone in the Kankudatta Vinayaka temple at Kavalkudaru
46. Sources of Vijayanagar history—S. K. Aiyangar-P 273
47. ఆంధ్రకవితరంగిణి, 12 సం. పే. 5.

రఘునాథునాస్థాన కవయిత్రియగు రామభద్రాంబయు, తదితరకవులును రఘునాథునగ్రజుఁడగు నచ్యుతనాయకునిఁగూర్చి తమ గ్రంథములందు ప్రస్తావించియుండలేదు. తంద్రియాజ్ఞ ననుసరించి రఘునాథుఁడు తన యన్నను కారాగారమున బంధించినట్లు వై దేశికులు చెప్పియున్నారు.[48] ఆ సమయములో ఫాదర్ కొటిన్హో వ్రాసిన యొకయుత్తరమునుబట్టి యీ విషయము ధృవపడుచున్నది.[49] రఘునాథునిపైఁగల ప్రత్యేకాభిమానముతో నచ్యుతప్పనాయకుఁ డట్లు చేయించినాఁడని చెప్పవచ్చును. సాధారణముగ బాధ్యతగల తండ్రులు పెద్దకుమారులను పరిత్యజించి ప్రత్యేకాభిమానముతో తరువాతివారికి రాజ్యాధికారము నంటఁగట్టిన పరిస్థితులే రాజకుటుంబవిషాదాంత సన్నివేశములకు దారితీసినవి. రఘునాథుఁకు తనతండ్రి మరణానంతరము రాజ్యాధికారమును చేఁబట్టిన తొలిదశలో తనయగ్రజుని చంపినట్లు కొందరూహించియున్నారు.[50] ఈ వాదమును శ్రీ కురుగంటి సీతారామయ్యగారు తమ తంజాపురాంధ్రనాయకచరిత్రలో ఖండించియున్నారు. కృష్ణదేవరాయలకుఁగూడ నిట్టియపవాదమునే యంటఁగట్టిరి. సరసుఁడు, విశాలహృదయుఁడు, జ్ఞానసంపన్నుఁడునైన రఘునాథనాయకుఁడు భ్రాతృహింస చేసియుండఁడని భావించనగును. నతని కగ్రజుఁడు లేఁడని కురుగంటివారు చెప్పియున్నారు.

ఆనాటి సంస్కృతవిద్వాంసులలో, వేదాంతములోను నప్పయ్య దీక్షితుఁడు మిక్కిలి పేరుగాంచినాఁడు. అచ్యుతప్పనాయకుఁడా విద్వన్ముఖ్యు నాదరించి సన్మానించినాఁడు. ఆ రాజేంద్రుఁడా దీక్షితవర్యునకు 1595 లో ధనదానము చేసినట్లు తెలియుచున్నది.[51] గోవిందదీక్షితుఁడు కేవలము మేధానిధియైన మంత్రివర్యుఁడుగ నేగాక సకలశాస్త్రవి

48. Anquetil Duperron I. P., P. 168
49. Fr. Coutinho's letter to Fr. Fimenta dated 17-7-1600
50. The Aravidu Dynastry of Vijayanagar—Henry Hiras, P. 402.
51, Record No. 710 of 1904

మగుగ, ప్రముఖ వేదాంతిగను ప్రఖ్యాతిగాంచినాడు. ఆ మహామనీషి హరివంశసారచరిత్రమును మూడాశ్వాసముల మహాకావ్యమును, సంగీతసుధానిధియను సంగీతశాస్త్రగ్రంథరాజమును రమణీయశైలిలో రచించినాడు. అచ్యుతప్పనాయకునియాజ్ఞ ననుసరించి సంస్కృతములో నున్న తిరువయ్యారుపురాణమును తమిళములోనికి కనువదించినాడు. అతని బహుభాషాపాండిత్యమునకివి నిదర్శనములు. గోవిందదీక్షితుని హరివంశసారచరిత్రమునకు అప్పయ్యదీక్షితుడు చక్కని వ్యాఖ్యానమును రచించినాడు. శతకంఠవిజయము, భైష్మీపరిణయము, భావనాపురుషోత్తమనాటకము, విధినిర్ణయము, బోధతంత్రవివరణము, వేదాంతసారము మున్నగు మహాగ్రంథములను రచించి జగద్విఖ్యాతవిద్వాంసుడుగ పేరుగాంచిన రత్నవేలదీక్షితుడు గోవిందదీక్షితుని పుత్రుడు.

శ్లో. త్రినామాద్యంతనామానౌ మహీక్షిద్దీక్షితావుభౌ
శస్త్రేశాస్త్రేచనిపుణావాహవేషుహవేషుచ.

అను శ్లోకమునందచ్యుతప్పనాయక గోవిందదీక్షితులు చతుర్కావముగ ప్రశంసింపబడిరి. అచ్యుతప్పనాయకుడు క్రీ॥ శ॥ 1600 ప్రాంతమున పరమపదించినట్లు జెసూట్ పాదిరీలు చెప్పియున్నారు. 1614 ప్రాంతమున మరణించినట్లు వృద్ధగిరిశెన్ గారు, కురుగంటి సీతారామయ్యగారు నూహించియున్నారు. ఇతడు 1561 నుండి 1614 వరకును రాజ్యపాలన చేసినట్లు కురుగంటి సీతారామయ్యగారు చెప్పియున్నారు.

## 3. రఘునాథనాయకుడు

తంజావూరు నాయకరాజులలో రఘునాథనాయకుడు ప్రతిభాసమన్వితుడై ప్రభువర్యుడుగా ప్రఖ్యాతిగాంచినాడు: ఇతడు తంజావూరు రాజ్యమును క్రీ॥ శ॥ 1600 నుండి 1630 వరకు పరిపాలించినట్లు కొందరు చరిత్రకారులు పేర్కొనియున్నారు.[52] అతడు క్రీ॥ శ॥ 1614

52. Introduction to Raghunadhabhyudayam— N. Venkataramanayya & M. Somasekhara Sarma—P. 26,30.

నుండి 1633 వరకు నేలినట్లు కురుగంటివారు తెల్పియున్నారు. ఆ రాజేంద్రుని పరిపాలనాకాలమున రాజ్యము సుఖశాంతులకాలవాలమై యలరారినది. ప్రజాహృదయములు నిమ్మకునీరుపోసినట్లు ప్రశాంతముగ నుండి రమణీయభావవికాసముతో రసానందముకొరకు రంతులాడఁ జొచ్చినవి. ఆనాటి ప్రజాజీవనస్రవంతిలో సంస్కారసముపేతచైతన్య శక్తి జాలువారినది. కర్ణాటకసంగీత నాట్యాది సరసకళలా రాజశ్రేష్ఠు నాదరాభిమానములవలన పరిపూర్ణవికాసమునందినవి. ప్రత్యేకముగ సాహితీసరస్వతి యారఘునాథునాస్థానరంగస్థలముపై గజ్జెలుకట్టుకొని రసానందజనకముగ రమణీయ నాట్యభంగిమలనెరపినది. ఆ మహాత్ముని వలన తంజానూరురాజ్యమునకు కీర్తిప్రతిష్ఠలు సంక్రమించినవి. అతని పరిపాలనాసమయమున తంజానూరు దాక్షిణాత్యకళాకేంద్రముగా వర్ధిల్లినది. తాను స్వయముగ ననేక రసవద్గ్రంథములను రచించి మహాకవిగ, పండితుఁడుగ, నుత్తమ సంగీతవిద్వాంసుఁడుగను ప్రఖ్యాతి గాంచినాఁడు. తనయాస్థానమున ననేక కవీంద్రులను పోషించి వారిచే నుద్గ్రంథములను రచింపించి కవిపండితపోషకుఁడుగ గణనకెక్కినాఁడు. ఇట్టి సర్వతోముఖప్రతిభ నాధారముగఁ జేసికొని యానాటి కవీంద్రు లతని నభినవభోజరాజని ప్రశంసించినారు. అతఁ డాయాయుద్ధములలో సాధించిన ఘనవిజయములే యతని కీర్తిపతాకలై తేజరిల్లినవి. "But for him, the history of the Tanjore would have remained obscure and insignificant."[53] అని చరిత్రకారులు ప్రశంసించి నట్లతఁడు లేనిచో తంజానూరురాజ్యమునకు గౌరవప్రతిష్ఠలు లేవని చెప్ప వచ్చును. కర్నాటక, నేపాల (జాఫ్నా) రాజుల రాజ్యాధికారములను నిలఁబెట్టినవాఁడుగ పేర్కొనఁబడినాఁడు. జాఫ్నాతీరమువరకు సముద్ర ముపై పడవలతో వంతెన నేర్పరచి సైన్యసమేతుఁడై యతిసాహస ముతో జాఫ్నాలో ప్రవేశించి శత్రువులైన పోర్చుగీసువారిపై విఖ్యాత విజయము సాధించి నూతన దాశరథియనుపేరు గాంచినాఁడు.

---

53. The Nayaks of Tanjore—Vriddhagirisan—P. 62.

కళాప్రియుఁడు, సౌందర్యోపాసకుఁడునైన రఘునాథనాయకుఁడు తంజావూరుకోటలో ననేక సుందరభవనరాజములను నిర్మించినాఁడు. అట్టివానిలో లక్ష్మీవిలాసము, అచ్యుతరంగకూటము, నాకపురీవిలాసము, లాగులచప్పరము, శ్రీరామసౌధము, విజయభవనము, ఇందిరా మందిరము మున్నగునవి దివ్యభవనములుగ పేర్కొనఁబడినవి. కోనెపాకిలిలోనున్న లక్ష్మీవిలాసభవనములో వేచియున్న వివిధ సేనానాయకులతో కలసి రాజు సైనికవ్యవహారములను యుద్ధతంత్రములను రాజ్యసంరక్షణము మున్నగు వ్యవహారములను చర్చించెడివాఁడు. పున్నాగ వృక్షచ్ఛాయాసమీపముననున్న యచ్యుతరంగకూట మాటపాటలకు నిలయమైయుండెడిది. అతిసుందరముగ నిర్మింపఁబడిన నాకపురీవిలాస భవనము స్వర్గసౌధమునధఃకరించుచుండెడిదట. వ్యాయామక్రీడాకారులకు 'లాగులచప్పరము' కేంద్రముగ నుండెడిది. మదనగోపాలసౌధములో మన్నారుదేవుని సుందరవిగ్రహము ప్రతిష్ఠింపఁబడి హృదయాకర్షకముగ నుండెడిది. శ్రీరామసౌధము శ్రీరామచంద్రునకు నిలయమై ఇంద్రనీలమణిస్థగితమై ద్వితీయపుష్పకవిమానమువలె కానవచ్చెడిది. రఘునాథుని వివిధవిఖ్యాతవిజయములకు, వీరవిన్యాసములకును చిహ్నముగ కాంచనకవాటములతో విజయభవనము నిర్మింపఁబడినది. చోళగుఁడు, పోర్చుగీసువారు, పాండ్యతుండీరనాయకులు మున్నగు శత్రువులపై రఘునాథుఁడు సాధించిన విజయముల మనోహరకళావైభవముట్టిపడునట్లు చిత్రింపఁబడి యొక మనోజ్ఞ చిత్రకళానికేతముగ నిందిరామందిరము కానవచ్చెడిది. ఇంకను నాటకకళాశాలలు తదితర నిర్మాణము లనేకములుండెడివి. ఇతఁడు అమ్మాంబా వెంపరాజచంద్రుల రమణీయతనయయగు కళావతిని వివాహమాడినాఁడు. మరియు వెంకటేంద్రుని తనయయగు వేంకటమ్మ, చెంజిరాజకుమారియగు లక్ష్మమ్మ విశ్వనాథునిపేర విభుపుత్రికయు నతనిభార్యలుగ రఘునాథనాయకాభ్యుదయ కావ్యములో పేర్కొనఁబడిరి.[54]

---

54. రఘునాథనాయకాభ్యుదయము–విజయరాఘవనాయకుఁడు–తృ. అ.

రఘునాథుడు పాండ్యరాజకుమార్తెను వివాహమాడినట్లు రామభద్రాంబ తన రఘునాథాభ్యుదయములోఁ జెప్పినది. ఆ వీరవరుడు క్రీ॥ శ॥ 1610 లో పాండ్యరాజులతో చేసిన యుద్ధమునకు ఈ వివాహమునకును సంబంధము గలదని భావించి తంజావూరు గెజిట్‌లో ఈ వివాహసన్నివేశమునకు కథాప్రాధాన్యమియ్యబడినది. కాని కొందరు చరిత్రకారులీ వివాహమును విశ్వసింపలేదు.[55] అట్లే అనేక రాజపుత్రికలను వివాహమాడినట్లు సాహిత్యరత్నాకరమునందు వర్ణింపబడినది. అతనికి పట్టమహిషియైన కళావతివలన విజయరాఘవనాయకుడు గలిగినట్లు సాహిత్యరత్నాకరమువలన తెలియుచున్నది. విజయరాఘవనాయకుని రఘునాథాభ్యుదయనాటకముగూడ "కళావతి" రఘునాథుని పట్టంపు రాణియని పేర్కొనినది.

క్రీ॥ శ॥ 1584 లో వేయించిన రఘునాథనాయకుని మొట్టమొదటి శాసనము ఉత్తరార్కాటుజిల్లా, వందవాసితాలూకాలోఁ గానవచ్చినది.[56] రఘునాథనాయకుడు యువరాజుగనున్నప్పుడుకూడ తండ్రితో కలిసి రాజ్యపాలనచేయుచు నాటి విజయనగరప్రభువైన వెంకటపతిరాయల కనుకూలముగ యుద్ధములందు సాధించిన విఖ్యాతవిజయములతని ఘనతకు కారణములైనవి. క్రీ॥ శ॥ 1589 లో నతఁడు గోల్కొండయుద్ధమునందు చేసిన నిరుపమసాహసమునకు రాయలు మిక్కిలి మెచ్చుకొనినాఁడు. పెనుకొండ యుద్ధములో నాసాహసించి సాధించిన ఘనవిజయమే యతని వినుతవీరత్వమును దశదిశలఁ జాటి చెప్పినది. క్రీ॥ శ॥ 1611 లో మధురనాయకరాజులతో జరిగిన యుద్ధములో నతఁడు ప్రముఖపాత్ర వహించినాఁడు. చైత్రయాత్రలో నతఁడు ముందు కుంభకోణము వెళ్ళి, యచ్చటినుండి కోలరూనసముఖద్వారము కడనున్న దుర్భేద్యమగు చోళగుప్త కోటను ముట్టడింపవలెనని, యనంతరము బాధ్నుకువచ్చిన శత్రుప్రమాదమును తొలగించి యచ్చటి

55. The Nayaks of Tanjore—Vriddhagirisan—P. 64.
56. Ibid, 112 of 19:4.

రాజ్యమొక్క రాజ్యాధికారమును సుస్థిరముగావించవలెనని, యటుపై తోపూరువెళ్ళి యచ్చట జగ్గరాజును శిక్షించి రాయల యాధిపత్యమును పటిష్ఠముగావించవలెనని యు నిశ్చయించుకొనినాఁడు. చిదంబరము తాలూకాలోని భువనగిరికోటను స్వాధీనపరచుకొని తాను సాధించిన విజయమునకు చిహ్నముగ నచ్చటి యుద్ధరంగస్థలమున నొక జయస్తంభము నెత్తించినాఁడు. మధురనాయకప్రభువైన ముద్దువీరప్ప తంజాపూరిపై దండెత్తిరాగా నతని రఘునాథుఁడోడించి తద్విజయ చిహ్నముగ తనకాలి గండ పెండారములో నతనిబొమ్మను చెక్కించినాఁడు, ఇతని పట్టాభిషేకము క్రీ॥ శ॥ 1611లో జరిగియుండునని కురుగంటివారూహించియున్నారు. శ్రీ కుప్పుస్వామిశాస్త్రిగారు, కృష్ణస్వామిఅయ్యంగారు, సత్యనాథయ్యరుగారు. తంజాపూరుజిల్లా గెజటీరు మాన్యువలుకారులును కురుగంటివారి యభిప్రాయముతో నేకీభవించినారు. శ్రీరామపండితుఁడుమాత్ర మతని పట్టాభిషేకసమయమును 1597 గా పేర్కొనియున్నాఁడు.

"Raghunadha was not the lawful heir to the thrown He had an elder brother whom he supplanted. The contemporary European travellers and Christian missionaries explicitly state that he had an elder bhother. It is stated that by the order of Achutappa who was partial to Raghunadha, this unfortunate prince was at first imprisoned; and was subsequently murdered by Raghunadha after his accession to the thrown. [57]

అని పాశ్చాత్యులు చెప్పిన విషయమును తగిన బలీయాధారములు లభించువరకును విశ్వసించుటకువీలులేదని నేలటూరి వెంకటరమణయ్యగారు తమ రఘునాథనాయకాభ్యుదయగ్రంథమునకు చెందిన యాంగ్ల పీఠికలో వ్రాసియున్నారు[58]

57. Ibid, PP. 401-2
58. Introduction to Raghunadhanayacabyudayamu, P. 27.

శ్లో॥ సింహస్వంతితీపగతచోళగ శిక్షణంచ
నేపాళదేశ నృపశాత్రవ నిగ్రహాశ్చ।
కర్ణాల భూపతినవీకరణంచ సర్వ
మాపన్యతేతు మ ను దిగ్విజయోపదేశాత్ 59

అను శ్లోకమునుబట్టి రఘునాథనాయకుఁడు దిగ్విజయయాత్రకు బయలుదేరినపుడు చేసిన ప్రతిజ్ఞ వ్యక్తమగుచున్నది. రఘునాథనాయకుఁడు తనజైత్రయాత్రలో మొదట చోళగునిపై దృష్టిని కేంద్రీకరించినాఁడు. అతఁడు కొలెరూన్ నదీముఖద్వారముకడనున్న దేవికోటను రాజధానిఁ జేసికొని యా ప్రాంతమును పరిపాలించుచుండెడివాఁడు. మహాక్రూరుఁడై బాటసారులను పీడించుచు స్త్రీలను మానభంగము గావించెడివాఁడు. రాజాజ్ఞలను ధిక్కరించుచు సార్వభౌమునకవిధేయుఁడుగ నుండెడివాఁడు. దప్పికగొన్నవారిని మరుఁగుచున్న సీసమును త్రాగుఁడని బలవంతము చేసెడివాఁడు. ప్రత్యేకశిక్షణతో కండకములో నుంచబడిన మొసళ్ళకు బంధితుల నాహారము నిచ్చెడివాఁడు. సూదులతో గ్రుచ్చి బంధితులను బాధించెడివాఁడు. ఇట్టి దారుణచర్యలవలన నతఁడు రావణాసురునితో పోల్పఁబడినాఁడు. దశశిరస్సులు లేకపోవుట తప్ప మిగిలిన విషయములందు రావణునకు చోళగునకు భేదమేమాత్రములేదని చెప్పవచ్చును. అతఁడు భైరవస్వామి నారాధించి మంత్రశక్తులను సంపాదించియున్నాఁడని రామభద్రాంబ పేర్కొనినది. నాటి విజయనగర ప్రభువర్యుఁడు విశ్వప్రయత్నముచేసినను నతనిని జయించలేకపోయినాఁడు. ఆయదనుజూచుకొని పోర్చుగీసువారుగూడనా క్రూరకర్మునకు సహాకరించి యతని పాపకార్యములను ప్రోత్సహించిరి. అతఁడు జింజికృష్ణప్పనాయకుని సామంతుఁడు. అతనిని సాలవచ్చుఁడని హీరాసుపండితుఁడుపేర్కొనినాఁడు. అతనిరాజధానియైన దేవికోటను "జలకోట" యని మహమ్మదీయచరిత్రకారులు పేర్కొనిరి. జలముచే

59. రఘునాథాభ్యుదయము, 8-31.

చుట్టంబడియున్నది గనుక దానికానామము సార్థకమైయున్నట్లుభావింప నగును. క్రీ॥ శ॥ 1597 లో నాసముద్రతీరప్రాంత సంచారముచేసిన ఫాదర్ పిమెంటాయను పాశ్చాత్యుండతనినిగూర్చి, యతని సుశిక్షిత మకరసమూహామునుగూర్చియు చెప్పి, యతని కుమారుండు క్రైస్తవ మిషనరీలకు స్నేహపూర్వకముగ సహాయము చేసినట్లు వేర్కొని యున్నాండు. అట్టి మాయాతంత్రజ్ఞుండు, శౌర్యధైర్యసంపన్నుండునైన చోళగుండుగూడ రఘునాథనాయకుని ధాటికోర్వలేక లొంగిపోయి నాండు. ఆ నాయకప్రభువు చోళగుని, నతని కుటుంబీకులను బంధించి యతనిచే బంధితులైనవారికి విముక్తి కలిగించి ప్రజల బాధలను బాపి నాండు. ఇది రఘునాథుని తొలివిజయమని వృద్ధగిరీశన్ గారు చెప్పి యున్నారు.[60] ఆ మహాయుద్ధము క్రీ॥ శ॥ 1615 లో జరిగినట్లు కృష్ణ స్వామిఅయ్యంగారు చెప్పియున్నారు.[61]

దేవికోట విజయానంతరము రఘునాథనాయకుండు సైన్యసమే తుండై సముద్రతీరముగుండ దక్షిణదిశంగా ప్రయాణముచేసి సముద్ర ములో పడవలవంతెన నేర్పరచి సముద్రముదాటి జాఫ్నా(నేపాళము) చేరుకొనినాండు. కర్రతెప్పల నాధారముగంజేసికొని సముద్రతరణము చేసినట్లు రామభద్రాంబ చెప్పినది. ఆ జాఫ్నాయుద్ధములో పోర్చుగీసు వారినోడించి,యాప్రాంతమునుండివారిని పారద్రోలి నేపాలరాజులను తిరిగి సింహాసనమునందు ప్రతిష్ఠించి, యతని రాజ్యాధికారమును సుస్థి రముగావించినాండు. శతఘ్నులు పేలుచున్నను లెక్కచేయకుండ గుండ్లవర్షములో సేనాముఖమున నిర్భయముగ నిలంబడి తనసైనికులను ప్రోత్సహించి,మహాశూరుండుగాప్రపంచప్రఖ్యాతిగాంచిన నెపోలియన్ సేనానివలె రఘునాథనాయకుండుగూడ పోర్చుగీసువారిగుండ్లవర్షము లెక్కచేయక తన సైన్యమును ప్రోత్సహించుచు జాఫ్నాలోవిజయము

60 The Nayak's of Tanjore—(Vriddhagirisan, P. 76.

61. Sources of Vijayanagar History—Dr. S. Kristna Swamy, Ayyangar.

సాధించినాఁడు. ఈ వీరోచిత విజయాత్మక సన్నివేశము 1615 వ సంవత్సరాంతమునఁగాని, 1616 వ సంవత్సర ప్రారంభదశలోఁగాని జరిగియుండునని చరిత్రకారు లూహించియున్నారు. ఈ సంఘటన పోర్చుగీసువారి డైరీలలో యాల్వుణవైభవమాలై[62] Ancient Jaffna[63] అను గ్రంథములందు సవివరముగ పేర్కొనఁబడినది. నాటి సేనాళి ప్రభువుసంకలికుమారుఁడనిరసనాయగముగారుచెప్పియున్నారు. అచ్చటినుండి రఘునాథుఁడు జగ్గరాజుపై దండెత్తుటకు నిర్విరామ ప్రయాణముసాగించి నలనామసంవత్సరములో నాషాఢమాసమునందు (క్రీ॥ శ॥ 1616) పలమనేరికడ విడిసినాఁడు. తోప్పూరువద్ద జరిగిన భయంకర సంగ్రామములో నతఁడు క్రూరుఁడైన జగ్గరాజును సంహరించి, రామరాయలను విజయనగరరాజ్యాధిపతిగావించి, తనవిఖ్యాత విజయమునకుచిహ్నముగ నాసంగ్రామరంగస్థలమునందు విజయస్తంభమును స్థాపించినాఁడు. అనంతరము జగ్గరాజు సహోదరుఁడగు యతిరాజు, జింజి కృష్ణప్పనాయకుఁడునురఘునాథు నెదిరించుటకు ప్రయత్నింపఁగా తాను తిరువైయారులో విడిసియుండి తన సేనానాయకునిపంపి భువనగిరికోటను వశపరచుకొని వారి యాగడముల నరికట్టినాఁడు. అట్లు జేగీయమాన విజయపరంపరలతో, సజరామరమైన ఖ్యాతితోను తన రాజధానియైన తంజావూరునకు తిరిగివచ్చి ముగ్ధహృదయములతో పౌరులర్పించిన ప్రశంసాపూర్వక నీరాజనము లందుకొనినాఁడు. ఆవీరవరుఁడు చేసిన మహాయుద్ధములలో తోప్పూరు యుద్ధము చివరిదిగా పరిగణింపఁబడుచున్నది. "జగ్గరాయ యాచమనాయకుల సైన్యములు లక్షలాదిసంఖ్యలో యుద్ధముచేయుటకు తిరుచునాపల్లికడనున్న విశాల ప్రదేశములో చేరియున్నవి"[64] అని యొక పాశ్చాత్యుఁడు చెప్పియుండు

62. మయిల్ పాహనపులవర్-17 వ శతాబ్దము.

63. సి. రసనాయగమ్-(తమిళము)- పే. 96.

64. Barradas writing on December 12, 1616 A. D.

టనుబట్టి, యీ యుద్ధమునుగూర్చి విజయరాఘవనాయకుఁడు తన రఘునాథాభ్యుదయములో చేసిన వర్ణనను బట్టియు తోపూరు యుద్ధము క్రీ॥ శ॥ 1617 ప్రారంభదశలో జరిగినట్లు చారిత్రకులచే నిర్ణయింపఁబడినది [65] ఈ యుద్ధము నలనామ సంవత్సరాషాఢ శుద్ధ షష్టినాఁడు అనగా 27-6-1616న జరిగినట్లు కురుగంటివారు చెప్పియున్నారు. రఘునాథుని విజయపరంపరకు భయపడి బిజపూరుసుల్తానైన యేదులఖాన్ (ఆదిల్ ఖాన్) హనుమోజిపంతులను రాయబారిగ పంపి యతనితో చెలిమి చేసికొనినాఁడు. ఈ విషయము "ఏరాజు భుజశౌర్యమేదులఖానాది వజ్రీల చెలిమికి వశ్యవిద్య" అను విజయవిలాస పద్యపాదములో ప్రశంసాపూర్వకముగ పేర్కొనఁబడినది.[66] కాని యీ తోపూరు యుద్ధమింకను పూర్తికాలేదని ఫాదర్ రూబిన్డో[67] అనునతఁడు 29-11-1617 తేదీన వ్రాసిన యొకయుత్తరములో పేర్కొనియున్నాఁడు. ఇతని యభిప్రాయము సరియైనదికాదని, రఘునాథనాయకుఁడు తోపూరు యుద్ధములో విజయముసాధించిన తరతపాతనుక్రోపముకొలది జింజి కృష్ణప్పనాయకుఁడు, జగ్గరాజుయొక్క సోదరుఁడగు యతిరాజును కలిసిచేసిన తాత్కాలికసంచలనమునుజూచి యతఁడట్లు వ్రాసియుండునని మన చరిత్రకారులు చెప్పియున్నారు.[68]

విజయనగరప్రభువైన వెంకటపతిరాయలకు విధేయతాపూర్వక సహకారమునిచ్చినట్లే యనంతరదశలో పరిపాలించిన రామరాయలకుఁ గూడ నట్లే సహకరించి తన వినమ్రస్వభావమును చాటుకొనినాఁడు.

65 "Ramaraya of Vijayanagar" in Sardesai Commemoration Volume (S. K. Ayyangar), P. 203, The Aravidu, Dynastry of Vijayanagar-Fr. Heras, P. 484, History of Nayakas of Madura, P. 103

66. వి. వి. అవతారిక-చె. వెం. ప. 56.

67. Fr. Rubind, the master of the College at Santhome.

68. The Nayaks of Tanjore-Vriddhagirisan, P. 89

దేవికోటలో తమ ప్రతినిధినుంచుట కనుమతి నర్థించుచు నాంగ్లేయులొకయు త్తరమును రఘునాథునకు వ్రాసినారు. కాని యతఁడు వారికోరికను తిరస్కరించినాఁడు [69] సెంగిలినాఁడునకు చెందిన వేదండి చోళన్‌అను వీరుఁడు పెరిచ్చిచోళగన్‌అను క్రూరుని పట్టుకొని చంపి నందుల కతనిని రఘునాథనాయకుఁడు బహూకరించినట్లు "నొడియార్" శాసనమువలన తెలియుచున్నది.[70] పెరిచ్చిచోళగన్ అనునతడే దేవికోటకుచెందిన చోళగుఁడని, రఘునాథుఁడతనిని యుద్ధములో బంధించి తీసికొనివచ్చిన యనంతర మతఁడు తప్పించుకొని పారిపోయియుండునని, యతనిని తిరిగి వేదండిచోళన్ అను వీరుఁడు పట్టుకొని చంపియుండునని యీ శాసనమునుబట్టి యూహింపనగును.

రఘునాథనాయకుని ప్రముఖపరిపాలనా సమయమునందు పోర్చుగీసువారేగాక యాంగ్లేయులు, డచ్చివారు, డెన్మార్కుదేశీయులును వ్యాపారార్థమై సముద్రతీరప్రాంతములకు చేరుకొనిరి. పోర్చుగీసు వారికి, డచ్చివారికిని వైరుధ్యము పెచ్చుపెరిగినది. డచ్చివారి సహాయముతో పోర్చుగీసువారిని స్థానికప్రభువులైన తంజావూరి నాయకుఁడు, తదితరులును పోర్చుగీసువారిని దక్షిణదేశమునుండి తరిమివేసిరి. తిరుమలరాయపట్టణములో తమకు కావలసిన కొంతస్థలముకొరకు నాటి తంజావూరునాయకప్రభువుతో రాయబారముజరిపినట్లొక డచ్చిప్రతినిధి యొకయు త్తరములో వ్రాసినట్లు తెలియుచున్నది.[71] డెన్మార్కుదేశీయులాంగ్లేయులకంటె కొద్దిసంవత్సరములు ముందుగనే తంజావూరినాయకుని పరిపాలనాసమయమున 19-11-1620 తేదీనాఁడు కోరమాండల్ తీరమునందున్న ట్రాన్క్వెబార్‌లో స్థిరనివాసము నేర్పరచుకొనిరి. నాటి డెన్మార్కుప్రభువైన కింగ్ క్రిస్టియన్ IV చేత భారతదేశమునకు

69. The English factory records, 1661-64, P. 365.
70. Inscription No. 200 of 1932, coming from Nodiyar Tanjore District.
71: Bourgouji, the dutch factor at Tegnapatam-letter dt. 26-7-1610.

మొదట పంపఁబడిన నావికాముఖ్యాధికారియగు గీడి (Geede) యను నతఁడా డేనిష్ సెటిల్‌మెంటుకు కారకుఁడైనాఁడు. ఆవిధముగా 1620 సం॥ నవంబరు నెలలో గీడియనునతఁడు చేసిన ప్రయత్నము ఫలించుట వలన ట్రాన్క్విబారులో కోటనుగట్టుటకు కావలసిన సాధనసామాగ్రిని సప్లైచేయుటకు, నాప్రాంతములో వ్యాపారము చేసికొనుటకను రఘునాథుఁడు డెన్మార్కువారి కనుమతినిచ్చినాఁడు. కాని యంతకుముందే డేనిష్‌సర్వీసులోనున్న రాక్లెన్ట్‌క్రేప్ (Roclantcrape) అను డచ్‌దేశీయుడు తన పదముగ్గురనుచరులతో తంజావూరువచ్చి రఘునాథని సందర్శించి యా ప్రభువర్యునాదరాభిమానములకు పాత్రుఁడైనాఁడు.[72] అట్లే యాంగ్లేయులుగూడ క్రీ॥ శ॥ 1624 లో నాయకోత్తముని రాజ్యమునందు కర్రైకాల్‌లో నొకమిషను (factory) స్థాపించుటకు ప్రయత్నించిరిగాని యతఁ డెక్కువధనము నద్దెరూపములోనడిగినకారణమున నాప్రయత్నమును విరమించుకొనినారు. "తంజావూరు నాయకరాజు తనదేశమున నివసించువాడని తరచు మమ్మాహ్వానించి ప్రత్యేకములగు హక్కులు కల్పింతునని వాగ్దానము చేసినాఁడు" అని బ్రాక్సిడన్ అను పాశ్చాత్యు డొకయుత్తరములో వ్రాసియున్నాఁడు.[73]

జాన్‌జాన్సన్ అనునతఁడు 16.0 లో డేనిష్‌నావికులతో కలిసి భారతదేశమునకువచ్చి రఘునాథనాయకు నాస్థానమును సందర్శించినాఁడు.

రఘునాథనాయకుని పరిపాలనలో నుత్తరదేశ యుద్ధములుగాని, రాజకీయసంక్షోభములుగాని లేకుండ ప్రశాంతముగ సాగినది. ప్రజలు శాంతచిత్తులై మాన్యభావములతో మనఁగల్గిరి. అతని సువిశాల

72. J. R A. S., 1898, P. 625. The Danish settlement of Tranquebar Donald Ferqusson.
73. Letter from President Brokcedon from Bataria to the East India Company, dated 14-12-1623. The English factory records. Vol. 11, P. 337

రాజ్యముయొక్క సరిహద్దులందెట్టి శత్రుసంచలనము లేకుండ నతని యాధికారికి ప్రతిపత్తి దక్షిణదేశమున రామ్‌నాడ్ జిల్లాలోని తిరుక్కోట్టియార్, తిరుచునాపల్లిజిల్లాలోని లాల్‌గూడి, చెంగల్‌పట్టు జిల్లాలోని గోవిందపాడి, యుత్తరార్కాటుజిల్లాలోని నెడున్‌గున్రమ్, నరట్టన్‌పూడి మున్నగు ముఖ్యప్రదేశములవరకు నప్రతిహతముగ వ్యాపించినట్లు రఘునాథుని శాసనములనుబట్టి తెలియుచున్నది.[74]

రఘునాథుని శాసనములు కొన్ని రాజకీయ ప్రతిపత్తిగల యధికారవర్గమును సూచించుచున్నవి. అతని ముఖ్యమంత్రియగు గోవింద దీక్షితుఁ డతని శాసనములలో నెక్కువగా పేర్కొనఁబడినాఁడు. ఆ మంత్రివర్యుఁ డొక శాసనములో ప్రధానిగను, మరొక శాసనములో రాజప్రతినిధిగను (Agent) పేర్కొనఁబడినాఁడు. మరొక శాసనములో మాదయ్యనాయకుని కుమారుఁడగు సెల్లప్ప నాయకుఁడు ముఖ్యప్రతినిధిగా పేర్కొనఁబడినాఁడు.[76] రఘునాథుని మరియొక ప్రతినిధియైన "కొలందప్పార్" అనునతఁడు బ్రాహ్మణసంతర్పణలకు, తిరుక్కోట్టియార్ దేవాలయోత్సవములకును నవకాశములు కల్పించినట్లు వేరొక శాసనమునుబట్టి తెలియుచున్నది.[77] ఇంకను మల్లప్పనాయకుని కుమారుడగు మారయ్యనాయకుఁడు శ్రీవంజియములో తట్టప్పిళ్లై, నరసింగ దీక్షితుఁడు మొదలగు ప్రముఖులతని యేజెంట్లుగనున్న ట్లాయాశాసనములనుబట్టి తెలియుచున్నది.[78] మరియు వేంకటపతిరాయలపేరిట రఘునాథుఁడు కైలాసపురమనుగ్రామమును భగవంతునకు సర్వమాన్య

74 Records No. 308 of 1923 dated Saka, 151 of 1928 from Nattamangudi, 40 of 1923, Govindavdi, 705 of 1904 from Nedungunram and 379 of 1925 from Naravayhampudi.

75. Records No. 331 of 1923 and 290 of 1927

77. No. 308 of 1923 Dt. 1607 A. D

78 Records Nos 77 and 78 of 1911, 57 of 1923, 371 of 1925 Dt- 1614

దానముగ నిచ్చినట్లు వేరొకధశాసనమునుబట్టి తెలియుచున్నది.79

రఘునాథనాయకుఁడు మాన్యమత పరమార్థమునుగ్రహించి నిజమైన యద్వైతభావముతో శైవవైష్ణవమతములను, తదితర మతములను నభిమానించి యాయా దేవాలయములకు దానధర్మము లసంఖ్యాకముగఁజేసి నిరుపమసేవచేసినాఁడు. తంజావూరు నాయకవంశీకులపారమార్థిక దృక్పథమును జాగరూకతతో పరిశీలించినచో విజయనగర రాజుల మహనీయ మతసహనమును బాగుగ జీర్ణించికొనినట్లు తోచును అట్టి మానిత మతసహనమునకు రఘునాథనాయకుఁడొక నిదర్శనము. విజయీంద్రతీర్థుని యనంతరము మధ్వాచార్యపీఠమునలంకరించిన సుధీంద్రునకు తన యాస్థానములో కనకాభిషేకముచేసి యా యాచార్యోత్తముని గౌరవించినాఁడు.80 తనరాజ్యములో క్రైస్తవులు వ్యాపారముచేసికొనుట కనుమతించుట, నాగపట్టణము, ట్రాన్క్విబార్ మున్నగుచోటులందు విదేశస్థులు నివసించుట కనుమతించుట, మున్నగు సన్నివేశములారాజేంద్రుని మతసహనమును, విశాలభావసంపత్తిని వ్యక్తముగావించుచున్నవి. ఆ మహోదాత దానధర్మములు చేసినపుడు విడిచిపెట్టిన ధారాజల మొకనదివలె ప్రవహించినదని రామభద్రాంబ తన రఘునాథాభ్యుదయములో వర్ణించినది. అతఁడు బ్రాహ్మణోత్తులకు రెండు పర్యాయములు తులాపురుషదానములు చేసినట్లు యజ్ఞనారాయణదీక్షితుఁడు తన సాహిత్యరత్నాకరమునందు పేర్కొనినాఁడు. వికలాంగులకుఁగూడ నమూల్యరత్నములను, కాంచనాభరణాదులను దానముచేసినాఁడు. మఱియు నతఁడు హిరణ్యగర్భ మహాభూతఘటములను మహాదానములుకూడ చేసినాఁడు. బంగారముతోచేయఁబడిన గోవుల నమూల్యరాజలాంఛనాత్మక వస్తువులనుకూడ దానముచేసినాఁడు. హేమాద్రిచే రచింపఁబడిన దానచింతామణియందు పేర్కొనఁబడిన వివిధదానములకు మించి యతడనేకదానములు చేసినట్లు చెప్పఁ

79 Narohampundi (North Arcot Dt ) inscription No- 379 of 1925-

80. రాఘవేంద్రవిజయము 11 అ, శ్లో. 53.

బడినది.[81] ఆ రాజోత్తముడు తులాపురుష ప్రదానములు చేసినట్లు గోవిందదీక్షితుడుకూడ తన సంగీతసుధావతారికలో చెప్పియున్నాడు. ఆ సంగీతసుధావర్ణనమునుబట్టి రఘునాథుఁ డసంఖ్యాక బ్రాహ్మణులను నిరతాన్నదానముతో పోషించినట్లు తెలియుచున్నది.[82] రామభక్తుఁడైన రఘునాథనాయకుడు కుంబకోణ రామేశ్వర శ్రీరంగపట్టణము లందు రామాలయములను నిర్మించినందులకు సంగీతసుధ, తంజావూరి యాంధ్రరాజుల చరిత్రమను గ్రంథములందు ప్రశంసింపఁబడినాడు. కుంబకోణమునందలి కుంభేశ్వరస్వామ్యాలయమునకు గోపురమును, మంటపమును నిర్మించినాడు. మన్నారుగుడిలోని శ్రీనివాసస్థలచంపక దేవాలయములకుఁ జేర్చి సుందరభవనములను నిర్మించినాడు. తిరువయ్యారులోని జప్యేశ్వరస్వామియొక్క, పశుపతికోయిల్‌లోని ధేనునాథస్వామియొక్కయు రథోత్సవములు భక్తిశ్రద్ధలతో నతఁడు జరిపించినట్లు సంగీతసుధ ప్రశంసాపూర్వకముగా పేర్కొనినది.[83] ఖడ్గవిద్యయందు రఘునాథుఁడపారప్రావీణ్యముగలవాఁడని రఘునాథాభ్యుదయకావ్యమునందు వర్ణింపఁబడినది.[84] మరియు లక్ష్యశుద్ధితో తుపాకీ పేల్చుటయందు, నశ్వారోహణవిద్యయందును గడునిపుణుఁడనియు సాహిత్యరత్నాకరవర్ణనమునుబట్టి తెలియుచున్నది.[85] ఆ వీరాగ్రగణ్యుని యుద్ధతంత్రనైపుణ్యాతిశయమున కతఁడు సాధించిన ఘనవిజయములే తార్కాణములు. సంగీతసాహిత్యములందు సమధికపాండిత్యము సంపాదించి సంస్కృతాంధ్రములందసమాన కవితాశక్తిని గడించినాఁడు. దండనీతియందతనికి లోతైన పరిజ్ఞానముగలదని రామభద్రాంబ చెప్పినది.[86] కవితాకరశకాటపట్టులుగ పరమసుందరపద్యములను గూర్చు

81. The Noyaks of Tanjore (Vriddhagirisam, P. 107.
82. సంగీతసుధ, శ్లో. 57-60.
83. సంగీతసుధ, శ్లో. 54-56.
84. రఘునాథాభ్యుదయము, 111 ఆ. శ్లో. 27.
85. సా. ర. 111 ఆ.
86. రఘునాథాభ్యుదయము (రామభద్రాంబ) ఆ. శ్లో. 35 నుంచి 46.

టలో, రసానుకూలముగ వివిధవృత్తములను ప్రస్తావనలను గూర్చుట లోను నతనికిగలప్రజ్ఞ నిరుపమానమైనది. పారిజాతాపహరణము, వాల్మీకిచరిత్రము, రుక్మిణీపరిణయ యక్షగానము, రామాయణమునను తెలుఁగు గ్రంథములు, సంగీతసుధ, భారతసుధయను సంస్కృతగ్రంథ ములును రఘునాథుని రసవద్రచనలలో ముఖ్యములైనవి. అతఁడు సంగీతశాస్త్రములో పరమప్రామాణికుఁడని, సుప్రసిద్ధ కర్ణాటకసంగీత వ్యవస్థాపకుఁడనియును తెలియుచున్నది. వివిధరాగానుకూలముగ వీణను మేళవించి చిత్రవిచిత్రధ్వనులు వెలయించుటలో నతఁడు కడు నిపుణుఁడని చెప్పఁబడినది.[87] జయంతసేనాది నూతనరాగములకు, రామానందాది నూతనతాళములకు నతఁడు కర్తయైనట్లు సంగీతసుధను బట్టి తెలియుచున్నది. ప్రముఖసంగీతశాస్త్రగ్రంథమైన సంగీతసుధ యొక్క కర్తృత్వవిషయము వివాదాస్పదమైనది. "ప్రజలందరికిఁ దెలియునట్లు ద్విపదచ్ఛందములో సంగీతసుధను రచింపుము." అని గోవిందదీక్షితుఁడు రఘునాథుని కోరినట్లు తెలియుచున్నది.[88] తనతండ్రి యగు గోవిందదీక్షితుఁడు సంగీతసుధను రచించినట్లు వెంకటముఖి తన చతుర్దండిప్రకాశికలో చెప్పియున్నాఁడు. రఘునాథుఁడే దీనిని రచించి నట్లు గ్రంథస్థనిదర్శనములు కానవచ్చుచున్నవి. వెంకటముఖి నిర్ణయ మును విశ్వసించినవారు "గోవిందదీక్షితుఁడే యీగ్రంథమును రచించి రఘునాథునిపేర ప్రకటించియుండును" అని యూహించుచున్నారు. కాని యిద్దరును సకలశాస్త్రవేత్తలు, బహుభాషాకోవిదులు, గ్రంథ నిర్మాణదక్షులును గనుక రఘునాథుఁడు గోవిందదీక్షితుని సహాయ ముతో సంగీతసుధను రచించియుండునని భావించుట సముచితము. శ్రీకృష్ణదేవరాయల భువనవిజయమునుబోలిన యిందిరామందిరమను సభాభవన మతని కుండెడిది.

87. సా. ర. V & VI ఆ. శ్లో. 10 నుంచి 28.

88. సం. సు. పీఠిక. శ్లో. 71 నుంచి 76.

ఆ రాజకవీంద్రు నాస్థానములో ననేక కవులు, కవయిత్రులును తమ రసవత్కవితారీతులకాలవాలములైన కమనీయ కావ్యగ్రంథములతో నా నరసప్రభువర్యు నారాధించి తరించిరి. రఘునాథుఁడు విద్యాసముద్రుఁడుకాగా నందు కలియు నదులవంటివారుగ పండితులు పేర్కొనఁబడినారు.

అతనికాలములో తంజావూరు వాణీనిలయమైనది. నాడు బాల బాలికలుగూడ వివిధవిద్యామూర్తులుగ వర్ధిల్లిరి. యజ్ఞనారాయణ దీక్షితుఁడా రఘునాథునిఁ గవిబుధగాయకాభిమత కల్పతరువుగా పేర్కొనియున్నాఁడు. మట్లయనంతభూపాలు నాస్థానకవి, కొంకణకో ణంగికవియని పేరుగాంచినవాఁడునైన కవి చౌడప్ప యారాజేంద్రుని సందర్శించి మెచ్చుకొనుటయేగాక యతనిచే సన్మానింపఁబడినాఁడు.[89] గోవిందదీక్షితుఁడు, యజ్ఞనారాయణదీక్షితుఁడు, వెంకటముఖి (వెంక టాధ్వరి) యను గోవిందదీక్షితుని తనయులిరువురు, రత్నఖేటదీక్షితుని కుమారుఁడు రాజచూడామణిదీక్షితుఁడు, కుమార తాతాచార్యుఁడు, రామభద్రాంబ, మధురవాణియను సంస్కృతకవులు, కవయిత్రులును, చేమకూర వేంకటకవి, కృష్ణాధ్వరి మున్నగు నాంధ్రకవీశ్వరులును తమ కావ్యమాలికలచే నతని యాస్థానము నలంకరించిరి. రఘునాథుని జైత్రయాత్రాఫలితముగ యుద్ధములు సమసిపోయి దేశమునందు ప్రశాంతవాతావరణమేర్పడిన సమయమందిట్టి కళావికాసము తారస్థాయి నందుకొనినట్లు భావింపనగును. ఆ సరససమయమతనిపరిపాలనయొక్క యుత్తరదశగా పరిగణింపఁబడుచున్నది. అతని యాస్థానకవుల రచన లలో చాలవరకు క్రీ॥ శ॥ 1617 తరువాతనే రచింపఁబడినట్లు తెలియు చున్నది.[90] రఘునాథునకు నాటకకళయందు ప్రత్యేకాభిమానమున్న కారణమున రాజభవనములో నొక నాటకప్రదర్శనశాల నేర్పాటుచేసి

---

89. తం. అం. చ. పీఠిక (Vavilla Publishers) పే. 28.

90. The Nayaks of Tanjore - Vriddhagirisam, P. 110

యందు నాటకములను ప్రదర్శింపఁజేసెడివాఁడని తెలియుచున్నది.[91] ఆ కళాతపస్వియొక్క యాదరాభిమానపూర్వక ప్రోత్సాహమువలననే యక్షగానసరస్వతి తన తొలిరూపరేఖలు దిద్దుకొనినది. ఆ సమయములో సంస్కృతాంధ్రసాహితీవికాసములు మిగిలిన భాషాసాహిత్యములకన్న నతిశయస్థాయిలో సాగినవి. మహాభయంకరయుద్ధములుచేసి యా వీరనాయకోత్తముఁడు సాధించిన ఘనవిజయములవలన ఘనతఁ గాంచి, తాను స్వయముగ కవీంద్రుఁడు పండితప్రకాండుఁడునై కళారసికతతో ననేక కవులను, పండితులను, నితరకళాకారులను పోషించి శాశ్వతకీర్తి నార్జించినాఁడు, యజ్ఞనారాయణదీక్షితుఁడు, చేమకూర వేంకటకవియు తమ గ్రంథరాజములందా రాజశ్రేష్ఠు నభినవభోజుఁడు, చోళగమానభంజనుఁడు, సుకవితాభోజుఁడు, దక్షిణసామ్రాజ్యవిభవధౌరేయుఁడు, నేపాలనృపాలస్థాపనచణుఁడు, సమరనిశ్శంకుఁడు, రత్నతులాపురుషాదికదానచణుఁడు, వితరణదీక్షారాధానుతుఁడు, రత్నతులాపురుషాదికదానచణుఁడు, వితరణదీక్షారాధానుతుఁడు, రాజసేవాధురీణుఁడు, చతుష్షష్టివిద్యాప్రవీణుఁడు, పురందరజిద్భోగధురంధరుఁడు, షోడశమహాదానాదిపుణ్యక్రియాదక్షుఁడు, కర్ణాటకప్రభుసుఖప్రదుఁడునను ప్రముఖబిరుదములతో నతని సహజసిద్ధగుణములకు నాత్మకవితాపూర్వకనిస్తుల నీరాజనముపట్టినారు.[92]

Raghunadha is the most war like prince in all those parts, an observer of justice and one who will protect all those that trade in his country"[93]

91. వి. వి. (చే. వేం.) అవతారిక, 28 ప.

92. 1. వి. వి. అవతారిక–60–64 ప్ర. అ. 160–163, ద్వి. అ. 204 ప॥
2. స. ర.–ద్వి. అ.–శ్లో. 71 తృ. అ. 238, 239 ప॥

93. English factory records: vol. III. Letter from President Brockedom to the East India Company, dated January 17, 1624 A. D.

అని పాశ్చాత్యప్రముఖులుగూడ నతనిని కొనియాడినారు. దక్షిణదేశ మునందాంధ్రవాఙ్మయాభిరుచిని పెంపొందించి తద్వికాసమునకు రఘునాథనాయకుఁడే కారకుఁడైనాఁడు. ఇట్లు సర్వసమర్థుఁడైన రఘునాథ నాయకుఁ డెక్కువకాలము రాజ్యము నేలునదృష్టమునకు నోచుకొన లేదు. అతఁడు క్రీ॥ శ॥ 21-1-1631 నాఁడు పరమపదించినట్లు తెలియు చున్నది.[94] ఈ యభిప్రాయముతో ప్రొఫెసర్ కె. వి. ఆర్. నరసింహము గారుగూడ నేకీభవించినారు. తంజావూరు రాజులందరిలోను నీ ప్రభు వయ్యేఁడే తక్కువకాలము పరిపాలనచేసినట్లు తెలియుచున్నది. శా॥ శ॥ 1553 (క్రీ॥ శ॥ 1631) లో కుంభకోణమునందలి మఠములో వేసిన శాసన మతని కట్టకడపటిశాసనముగ పరిగణింపఁబడుచున్నది.[95] రఘు నాథనాయకుఁడు తనకుమార్తెయగు నచ్యుతరఘునాథమ్మను మధుర తిరుమలనాయకునకిచ్చి వివాహముచేసినాఁడని, యొకప్పుడా తిరుమల నాయకుఁడు మధురలో కోటను కట్టించి తనభార్యకు చూపఁగా నామె తనతండ్రికోటతోనది సరితూగదని చెప్పినందున నతఁడు కోపించి యామెను బాకుతో పొడిచి చంపినట్లొక యైతిహ్యముగలదు గాని దానిని విశ్వసించుటకుఁదగిన చారిత్రకాధారములు గానరావు.

తంజావురాంధ్రచరిత్రమునకు రఘునాథుఁడొక నాయకమణి. అతఁడు కృష్ణదేవరాయలతో నన్నివిషయములలోను సాటివచ్చును. లక్ష్మీ సరస్వతు లిరువురును తంజావూరు నాటపట్టుగఁ జేసికొనిరి. కృష్ణదేవరాయలకాలములో విజయనగరమున నాంధ్రకవితావధూటి యెట్లు పల్లకిలో నూరేగినదో యట్లే రఘునాథనాయకునికాలమునఁ గూడ ధ్వజాది రాజచిహ్నములతో నలరారినది.

శ్లో॥ కళారత్నం గీతం, గగనతలరత్నం దినమణిః,
సభారత్నం విద్వాన్, శ్రవణపుటరత్నం హరికథా,

94. Day book of the Dutch factory at Pulicat, P. 493
95. Ed. Coll, 290 of 1927

నిశారత్నం చంద్రః, శయనతలరత్నం శశిముఖీ,
మహీరత్నం శ్రీమజ్జయతి రఘునాథో నృపవరః.[96]

అను రఘునాథస్తోత్రపరమైన యుత్తమశ్లోకములతో నతఁడు రాజశ్రేష్ఠుఁడుగఁ గొనియాడబడినాఁడు.

ఉ॥ సారభుజాబలంబునను జక్కఁదనంబున సద్గుణంబులన్
ధీరనుతప్రతాపమున దిక్కులమిక్కిలినిండు కీర్తులన్
ధారుణిఁబ్రోచునేర్పున నుదారదయం గవితా చమత్కృతిన్,
శ్రీరఘునాథభూమిపరిణీమణికిన్ సములే నృపాలకుల్.

అని రంగాజమ్మ తన మన్నారుదాసవిలాసమునందు రఘునాథుని ప్రశంసించినది.

శ్లో॥ కత్ కత్ నక్షితిపతయః కింతే రఘునాథనాయకాయంతే
భువిభహవః కిలతరవః కింతే సంతానపాదపాయంతే

అని రామభద్రాంబ రఘునాథుని యాధిక్యమును ప్రశంసించినది.

"రఘునాథుఁడు రామభక్తుఁడు, పితృభక్తిపరాయణుఁడు, కృతికర్త, కృతిభర్త, పండితుఁడు, గాయకుఁడు, యుద్ధతంత్రవిశారదుఁడు, రాజనీతినిపుణుఁడు, కవిపండితపోషకుఁడు, సంస్కృతాంధ్రభాషాసాంపర్యప్రజ్ఞానఘనుఁడు, దక్షిణాంధ్రవాఙ్మయచరిత్ర నుద్దీపింపఁజేసిన రసికప్రభువతంసుఁడు, గొప్పబుద్ధిశాలి, జ్ఞాని, దృఢకాయుఁడు, గొప్పవీరుఁడు సజేయుఁడు, నిత్యగణపూజాధురంధరుఁడు, విష్ణుశంభుమతములను రెండిటిని పాలించినవాఁడు" అని శ్రీ కేతవరపు రామకోటిశాస్త్రిగారు ప్రశంసించియున్నారు.[98]

96. సుభాషితరత్నభాండాగారము, 183.
98. సంగ్రహాంధ్రవిజ్ఞానకోశము–రఘునాథరాయలు (డా॥ కేతవరపు రామకోటిశాస్త్రి) పే. 457.

## 4. విజయరాఘవనాయకుఁడు

రఘునాథనాయకుని యనంతర మతనికుమారుఁడగు విజయరాఘవ నాయకుఁడు తంజావూరి సింహాసనము నధిష్ఠించినాఁడు. అతని నచ్యుత విజయరాఘవనాయకుఁడనికూడ వ్యవహరించెడివారు.[99] అతని యారాధ్యదైవమైన మన్నారుగుడికిచెందిన మన్నారుదేవుని చిహ్నముగా మన్నారుదాసను వ్యవహారముకూడ నతనికిఁగలదు.[100] విజయ రాఘవుని పరిపాలన క్రీ॥ శ॥ 1634 నుండి ప్రారంభమైనట్లు తెలియుచున్నది.[101] దీనినిబట్టి రఘునాథనాయకుఁడు 1634 లో మరణించినట్లు, నాసంవత్సరములోనే విజయరాఘవనాయకుఁడు తంజావూరు రాజ్యప్రభువైనట్లు నూహింపఁబడుచున్నది. అతని పట్టాభిషేకోత్సవ సమయములో నా మహోదాత్త షోడశమహాదానములను జేసినట్లు రఘునాథాభ్యుదయకావ్యములో వర్ణింపఁబడినది. విజయరాఘవుని యాస్థాన కవియగు చెంగల్వకాళకవి తన విజయరాఘవవంశావళియను విఖ్యాత గ్రంథములో నారాజేంద్రుఁడా షోడశమహాదానములను శ్రీముఖనామ సంవత్సరమునందు శ్రావణమాసములోఁ జేసినట్లు చెప్పియున్నాఁడు. ఆ సమయము క్రీ॥ శ॥ 1633 వ సంవత్సరములో ఆగష్టు, సెప్టెంబరు నెలల మధ్యకాలమునకు సరిపడుచున్నది. ఈ రెండుగ్రంథములలో పేర్కొనఁబడిన సమానసన్నివేశమునుబట్టి విజయరాఘవుఁడు క్రీ॥ శ॥ 1633 లోనే పట్టాభిషిక్తుఁడైనట్లు తెలియుచున్నది. శ్రీ కురుగంటి సీతారామయ్యగారుకూడ నీయభిప్రాయముతో నేకీభవించినట్లు వారి తంజాపురాంధ్రనాయకరాజచరిత్రమునుబట్టి తెలియుచున్నది. [102]

99. Incription No. 461 of 1922 from papanaśenam.
100. Letter of Father proenza in 1659 La Mission Du Madure.
101. భవసంవత్సరములో రఘునాథుఁడు పట్టీశ్వరమునందు చేయించిన శాసనము నం. 257 ఆఫ్ 1927. ఈభవ సం॥ క్రీ॥ శ॥ 1634 వ సం॥నకు సరిపడుచున్నది.
102. The nayaks of Tanjore (Vriddhagirisan) P. 126.

మఱియు నీ విషయము వెంకటమఖి యొక్క శిష్యుడైన రాజచూడామణి దీక్షితుఁడు తన 'తంత్రశిఖామణి' యను గ్రంథమునందు చేసిన వర్ణనమునుబట్టి కూడ ధ్రువపడుచున్నది. కవి గురువుగారియొక్క యాజ్ఞ చొప్పున తా నా గ్రంథము రచించినట్లు దీక్షితుఁడు పేర్కొని యున్నాఁడు. అతని గురువైన వెంకటమఖి విజయరాఘవుని యాస్థాన కవి యయ్యెడు. విజయరాఘవుడు క్రీ.శ. 1633 నుండి 1673 వరకును రాజ్యపాలన చేసినట్లు తెలియుచున్నది.

విజయరాఘవనాయకుఁడు వీరోచితముగా సాగించిన విజయములు రఘునాథనాయకాభ్యుదయప్రారంభదశలో వర్ణింపఁబడినవి. ఇతఁడు యువరాజుగ నున్నపుడే పశ్చిమాధిపతిగ పేరు గాంచిన మధురనాయక రాజు నోడించి, తన పరాక్రమాతిశయమును చాటుకొని తండ్రి కానందము చేకూర్చినాఁడు. మరియు నితడు యుద్ధములో సవరము వెంకటపతిరాజు నోడించి పండసల్లూరును వశపరచుకొనినాడు. తాను మన్నారు గుడి యందలి మన్నారు దేవుని కుమారుఁడ నని యాతఁడు చెప్పికొనెడివాఁడని పాశ్చాత్యుల వ్రాతలనుబట్టి తెలియుచున్నది.[103]

రాజచంద్రుని కుమార్తెయగు కాంతిమతిని విజయరాఘవుఁడు వివాహమాడినట్లు, పదిలక్షలగ్రామము లతనికి కట్నముగ సంభవించి నట్లును తెలియుచున్నది.[104] అతనికి రాజగోపాలాంబిక యను మఱి యొక భార్యయుండెడిదని యామెయె పట్టమహిషియని, మన్నారుదాసను తనయుఁడు వారికి గలిగినట్లును తెలియుచున్నది.[105] దీనినిబట్టి విజయ రాఘవునకుఁ బెక్కు మంది భార్యలున్నట్లు తెలియుచున్నది. రసికాగ్ర

103 Father Proenza's letter, 1659 A. D. - La Mission Du Madura, Vol. III

104 మన్నారుదాస విలాసము-రంగాజమ్మ

105 హేమశాంబనాయికా స్వయంవరము-మన్నారుదాసు,

గణ్యమైన యీ ప్రభువయ్యాంధ్రసాహిత్యమునకు చేసిన సేవ నిరుపమానమైనది. రాజకీయరంగమున నతఁడు చేసిన కృషి కంటె వాఙ్మయరంగమునం జేసిన కృషి మాన్యతమమైనదిగా పరిగణింపఁబడుచున్నది. అనేకకవులను, కవయిత్రులను, పండితప్రకాండులను పోషించి యాతఁడు అసంఖ్యాకగ్రంథరత్నములను వెలయింపజేసె. తాను గూడ స్వయముగ కవియు పండితుఁడునై యనేకయక్షగానములను రచించి యాంధ్రసాహిత్యచరిత్రలో శాశ్వతస్థానము నాక్రమించుకొనినాఁడు. అతఁడు తెలుఁగుసాహిత్యములోని యక్షగాన వాఙ్మయశాఖకు పట్టుఁగొమ్మయై పేరు గాంచినాఁడు. అతఁడొక కళాతపస్వి. అతని యపూర్వాదరణలో నాంధ్రసాహితీసుందరి పవిత్రకావ్యభూషణములతో విభూషితయై ముద్దుమురిపెములు నూపినది. అతని సరససాహితీ సమారాధనమును ప్రశంసించుచు, సుప్రసిద్ధచారిత్రక విమర్శకులగు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు "The Telugu Prabandha Literature inaugurated by Allasani Peddana, reached its glory under the careful nourishment and patronage of Vijayaraghava." అని పేర్కొనియున్నారు. అల్లసాని పెద్దనచే ప్రారంభింపఁబడిన యాంధ్రప్రబంధ సాహిత్యము విజయరాఘవుని పరిపోషణమునందు పరాకాష్ఠదశ నొందినదనిదీని యభిప్రాయము.

రఘునాథనాయకున కచ్యుతనాయకుఁ డచ్యుతరామభద్రుఁడు, విజయరాఘవనాయకుఁడను నను ముగ్గురు తనయులు గలరు. విజయరాఘవుఁడు యువరాజుగనున్నపుడు తిరుక్కాట్టుపల్లి, పందనల్లూరు గ్రామములతో తృప్తిపడినట్లు తెలియుచున్నది.[106] తండ్రిమరణానంతరము విజయరాఘవనాయకుఁడు తన యగ్రజులిరువురి యొక్క నేత్రములు పీకించి గ్లింకోటలో వారిని బందీలుగ నుంచినట్లు జెసూట్ వృత్తాంతముల

106. The Maratha Principality of Tanjore--Hiki

వలన తెలియుచున్నది. "......The prisons were thrown open and multitude of state prisoners were set free, the sole crime of most of whom being their fortune or social position. Among the latter were two brothers of the Nayak, whom he had shut up in these prisions, after pulling out their eyes to remove all desire on their side of succeeding him [The Nayak][107] అను వాక్యములు పై యభిప్రాయమునకు ప్రోద్బలకములుగఁ గానవచ్చుచున్నవి.

విజయరాఘవ నాయకుఁడు శా. శ 1555 శ్రీముఖనామ సంవత్సర శ్రావణశుద్ధ ద్వాదశినాఁడు తంజాపురాధిపతి యైనట్లు తెలియుచున్నది.[108] ఇచ్చట పేర్కొనబడిన శాలివాహనశకవత్సరము క్రీ. శ. 1633తో సరిపడుచున్నది. దీనినిబట్టి యితఁడు క్రీ. శ. 1633 లో తంజాపుర రాజ్యమునకు పట్టాభిషిక్తుఁడైన ట్లూహింపబడుచున్నది. విజయనగర ప్రభు వైన శ్రీరంగరాయలకితఁడు సమకాలికుఁడు. కప్పములు గట్టుట మాని తన యాజ్ఞను ధిక్కరించుచున్న మధురరాజ్యాధిపతి యగు తిరుమలరాయనిపై, చెంజి రాజ్యాధిపతి యగు [illegible] నాయకుఁడు మొదట నాయక పక్షమవలంబించినను చివరికి రంగరాయల పక్షముఁ జేరి యా యుద్ధమునందు విజయనగరప్రభువునకు విజయమును సాధించి పెట్టినాఁడు.[109] ఇతనికి "జీర్ణకర్ణాటకసామ్రాజ్యసింహాసన స్థాపనాచార్య" యను బిరుదము గలదు. కాని యీ సందర్భములో విజయరాఘవనాయకుఁడు వహించిన పాత్ర యుత్తరరూపమును దాల్చినట్లు జెసూట్ మిషనరీల వ్రాతలనుబట్టి తెలియుచున్నది.

107. History of the Nayaks of Madura, S. Satyanatha Iyer, Appendix A. PP.270-272.

108. రఘునాథనాయకాభ్యుదయము (విజయరాఘవనాయకుఁడు) పే. 12 275 ను 280పా.

109. History of the Nayaks of Madhura, P. 127,

"The Nayak of Madura enlisted in his difection those of Tanjore and Ginjee, by concluding with them a league against their common soverign. The later informed of everything through the Nayak of Tanjore who had the meanness to betray his allies, marched at the head of his army and advanced on the territory of Ginjee" అని యీ సందర్భములో 'జెసూట్' మిషనరీలు వ్రాసినట్లు తెలియుచున్నది.[110]

తండ్రి తాతవలె విజయరాఘవనాయకుడు గూడ ప్రగాఢ వైష్ణవ మతాభిమానము గలిగియుండెను. మన్నారు గుడి రాజగోపాల స్వామి భక్తాగ్రగణ్యుడుగ భాసిల్లినాడు. ఆ మన్నారుదేవుని భక్తుడుగ వర్థిల్లిన కారణమున నతనికి మన్నారుదాసను నామాంతరము గూడ నేర్పడినది. అతడు శ్రీరంగ క్షేత్రమునందలి రంగనాథస్వామికి రత్నాంగి మొదలగు మణిమయాభరణములను కానుకలుగా సమర్పించినాడు. ఆ దేవాలయమునకు ప్రాకార గోపుర ప్రాసాదములను నిర్మించినాడు. ఒక తటాకమును త్రవ్వించి పూలతోటను గూడ నేర్పరచినాడు. బ్రాహ్మణులకు రఘునాథపురాద్యగ్రహారములను దానము చేసినాడు. సత్రములను నిర్మించి నిరతాన్నదానముచేసి ప్రఖ్యాతి గాంచినాడు.

కారణాంతరములవలన తండ్రియైన విజయరాఘవునిచే బంధింపబడిన మన్నారుదాసు దశాంతరములో నా తండ్రి చేతనే బంధవిముక్తుడై నందులకు సంతసించి తన తండ్రిని ప్రశంసించుచు నాశువుగ చెప్పిన

"క. మణి క్రిందు పరచి జలనిధి
తృణమున్ పైనుంచె నతనిదే కొదువ సుమీ
మణి మణియే తృణము తృణమే
రణ విజయ దిలీప విజయ రాఘవభూపా!"

110. Nayaks of Madura, P. 264 [S. Satyanadha Aiyer]

## విజయరాఘవుని కృతులు

1. రాజగోపాలవిలాసము (యక్షగానము)
2. చెంగమల వల్లీపరిణయము ”
3. గోవర్ధనోద్ధరణము ”
4. రతి మన్మథవిలాసము ”
5. రాసక్రీడ ”
6. నవనీతచోరము ”
7. పారిజాతాపహరణము ”
8. రుక్మిణీ కల్యాణము ”
9. రాధామాధవ వివాదము ”
10. ధనాభిరామము ”
11. సత్యభామావివాహము ”
12. ఉషాపరిణయము ”
13. కాళియ మర్దనము ”
14. రఘునాథాభ్యుదయము ”
15. ప్రహ్లాద చరిత్రము ”
16. పూతనాహరణము ”
17. విప్రనారాయణచరిత్ర ”
18. సముద్ర మథనము ”
19. కృష్ణవిలాసము ”
20. ప్రణయకలహము ”
21. కంస విజయము ”
22. జానకీ కల్యాణము ”
23. పుణ్యక వ్రతము ”

24. రఘునాథ నాయకాభ్యుదయము (ద్విపదకావ్యము)
25. మోహినీ విలాసము ,,
26. పాదుకా సహస్రము ,,
27. గోపికాగీతలు (ఆంధ్రానువాదములు)
28. భ్రమరగీతలు ,,
29. ఫల్గునోత్సవము (రగడలు, చౌపదములు నను ఛందోరీతులలో చెప్పఁబడినది)
30. రాజగోపాలదండకము.
31. పీర శృంగార సాంగత్యము
32. సంపంగిమన్నారు సాంగత్యము
33. గోపాలుని పేరిట రచింపఁబడిన వేడుకోళ్లు, విన్నపములు, దరువులు, ఏలలు సంకీర్తనములు, విడిపదములు మున్నగునవి.

విజయరాఘవుఁడు తాను జేసిన రచనలన్నిటిని తన ప్రహ్లాద చరిత్ర పీఠికలో నొక సీసమాలికయందుఁ జెప్పొని యున్నాఁడు. ఇట్టి వివిధ శాఖలకు నాధికారిక ప్రాతినిధ్యము వహించినట్లు విజయరాఘవుఁడు వివిధ గ్రంథములను రచించి నాఁటి రాజకీయ సామ్రాజ్యము నకే గాక ప్రక్రియావైవిధ్యమునకు పట్టుగొమ్మగా వర్ధిల్లిన దక్షిణాంధ్ర యుగ సాహితీ సామ్రాజ్యమునకుఁ గూడ సార్వభౌముఁడుగ రాణకెక్కినాఁడు. ఈ రాజకవివర్యుని గ్రంథరాజములలో కాళీయమర్దనము, ప్రహ్లాదచరిత్రము, పూతనాహరణము, విప్రనారాయణ చరిత్రము; రఘునాథనాయకాభ్యుదయము, రఘునాథాభ్యుదయము దప్ప మిగిలిన గ్రంథములేవియు నేటివరకును లభింపలేదు. అతఁ డష్టభాషాధురీణుఁడు. చతుర్విధకవితానిర్వాహకసార్వభౌముఁడు. సావరూకాగ్రగణ్యుడు, కల్పనాధురీణుఁడు, ప్రాబంధికపట్టభద్రుఁడు, బుధ

సార్వభౌముఁడు, కవిసమాజభోజభూజాని, సర్వజ్ఞతిలకుఁడు, కవిరాజరాజు, ఘనమనీషాధురీణుఁడు, శృంగారలోలుఁడు భువనవిఖ్యాతశీలుఁడు, సాహిత్యశేషశేషుఁడు, రసికాగ్రగణ్యుఁడు, కోటిమన్మథరూపుఁడు నని ప్రశంసింపఁ బడినాఁడు.

సీ. భోజకన్యాముఖాంభోజరాజమరాళ
సత్యాఘనస్తనస్తబకభృంగ,
జాంబవతీవిలోచనచకోరశశాంక
మిత్రవిందాతటిన్మేఘరూప,
భద్రావశావశాభద్రదంతావళ
వరసుదంతామనోవనమృగేంద్ర,
లక్షణారూపకలాపిపర్జన్య
భానుసుతాలతాపారిజాత.

గీ. షోడశస్త్రీసహస్రచక్షుఃప్రసార
హారసారమసారమోహనశరీర
విజయరాఘవ భూపాల భజనలోల
కేలు మోడ్చెద రాజగోపాల నీకు.

అను శ్రీకృష్ణస్తవరూపసీసపద్యరత్నము విజయరాఘవుని యక్షగానములన్నిటి యందును నాందీ పద్యముగఁ గానవచ్చుచున్నది. సాహితీసార్వభౌమత్వమునకు చిహ్నముగ నతని పాదమునకు రాయ పెండార మలంకరింపబడియుండెడిది.[111] విజయరాఘవుని కళాపిపాసకు చిహ్నముగ నతని సరసనభాస్థలి యందు శారదాధ్వజ మలరారుచుండెడిది. దాని రెపరెపలలో వాగ్దేవి నటనలీలలు స్ఫురించెడివి.

111. రాజగోపాల విలాసము-అవతారిక-విజయరాఘవ వంశావళి (చెంగల్వ కాళకవి)

"సీ. ఒక్కొక్కయెడఁ జీని చక్కెర పానకం
బాని నట్లాహ్లాద మావహిల్ల,
ఒక్కొక్కయెడఁ దావి నెక్కొని నిదవాది
సరము లెత్తిన రీతిఁ బరిమళింప,
ఒక్కొక్కయెడఁ జవు లుప్పతిల్లఁగ మంద
మారుతంబులు వీచు మహిమ చెలఁగ
ఒక్కొక్కయెడ మేనఁ జొక్కు సంపాదించు
వెలదివెన్నెల తేట విధము మించఁ

గీ. గవిత రచియింప విజయరాఘవ విభుండె
నేర్చు నని పాణి నర్తించు నేర్పు మెరయఁ
జామరానిలకందళచలితమగుచుఁ
దనరు సభలోన నల శారదాధ్వజంబు..."

అను సీసపద్యములో కాళకవి యా శారదాధ్వజమును చక్కగ చిత్రించినాడు. ఆరసికావతంసుని యాస్థానములో పసుపులేటి రంగాజమ్మ, కృష్ణాజమ్మ, చంద్రరేఖ మొదలగు కవయిత్రీశిఖామణులు తమ సరససంగీతసాహిత్యకళాపాలనములను నిరంతరము ప్రదర్శించెడివారు. రంగాజమ్మ మన్నారుదాసవిలాసప్రబంధము, మన్నారుదాస విలాసయక్షగానము, ఉషాపరిణయప్రబంధము, సంగ్రహరామాయణము, సంగ్రహభారతము మున్నగు గ్రంథములను రచించినది. ఈమె కవితాప్రావీణ్యమునకు మురిసి విజయరాఘవు డీమెకు నిండు సభలో కనకాభిషేకము చేసినాడు. మరియు రూపవతి, చంద్రరేఖ, కోమలవల్లి, శశిరేఖ, రత్నగిరి, భగీరథి, లోకనాయిక మొదలగు నాట్యకత్తెలచే పదము, జక్కిణి, కొరము, నవపదము, దేశి దురుపదము పేరణి మున్నగు నాట్యవిశేషములను వెలయించి యా రాజశేఖరు

నాస్థానము నలంకరించినారు. అతని పాలనలో సాహితీకళతోపాటు సంగీతనాట్యకళలుగూడ నభివృద్ధిచెంది యాంధ్రసాహిత్యమున కపూర్వ మాధురీమహిమను చేకూర్చినవి. ఆ రాజేంద్రు నాస్థానమున కామరసు వేంకటపతిసోమయాజి, కోనేటి దీక్షితచంద్రుఁడు, పురుషోత్తమదీక్షితుఁడు, మున్నగు కవీంద్రులు వర్ధిల్లినారు. వీరందరు యక్షగాన సాహితీ ధురంధరులు. కోనేటి దీక్షితుఁడు, విజయరాఘవ కల్యాణము, కామరసు వేంకటపతిసోమయాజి విజయరాఘవచంద్రికావిహారము పురుషోత్తమదీక్షితుఁడు తంజాపురాన్నదాన మహానాటకము, విజయరాఘవుని తనయుఁడగు మన్నారుదేవుఁడు, హేమాబ్జనాయికా స్వయంవరము, మొదలగు యక్షగానములను రచించి ఘనకీర్తి నార్జించిరి.

విజయరాఘవ నృపాలుని రసికతను సూచించు శృంగారాత్మక చాటుపద్యములు, గొన్నిటిని సేకరించి శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రి గారు తమ చాటుపద్యమణిమంజరిలో నుదహరించినారు. అవి యీ క్రింద పేర్కొనఁబడినవి.

1. ఉ. రాజనిభాననా! సరసురాలవు జబ్బుగ నల్లినా వదే
మేజడ? యింతకంటె వలెనే? వలనొప్ప బిగించి యల్లవే
దో జవరాల! వేరె పనియున్నది, దోసమె దోసమే మహా
రాజగు నట్టి యా విజయరాఘవు పైఁ జిగురాకె కోమలీ!

2. ఉ. ఏవనితల్ మముం దలఁప నేమిపనో తమరాడువారుగా
రో? వలపించు నేర్పెఁఱుఁగరో? తమకౌఁగిటిలోన నుండఁగా
రావది యేమిరా విజయరాఘవ యంచు చిలు దూరి బల్మిచేఁ
దీవరకత్తెనై పెనఁగి తీసుకవచ్చితినా తలోదరీ?

3. చ. కలికెద వేటికే చెలియ? కంచెదు మానెదు గానునెల్లవా
రలు వినినారులే, విజయరాఘవరాయఁడు నిన్నుఁగూడుటల్
వలపులె చాటుచున్నవి జవాదియు నల్లవు విర్రపీగఁగా
వలెనటె, చూచి యోర్తురటె వంతలు జంతలవేటి యెమ్మెలే

4, కం. ఇంతీ! పానుపు పైసిదె
కంతుఁడు గూర్చున్నవాఁడు కనుగొను మహహా
కంతుఁ డనంగుఁడు నీ కౌలి
వింతేనా, విజయరాఘవేంద్రుఁడె చెలియా!

అతఁడు తన రఘునాథనాయకాభ్యుదయ కావ్యములో నవమోహనాంగులైన నాట్యకర్తెలను, వారి నిపుణనాట్యకళావిశేషములను గాయనీమణుల గానపటిమలను వర్ణించుటనుఁబట్టి యతని నాట్య సంగీతకళావైశారద్యము వ్యక్తమగుచున్నది.[112]

విజయరాఘవుఁడు తొలిదశలో సామాన్యవైష్ణవమతాభిమాని యైనను చివరికి వీరవైష్ణవుఁడై యన్యమతములను నిరసించినాఁడు. అట్టి పరమతపీడనమే యతని పతనమునకు హేతువైనది. అలంకార ప్రియత్వ మతనిని సుఖలాలసునిఁ గావించినది. అది యతని స్త్రీలోలత్వమునకు దారి తీసినది. ఉభయపార్శ్వములందు సుందరీమణులను గూర్చుండఁబెట్టుకొని, వారి నొరసికొని మధ్యలో తాను గూర్చుండెడివాఁడు. అట్టి యతని సుఖాసక్తి, స్త్రీలౌల్యము మున్నగు దౌర్బల్యము లతనిని పిరికిపందను గావించినవి. క్షాత్రధర్మము లను పూర్తిగా విస్మరించినాఁడు. ఆ దౌర్బల్యములు శత్రు విజృంభణమున కవకాశము

112. ర. నా. అ. (విజయరాఘవ నాయకుఁడు) పే. 21, ఉ 500 నుండి 515 పా.

గలిగించినవి. 1673 లో నతఁడు మరణించుటతో సుమారొకటి న్నర శతాబ్దుల కాలమప్రతిహతముగ సాగించిన తంజావూరు నాయక రాజుల రాజ్యాధికారము సమసిపోయినట్లు భావింపఁ బడినది.[113]

విజయ వేంకటపతి, మన్నారుదేవుఁడు, రాఘునుడు, చెంగ మలదాసునువారలు విజయరాఘవుని తనయులుగా నుపాపరిణయము నందు రంగాజమ్మచేత పేర్కొనబడినారు. విజయరాఘవు నష్టమహిషుల లో రాజగోపాలాంబిక, ధీరాంబిక, జ్ఞానాంబికయు పేర్కొనదగినవారు. రాజగోపాలాంబికా విజయరాఘవుల తనయుడు మన్నారుదాసు, తండ్రియును మధురప్రభువగు చొక్కనాథునితో యుద్ధముచేసి వీరమరణము నొందినారు. అనంతరము చెంగమలదాసు క్రీ. శ. 1674-75 మధ్య కాలములో రాజ్యాధికారమునకుఁ గొంత రాపత్రియపడినాడు గాని శత్రువిజృంభణమువలన లాభము లేకపోయినది. విజయరాఘవుని మరణముతో తంజావూరి నాయకరాజుల రాజ్యాధికార మంతరించినట్లు భావింపనగును.

తంజాపురాంధ్రరాజచరిత్ర మాంధ్రచరిత్రమునందేగాక దక్షిణ హిందూరాజ్యచరిత్ర మధ్యయుగమునందును చరమాధ్యాయము. యక్షగానరచన పూర్వకాలములోనే కలువడినను తంజాపురాంధ్ర నాయకరాజులు దానిని జేబట్టిన కారణముననే యాంధ్రదేశమున దానికి సర్వతోముఖవికాసము, జనాదరము లభించినవి. ఆ కాల మున యక్షగానరచన సాహితీసమారాధకుల యభిమానపూర్వక లాలనముతో లావణ్యరేఖలను దిద్దుకొనినది. ఈ యక్షగానరచనా పై దగ్ధ్యమువలననే దక్షిణాంధ్రయుగ మాంధ్రసాహిత్యచరిత్రలో నొక విశిష్టస్థానము నాక్రమించు కొనగలిగినది. మరియు నా యక్షగాన

113. Tanjore District Gazetteer - P. 40

వాఙ్మయ శాఖావైఖరికి తంజాపురాంధ్ర నాయకరాజుల కాలము సమున్నతస్థానమును కల్పించినది. అట్టి విశిష్టయక్షగానవాఙ్మయశాఖాసంప్రదాయమును విజయరాఘవనాయకుఁడు పోషించి, క్రొత్తరీతులలో వర్ధిల్లజేసినారు. ఆంధ్రనాయకరాజుల యనంతరము తంజావూరి రాజ్యమును పాలించిన మహారాష్ట్రప్రభువులుగూడ రసజ్ఞులు, కళాప్రియులు, సాహితీ పరిపోషకులునై యాంధ్రవాఙ్మయమును ప్రత్యేకాభిమానముతో నాదరించి వర్ధిల్లఁజేసిరి.



# రఘునాథనాయకుని సర్వతోముఖప్రతిభ

తంజాపుర నాయకరాజులలో రఘునాథనాయకుఁ డగ్రగణ్యుఁడు. మూర్త్యంబాచ్యుతప్ప నాయకుల ప్రియతనయుఁడు. క్రీ. శ. 1600 నుండి 1631 వరకు తంజావూరు రాజ్యమును నిరాఘాటముగ పరిపాలించిన యువక్రిపరాక్రిమశాలి. యువరాజుగ నున్నపుడే క్రీ. శ. 1584లో జరిగిన పెనుగొండయుద్ధములో ఘనవిజయమును సాధించిన సాహసికుఁడు. తాను జీవించియున్నంతకాలము విజయనగరప్రభువులపై భక్తివిశ్వాసములు ప్రకటించి, వారి మన్ననల నందుకొనిన మాన్యప్రభువర్యుఁడు. మిత్రాజ్ఞాపరిపాలకుఁడై పోర్చుగీసువారిని పారద్రోలి, నేపాళ (జాఫ్నా) రాజుయొక్క రాజ్యాధికారమును సుస్థిరము గావించిన ధీరవరుఁడు. లోకకంటకుఁడుగ పరిణమించిన చోళుగునిఁ బరిమార్చి లోకోత్తరవిజయమును సాధించిన సాహసాంకుఁడు. సంగీతసాహిత్యసమరాంగణసార్వభౌముఁడై కవిపండితప్రశంసల నందుకొనిన సరసహృదయుఁడు. మహామంత్రి, గురువర్యుఁడునైన గోవిందదీక్షితుని దివ్యశిక్షణలో సంగీతసాహిత్యాదివిద్యానిష్ణాతుడైనాఁడు. "సంగీత సుధ" యను గ్రంథమును శాస్త్రీయధోరణిలో రచించి కర్ణాటక సంగీతమునకు రూపరేఖలు తీర్చినాఁడు. వైష్ణవమతాభిమానియైనను జాతిమతభాషా భేదములు పాటింపక సమస్తమతస్థులను సమభావముతో నాదరించి, యసంఖ్యాకదానధర్మములు చేసి యసమానకీర్తి నార్జించినాఁడు. తన రాజ్యములో క్రైస్తవులకు సహితము నవకాశమిచ్చి మతసహనమును ప్రదర్శించినాఁడు. ఇతని కాలము

లోనే యాంధ్రభాషామతల్లికి తంజాపురాస్థానమున ప్రవేశము లభించి ఆ రాజ్యములో తొలుత నాంధ్రవాఙ్మయమునకు శ్రీకారము చుట్టిన రాజకవీంద్రుఁడితఁడు. ఆంధ్రగీర్వాణభాషలలో నసదృశ పాండిత్యము సంపాదించి, కమనీయకవితాశక్తి, పాండితీప్రతిభయుఁ గలిగి వివిధకళాపోషకుఁడుగ వర్ధిల్లినాఁడు.

రసికతావీరత్వములతని యందు సమానములగు పాళ్ళలో నెలకొన్నవి. అన్వీక్షక్యాదిరాజ్యతంత్రజ్ఞానసంపన్నుఁడు. జయంతసేన రామానందాది రాగతాళములను కనిపెట్టిన సంగీతకళాకోవిదగ్రామణి. విజయనగరసామ్రాజ్యమునకు కృష్ణదేవరాయ లెట్టివాఁడో తంజావూరు రాజ్యమునకు రఘునాథనాయకుఁ డట్టివాఁడు. విజయవిలాస కర్త యితని నభినవ భోజుఁడు.[1] చతుష్షష్టివిద్యాప్రవీణుఁడు. రసభావానుకవితాభోజుఁడు, భరతశాస్త్ర ప్రౌఢమార్గైకలాస్యరసాస్వాదనకోవిదుఁడు, అతులాగమశాస్త్రనిరస్తసురేజ్యుఁడు. 'రత్నతులాపురుషాదిదానచణుఁడు' అని ప్రశంసించినాఁడు.

"ఉ. మాటల నేర్పులా సరసమార్గములా కొలువుండు రీతులా
పాటలగంధులా కళలభాగ్యములా బహుదాన లీలలా
నాటకశాలలా యొకటనన్ వలదెన్నిటఁ జూడ నన్నిటన్
మేటియుఁగీర్తిలోలుఁడు జుమీ రఘునాథనృపాలు డిమ్మహిన్ [2]"

అను విజయవిలాసపద్య మా ప్రభువర్యుని గుణసమగ్రతను చాటుచున్నది.

---

1. విజయవిలాసావతారిక — 5 పద్య.

2. విజయవిలాసావతారిక — 2 పద్య.

విజయనగర రాజుల సాహిత్యాభిరుచి, భరతశాస్త్ర ప్రావీణ్యము, సభానిర్వహణము, కవిపండితాదరణ, జైత్రయాత్రలు, దేవభూదేవసంసేవనము, భవననిర్మాణము, స్వారి వెడలుట, అలంకరణ విశేషములు మున్నగు రాజలాంఛనముల నన్నిటిని రఘునాథుడు యథాతథముగ ననుసరించినాడు. సామ్రాజ్యాధికారమున కడ్డుతగిలిన జగ్గరాజును బరిమార్చి రామదేవరాయలను విజయనగరసింహాసనమున నిల్పిన పరోపకారపారీణుడు. భయంకరయుద్ధములో పాండ్య, తుండీర విభులపై విజయమును సాధించిన వీర వరుడు. ఈ విఖ్యాత విజయాంకితములుగ నున్న సింహాసనము మాట శిథిలమేటలు విని గట్టిగా నిలువ గంకణము గట్టె[3].

ఘన ఘనాఘనముల కాలసంకెలc బెట్టు పాండ్య పెన్నాడి
పార దరిమె, తండిరనాథుండు దురమున బరవంగcజూచి
ప్రాణము దయగాచి విడిచె[4]......అను ప్రముఖ పద్యములరూపమున విజయవిలాస కర్తయా వీర శేఖరునకు నీరాజనము పట్టినాడు.

ఉ. ఆనతియిచ్చెనా యది శిలాక్షర, మెవ్వనినేని మెచ్చెనా
వాని గృతార్థుజేయుc బగవాడయినన్ శరణంబుజొచ్చెనా
యానకు నేర మెంచక తనంతటివాని నొనర్చు, నిచ్చెనా
యేనుcగుపాcడి, యీడు గలరే రఘునాథనృపాలమౌళికిన్.[5]

అని చేమకూర వేంకటకవి రఘునాథుని గూర్చి చేసిన ప్రశంసలు

3. విజయ విలాసావతారిక—57ప.
4. „ „ —58ప.
5. „ „ —54ప.

ప్రత్యక్షరసత్యములు. ఆంధ్రగీర్వాణద్రావిడాదిభాషలలో కవులను, కవయిత్రులను, విద్వాంసులను, విదుషీమణులను పోషించి వారిచే ననేకగ్రంథములను రచింపజేసి, యనేకగ్రంథములకు కృతిపతియై, తాను స్వయముగ ననేకసంస్కృతాంధ్రగ్రంథములను రచించి బహుశృంగహారసిత్యసత్యప్రతిష్ఠాతయై, నిరతాన్నదాతయై, దయార్ద్రహృదయుడై, ప్రజలను కన్నబిడ్డలవలె పరిపాలించి రఘునాథనాయకుడు దక్షిణసామ్రాజ్యవిభవధౌరేయుడుగ, నభినవభోజుడుగ, నపరకృష్ణరాయలుగను ప్రఖ్యాతి వడసినాడు. సంగీతసాహిత్యభంగీ సాహిత్యనిర్మాణ కర్మాంతికప్రబంధ శతనిబంధనామందధౌరంధర్య ధిషణాసనాథే రఘునాథజనాధినాథే..........

అను వాక్యమునుబట్టి రఘునాథుడు శతాధికగ్రంథకర్త యని తెలియుచున్నది. ఈ ప్రశంస కొంత యతిశయోక్తిభరితమనిపించును. ఈ ప్రశంస నాధారముగా జేసికొని డా. నేలటూరి వేంకట రమణయ్యగారు తమ "మధుర తంజావూరి రాజులనాటి యాంధ్రవాఙ్మయచరిత్ర" లో రఘునాథుని శతాధికగ్రంథకర్తగా పేర్కొనినారు.

1. శ్లో. జయంత సేనాదిమరాగరామా
నందాది తాళాన్ రచయన్ననేకాన్
సంగీత విద్వాంస ముపాది శస్త్వం
విపంచికానాద విచక్షణానాం.

2. శ్లో, సింధ్వంతరీపగత చోళగ శిక్షణం చ
నేపాళదేశనృపశాత్రవనిగ్రహశ్చ
కర్ణాటభూపతి నపీకరణంచ సర్వ
మాపద్య తేతః మమ ద్విజ యూపదేశాత్.

3. శ్లో. తస్యాం నగర్యాం తరుణార్కబింబ
ద్వ్యుత్క్త సౌధాగ్రసువర్ణకుంభం
ఉత్తుంగసాలై రుపశోభమాన
మనేకకక్ష్యాంచిత మస్తి ధామ.

4. శ్లో. లక్ష్మీవిలాసోపి చ భద్రశాలా
శ్రీరామసౌధోపి చ హేమకూటః
అన్యాశ్చ యత్రాచ్యుత రంగముఖ్యా
స్సభా స్సుధర్మా క్షమితా జయంతి.

5. శ్లో. సంభావనీయా ధ్వజశాతకుంభ
స్తంభావళీ సంభృత నూత్నరత్నైః
రమ్యా విశేషణ సభావిభాతే
తత్రేందిరా మందిర నామధేయా.7

అను శ్లోకములలో రఘునాథుని రాగతాళాత్మకసంగీతకళాకౌశలము, విశిష్టవిజయములును లక్ష్మీవిలాసశ్రీరామసౌధాచ్యుతరంగేందిరామందిరాది భవననిర్మాణనైపుణ్యమును ప్రశంసింపబడినవి.

పదవాక్యప్రమాణజ్ఞుఁడు, షడ్దర్శనీపారగుఁడు, అలంకారరత్నాకరసాహిత్యసుధారఘునాథభూపాలీయాదిగ్రంథకర్తయు నగు గోవిందదీక్షితుఁడు మహామంత్రియై రఘునాథభూపాలుని సర్వతోముఖవికాసమునకు దోహదము చేసినాఁడు. గోవిందదీక్షితుని పెద్దకుమారుఁడు. రఘునాథుని శిష్యరత్నము నై సంస్కృతభాషలో సాహిత్యరత్నాకర రఘునాథభూపతివిజయ రఘునాథవిలాసాది గ్రంథములను రచించి

7. సంగీతసుధ

నాఁటి కవిసమాజములో వన్నెకెక్కిన యజ్ఞనారాయణదీక్షితుని ప్రతిభను బట్టి రఘునాథుని పరిపూర్ణప్రభావము నూహింపవచ్చును. యజ్ఞనారాయణుఁడు రఘునాథుని కడ కావ్యనాటకాలంకారాదుల నభ్యసించి గురుదక్షిణ నీయఁబోఁగా నాసరసప్రభువర్యుఁడు తనకాలియందెను చేతికడియమును, చెవులకుండలములను దీసి యా శిష్యరత్నమునకు చిరునవ్వుతో బహూకరించినాఁడు.

శ్లో. తత్రేందిరా మందిర నామధేయే సభావిశేష సహ మంత్రివర్గైః
చిరంతనై ర్నిగమవృద్ధవర్గై రన్యైర్వినయావనమ్రైః
షడ్దర్శనీ సాగరపారగై శ్చ మహీసురై ర్భూషిత భూమిభాగః
కవిప్రకాండై రపి కాళిదాస మయూర సౌమిల్ల మురారి దేశ్యైః
కర్ణాటకాంధ్రద్రవిళప్రబంధనిర్మాణవిద్యానిపుణై శ్చ తైశ్చ
వాగ్గేయకారైః ప్రముఖై రనేకైః విదిత్రిగీతాదికళాప్రవీణైః
తథైవ వీణాదిసువాద్యవిద్యా విచక్షణై శ్చాపి నిషేవ్యమాణః
నానావిధేశా నరపాలవర్గ సందేశకృద్భి స్సముపాస్యమానః
అస్త్యేధి భద్రాసన మచ్యుతేంద్రతనూభవ శ్రీరఘునాథభూపః

అను శ్లోకములనుబట్టి రఘునాథుని కొలువుకూటము కవిపండితగాయకశిఖామణులతోఁ గూడి యుండెడిదని తెలియుచున్నది. రఘునాథుని యిందిరామందిరసభాభవనము కృష్ణదేవరాయల భువనవిజయము వంటిదే. అది యతని కళాభిమానమునకు, వివిధకళాపాటవమునకును నొక ప్రబలనిదర్శనము. ఆ రమణీయసభామందిర మిందిరా సరస్వతు విద్దరికి నాటపట్టయి యలరారినది.

"భిన్నైర్ఖడ్గగణ్యపాది బాహుజనుషాం సేతు శ్శిరః కర్పరైః
కావేర్యాం యుధి బంధయామి సుదృఢం కామంత దాహంథ్వజైః"

అను శ్లోకమునుబట్టి కావేరియానకట్టను పాడుచేయించిన జగ్గరాజు శిరస్సునే పునాది రాయిగ, శత్రుసైనికుల శిరస్సులనే యిటుకలుగఁ జేసి యానకట్టను పునర్నిర్మింతునని ప్రతిజ్ఞచేసి నెరవేర్చుకొనిన కార్యశూరుఁడతఁడు. రఘునాథుఁ డట్టి రణరంగధీరుఁడు గనుకనే చేమకూర వేంకట కవి విజయవిలాసావతారికలో తన చతురవచోవిలాససంపద యుట్టిపడునట్లు "సమరనిశ్శంక రఘునాథసాహసాంక"[9] యను మనోహరమకుటముతోఁ గూడిన యేడు సీసపద్యములలో వీరనీరాజనము పట్టినాఁడు.

రఘునాథుఁడు దక్షిణాంధ్రయుగకర్త. మధురకవితాశాఖకు మార్గదర్శకుఁడు. యక్షగానచాటుకావ్యాదినూతనప్రక్రియానిర్మాణమును ప్రోత్సహించినాఁడు. ద్విపదకావ్యరచనావైదగ్ధ్యమును పునరుద్ధరించినాఁడు. తాను స్వయముగ ననేకోత్తమకావ్యములను రచించి తన యాస్థానకవులచే ననేకగ్రంథములను రచింపజేసిన రసార్ద్రహృదయుఁడు. పదకవితాపితామహుఁడైన క్షేత్రయ్య, రఘునాథుని సందర్శించినపు డాశువుగఁ జెప్పిన

క. తము దామె వత్తు రర్థులు
క్రమమెఱిఁగిన దాతకడకు రమ్మన్నారా
కమలము లుండెడి చోటికి
భ్రమరమ్ముల నమ్యలేందు రఘునాథనృపా!

అను పద్యమునుబట్టి రఘునాథుని విఖ్యాతదాతృత్వము వ్యక్తమగు

9. విజయవిలాసావతారిక—40 నుండి 46ప.

చున్నది.

శ్లో. శ్రీపారిజాతాపహరణప్రబంధం,
చిత్రం చ వాల్మీకిచరిత్రకావ్యం,
తథాచ్యుతేంద్రాభ్యుదయం గజేంద్ర
మోక్షం చరిత్రం చ నలస్య చిత్రం,

శ్లో. శ్రీరుక్మిణీకృష్ణవివాహయక్ష
గానం ప్రబంధానపి నైకభేదాన్
నిర్మాయ వాగ్భిః నిపుణార్థభాగ్భిః
విద్వత్కవీనాం విదధాసి హర్షం.

అను శ్లోకములనుబట్టి రఘునాథుఁడు పారిజాతాపహరణము, వాల్మీకి చరిత్ర, అచ్యుతాభ్యుదయము, గజేంద్రమోక్షము, నలచరిత్ర, రుక్మిణీకృష్ణవివాహము (యక్షగానము) అను గ్రంథములను రచించినట్లు తెలియుచున్నది. ఈ రాజకవీంద్రుఁడు రామాయణము, శృంగారసావిత్రి జానకీకల్యాణ మను గ్రంథములను గూడ రచించినాఁడు. అతని గ్రంథములలో వాల్మీకిచరిత్ర, నలచరిత్ర, శృంగారసావిత్రి, రామాయణము తప్ప మిగిలిన గ్రంథము లేవియు నేఁటివరకు లభింపలేదు. మరియు నితఁడు రామాయణసారసంగ్రహము, భారతసారసంగ్రహము, సంగీతసుధ, సాహిత్యసుధ, భరతసుధ మున్నగు సంస్కృతగ్రంథములను గూడ రచించినట్లు తెలియుచున్నది. ఇతని యచ్యుతాభ్యుదయనలచరిత్రలు దక్షిణాంధ్రయుగ ద్విపదకావ్యజగత్తునకు మకుటాయమానములుగ నలరారుచున్నవి. ఇతని యచ్యుతాభ్యుదయ మభ్యుదయకావ్యపరంపరకు

10. సంగీతసుధ.

మార్గదర్శకమైనది.

శ్లో. "యామద్వయేన యదునేతది పారిజాత
మాజీ హరత్సరస మచ్యుతభూప సూనః"11

అను శ్లోకమునుబట్టి రఘునాథుఁడు పారిజాతాపహరణగ్రంథమును రెండు జాములలో రచించినట్లు తెలియుచున్నది. ఈవిషయము రుక్మిణీ పరిణయగ్రంథమునందుఁ గూడ ప్రస్తావింపఁబడినది. ఉత్తమకవితా సంప్రదాయబద్ధములైన రఘునాథుని రసోదంచితకావ్యములన్నియు దక్షిణాంధ్రయుగప్రక్రియావైవిధ్యమునకు మార్గదర్శకములై వాఙ్మయచరిత్రలో మాన్యస్థానము నాక్రమించినవి.

ఉత్తమకావ్యము నందలి రసప్రాధాన్యమును గుర్తించి యా రాజకవివర్యుఁడు ఛందోబద్ధమైన కవిత్వమునకు రసపరిపాటి బంగరునకుఁ దావి యని చెప్పియున్నాడు. కవిత్వమునకు రసము ప్రాణమని యతని యభిప్రాయము.

క. చెప్పఁగవలెఁ గప్పురములు
కుప్పలుగాఁ బోసినట్లు కుంకుమ పైపై
గుప్పినక్రియ విరిపొట్లము
విప్పినగతి ఘుమ్మనం గవిత్వము సభలన్

క. చెవులకుఁ జవులై చల్లఁగఁ
గవులకుఁ దవులై సమస్తకావ్యకళాబం

11. సాహిత్యరత్నాకరము.

ధువులై రససింధువులై
యవురా యనఁ గవిత లవని నలరగ వలదా[12]

అను పద్యములలో నుత్తమకవితాలక్షణములను గొన్నింటిని పేర్కొని యున్నాడు. మహాదాత, శత్రుజేత, కృతిపతి, కృతిప్రణేత, శరణాగతత్రాత, గాంధర్వవిద్యాధిష్ఠాత, "కవిపండితహృదయసంస్థాతయు నగు నీ రఘునాథభూనేత చరిత్రము బంగరునీట లిఖింపఁదగినది" అని సుప్రసిద్ధవాఙ్మయ చరిత్రకారకులగు శ్రీ నిడదవోలు వెంకటరావుగారు రఘునాథభూపాలుని ప్రశంసించియున్నారు.

క. సందర్భము నవరస ని
ష్యంది యగుచుఁ గవుల చెవులఁ దవులగ నిల యిం
పొందినఁ దగుఁగా కుఱరక
యందదుకలు గూర్చు కవిత యందంబగునే[13]

అనునతని పద్యమునుబట్టి కావ్యరచన యందతనికి గల రసైకదృష్టి, కవిపండితజనరంజకముగ రచన చేయవలెనను సదాశయసంపత్తియు నభివ్యక్తము లగుచున్నవి.

రఘునాథుని రచనలలో ననేక స్వతంత్రకల్పనలు గాన వచ్చును. అవి యారాజకవీంద్రుని భాసురభాషాబలమునకు నిదర్శనము లు. లలిత లలితపదములతోఁ గూడిన యతని శైలి సరళమై మనోజ్ఞముగ నుండును. అతని కావ్యములన్నియు సుకుమారశయ్యాసౌభాగ్యసంపత్తితో నలరారుచున్నవి. వర్ణనములన్నియు సహజోక్తి మధురములు

12. వాల్మీకిచరిత్ర.

13. రామాయణము (రఘునాథవిరచితము)

అతని కమనీయకవిత్వము ద్రాక్షాపాకబంధురమై చమత్కారములకు నిలయమై యలరారుచున్నది. కాలప్రభావమును బట్టి యతఁడు ప్రదర్శించిన యతివేలశృంగారప్రియత్వము, హాస్యచతురత, విలాసతత్పరత మున్నగునవి దక్షిణాంధ్రయుగవిశిష్టలక్షణములుగ విరాజిల్లుచున్నవి. మూలములో శాంతరసప్రధానమగు సావిత్ర్యుపాఖ్యానమును శృంగారరసప్రధానము గావించి తన గ్రంథమునకు "శృంగార సావిత్రి" యని పేరిడుటలో నతని శృంగారప్రియత్వము వ్యక్తమగుచున్నది.

ఉ. తా రస పుష్టిమైఁ బ్రతిపదంబున జాతియు వార్తయున్ జమ
త్కారము నర్థగౌరవముఁ గల్గ ననేక కృతుల్ ప్రసన్న గం
భీరగతిన్ రచించి మహిమించినచో నిఁక శక్తు లెవ్వర
య్యా రఘునాథభూపరసికాగ్రణికిన్ జెవిసోఁకఁ జెప్పఁగన్[14]

అను పద్యములో చేమకూర వెంకటకవి రఘునాథునిరమణీయ కవితా గుణంబులను ప్రశంసాత్మకముగఁ బేర్కొని యున్నాఁడు. అతని గ్రంథములు జాతి వార్తాచమత్కారార్థ గౌరవములతోఁ గూడి రసనిర్భరములై యున్నవని తెలియుచున్నది. నన్నయభట్టారకుడు ప్రదర్శించిన ప్రసాద గుణమితని కవిత్వమునందు పతాకస్థాయిలోఁ గానవచ్చును. వివిధశాస్త్రములతో, వివిధభాషలతో, వివిధకవిపండితబృందముల తోను నేర్పడిన పరిచయముతో పాటూ రాజకవితల్లజుఁడు సాధించిన యపారలోకానుభవము వలన అతని కవితావధూటికి నిరుపమ గౌరవము లభించినది.

14, విజయవిలాసావతారిక – 31ప.

ద్వి. శిలలోపల వెన్న చిలికిన కరణి
నలఘు సంస్కృతములయర్థంబులెల్లఁ
దెలుఁగు మాటల తేటతెల్లంబుగాఁగఁ
జెలువొందఁ బల్కనేర్చిన నన్నపార్యుఁ
దిక్కయజ్వను నెఱ్ఱధీమణిఁ దలచి
యక్కజంబుగ నిటులౌనను నుభయ
భాషల నానార్థభంగు లింపార
నైషధాదిక ప్రబంధంబు లెన్నేని
భువిసల్పి సత్కీర్తిఁ బొందినయట్టి
నవరసనాథు శ్రీనాథునిఁ బొగడి.[15]

అను పద్యమును బట్టి కవిత్రయముపై, శ్రీనాథకవిసార్వభౌమునిపైన రఘునాథునకుఁ గల భక్తివిశ్వాసములు వెల్లడియగుటయేగాక కడసారి సరసకవితామార్గముల నిత డనుసరించినట్లు గూడఁ దెలియుచున్నది.

ద్వి. "ఇది రామచంద్రమహిత దయాసాంద్ర
విదితసాహిత్య నవీన సాహిత్య
చిన చెవ్వయాచ్యుత క్షితిపాలతనయ
వినయాదిశుభ గుణవిభవసనాథ
రఘునాథభూపాల రమ్య వాగ్జాల
నఘటిత నవరస స్ఫుట శబ్దమహిమఁ
దలరెడు నలచరిత్రమను ప్రబంధ...మున[16]

అను నాశ్వాసాంతపద్యములను బట్టి యీ నాయకశిఖామణి రెయొక్క

15. నలచరిత్ర
16. నలచరిత్ర

రామభక్తితత్పరత్వము, పితృభక్తి, వినయాదిశుభగుణములు, నవరస స్ఫుటశబ్దమహిమతోఁ గూడిన రమణీయకవితాశక్తియును వెల్లడి యగుచున్నవి.

క. ఏకాకి నరరాజులు!
భూకాంతులు నిన్నుఁ జాలఁ బొగడుదురు భళీ!
స్వారాజని సేరాజని
రారాజని యచ్యుతేంద్రరఘునాథనృపా!

అని రఘునాథుని ప్రశంసించుచు రామభద్రాంబ చెప్పిన పద్యమును బట్టి యతని యాధిక్యము వ్యక్తమగుచున్నది.

కవితాశక్తియు, పాండితీపటిమయుఁ గల రఘునాథుఁడు స్వయముగ ననేకగ్రంథములను రచించుటయేగాక సరసకవితా ప్రౌఢిమ గల సంస్కృతాంధ్రకవులను, కవయిత్రులను గొందరిని పోషించి, వారిచే నుద్గ్రంథములను రచింపఁజేసి దక్షిణాంధ్రయుగ మూలపురుషుఁ డైనాఁడు. అలంకారరత్నాకరము, సాహిత్యసుధ, రఘునాథ భూపాలీయము మున్నగు గ్రంథములను రచించిన గోవిందదీక్షితుఁడు, సాహిత్యరత్నాకరము, రఘునాథభూపవిజయము, రఘునాథవిలాసము మొదలగు గ్రంథములను రచించిన యజ్ఞనారాయణదీక్షితుఁడు, సాహిత్య సామ్రాజ్యము, శబ్దమీమాంస, కర్మాంతవార్తికము, వార్తికాభరణము, చతుర్దండిప్రకాశిక మున్నగు గ్రంథములను రచించిన వేంకటమఖియు, కావ్యదర్పణము, కర్పూరవర్తిక, తంత్రశిఖామణి కమలినీకలహంసిక, రుక్మిణీపరిణయము, ఆనందరాఘవము మొదలగు గ్రంథములను రచించిన రాజచూడామణిదీక్షితుఁడు, రాఘునాథ రామాయణకారిణియగు మధురవాణి, రఘునాథాభ్యుదయకారిణియగు

రామభద్రాంబ, సారంగధర చరిత్ర) విజయవిలాసములను రచించిన చేమకూర వేంకటకవి, నైషధపారిజాతీయము (ద్వ్యర్థికావ్యము), పారిజాతక నావతారికాహ్లాదయము, కళ్యాణకౌముదీకందర్పనాటకము, తాళచింతామణి యను గ్రంథములను రచించిన కృష్ణాధ్వరియును రఘునాథునాస్థానము నలంకరించి యా రాజేంద్రుని కీర్తిపతాకకాంతులను దశదిశల వ్యాపింపఁజేసిరి.

సాధారణముగ వ్యక్తులను విమర్శించు స్వభావము కల కవిచౌడప్పకూడ——

క. నేరుతునని మాటాడఁగ
వారిజభవు నంతవాని వశమా తంజా
వూరి రఘునాథనాయని
గారిసభన్ గుందవరపు కవిచౌడప్పా.

అను పద్యములో రఘునాథభూపాలుని మెచ్చుకొనినాఁడు.

ఈ విధముగా నితరులు చేసిన ప్రశంసలను బట్టి, యతని గ్రంథములను బట్టియు తంజావూరు రఘునాథనాయకుని సర్వతోముఖ ప్రతిభ వ్యక్తమగుచున్నది.

# విజయవిలాస చారిత్రక నైపథ్యము

సరసకవితాధురంధరుఁడు, శ్లేషయమకచక్రవర్తి, చమత్కారనిధియునైన చేమకూర వేంకటకవి రచించిన విజయవిలాసప్రబంధ ముత్తమకవితాగుణములకు, కృతిభర్తృవంశచరిత్రాంశములకును నాటపట్టై సరససాహితీసమున్నతస్థాయి నందుకొనిన యాంధ్రకావ్యరాజముగ నలరారుచున్నది.

ఆంధ్రకావ్యములందలి యవతారికాభాగములు సమకాలీన ప్రస్పర్శ గల్గి చారిత్రకనిర్ణయముల కాధారభూతము లగుచున్నవి. ఆంధ్రసాహిత్యములో నిట్టి యవతారికాభాగములకు మన యాదికవియైన నన్నయభట్టారకుఁడు[1] మార్గదర్శకుఁడైనాఁడు.

కవులందరు సామాన్యముగ కృతిపతి వంశవర్ణనము నతిశయోక్తి భరితము గావింప చేమకూర వేంకటకవి తన కృతిపతియైన రఘునాథ నాయకుని వంశవర్ణనమును సహజోక్తిసముదంచితము గావించినాఁడు. విజయవిలాసావతారికలో మొత్తమరువదినాల్గు పద్యములు గలవు. వీనిలో మొదటి యెనిమిది పద్యములు నిష్టదేవతాస్తుతిపరములు. తరువాత నేఁబదియొక్క పద్యములు కృతిపతివంశవర్ణనాత్మకములు. చివరి యైదు పద్యములును షష్ఠ్యంతసముల్లసితములు. వంశవర్ణనాత్మకపద్యములలో చాలవరకు కృతిభర్తయైన రఘునాథుని రమణీయగుణగణ

---

1 ఉ. రాజకులైక భూషణుఁడు——రాజమహేంద్రుఁ డున్నతిన్

(ఆంధ్రమహాభారతావతారిక 1 పే. 3ప.)

క. విమలాదిత్యతనూజుఁడు——శశిహిమకరుఁ డురుకాంతిన్

(1 పే. 4 ప.)

ములను వర్ణించుటలోనే చరితార్థములైనవి. ఇందు "సమరసశ్యాంక రఘునాథ సాహసాంక"[2] అను మకుటముతో గ్రథితములైన యేడు సీసపద్యములలో రఘునాథుని శౌర్యధైర్యాదిగుణసమూహమును తగిన మోతాదులలో నిరాడంబరముగ వర్ణించినాడు. చెవ్వభూపతి రఘునాథుని పితామహుడు. అచ్యుతనాయకుడు రఘునాథుని తండ్రి. విజయనగరప్రభువులకు నాయకరాజులకును సన్నిహితసంబంధము గలదు. నాయకరాజులు విజయనగరాధిపుల సామంతులు.

చోళదేశములో వీరనరసింగరాయ లను సామంతరాజు తిరుగుబాటు చేసినప్పుడప్పటి విజయనగరప్రభువైన యచ్యుతరాయలు తన సేనలనంపి యా తిరుగుబాటు నణచిన యనంతరము పరిపాలనాసౌలభ్యము కొరకా ప్రాంతమును రెండు భాగములుగ విభజించినాడు. అందు దక్షిణభాగమునకు మధుర రాజధానియైనది. ఉత్తరభాగమునకు రాజధాని తంజాపురము. ఈ యుత్తరప్రాంతమే తంజావూరురాజ్యముగ వ్యవహరింపబడినది. ఈ రాజ్యమునకు చెవ్వప్పనాయకు డధిపతిగా నియమింపబడినాడు. చెవ్వప్పనాయకుడు విజయనగరప్రభువైన యచ్యుతరాయలకు తోడల్లుడైయున్న కారణమున నతనికి తంజాపురరాజ్యాధికారము సంక్రమించినది. మధురప్రాంతమునకు విశ్వనాథనాయకు డధిపతిగ నియమింపబడినాడు. అచ్యుతరాయల పట్టమహిషియైన తిరుమలాంబయు, చెవ్వప్పనాయకుని భార్యయైన మూర్తిమాంబయు, నప్పసెల్లెండ్రు. ఈ చరిత్రాంశమును వేంకటకవి—

తే. దీని నచ్యుతరాయల దేవియైన
తిరుమలాంబకు ననుజయై తేజరిల్లు

---

2. విజయవిలాసావతారిక 40-46

మూర్తమాంబను పెండ్లియై కీర్తి వెలయఁ
జెవ్వవిభుఁడు మహోన్నతశ్రీఁ జెలంగె[3]

అను విజయవిలాసావతారికాపద్యరూపమున సూచించినాఁడు.

క్రీ. శ. 1550 సంవత్సరములో తంజాపురనాయకరాజ్యస్థాపన జరిగినది. తంజాపురనాయకవంశమునకు కృష్ణప్పనాయకుఁడు మూలపురుషుఁడు. అతని మనుమఁడైన తిమ్మనాయకునకు బయ్యాంబిక వలన— పెదచెవ్వప్ప, పినచెవ్వప్ప, పెదమల్ల, పినమల్ల లను నలుగురు తనయులు గలిగిరి. వీరిలో పినచెవ్వప్పనాయకునకు తంజాపురాధిపత్యము లభించినది. అతఁడే తొలి తంజాపుర నాయకప్రభువుగ పరిగణింపఁబడినాఁడు. అతఁడు క్రీ. శ. 1550నుండి 1580 వరకు పరిపాలించినాఁడు. అతనియనంతర మతని కుమారుఁ డచ్యుతప్పనాయకుఁ డధిపతియై క్రీ.శ. 1580 నుండి 1600 వరకును తంజాపురరాజ్యపాలన చేసినాడు. అతనికి మూర్తిమాంబ వలన నచ్యుతనాయకుఁడు, రఘునాథనాయకుఁడు నను తనయు లిరువురు గలిగిరి. అచ్యుతనాయకుని యనంతరము రఘునాథనాయకుఁడు రాజ్యాధిపతియై క్రీ. శ. 1600 నుండి 1631 వరకు పరిపాలన చేసినాఁడు. అతనికి చెంచులక్ష్మమ్మ, కళావతి యను భార్యలు గలరు.[4] కళావతీరఘునాథనాయకుల కచ్యుతనాయ కాచ్యుతరామభద్ర, విజయరాఘవనాయకు లను ముగ్గురు తనయులు గలిగిరి. రఘునాథుని యనంతర మతని పెద్దకుమారుఁడు రెండుసంవత్సరములు మాత్రము రాజ్యపాలన చేసినట్లు తెలియుచున్నది. అటుపై విజయరాఘవుఁడు తంజాపురాధిపతియై క్రీ. శ. 1633 నుండి 1673 వరకు రాజ్యపాలన

3. విజయవిలాస పీఠిక—16 ప.

4. ఉషాపరిణయములో చెంచులక్ష్మి, కళావతియు రఘునాథుని రాణులుగఁ జేర్కొనఁబడిరి.

చేసినాడు. విజయరాఘవుడు నతని కుమారుడు మన్నారుదాసును మధుర రాజులతో నేర్పడిన యుద్ధములో మరణించుటతో తంజావురముపై నాయకరాజుల యాధిపత్య మంతరించినది.

విజయవిలాసావతారిక యందు చేమకూర వేంకటకవి రఘునాథుని ప్రశంసించుచు రచించిన షష్ఠ్యంతములలో—

క. సుస్థిర లక్ష్మీ మహితమ
ణిస్థగిత గృహాంగణునకు, నేపాలనృపా
లస్థాపనచణునకు, సక
లాస్థానప్రణుతవరగుణాభరణునకున్.[5]

అను పద్యము చరిత్రాంశగర్భితమై చారిత్రకుల మన్ననల నందుకొన్నది. శత్రువులను పారద్రోలి రఘునాథ నాయకుడు నేపాలరాజునొకని రాజ్యాధికారమును సుస్థిరము గావించుకొనినాడు. హిమాలయ ప్రాంతమున నున్న నేపాలరాజ్యముగ దీనిని భావింపరాదు. ఇది సింహళమునకు సమీపమున నున్న యొకద్వీపము. దీనినే జాఫ్నా యని వ్యవహరించుచున్నారు. దీని తొలుతటి పేరు యాళపాణ. నేపాళ శబ్దమే సామాన్యుల యుచ్చారణభేదముచే కాలక్రమమున నలిగి యాళపాణగా నుచ్చరింపబడినదని యూహింపవచ్చును.

శ్లో. భో రక్ష రక్ష సహసాధువ నైక వీర
నిద్రావితాన్నిజపదాద్వ్యమశైస్వ్యమస్మాన్
నేపాళ నేతుర నరోధనితంబ సత్వః
పత్యావయం పదమితా శ్శరణం తవేత్.

5. విజయవిలాసపీఠిక—62 ప.

శ్లో. నేపాల భూవిభు మసౌనిజ భర్మ గేహ
ద్వారస్థితం ప్రదుత ముపేత్య త మిత్యువాచ
పారీకృత శేషగుణ రామ్యధి పారశీక
ప్రాణాన్ హరే యుదధు నాత్మత ఏవబాణాః6

అను శ్లోకములనుబట్టి పారశీకుల వలన నేర్పడిన ప్రమాదమును తొలగించి నేపాళ రాజు యొక్క యధికారమును నిలబెట్టుట కచ్యుతప్ప నాయకుఁడు వాగ్దానము చేసినట్లు తెలియుచున్నది. అప్పటికి రఘునాథుఁడు యువరాజుగ నుండెడివాఁడు. ఆ కార్యభారము రఘునాథుని భుజస్కంధములపైఁ బడినది. మహనీయుఁడైన తండ్రియాజ్ఞను శిరసావహించి రఘునాథుఁడు జైత్రయాత్ర సల్పి పారశీకులను పారద్రోలి నేపాళ రాజును సింహాసనమునందు సుఖోపవిష్టునిఁ గావించినాఁడు.

రఘునాథుని యాఘునవిజయము నతని యాస్థానకవయిత్రియగు రామభద్రాంబ

శ్లో॥ వినా ప్రగల్భం విమతాం జిగీషుః
మహీపతి స్తత్ర మహాంబురాశౌ
తరీ భిదా తత్తరణాయ తూర్ణం
అకల్పయ త్సేతు మనన్యసాధ్యం

శ్లో॥ ఉదస్త నానాయుధ ముత్పతాక
మభిద్రవంతీ మవనీశ సేనాం

6. యజ్ఞనారాయణ దీక్షితుఁడు రచించిన సాహిత్యరత్నాకరమునందలి శ్లోకములు.

ఆలోకితుం స్థాతు మశక్నువంతో
భయా త్పలాయంత పరంగినశ్యాః 7

మొదలగు శ్లోకములలో మనోహరముగ వర్ణించినది.

డాన్వెర్ అనునతఁడు వ్రాసిన 'హిందూదేశమునందలి పోర్చుగీసులు' అను గ్రంథమునుబట్టి తంజావూరునాయకులకు పోర్చుగీసువారికిని పడెడిది కాదనియు, రాజ్యకాంక్షతో పోర్చుగీసువారు జాఫ్నా రాజులను పదభ్రష్టులను చేయఁగా వారు తంజావూరు నాయక రాజుల నాశ్రయించినపుడు వారి కభయ మొసంగి నాయకరాజులు శత్రువులను పారఁద్రోలి వారి రాజ్యములను వారి కప్పఁజెప్పినారని యును దెలియుచున్నది. ఈవిషయమును విజయరాఘవనాయకుఁడు తన తండ్రియైన రఘునాథనాయకుని విజయపరంపరను ప్రశంసించుచు తన "రఘునాథనాయకాభ్యుదయము" లో...

"..................నేపాళభూపాలకునకు
దొరతనం బిచ్చిన దోర్విలాసములు"

అని ద్విపదపద్యరూపములో పేర్కొనియున్నాఁడు. పోర్చుగీసువారు సాహిత్యరత్నాకరములో పారశీకులుగను, రఘునాథాభ్యుదయములో పరంగీలుగను పేర్కొనఁబడిరి.

ఉ. శ్వేళగశైకలాంఛనవిజిత్వరయశోవిశాలధా
రాళగళన్మదద్విరదరాజివిరాజిసభాంగణా! ఘనా

7. రఘునాథుని నాస్థానకవయిత్రి యగు రామభద్రాంబ తన 'రఘునాథాభ్యుదయ కావ్యము'లోఁ జెప్పిన శ్లోకములు.

వేళగరిష్ఠదానపదవీపరితోషితకాళగాతమీ
చోళకవిద్విజస్తుతవచోలగ, చోలగమానభంజనా! 8

అను తృతీయాశ్వాసాంతపద్యములో చివర రఘునాథుని ప్రశంసించుచు వాడఁబడిన "చోలగమానభంజనా" అను విశేషణము గూడఁ జారిత్రిస్పర్శ గల్గియున్నది. ఈచోలగుఁడు కొల్లెడ (కొలరూన్) సంగమస్థానమున నున్న యొక ద్వీపమునకు రాజుగ నుండెడివాఁడు. ఇది యిప్పటి దేవికోటకు సమీపమున నుండెడిదని భావింపవచ్చును. ఇతడు పరమదుర్మార్గుఁడై ప్రజల ననేకవిధములుగ బాధించుచు జనకంటకుడుగ తయారైనాడు. అతని యాగడము లరికట్టుటకు రఘునాథుడు చాల ప్రయాసపడవలసివచ్చినది. మహావీరుఁడైన రఘునాథుఁ డతని నెదిరింపఁబోగా నతఁ డెదురుపడక యా వీరాగ్రేసరున కాయాసము గల్గించినాడట. పడవలతో వంతెన కట్టి కోటను సమీపించి, చోలగుని పట్టి బయటి కీడ్చి మానభంగము గావించి రఘునాథుఁ డతని నణచి లోకోపకార మొనర్చినాడు. సాహిత్యరత్నాకర రఘునాథాభ్యుదయాది గ్రంథములలో నీ విజయప్రశంస చేయఁబడినది. "చోళగ మానహంత్రే" 9 అని రామభద్రాంబ రఘునాథుని ప్రశంసించినది. "కదనంబులో చోలగుని గెల్చినట్టి పోలికల్" 10 అని ఇందిరామందిరములో విజయాంకితములుగ చిత్రింప బడినట్లు విజయరాఘవనాయకుఁడు చెప్పినాఁడు.

---

8. విజయవిలాసము తృ. ఆ. ౧౩౭ ప.
9. రఘునాథాభ్యుదయము.
10. రఘునాథనాయకాభ్యుదయము.

"భుజ పరాక్రమార్జిత నానాజల దుర్గ 11 ..........." అని విజయవిలాసకర్త చెప్పిన రఘునాథపరాక్రమార్జితజలదుర్గములలో నిది యొకటియై యుండును. వంశపారంపర్యముగ వచ్చుచున్న విజయనగరసింహాసనాధిపత్యమున కిష్టతగిలిన జగ్గరాజును తోపూరు యుద్ధములో సంహరించి రామదేవరాయలను విజయనగరసింహాసనాధిష్ఠితుని గావించిన వీరవరుఁ డితఁడు.

రఘునాథుఁడు సాధించిన విజయములకు చిహ్నముగ "విజయవిలాసము" అను పేరుతో నొక సుందరభవనరాజము తంజావూరులో నిర్మింపబడినట్లు విజ్ఞులు కొందరూహించుచున్నారు. దానికి ప్రతీకగా వేంకటకవి విజయవిలాసప్రబంధనిర్మాణము చేసినట్లు తోచును. అదియే నిజమైనచో నా భవనరాజము నేఁడు లేక పోయినను దానికీ కవీంద్రుఁడు సాంస్వతస్పర్శ నిచ్చి శాశ్వతరూపకల్పన చేసినాఁ డన వచ్చును.

"చెలులు ప్రసంగవశంబున
నలరెం గడు విజయభవనంబనిసన్ 12..........."

అను పద్యములో వేంకటకవి గూడ నా భవనమును సూచించినాఁడు.

"విజయచిహ్నములచే వెలయుచునున్న
విజయభవనరాజవేదికాస్థలిని" 13

అని విజయరాఘవనాయకుఁ డా భవనరాజమును పేర్కొని యున్నాఁడు. కనుక రఘునాథుని లోకోత్తరవిజయచిహ్నముగ వేంకటకవి తన గ్రంథమునకు విజయవిలాసము అను పేరు పెట్టుట యిహపరసాధకమైనట్లు భావింపవచ్చును.

11. విజయవిలాసము ద్వి.ఆ.205ప. 12. విజయవిలాసము తృ. ఆ.26ప.
13. రఘునాథనాయకాభ్యుదయము.

# ఇతివృత్తము మూలము మార్పులు కూర్పులు

## ఇతివృత్తము-

విజయవిలాసేతివృత్తము మూఁడు ముఖ్యసన్నివేశములతోఁ గూడియున్నది. ఆ త్రివిధసన్నివేశములును విజయవిలాసాత్మకములుగ వినుతిఁగాంచినవి. ఆ మూఁడు ఘట్టములును శృంగారరససమన్వితములై యీ ప్రబంధరాజమున కెనలేని శోభను జేకూర్చినవి. అర్జునుఁడు తీర్థయాత్రాసందర్భమునఁ గ్రమముగ నులూచిని, చిత్రాంగదను, సుభద్రను వివాహమాఁడిన సరససన్నివేశము లీ యితివృత్తముఖ్యవిషయములు. మధ్యలో నందాద్యప్సరోవృత్తాంత మొకటి చేర్పఁబడినది. ఆ సన్నివేశములలోఁ జేమకూర వెంకటకవి విజయుని వివిధవిలాసములను గణనీయకవితాసామర్థ్యప్రకటనాత్మకకమనీయపదజాలములో వర్ణించి తన ప్రబంధనామమును సార్థకము గావించుకొనినాఁడు.

విజయవిలాసము మూఁడాశ్వాసముల ప్రబంధము. ఇందు మొత్తము 672 పద్యగద్యములున్నవి. గద్యసంఖ్య యత్యల్పమైనది. ఈ ప్రబంధములో మొత్త మెనిమిది వచనములే యున్నవి. మిగిలినవన్నియు నిరర్గళధారాశుద్ధితోఁ గూడిన పద్యములే. అర్జునుని తీర్థయాత్రావిశేషములను వర్ణించుచుఁ జెప్పిన వచన మొక్కటే యందుఁ గొంచము పెద్దదిగఁ గానవచ్చును. 1 సహజముగ నల్పబీజసమన్వితమైన యితివృత్తమును దన మనోజ్ఞకవితాకళాగతి కనుకూలముగ వర్ణనాత్మకవిన్యాసములతో విస్తరింపఁజేసినాఁడు.

శ్రీకృష్ణు నాజ్ఞపై గదుఁడు ద్వారకానగరమునుండి యింద్రప్రస్థమునకు వచ్చి యర్జునునికడ సుభద్రాసౌందర్యాతిశయమును బ్రశం

---

1. వి.వి. ప్ర.ఆ. ప. 123

సించుట, చోరహృతధేనూత్తంసుఁడైన బ్రాహ్మణుఁ డొకఁడు మొఱపెట్టుకొనఁగా నతని మొఱ నాలించి తద్గోసంరక్షణార్థము ధనుర్బాణముల కొఱ కర్జునుఁడు ధర్మరాజు నంతఃపురమున కేగుట, సమయభంగమైనందువలన నొకయేఁడు భూప్రదక్షిణముచేయుటకు సకలధర్మవేత్తయైన విశారదునితోఁ గలిసి సపరివారముగ నర్జునుఁడు బయలుదేరుట, మార్గమధ్యమున నులూచి యను నాగకన్యను వివాహమాడుట, యిలావంతుఁడను కుమారుఁడు జనించుట, యనంతర మర్జునుఁడు మణిపురాధీశ్వరుఁడగు మలయధ్వజుని ప్రియతనయ యగు చిత్రాంగదను వివాహమాడుట, బభ్రువాహనజననము, సౌభద్రాదిపంచతీర్థములందు శాపవశమున గ్రాహరూపములలో నున్న నంద, లలిత, పద్మ, సౌరభేయి, సమీచి యను నైదుగు రప్సరస్స్త్రీలకును శాపమోక్షము గావించుట, యాత్మవాంఛాసిద్ధికొఱ కర్జునుఁడు కపటసన్న్యాసవేషమును ధరించుట యాదవుల రైవతకోత్సవసన్నాహములు, బలరాముఁడా కుహనాసన్న్యసిని ద్వారకానగరమున కాహ్వానించుట, యా మాయాత్రిదండికి సపర్యలు చేయుటకై బలరాముఁడు సుభద్రను నియమించుట, యతనికిఁ బరిచర్యలుచేయుచు నర్జునుని యోగక్షేమములను గూర్చి యతని నడుగుట, తానే యర్జునుఁడ నని యతఁడు బయటపడుట, తనను గాంధర్వవిధిని వివాహమాడు మని యర్జునుఁడు సుభద్రను గోరుట. వివాహవ్యవహారములు నడుపు బాధ్యత పెద్దల దని చెప్పి యామె తప్పించుకొనుట, యంతర్ద్వీపమున యాదవులు శివుని జాతర చేయుట, శ్రీకృష్ణుఁడు ద్వారకలో సుభద్రార్జునుల వివాహము జరిపించుట, సుభద్రార్జునుల యింద్రప్రస్థపురీప్రయాణము, యాదవసైన్యము విజయు నడ్డగించుట, సుభద్రరథసారథ్యము నిర్వహింప నర్జునుఁడు వారితో యుద్ధముచేసి విజయము సాధించుట, సుభద్రాపహరణవృత్తాంతమును విని బలరాముఁడు కోపోద్రిక్తుఁ డగుట, శ్రీకృష్ణుఁ డతనిని శాంతపరచుట, సుభ

ద్రౌపదీ విజయుల ఇంద్రప్రస్థముఁ జేరుట, బలరామకృష్ణు లింద్రప్రస్థమునకు వచ్చి సుభద్రార్జునుల వివాహము నతివైభవముగ జరిపించుట, యభిమన్యుని జననము నను విషయములు విజయవిలాసేతివృత్తముఖ్యాంశములుగ నభివర్ణితములు.

ఈ ప్రబంధమునందలి మూఁడుఘట్టములకును సంబంధించిన నాయికలు త్రివిధనాయికలుగఁ జిత్రింపఁబడినారు. తొలిఘట్టమున నులూచిప్రౌఢగ, మలిఘట్టమున చిత్రాంగద ముగ్ధగ, తుదిఘట్టమున సుభద్ర మధ్యగను వర్ణింపఁబడినారు. మరియు నర్జునున కులూచితో జరిగిన వివాహమును గాంధర్వముగను చిత్రాంగదతో జరిగిన వివాహమును బ్రాహ్మముగను, సుభద్రతో జరిగిన వివాహమును రాక్షసముగను వర్ణించుటవలన నీ కథ కొక నూతనవికాసము, తద్గతశృంగారవిన్యాసమునకుఁ గ్రొత్తమెలుపును లభించినవి. ఈ యితివృత్తము భిన్ననాయికాశ్రయమైయున్నను నేకనాయకబద్ధమైయుండుట యొక విశేషముగఁ గానవచ్చును. ఈ మనోహరనాయికామణులు సుందరనాయకసూత్రమున నపూర్వహారముగఁ గూర్పఁబడినట్లు గన్పట్టును. కావ్యకథానిర్మాణరీతిలో నిది యొక నూతన పద్ధతి. ఇట్టి క్రొత్తమెలుపుతోఁ గూడిన యితివృత్తములు గల యాంధ్రప్రబంధము లరుదుగఁ గానవచ్చును.

స్థూలదృష్టితోఁ జూచినచో విజయవిలాసమున వస్త్వైక్యము చెడినట్లు గన్పట్టును. ప్రాథమికసన్నివేశములో నులూచీపరిణయవృత్తాంతము, ద్వితీయసన్నివేశములోఁ జిత్రాంగదావివాహవృత్తాంతము, తృతీయసన్నివేశములో నందాద్యప్సరోవృత్తాంతము, చతుర్థసన్నివేశములో సుభద్రాపరిణయవృత్తాంతమును వివరింపఁబడియున్న కారణ

మున నీ ప్రబంధమునందలి యితివృత్తము చతుర్భాగములుగ విభజింపఁబడినట్లు గానవచ్చుటచేత నిందైక్యము చెడినట్లు తోఁచును. వస్త్వైక్యము ప్రబంధలక్షణములలో ముఖ్యమైనది. అట్టి యైక్యగుణము కొఱవడిన ప్రబంధము లోపభూయిష్ఠముగఁ గానవచ్చును. కాని సూక్ష్మదృష్టితోఁ బరిశీలించినచోఁ దల్లోపపరిహారార్థము వేంకటకవి ప్రయత్నించినట్లు తోఁచును. అర్జును నొక్కనినే నాయకునిగా నెంచి, ప్రబంధము మొదట గదకృతసుభద్రాసౌందర్యప్రశంసాత్మకవర్ణనమును గల్పించి యాద్యంతసన్నివేశములలో సుభద్రావృత్తాంతప్రాధాన్యమును ముచ్చటించి, యులూచీచిత్రాంగదా వృత్తాంతములను బ్రాసంగికేతివృత్తభాగములుగ వివరించి యీ కవీంద్రుఁడు వస్త్వైక్యమునకు భంగము గలుగకుండఁ జేసినాఁడని భావింపనగును. "విజయవిలాసమున నర్జునుఁడే నాయకుఁడై యుండుటతక్క వేరొక్క యైక్యము లేదు. కావ్యమునందలి వస్తువున కొక విధముగా నైక్యసంధానము గావించుటకు గదకృతసుభద్రావర్ణనము నుపయోగించినాఁడు." అని యొకచోట దివాకర్ల వేంకటావధానిగారు చెప్పినవాక్యము లీ సందర్భములో స్మరణీయములు.[2] ఈ ప్రబంధమునకుఁ గల సుభద్రాపరిణయ మను నామాంతర మీ కథా భాగములలో సుభద్రావివాహవృత్తాంతప్రాధాన్యము నుగ్గడించుచున్నది.

కాలపరిస్థితులు, రసార్ద్రహృదయులైన రాజుల మనస్తత్త్వములు, రసికజనవిలాసవైఖరులు, సరసహృదయుల నాకర్షించు రమణీమణుల యనురాగమయకార్యకలాపములు, రాజావలంబమునుబట్టి వైష్ణవ

2. కా. ల. ది. వేం. పంచమోపన్యాసము పే. 183.

మతము ప్రేరేపించిన ప్రణయతత్త్వము, దక్షిణాంధ్రయుగకవితావిశిష్టరీతులు మున్నగువాని ప్రభావమువలన వేంకటకవి తన విజయవిలాసేతివృత్తమును శృంగారరసమయము గావించినాఁడు. అట్టి శృంగార రసస్పందనాత్మక ధోరణికిఁ జిహ్నముగ నాఁటి ప్రబంధములు విలాసపదాంకితములైనవి. అట్టి దక్షిణాంధ్రయుగవిలాసకావ్యజగత్తునకీ కవీంద్రుఁడే మూలపురుషుఁడుగ భావింపఁబడుచున్నాఁడు. అంతకుముందు శ్రీనాథాది కవీంద్రులు హరవిలాసాదికావ్యములను రచించియున్నను దక్షిణాంధ్ర యుగమునందే శృంగారరసప్రధానములైన సర్వాంగసుందరవిలాస కావ్యము లవతరించినవి. కనుక శృంగారరసప్రధానములైన యితివృత్తముల నెన్నుకొనుట, వర్ణనములను శృంగారరసమయములు గావించుటయు దక్షిణాంధ్రయుగవిశిష్టకవితాసంప్రదాయముగ భావింపనగును.

మూలము - విజయవిలాసేతివృత్తమునకు మహాభారతాదిపర్వమునందలి సుభద్రావివాహఘట్టము మూలము. మూలమునందుఁ గూడఁ బ్రధానమైన సుభద్రావివాహఘట్టముతో పాటు నాగకన్యా ఉలూచీ చిత్రాంగదావివాహవృత్తాంతములును ప్రాసంగికసన్నివేశములుగఁ జెప్పఁబడినవి. మూలకథావిశేషములను సూత్రప్రాయముగ స్వీకరించి స్వకపోలకల్పితమనోహరసన్నివేశములతోఁ జేమకూర వేంకటకవి తన విజయవిలాసకథను ప్రబంధోచితపద్ధతిలో విస్తరింపఁజేసినాఁడు. ఇట్టి ప్రబంధోచితపరిణామ మాంధ్రప్రబంధేతివృత్తములకు సహజలక్షణముగఁ గానవచ్చును. ఇట్టి సూత్రప్రాయమూలకథాస్తంభములపైననే పెద్దనాదిప్రబంధకవు లాత్మప్రబంధకథామహాసౌధనిర్మాణములు గావించినారు.

విజయవిలాసేతివృత్తమునకు మూలమైన సన్నివేశము

లాంధ్రమహాభారతమునందు మొత్తము 108 పద్యగద్యములలోఁ జెప్పఁడినది. 3

సంస్కృతభారతమునం దీ విషయమును వ్యాసమునీంద్రుఁడు తొమ్మిదధ్యాయములలో 297 శ్లోకములలోఁ జెప్పియున్నాఁడు.4 వ్యాస భగవానుఁడు సంస్కృతభారతమునందు విస్తృతధోరణిలోఁ జెప్పిన యీ కథను నన్నయభట్టారకుఁడు తన భారతభాగమునందుఁ గొంత సంగ్రహించినాఁడు. దానిని వేంకటకవి తన విజయవిలాసములో మొత్తము 672 పద్యములలో బాగుగ పెంచినాఁడు.

ఆంధ్రమహాభారతమున నీ కథ నారదప్రేరితులై పాండవులు సమయము చేయుట, బ్రాహ్మణునికోరికపై నర్జునుఁడు చోరులను వధించి యతని గోధన మతనికి నిచ్చుట, సమయభంగకారణమున నర్జునుఁడు తీర్థయాత్ర కేగుట, యులూచి యర్జునునిఁ గామించుట, యర్జునుఁడు చిత్రాంగదను వివాహమాడుట, యర్జునుఁడు సౌభద్రాది పంచతీర్థములందు వందా(నందా)ద్యప్సరసలను శాపవిముక్తలనుగావించుట, యర్జునుఁడు ద్వారకానగరంబున కరుగుట, యతఁడు కన్యాంతఃపురమున యతిరూపంబుననుండుట, సుభద్రార్జునుల వివాహము జరుగుట, యర్జునుఁడు సుభద్రాసహితుఁడై యింద్రప్రస్థమున కేగుట, శ్రీకృష్ణబలరామాదులు పాండవులకుఁ గానుకలు దెచ్చియిచ్చుట, యభిమన్యు జననము నను క్రమపద్ధతిలోఁ జెప్పఁబడినది.

3. ఆం.మ.భా. సం.ము. ఆ.ప. అష్టమాశ్వాసము నన్నయ ప. 116-223

4. సం. భా. (గీతాప్రెస్) ఆ. ప. అర్జునవనవాసపర్వము స. 264 నుండి 273 వరకు.

వేంకటకవి తనయితివృత్తమునకుఁ జాలవరకు నన్నపార్యుని భారతభాగమునందలి యులూచీచిత్రాంగదాసుభద్రలవృత్తాంతములనే మూలముగఁ జేసికొనినట్లు కానవచ్చును.

మార్పులు కూర్పులు- చేమకూరవేంకటకవి తన ప్రబంధో చితపద్ధతి కనుకూలముగఁ గొన్ని మూలసన్నివేశములను మార్చి కొన్ని నూతనకల్పనలను గూర్చియు విజయవిలాసేతివృత్తమును సర్వాంగసుంద రముగ విస్తృతపరచినాఁడు. ఆ మార్పులు, కూర్పులును మూలకథకు సొగసును జేకూర్చినవి.

గదునిచేఁ జేయఁబడిన సుభద్రాసౌందర్యప్రశంస యట్టి మార్పు లలో మొదటిది. విజయవిలాసకథాప్రారంభదశలోనే యీ మార్పు చేయఁబడినది. అర్జునునకు సుభద్రపై ననురాగోదయమగుట, ఈ ప్రబంధమున సుభద్రావృత్తాంతప్రాధాన్యము, వస్త్వైక్యము కుదురుట మున్నగు ప్రయోజనము లీ మార్పువలన సిద్ధించినవి.

బ్రాహ్మణగోధనరక్షణవిషయమును నన్నయ యైదు పద్యగద్య ములలోఁ జెప్పియుండఁగా 5 నీ కవీంద్రుఁ డొకే పద్యములో నా విష యమును గడు సామర్థ్యముతో సంగ్రహించినాఁడు. 6 ప్రబంధకళా గతి కననుకూలములైన సన్నివేశములను సంగ్రహించి విజయవిలాసము నుత్తమ ప్రబంధముగఁ దీర్చిన వేంకటకవియొక్క ఘనకవితాశక్తి దీని వలన వ్యక్తమగుచున్నది. అర్జునుఁడు ద్వాదశవార్షికవ్రతమునకుఁ

5. ఆం. మ. భా. సంశోధితముద్రణము అ. ప అ. ఆ.ప. 116 నుండి 120 వరకు

6. వి. వి. ప్ర. ఆ. ప. 43.

బోనుకొన్నట్లు నన్నయ (నాంధ్ర)మహాభారతభాగమునందుఁ జెప్పఁబడినది. ఈ సందర్భమున వెంకటకవి నన్నయమార్గము ననుసరించినాఁడు.

మూలమునందలి యులూచీ,చిత్రవాహన,నందా,లతాదినామములు ఉలూచీ,మలయధ్వజ,నందా,లలితాదులుగ నిందు మార్చఁబడినవి. శ్రుతిసుభగధ్వనుల ననుసరించి, యాంధ్రజాతీయవ్యవహారముల ననుసరించియు నీ కవి యిట్టి నామములను గొన్నిఁటిని మూలభిన్నముగ మార్చినట్లు భావింపనగును.

ఉలూచి ప్రభాతసమయమున నర్జునునిఁ దన నాగలోకమునకుఁ గొనిపోయినట్లు, మరునాఁటి యుదయమువరకు నతఁ డచ్చట నే యున్నట్లును మూలమునందుఁ జెప్పఁబడినది. 7 అతని నామె మాయ యచ్చుపడు మాపటివేళఁ దన లోకమునకుఁ దీసికొని వెళ్లినట్లు విజయవిలాసమున మార్పఁబడినది. 8 ఆ ప్రణయమూర్తుల వాంఛలు దీరుటకుఁ దగిన యవకాశమును గలిగించుట, సమయౌచిత్యము పోషింపఁబడుట యను ముఖ్యప్రయోజనము లీ మార్పుల వలన సిద్ధించినవి. ఉలూచి యైరావతకులసంభవుఁడైన కౌరవ్యునికూఁతు రని మూలమునఁ జెప్పఁబడినది. 9 ఇందామె భుజంగమరాజకన్యక యనియే చెప్పఁబడినది. 10 భారతమున నేఁడు పద్యగద్యములలోఁ జెప్పఁబడిన యులూచీ

7. ఆం. మ భా. సం. ము. ఆ. ప. అ. ఆ. వ. 127, 134
8. వి. వి. ప్ర. ఆ. ప. 72, 73
9. ఆం. మ. భా. సం. ము. ఆ. ప. అ. ఆ. వ. 130.
10. వి. వి. ప్ర. ఆ. ప. 79

వృత్తాంతము నిండుపదియారుపద్యములలో మనోహరవర్ణనాత్మకవిన్యాసములతో బాగుగఁ జెప్పినాఁడు. ప్రబంధోచితధోరణిలో సులూచ్యంగప్రత్యంగవర్ణన చేయుటవలన, నాటకోచితపద్ధతిలో సులూచ్యర్జునసంవాదమును పడుపుటవలనను నీకథ యింత పెరిగినది. ఈ సందర్భములో నొక పర్యాయ ములూచీసౌందర్యమును దనివిదీర సుదీర్ఘముగ వర్ణించి మరల నర్జునునిచే విశారదాదులకడ నామె సౌందర్యమును పది పద్యములలోఁ జెప్పించుట యంత సమంజసముగఁ గానరాదు.

వేంకటకవి దన విజయవిలాసకథాగతియందు మూలభిన్నముగఁ గావించిన మార్పులలో విశారదపాత్రసృష్టి యొకటి. అఖిలవేదవేదాంగపారగులైన బ్రాహ్మణులు ననేకశాస్త్రవిదులై వివిధకథాకథనదక్షులైన పౌరాణికులును దనకు సహాయులుగా నర్జునుఁడు తీర్థయాత్ర కరిగినట్లు మూలమునఁ గలదు.11 ధర్మరాజు తనపురోహితుఁడైన ధౌమ్యుని తమ్ముని కుమారుఁడును, సకలధర్మవిశారదుఁడును నైన విశారదు నర్జునుని వెంటఁ బంపినట్లు విజయవిలాసకారుఁడు కల్పించినాఁడు. 12 కథాక్రమమున సముచితప్రయోజనమును నిర్వహించుటకై యీ నూతనపాత్రనీ ప్రబంధమునందుఁ దొలిదశలోనే సూచించినాఁడు. ఇతఁ డర్జునుని నర్మసచివు డనఁదగియున్నాఁడు. ఇతఁడు నాయకానుకూలుఁడై యర్జునుని మనోవాంఛాసిద్ధికొరకు ప్రయత్నించినాఁడు. సంస్కారరహిత హాస్యమున కాటపట్టైన విదూషకపాత్రవలెఁ గాక విశారద పాత్రను వివేకవంతమైనదిగ, సంస్కారసహితమైనదిగను జిత్రించినాఁడు

11. ఆం. మ. భా. (సం. ము.) ఆ. ప. అ. ఆ. వ. 124.

12. వి. వి. ప్ర. ఆ. ప. 45.

మరియు నితఁడు హావభావపరిణామవిమూఁడుగఁగూడఁ జేర్పఁబడి నాఁడు. అర్జునుని కోరికపై పెండ్లిరాయబారము నడిపి, మలయధ్వజు నొప్పించి చిత్రాంగదార్జునుల వివాహము గావించినాఁడు. చిత్రాంగ దను దనకిచ్చి వివాహము చేయుమని యర్జునుఁడామె తండ్రియగు చిత్రవాహనుని కడకేగి యడిగినట్లు మూలమున నున్నది. 13

శ్లో. "అభిగమ్య చ రాజాన మవదత్ స్వంప్రయోజనమ్
దేహి మే ఖల్విమాం రాజన్ క్షత్రియాయ మహాత్మనే"

అని సంస్కృతభారతమునందుఁ గృష్ణద్వైపాయనుఁడుగూడ నిట్లే చెప్పి యున్నాఁడు. 14 ఇట్లర్జునుఁడు దానే చిత్రవాహను నడుగుట నాయకో త్కర్షకు భంగకరముగ నున్నది. మరియు నతని సహజమానసికగాంభీ ర్యమున కిది విరుద్ధముగఁ గూడ నున్నది. అట్టి యనౌచిత్యమును దొల గించి రాజకుటుంబసంప్రదాయములు సిలఁబెట్టి నాయకోత్కర్షము గా వించుటకై యీ కవీంద్రుఁడు విశారదపాత్రను ప్రవేశపెట్టి యతని ద్వారా పెండ్లిరాయబారము నడిపించి చిత్రాంగదార్జునవివాహఘట్ట మునకు సరసతయు, సొగసుఁదనమును, జేకూర్చినాఁడు.

"అర్జున నభిప్రాయం బాప్తులవలన నెఱింగి" 15 అని మూల భారతమునందు నన్నయ వాడిన యాప్తశబ్దము నాధారముగఁ జేసి కొని విజయవిలాసకారుఁడు విశారదపాత్రను సృజించినట్లు భావింప

---

13. ఆం. మ. భా. (సం. ము.) ఆ. ప. అ. అ. వ. 140.
14. సం. భా. (గీతాప్రెస్) ఆ. ప. పే. 266 శ్లో. 17.
15. ఆం. మ. భా. (సం. ము.) ఆ. ప. అ. ఆ. వ. 140.

నగును. కన్యను దన కిచ్చి వివాహము చేయు మని తానై యడుగుట కంటె నొక పెద్దమనిషిచేత నడిగించుట యుభయులకు గౌరవకరమట యేగాక సాంఘికమర్యాదకూడ నగును. విజయవిలాసమునకు ముందు రచింపఁబడిన వసుచరిత్రమునందలి నర్మసచివుని మధ్యవర్తిత్వము నను సరించి యిందీ విశారదవ్యవహారమును నడిపినట్లు గానవచ్చును.

చిత్రాంగదా వివాహానంతరమర్జునుఁడు మణిపురసమీపసముద్రతీరతీర్థంబులు చూచుచుం జని సౌభద్రాదిపంచతీర్థములందలి నందాద్యప్సరసలకు శాపమోక్షము గావించి మణిపురమునకుఁ దిరిగివచ్చి చిత్రాంగదయందు బభ్రువాహనుఁ డను పుత్త్రుం బడసినట్లు మూలమునఁ జెప్పఁబడినది. బభ్రువాహనజననానంతర మర్జునుఁడు తీర్థయాత్ర చేయుచుఁ బంచతీర్థముల కేగి గ్రాహరూపములనున్న నందాద్యప్సరసలకు శాపమోక్షము గావించినట్లు కొంత మార్చి యీ సన్నివేశము నీ కవీంద్రుఁడు మనోహరముగ మలచినాఁడు. ఇట్లు మార్చుటవలన నర్జును నితీర్థయాత్రాగమనము నిరాటంకముగ సాగించుట కవకాశము లభించినది. దీనివలన పూర్వోత్తరకథావిషయములకు, జక్కని యనుసంధానము గుదిరినది. ఈ మార్పువలన నీ వృత్తాంతమును గొంత సంగ్రహించుట కవకాశము లభించినది. మఱియు నచ్చటికి దగ్గరగనున్న ద్వారకానగరమున కేగి సుందరాంగి యగు సుభద్రను తొందరగ వివాహమాడవలె నను నర్జునుని తీవ్రవాంఛ కీ మార్పు తగియున్నది. నందాద్యప్సరసల శాపవిమోచనమైన తరువాత నర్జునుఁడు పశ్చిమసముద్రప్రాంతపుణ్యస్థలములు సందర్శించుచుఁ బ్రభాసతీర్థమున కేగి ద్వారకాపుర మచ్చటికి దగ్గరగా నున్నదని తెలిసి "కలదుగా! యింక సుభద్ర

రూపరేఖావిలాసవిభ్రమంబులు గనఁ జూడ్కి విందగాఁగ" 16 అని సంతసిల్లినట్లు వేంకటకవి చెప్పుటవలనఁ గథాగతి కొక క్రమవిధాన మేర్పడినది.

అర్జునుని తీర్థయాత్రాసందర్భమున సంస్కృతభారతమున జెప్పఁబడని గోదావరీభీమేశ్వరశ్రీపర్వతవేంగీదేశాదుల నాత్మప్రాంతీయాభిమానముతో నన్నయభట్టారకుఁడాంధ్రమహాభారతమునఁ బేర్కొని యున్నాఁడు. 17 ఈ సందర్భమున విజయవిలాసకారుఁడు నమూరిరుచిరమైన పుణ్యక్షేత్రములను కమనీయశైలీసమన్వితసుదీర్ఘవచనములో వర్ణించియున్నాఁడు. పుణ్యక్షేత్రములను వర్ణించు సందర్భములో వేంగీదేశమును బేర్కొనుట సముచితముగాదని వేంకటకవి దానిని పరిత్యజించినాఁడు. గోదావరి మొదలుకొని తిరుపతి వరకును గల యాంధ్రపుణ్యక్షేత్రముల నన్నిటిని ప్రత్యేకాభిమానముతో విజయవిలాసకారుఁడు పేర్కొనియున్నాఁడు. 18

శ్లో. అగస్త్యతీర్థం సౌభద్రం పౌలోమం చ సుపావనమ్
కరం ధర్మప్లవం చైవ హయమేధ ఫలం చ యత్
భారద్వాజస్య తీర్థం చ పాపప్రశమనం మహత్
ఏతాని పంచతీర్థాని దదర్శ కురుసత్తమః 19

16. వి. వి. ద్వి. ఆ. ప. 77.
17. ఆం. మ భా. (సం. ము.) ఆ. ప. అ. ఆ. ప. 139.
18. వి. వి. ప్ర. ఆ. వ. 128.
19. సం. భా. పి. పి. యస్. ప్రతి. పే. 1334.

అని యొక సంస్కృత భారతప్రతియందుఁ బేర్కొనఁబడిన పంచ తీర్థనామములకు భిన్నముగ నాంధ్ర మహాభారతమునందు సౌభద్ర, పౌలోమ, కారంధమ, ప్రసన్న, భారద్వాజములు పంచతీర్థములుగఁ బేర్కొనఁ బడినవి 20 గీతాప్రెస్‌వారు ప్రకటించిన సంస్కృతభారతము నందు, వావిళ్ళవారు తెలుఁగు లిపిలోఁ బ్రకటించిన సంస్కృత భారతప్రతి యందును "కార ంధమం ప్రసన్నంచ... 21" అని చెప్పఁబడిన నామ క్రమపద్ధతి ననుసరించి నన్నయ యీ పంచతీర్థ నామములను పేర్కొని యున్నట్లు భావింపనగును. ఇటి వివాదగ్రస్త నామముల జోలికి పోవుట యెందులకని కాఁబోలు విజయ విలాస కారుఁడొక్క సౌభద్ర తీర్థమును మాత్రమే పేర్కొని మిగిలిన వానినిఁ జెప్పకుండ పంచతీర్థములని సామాన్య దృష్టితోఁ జెప్పియున్నాఁడు.22

అప్సరసల నామములు వంద, సౌరభేయి, సమీచి, బుద్బుద, లత యని మూలమునందుఁ జెప్పఁబడఁగా విజయవిలాసమునందు నంద, లలిత, పద్మ, సౌరభేయి, సమీచి యని యొకభేదముతోఁ బేర్కొనఁ బడినవి. వెంకటకవి చూచిన మూల భారతప్రతిలో నీ నామము లిట్లే కన్పట్టి యుండు నని భావింపనగును.

చేమకూర వెంకటకవి తన విజయ విలాసమునందుఁ బెంచిన వివిధ ఘట్టములలో సుభద్రాకళ్యాణ సన్నివేశము ముఖ్యమైనది. కనుకనే ప్రబం ధోచిత ధోరణిలో దీనిని మూలము నతిక్రమించి బాగుగఁ బెంచి శృంగార రసదేవీసరసన్న రత్నసీమగఁ దీర్చిదిద్దినాఁడు. ఈ ప్రబంధాంతమున నీ ఘట్టము కవితాగుణఘనమై, యాపస్తృతియందు విశ్రాణమును సంత రించుకొనినదై, మురిపెముల ముద్దాయింపువలెఁ గానవచ్చుచున్నది. ఇందా ద్యంత సన్నివేశములలోఁ జేయఁబడిన సుభద్రావర్ణనము పునరుక్తిదోష

20. ఆ మ. భా. (సం ము)—ఆ. ప.—అ ఆ.—ప. 149.
21. సం. భా. (గీతాప్రెస్) — ఆ. ప — పే 267-శ్లో. 3. 4.
,, (వావిళ్ళప్రతి) - ,, — పే. 429.
22. వి. వి. — ద్వి. ఆ. — ప. 42.

జుష్టమైనట్లు గానవచ్చునుగాని యమూలకమైన యాపద్ధతియే వస్త్వైక్యమును గాపాడి, నాయక లక్ష్యమును నిర్ణయించి, పాత్రౌచిత్యమును పాటించుచున్నది.

మూలభారతమున నలువదియేడుమిది పద్యములలోఁ జెప్పఁబడిన సుభద్రావివాహవృత్తాంతము విజయవిలాసమున సుమారు మూఁడువందల యెబువదిపద్యములలో విస్తరింపఁబడినది. మఱియు నీ ప్రబంధ ప్రారంభదశలోఁ బది పద్యములలో సుభద్రా సౌందర్యప్రశంస చేయఁబడినది. ఈ ప్రబంధమునందధికభాగ మీ వృత్తాంతముతో నిండియున్నది. ద్వితీయాశ్వాసమున రెండు వంతులు, తృతీయాశ్వాసమంతయు నీ వృత్తాంతముతోనే గూడియున్నది

అర్జున యతివేషము, సుభద్ర యతనికిఁబరిచర్యలుచేయుట. ద్వారకానగరములో దేవకీవసుదేవులర్జునునకుఁ గన్యాదానము చేయుట, యర్జున యాదవ వీరుల యుద్ధము మున్నగునవి సంస్కృత భారతమునఁ జెప్పఁబడలేదు. వీనిలో నర్జున యతివేషము, సుభద్రా పరిచర్యలు యుద్ధము మాత్ర మాంధ్రమహాభారతమున నభివర్ణితములు[23] సుభద్రార్జునుల విరహతాపములు, సుభద్రవదినెలామెతో మేలములాడుట, మన్మథాద్యుపాలంభనములు, ద్వారకలో శ్రీకృష్ణుని యాధ్వర్యమున సుభద్రార్జున వివాహము జరుగుట, వియ్యాలవారిసయ్యాటలు, పడుకటింటి ముచ్చటలు, సుభద్రార్జునుల శృంగారవిలాసకృత్యములు మున్నగునవి మూలభిన్నముగ నీప్రబంధ రాజమునఁ గూర్పఁబడినవి.

శ్రీకృష్ణుఁడు తన సోదరి నపహరించి తీసికొనివెళ్ళి వివాహము జేసికొనుమని యర్జునితోఁ జెప్పినట్లు

23. ఆ. మ. భా. (సం. ము.)—ఆ. ప.—అ. ఆ.—వ. 180, ప. 182.

"ప్రసహ్య హరణంచాపి క్షత్రియాణాం ప్రశస్యతే
వివాహ హేతుః శూరాణామితి ధర్మవిదోవిదుః,
సత్వమర్జున కల్యాణీం ప్రసహ్య భగినీంమమ
హర స్వయంవరేహ్యస్యాః కోవై వేదచికీర్షితమ్"24
అను సంస్కృతభారతశ్లోకములనుబట్టి తెలియుచున్నది.

"అక్షయదాణ తూణీరబాణాసనసనాథంబై పవనజవనహయంబులం బూన్చిన యక్కాంచన రథంబెక్కి సుభద్రందోడ్కొని యింద్ర ప్రస్థ పురంబునకు పొగుము" అని శ్రీ కృష్ణుఁడర్జునునితోఁ జెప్పినట్లాంధ్ర మహాభారతమునఁ గలదు 25 సుభద్రనపహరించి తీసికొనిపొమ్మని శ్రీకృష్ణునిచేఁ జెప్పించుట కిష్టములేక "తోడ్కొనిపొమ్ము" అని నన్నయ యతనిచేత సౌమ్య పద్ధతిలోఁ జెప్పించినాఁడు.

తే॥ ఏల యాలస్యమింక నిందుఁ బ్రోలు సొచ్చి
నాగవలి సేయుదురుగాక వేగ కదలి
పొండు దంపతులని ధనుష్కాండ రథహ
యంబుల నొసంగి సరుఁబయనంబు సేసి.26

అను పద్యములో వేంకటకవి యీ విషయమునాంధ్రమహాభారతము ననుసరించి చెప్పినట్లు తెలియుచున్నది. ఇచ్చట నాగవల్లి యనునాంధ్ర వైవాహిక క్రియావిశేషము నదనముగ నీకవీంద్రుడు. చెప్పినాఁడు ఈ వృత్తాంతములో సుభద్రార్జునసంవాదముసరసగంభీరభావసమ్మిశ్రితముగ రమణీయ శైలిలోఁ జిత్రింపఁబడి వేంకటకవి యొక్క కవితాప్రతిభకు ముఖ్యనిదర్శనముగఁ గానవచ్చుచున్నది.

24. సం. భా (గీతాప్రెస్) — ఆ. ప. — పే. 270—శ్లో. 22, 23.
25. ఆ. మ భా. (సం. ము.) — ఆ. ప. — అ. ఆ. — వ. 197.
20. వి. వి. — తృ. ఆ. — ప. 130.

సందాద్యప్సరోవృత్తాంతమప్రసక్తమై ప్రధానకథాగతికాటంకమును కలిగించుచున్న ట్లీప్రబంధమునఁగన్పట్టుచున్నను నర్జునుని ధీరోదాత్తానాయకత్వమును ప్రథుపపబుచుచున్నది, ఆ వీరాగ్రగణ్యుని పరాక్రమాతిశయము త్యాగనిరతి, స్నిగ్రహశక్తి మున్నగునాయకోదాత్త గుణములీ సన్నివేశములోనే ప్రకటితములెనవి. ఇందరుసునిసౌశీల్యము బాగుగఁబోషింపఁబడినది.

విజయవిలాసకారుఁడుకొన్ని సందర్భములలో ద్విపదభారత సన్నివేశముల ననుసరించినట్లు కన్పట్టును. భుజంగమరాజకన్యను నన్నయ యులూపి యని పేర్కొనఁగా ద్విపదభారతకారుఁడులూచి యని పేర్కొనినాఁడు.[27] తనకుఁగొంచెము పూర్వదశలో వెలువడిన యీ ద్విపదభారత పాఠమునే వేంకటకవి స్వీకరించియుండును. కొన్ని మూలభారత ప్రతులలోఁగూడ నులూచి యనుపాఠాంతరము గానవచ్చును. నన్నయ పేర్కొనిన పుణ్యక్షేత్రములనేగాక ద్విపదభారతకారుఁడు కృష్ణవేణ్యాహోబలాది పుణ్యక్షేత్రములను గూడఁ బేర్కొని యున్నాఁడు. ఈ పుణ్యక్షేత్రములుగూడ విజయవిలాసమునఁ బేర్కొనఁబడుటంజేసి వెంకటకవి పుణ్యక్షేత్రవర్ణనమున ద్విపద భారతము ననుసరించినట్లు తోచును.[29]

ద్వి॥ ధాత్రీశుఁడయ్యింతిఁ దగిలెడు కాంక్ష నొదఁబడఁ గైకొని యొక కొన్ని నెలలు
పడతితోడ విహారపరిణతినుండి, బభ్రువాహనుఁడను పట్టిఁబుట్టించి.
సుభ్రు తండ్రికి వాని సుతునిఁ గానిచ్చి......"[30]

27. ద్వి. భా. ఆ. ప అ. ఆ బట్టేపాటతిమ్మయ — పే. 446.
28. ,, — ,, — ,, — ,, — పే. 450.
29. వి. వి. — ప్ర. ఆ. — వ. 128.
30. ద్వి. భా. — ఆ. ప — అ ఆ. . పే. 452.

అని ద్విపదభారతకారుఁడు చెప్పిన పద్ధతిననుసరించి యర్జునుఁడు చిత్రాంగదను వివాహమాడినతరువాత బభ్రువాహనుఁడనుతనయునిఁ బుట్టించి యామెతండ్రి కప్పగించి తిరిగిరాని పద్ధతితో సౌభద్రతీర్థమున కేగినట్లు విజయ విలాసకారుడు తెలియఁజేసినాఁడు ఇట్లు కొన్ని సన్నివేశములందు విజయవిలాసకారుఁడు ద్విపదభారతవిషయముల నాధారముగఁ జేసికొనినట్లు స్పష్టపడుచున్నది.

మొత్తము మీద వేంకటకవి మూలభిన్నముగఁజేసిన మార్పులుఁ గూర్పులును విజయవిలాసేతివృత్తమునకపూర్వరమణీయత్వమును సిద్ధింపఁ జేసినవి.

# శృంగారభంగిమలు

ప్రబంధములు శృంగారరసప్రాధాన్యము వహించి యాంధ్రవాఙ్మయమున నపూర్వపరావైభవముతో నలరారుచున్నవి. శృంగారరసమును సాంగోపాంగముగ చిత్రించుట ప్రబంధకవులకు పరిపాటియైనది. మనోహరాలంకారశైలిలో, సరసశృంగారవిన్యాసములతో, క్రమబద్ధవస్తువర్ణనలతో, కథాసన్నివేశక్రమ చిత్రణముతో, గణనీయ కాల్పనికశక్తితో సౌమ్యసంగీతనాట్యకేళులుట్టిపడుచు మధురభావసమన్విత పాదగతులతోను ఆంధ్రప్రబంధసుందరి కళామయ జీవులకు రసపారవశ్యమును కలిగించు స్వాత్మరూపమును సంతరించుకొని యపూర్వశోభతో నలరారుచున్నది. అట్టి విశిష్టరసవిలాససంపత్తితో నిండియున్నదికనుకనే ప్రబంధము సాహితీ ప్రపంచములో సమున్నతస్థానమునొందినది

శృంగారము రసరాజముగ పరిగణింపబడుచున్నది. "శృంగం (కామోద్రేకం) ఋచ్ఛతీతి శృంగారః" అని నైఘంటికులు దీనికి వ్యుత్పత్తి చెప్పియున్నారు. కామోద్రేకమును పెంచునదను యభిప్రాయము దీనికున్న యాధిక్యమును బట్టి యాలంకారికులు నవరసములందు శృంగారమున కగ్రస్థానమిచ్చియున్నారు. మానవజీవితముపై దీనిప్రభావము నిరుపమానమైనదని చెప్పవచ్చును. మోడుబారిన బ్రతుకుల నిది చైతన్యశక్తితో చిగురింపజేయును. నిరాశాపహమానవహృదయములో నాశాపరంపరలను రేకెత్తించును. అనుబంధములు లేక దూరదూర తీరముల నేకాంతజీవిత యాత్రలు సాగించువారి హృదయముల ననురాగ సూత్రబద్ధముల గావించి సాంఘిక జీవన వ్యవస్థలో సన్నిహితములగునట్లు సంఘటింపగల దివ్యశక్తి దీనికి కలదు. ఈ రసరాజము భగవంతునకు కూడ ప్రీతిపాత్రమైనది. "శృంగార ప్రియో విష్ణుః" అను నార్యోక్తి యీ విషయమును వ్యక్తము గావించుచున్నది. శృంగారరసమునకు విష్ణువధిపతి కనుక దీనికి పారమార్థికప్రాధాన్యముగూడ నున్నదని తెలియనగును. లీలాశుకుడు కృష్ణకర్ణామృతములో, జయదేవుఁడు గీతగోవిందములో, పోతనార్యుఁడు భాగవతములోను శ్రీకృష్ణుని లీలలను శృంగారరసపరిప్లుతములుగ పరాకాష్ఠదశలో చిత్రించి తరించినారు.

శృంగారరసప్రధాన వాదమును బహుళప్రచారమొనర్చిన యాలంకారికప్రముఖుఁడు భోజుఁడు. "శృంగార ఏవ ఏకోరసః" అని భోజుని సిద్ధాంతము. శృంగారమొక్కటే రసము, నిమిత్తభేదమువలన నేర్పడిన యితర రసములన్నియు నందు లీనములగునని యతనియభిప్రాయము.

"రసోఽభిమానోఽ హంకారః శృంగార
ఇతి గీయతే, యోఽర్థస్తస్యాన్వయా
త్కావ్యం కమనీయత్వ మశ్నుతే
విశిష్టాదృష్ట జన్మాయం జన్మినామంతరాత్మసు.
ఆత్మసమ్యగ్గుణోద్భూతేరేకో హేతుః ప్రకాశతే"॥[1]

అని శృంగార రసమునుగూర్చి భోజుఁడు చెప్పియున్నాడు. ఇష్టములగు చేష్టలచే నభివ్యక్తములగు నాత్మగుణసంపదలను (రత్యాదులను) స్వవిషయములుగ భావించుట వలనఁ గల్గు సుఖదుఃఖాద్యతిశయమునకుఁ గారణ భూతమైన యహంకార విశేషమె శృంగారమని యతని యభిప్రాయము. "శృంగార ఏవ మధురః పర ప్రహ్లాదనోరసః[2]" అని యానందవర్ధనుఁడారసరాజము యొక్క యేకైక ప్రాధాన్యమును ప్రశంసించియున్నాఁడు. "ఇతరుల మనస్సుల కానందమును జేకూర్చు మధుర రసమదొక్కటే." అని యాయాలంకారిక ప్రముఖుని యభిప్రాయము. "ఉత్తమ ప్రకృతి ప్రాయః రసః శృంగార ఇష్యతే[3]" అని విశ్వనాథుఁడు, "లోకోత్తరనాయకాశ్రయత్వేన శృంగారస్య పరిపోషాతిశయః[4]" అని విద్యానాథుఁడు పేర్కొని యుత్తమ నాయకాశ్రయత్వము వలన నా రసమునకుఁ గల్గు పుష్టిని వ్యక్తము గావించి యున్నారు

"Sringara firmly rooted in human nature itself since the beginning of creation. On the practical side it was delineated in

1. సరస్వతీ కంఠాభరణము. పే. 555 2. ధ్వన్యాలోకము
3. సాహిత్యదర్పణము. 4. ప్రతాపరుద్రయశో భూషణము. పే, 182.

an inevitable manner by the creative genius of great poets like kalidasa and Bana and on the theoretical side it was defined in the well - known dectum."

"రసోఽభిమానోఽహంకారః శృంగార ఇతి గీయతే"

—Of Bhoja Raja5 అని శృంగార రసమును గూర్చి మహామహోపాధ్యాయ ఎస్. కుప్పుస్వామిశాస్త్రిగారు ప్రశంసాపూర్వకముగ చెప్పియున్నారు. ఈ రసరాజమును కాళిదాస బాణాదిసంస్కృతకవి తల్లజులు కమనీయకావ్యరచనా రూపమున, భోజరాజాద్యాలంకారికులు లాక్షణిక ధోరణిలోను నారాధించినారు. అరసరమణికాంధ్రప్రబంధములాటపట్టులైయలరారినవి. రాయలయుగమునుండి దానికి స్వేచ్ఛాసంచార పూర్వకప్రతిపత్తి కావ్యసీమలందు లభించినది. వర్ణనలు శృంగార మయములైనవి. భావములు శృంగారబంధురములైనవి. నాటి చైతన్యాత్మకకావ్యరచనకు శృంగారము జీవనాడియైనదని యొక్కమాటలో చెప్పవచ్చును ప్రబంధస్థాయిలో తొలిదశయందారసమునకు పెద్దన పెద్దరికమును గల్పింప, మలిదశలో చేమకూర వేంకటకవి పాకరుచిని చేకూర్చినాడు రాయలయుగములో రమణీయవిన్యాసములతో రాజగౌరవమును, ప్రశాదరణమును పొందిన యా ప్రముఖరసము దక్షిణాంధ్రయుగములో ప్రత్యేకస్థాయి నందుకొనినది. రసికాగ్రగణ్యులైన యానాటి రాజశేఖరులు. రసగ్రహణపారీణులైన సామాన్యప్రజలు నారసరాజము నభిదేవతగ నారాధించిరి. నాటి ప్రభువర్యులు తమ జీవితముల నారసమున కంకితము గావించినారు

దక్షిణాంధ్రయుగప్రబంధములలో శృంగారరసాత్మక వర్ణనలతి వెలుగుగ గానవచ్చును. తద్యుగప్రబంధముక్తాహారములో విజయవిలాసము ముఖ్యమణిగ భాసిల్లును. శతసహస్ర సంఖ్యలో వెలసిన నాటి ప్రబంధములలో నది యగ్రగణ్యమైనది.

ఆ యుగమునకుఁ జెందిన ప్రబంధములు గొన్ని కాల ప్రభావమును

5. ఆశ్చర్యచూడామణి నాటకోపోద్ఘాతము.

ట్టి నీతిబాహ్యశృంగారవర్ణనాత్మకములైన కారణమున పండితవిమర్శకులకు గుఱియైనవి. అటినీతిబాహ్యస్థాయికి దిగజారక, జాగరూకుఁడై చేమకూర వెంకటకవి తన విజయవిలాసమునందు శృంగారరసమును పరాకాష్ఠదశలో పోషించిన కారణమున నీ కావ్యరాజము కవిపండిత ప్రశంసల నందుకొనినది మఱియు సన్నివేశములనుబట్టి శృంగారరసభంగిమలను భిన్నరీతులలో తీర్చి తనమధురకావ్యమునకొక విచిత్రశోభను చేకూర్చినాఁడు. ఇతనికి కొంచెము ముందుగానే 16 వ శతాబ్దములో విచిత్రకథాసన్నివేశములతో ప్రతిభాసమన్వితముగ కళాపూర్ణోదయ కావ్యరచన చేసి పింగళి సూరనార్యుఁడు శృంగార వైవిధ్యాత్మకశిష్టకవితావిన్యాసములకు మార్గదర్శకుఁడైనాఁడు. అట్లే పడక ముచ్చట్లను ఇదట పింగళిసూరన ప్రభావతీప్రద్యుమ్నమునందు ప్ర సనంతరదశలో చేమకూర వెంకటకవి యా ముచ్చట్లకు తన విజయవిలాసమునందు సరసస్థానముగల్పించినాఁడు. పెద్దనాదిప్రబంధకవులు రసరాజమైన శృంగారమునకే ప్రాధాన్యమిచ్చి యొక విశిష్టరచనాసంప్రదాయము నేర్పఱచినారు

విజయవిలాసము శృంగారరసప్రధానమైన యుత్తమ ప్రబంధము విజయుని శృంగారలీలలిందు మనోజ్ఞముగ వర్ణింపఁబడినవి గనుక నీకావ్యమునకు విజయవిలాసము అనుపేరు సార్థకమైనది. ఇందు నాయకుడు అర్జునుఁడు. అతఁడు దక్షిణనాయకుఁడుగ చిత్రింపబడినాఁడు ఈ కావ్యలక్ష్యమైన సుభద్రాకళ్యాణమునుబట్టి సుభద్ర నాయికయగును. కాని యీ గ్రథంమందు ముఖ్యమైన సుభద్రాకళ్యాణము చరమసన్నివేశమునందుఁ జెప్పఁబడినది. ఈ సన్నివేశప్రాధాన్యమును బట్టి యీ గ్రంథమునకు సుభద్రాకళ్యాణము నామాంతరము గూడ నేర్పడినది. అర్జునుఁడు తీర్థయాత్రారూపమున భూప్రదక్షిణము చేసి ద్వారకానగరము చేరుకొని సుభద్రను వివాహమాడుట యిందలి ప్రధానవస్తువు.

అర్జునుఁడు తీర్థయాత్ర చేయుచు నులూచిని, చిత్రాంగదను గలిసిన సన్నివేశములు కాకతాళీయములు అతని తీర్థయాత్రలోని సన్నివేశములు

ముందు జరిగినవి గనుక విజయవిలాసములోనివి యానుషంగికములుగ తొలి పలి దశలలో వర్ణింపఁబడినవి. ఈ మూఁడు ఘట్టములును శృంగారరస బంధురములే యైనను నాయికల మానసికస్థితినిబట్టి, వయఃపరిణామమును బట్టి లౌకికానుభవమును బట్టియు నా శృంగారము మూఁడు తీరులుగ వర్ణింపఁబడినది. ఆ నాయికల మనస్తత్త్వములను బట్టి యట్టిశృంగారభేదములను చిత్రించుటలో చేమకూర వేంకటకవియొక్క నిరుపమకవితాప్రతిభ వెల్లడియగుచున్నది. కళాపూర్ణోదయమునందలి శృంగారవైవిధ్యము భిన్ననాయికానాయకాశ్రయమై యున్నది. పింగళి సూరనార్యుఁడు తనయద్వితీయ కాల్పనిక శక్తితోఁ గూడిన యీ మహాకావ్యమునందు సుగాత్రీశాలీనులు, కలభాషిణీ మణికంధరులు, సరస్వతీచతుర్ముఖులు, రంభానలకూబరులు, అభినవకౌముదీసత్యాసురులు, మధురలాలసాకళాపూర్ణులు నను ప్రణయైకజీవుల వృత్తాంతములందు భిన్నశృంగారరీతులను ప్రదర్శించినాఁడు. అచట నొక్కొక్క సన్నివేశమొక్కొక్క జంటకుఁజెందిన ప్రత్యేక శృంగారమునకాటపట్టై యలరారినది. కాని విజయవిలాసమునందలి మూఁడు సన్నివేశములందును నాయికలు ముగ్గురైనను నాయకుఁడు మాత్రమొక్కఁడే ప్రథమ సన్నివేశములో నలూచి, ద్వితీయసన్నివేశములో చిత్రాంగద, తృతీయసన్నివేశములో సుభద్రయు నాయికలుగచిత్రింపఁబడినారు. ఈ మూఁడు ఘట్టములందును అర్జునుఁడే నాయకుఁడుగా చిత్రింపఁబడినాడు. అతఁడు దక్షిణనాయకుఁడుగా వర్ణింపఁబడినాడు. "తుల్యోఽనేకత్ర దక్షిణః: అనేకాసు నాయికాసు అద్వైష్యేణ స్నేహానువర్తీదక్షిణో నాయకః[1]" యని యాలంకారికులు దక్షిణనాయకలక్షణములను జెప్పియున్నారు అట్టులైన కృష్ణార్జునులిరువురును దక్షిణ నాయకులగుట విశేషము. మఱియు విజయవిలాస కృతిభర్తయు, దాక్షిణాత్యప్రభువర్యుఁడు, రసికాగ్రగణ్యుఁడునునైన రఘునాథనాయకుఁడు స్ఫురించునట్లర్జునుని చిత్రించుట మఱొక విశేషము.

ప్లక్షస్రవనువుపై గదుఁడర్జునునికడకు వచ్చి సుభద్రయొక్క యంద

1. విద్యానాథుడు—ప్రతాపరుద్రయశోభూషణము (నాయక ప్రకరణము, పే 18)

చందములను సాకల్యముగ వర్ణింప నర్జునునకామెపై ననురాగభావమేర్పడి నది. ఆమెను వివాహమాడఁదలచినాఁడు. ఆ సమయమునకతఁడు చేయవలసివచ్చిన భూప్రదక్షిణమతని మహోన్నత మానసికభావనకుఁగలిసివచ్చినది. ఆ యా...యాదృచ్ఛికముగ నతనికులూచీచిత్రాంగదలతో నేర్పడిన సమాగమములానుషంగికములు. ఈ మూఁడుసన్నివేశములకు సంబంధించిన త్రివిధనాయికామణుల నేకనాయకసూత్రబద్ధములుగావించుటలో వేంకటకవి చూపిన ప్రతిభ వేనోళ్ళఁబొగడఁదగినది

ఈ మూఁడు సన్నివేశములుమూఁడు శృంగారకథలుగా భావింపవచ్చును ఉలూచ్యర్జునుల సమాగమఫలముగ నిలావంతుఁడు సద్యోగర్భసంజాతుఁడైనాఁడు కాని యతఁడు మహాభారతసంగ్రామములో మరణించినాఁడు. ఉలూచి నాగకన్య అర్జునునిగాఢముగ ప్రేమించినది కాని యట్టి గాఢానురాగమతనికామెపైనున్నట్లు కానరాదు.

అనురాగము క్రమముగ వివిధదశలలో వృద్ధినంది చివరకు ఫలించునది కాని యేకకాలములో జనించి, పెరిగి ఫలంచునదికాదు. ఉలూచి మానవకాంత కాకపోవుట, ప్రణయఫలమైన కుమారుఁడు శాశ్వతముగ దక్కకపోవుట, రాజవంశముపై నామెప్రభావము కన్పట్టక పోవుట, దశాంతరమందెప్పుడు నర్జునుఁడామెను తలంపకపోవుట మున్నగు కారణములనుబట్టి యాశృంగారము వ్యర్థమైనదని భావించవచ్చును. ఉలూచీ ప్రణయదాహోపశమనమే దానిఫలము. ఆమె ప్రౌఢగా చిత్రింపఁబడినది. "స్మరమందీకృతవ్రీడా ప్రౌఢా సంపూర్ణయౌవనా[2]" అని యాలంకారికులు ప్రౌఢాలక్షణమును జెప్పియున్నారు. అనఁగా సంపూర్ణయౌవనముగల్గి, మదనాభిలాషచేనణపఁబడిన లజ్జగలది ప్రౌఢయని యభిప్రాయము. కనుకనే సిగ్గుదొంతరలనణచుకొని యాసక్తితోనామె యపరమన్మథునివలె గాంగసైకతస్థలినున్న యర్జునునిఁజూచినది

2. విద్యానాథుఁడు ప్రతాపరుద్రయశోభూషణము (నాయక ప్రకరణము పే. 25 శ్లో 56)

ఉ॥ గుట్టసియాడగప్పెచను గుట్టలపైఁబులకాంకురావళుల్
తెట్టువగట్టఁగోరికలు తేటలువెట్టఁగవేడుకల్ మదిం
దొట్టికొనంగ నచ్చెరువు తొంగలిఱెప్పల పీఁగనొత్తఁగాఁ
బెట్టిన దండతీయక విభిత మృగేక్షణ చూచెనాతనిన్.

అను పద్యములో నా చిలువచెలువ శారీరకమానసికపరిణామములతో నాసొగసుకానినిఁజూచిన విధము వర్ణింపఁబడినది.

ఉ॥ "కమ్మని జాళువానొరయఁగల్గినచెక్కుల చెక్కువాఁడు చొ
క్కమ్మగు జాతికెంపు వెలగాఁగొను మోవిమెఱుంగువాఁడు స
త్యమ్మగు రూపసంపద ధనాధిపసూనుని ధిక్కరించువాఁ
డమ్మకచెల్ల ! నా హృదయమమ్మకచెల్లదు పీసికియ్యెడన్4 "

అనియావీరవరుని విలాససంపదకు తానమ్ముడువోయినట్లు రసనిర్భర స్థాయిలో ప్రకటించినది.

"ఓమదవతీ నవమన్మథ ! యీ జగంబు పాతాళము,
నేనులూచి యనుదాన, భుజంగమరాజకన్యకన్5 "

అని యాసరసాంగి యాత్మపరిచయము గావించుకొని తానామోహా నాంగునిఁదెచ్చుటకుఁగల కారణము నతనితో

కం॥ సరిలేని విలాసముగని
వరియించిటఁదోడికొనుచు వచ్చితి నిన్నో
కురువీర ! వసింపఁగ నీ
కురువీర దృఢాంకపాళిఁగోరిన దానన్ "6

అని లజ్జారహితముగ, సవిలాసముగఁజెప్పినది.

ఆ॥ నువ్వుఁబువ్వు నవ్వు జవ్వనినాసిత
చివురుసవురుజవుడు మవిదమోవి

3: వి. వి, 1-61 ప 4. వి. వి. 1-70 5. వి. వి. 1-79 ప. ). 1.

మెఱుఁగు నుఱుఁగు గెఱుఁ గోబోఁకవతిపేణి
మెఱపునొఱపుఁ బఱపుఁదెఱవమేను.[7]

మున్నగు పద్యములలో నా నాగకన్యామణియొక్క కచకుచాద్యవయవ సౌందర్యము నరుఁడు మెచ్చుకొనిన తీరు వర్ణింపఁబడినది.

ఉలూచీసౌందర్యాతిశయమును జూచి యర్జునుఁడాశ్చర్యపడినాఁడు " రూపవిభ్రమరేఖాఖనులెందు నాగకన్యలేయని విందుము. నేడు నిక్క మయ్యెన్ జూడన్ 8 " అని యామె రూపరేఖలను మెచ్చుకొనినాఁడు. మఱియు భూలోకమునుండి నాగలోకమునకు తనను దెచ్చిన యామెసాహసము "ఎంత ఘనసాహసమింతులకు 9 " అని తన యాశ్చర్యమును బ్రకటించినాఁడు. మన సులో నామెపై మమతలు చెలరేగుచున్నను—

క॥ కాముకుఁడఁగాక వ్రతినై
భూమిప్రదక్షిణము చేయఁబోయెడివానిన్
గామించి తోడితేఁదగ
వా ? మగువ ః వివేకమించుకైనన్ వలదా ?10

అని గంభీరహృదయుఁడై యతఁడు ప్రశ్నించినాఁడు. అప్పుడామె "ఓ రసిక శేఖర ః యోజనరంజనైకలీలావహరూప ః యోగుతగుణా ః తగునా యిటులానతీయఁగన్11"? అని,

క॥ నినుగీతిసాహితీ మో
హనవాణులు చెపులువట్టి యాడింపంగాఁ
గనియుండి కాముకుఁడఁగా
నని పల్కిన నాకు నమ్మికొనె నృపాలా ః12"

7. వి. వి. 1-84 ప. 8. వి వి. 1-82 ప. 9. వి. వి. 1-77 ప.
10. వి. వి 1-89 11. వి. వి 1-89 ప. 12. వి. వి. 1-90

క॥ అతులితవిలాసరేఖా
కృతులన్ వలపించు యిటులఁ ద్రిభువనలీలా
వతుల నలయించుచేనా
వ్రతమనఁగ నీకు ? రూపవంచితమదనా ;13"

అనియు వలపులూఱ సధైర్యముగఁ బలికి –

తే॥ "చెఱకు విలుకొని బాఁకి వెఱచి నీదు
మఱుఁగుఁజేతిఁ జేపట్టి మనుపు నన్నుఁ
బ్రాణ దానంబు కన్నను వ్రతము గలదె ?
యెఱుఁగవే ధర్మపరుఁడవు నృపకుమార ,14"

ఏటికో తీయఁగఁ బంచదారవెనుతీయఁగఁ బల్కెదనునన్ద్వితీయగన్15 " మొదలగు ప్రణయవాక్పరంపరలతో ప్రబోధపూర్వకముగఁ దనవాంఛనభివ్యక్తముగావించినది. ఆమాటలు విని విజయుఁడు " ఈ యనుచితము తగునే ? పరసతి నెనయుట రాజులకు ధర్మమె ?" అని ధర్మోపదేశములు చేసినాఁడు ప్రౌఢగాఁగానవచ్చుచున్న యామె కన్యకాదేమోయను సంశయమతనిమనస్సులో పీకుచున్నది. అతని సంశయమును గుర్తించిన యాపాఁపపూపజవరాలు

" కన్నియఁగాని వేఱొకతెఁగాను మనోహరరూప ; నీకు నే
జన్నియవట్టియుంటి నెలజవ్వనమంతయు నేఁటిదాఁకనా
కన్నులయాన నావలపుకస్తురినామముతోడు నమ్ము కా
దన్నను నీదుమోవిమధువామృతమానియు బాసచేసెదన్16

అని తన కన్యాత్వమును, నిష్కల్మష ప్రేమాతిశయమును నామోహనాంగునకు బాసచేసి తెలిపినది. ఆమె వలపులోతులను పరీక్షింపనెంచి యతఁడు "ఫణిజాతివీవేను మనుజజాతి నన్యజాతిఁ బ్రవర్తించుట ధర్మమగునె 17 " ? అని యామెతో సంశయాత్మకముగ బలికినాఁడు

13. వి. వి. 1-91 ప. 14. వి. వి. 1-93 ప. 15. వి. వి. 1-94 ప.
16. వి. వి. 1-97 ప. 17. వి. వి. 99 ప

ఉ॥ "ఏమనఁబోయెదన్ దగులమెంచక నీవిటులాడఁదొల్లి శ్రీ
రాముకుమారుఁడైన కుశరాజు వరింపఁడె మా కుముద్వతిన్
గోమలచారుమూర్తి పురుకుత్సుఁడు నర్మదఁబెండ్లియాడఁడే ?
నీ మనసొక్కటే కఠఁగనేరదుగాని నృపాలకాగ్రణీ[18] "

అనియామె దృష్టాంతపూర్వకముగ తన ప్రణయాతిశయమును సమ
ర్థించుకొనినది ఆమె యనురాగగర్భితవాక్యములకతఁడు సంతసించి యామె
కోరికను మన్నింపనెంచి.

ఉ॥ "చక్కెరబొమ్మ ! నావ్రతము చందముఁదెల్పితి నంతెకాని నీ
చక్కఁదనంబుఁగన్న నిముసంబయినన్ నిలుపోపశక్యమే
యక్కునఁజేర్పక.................."[19]

అని సానుకూలముగఁబలికినాఁడు.

ఉలూచి కడుజాణ. తనవాక్చాతుర్యముతో నెదుటివారి నాత్మకానాను
గుణముగ వశపఱచుకొనఁగల చాకచక్యమామెకుఁ గలదు అర్జుననంతటి
ధీరగంభీరహృదయుని మాటలలో, చేతలలోను మెప్పించి యనుకూలుని
గావించుకొన్నది. అతనిని వలచి వలపించుకొన్నది.

అంకిలెఱింగిన యాసరసుఁడు "వివాహవిధిజ్ఞుఁడైన మీనాంకుఁడు
శుభైకముహూర్తము గావించినాఁడు శయ్యకురమ్ము[20]" అని యా మోహ
నాంగి నాహ్వానింప నామె తనహస్తకంకణకింకిణీ మనోహర నినాదములొలయ
నతని కరగ్రహణమొనర్చినది. ఆశుభసన్నివేశమును గాంధర్వపాణిగ్రహ
ణముగ భావింపవచ్చును. ఆ సరససమయమున నా రాగవతీహృదయములో
జరిగిన శారీరకమానసికపరిణామములు వర్ణనాతీతములు

ఉ॥ శయ్యకుఁదార్పఁగాఁదుఱుము జాఱెఁదనంతటఁజక్కదిద్దఁబోఁ
బయ్యెదజాఱె నయ్యెడ్డిరిపాటునఁగ్రక్కున నీవిజాఱె రా

18. వి. వి. 1-101 19. వి. వి. 1-104 ప. 20. వి. వి. 1-105 ప.

జయ్యెడ నవ్విలాసినియొయారముఁజూచికవుంగ లించెనో
నెయ్యెడ మెలెచూతురు, గ్రహింపరు జాణలుజాలుపాటులన్[21]

అని యా సరసమాగమసన్నివేశమును వేంకటకవి మనోజ్ఞముగ వర్ణించినాఁడు. ఆమెరతిపారవశ్యవిభ్రమములపారములు. ఆమె దూరమున నుండి యతనినిగూర్చికనినకలలు ఫలించినవి

తే॥ నాగరికముద్రగల మంచి బాగరియట !
నాగవాసములో వింతనటనల దఁట !
కులుకుగుబ్బలప్రాయంపుఁగోమలి యఁట !
వలచివలపింపదే యెంతవానినైన[22] .

అని యామెవ్యక్తిత్వమును చక్కఁగ చిత్రించినాఁడు. శృంగారము క్షణికసుఖదాయకముగా పర్యవసానము నొందినదిగాని యానాయికానాయకుల యుత్తరజీవితములతో పెనవేసికొని శాశ్వతస్థానము నాక్రమించుకొన లేకపోయినది.

విజయవిలాసములో వేంకటకవిచిత్రించిన శృంగార వైవిధ్యములో మఱియొక రమణీయభంగిమ చిత్రాంగదావృత్తాంతములోఁ గాన వచ్చును ఆ సన్నివేశమును శృంగారద్వితీయభంగిమగా భావింపవచ్చును. చిత్రాంగద ముగ్ధానాయికగా చిత్రింపబడినది. "ఉదయద్యౌవనాముగ్ధా లజ్జావిజితమన్మథా[23] " అని యాలంకారికులు ముగ్ధాలక్షణమును చెప్పియున్నారు. అనఁగా నుదయించుచున్న యౌవనముగల్గి, లజ్జచేత జయింపఁబడిన మదనాభిలాషకలదని యభిప్రాయము ఆమె పాండ్యదేశప్రభువయ్యుఁడైన మలయధ్వజుని ప్రియతనయ. ఆ ప్రముఖదేశమునకు రాజధాని మణిపురము, ఉలూచివలె వలచివలపింపఁగల ప్రౌఢత్వమీమెలోలేదు. ఉలూచి యచ్యుతుని వరించి, తానేస్వయముగ తనప్రియుని వెదకితెచ్చుకొని సంగమసుఖము నను

---

21. వి వి. 1-107 ప. 22. వి. వి. 1-110 ప.

23. విద్యానాథుఁడు-ప్రతాపరుద్రీయము (నాయకప్రకరణము, పే 25, శ్లో॥56)

భవించినది. అర్జునుఁడే చిత్రాంగదనుఁజూచి యామె యపూర్వరూపరేఖావైభవమునకాశ్చర్యపడి మోహాకులచిత్తుఁడైనాఁడు.

తన నగరమునకువచ్చిన యర్జునునకుఁ మలయధ్వజుఁడు గొప్ప విడిదినేర్పఱచి, కానుకలర్పించి, విందులనేర్పాటుచేసినాఁడు. వీరవరుఁడు, మోహనాంగుఁడునైన యర్జునుని తనయల్లునిగఁజేసికొనఁగోరి యారాజేంద్రుఁడా యేర్పాట్లన్నియుఁజేసినాడు.

మలయధ్వజవంశమునకు మూలపురుషుఁడు ప్రభాకరుఁడు. ఆమహాత్ముఁడు సంతానముకొఱకీశ్వరుని గూర్చి తపస్సుచేయఁగ నావంశజులకు ప్రతితరము నందొక్కొక్క తనయుఁడు గల్గునట్లు పరమేశ్వరుఁడు వరమిచ్చినాడఁట. తద్విరుద్ధముగ మలయధ్వజునకు మాత్రము కూతురు గలిగినది ఆమెను తగిన వరునకిచ్చి వివాహముచేసి, యామెకుఁగల్గు కుమారునకు తన పాండ్యరాజ్యాధికారమప్పఁజెప్పవలెనని యతనియభిలాష. వెదుకఁబోవు తీగ కాళ్ళకుఁదగిలినదన్నట్లు తన నగరమునకు విచ్చేసిన యర్జునునిఁ జూచి యారాజోత్తముఁడు సంతసించినాఁడు. అతనినే తన యల్లునిగఁజేసికొనఁగోరినాఁడు, అర్జునుఁడుగూడ సౌందర్యరాశియైన చిత్రాంగదను జూచి యామెను వివాహమాడఁ గోరినాఁడు.

1) తే॥ ఈ వెలదియొడల్ పైఁడిలో వెలంది
యీ నెలంతలలాటంబు లేనెలంత
యీ సుపాణిరదశ్రేణియే సుపాణి
యీబిడారు మృగిమదశ్రీబిడారు[24].

2) క॥ వాతెఱకు నమృత మేతుల
మేతులకింపులపిసాళిమిసిమికిఁ గ్రొమ్మిం
చేతుల చేతులకబ్జము
లేతుల రేతులవెలందు లీచెలితులయే ?[25]

24. వి. వి. 1-130 ప.   25. వి. వి. 1-131

3) క॥ కన్నెనగుమోము తోడన్
బున్నమచందురుని సాటిఁబోలుపవచ్చున్
నెన్నుదురు తొదమార్కొని
యున్నందఱిఁజూడ రేకమోవక యున్నన్ 26.

4) శా॥ చెండ్లాగుబ్బలు ; జాళువాతళుకులా చెక్కుల్లడాల్ ; సింగిణీ ;
విండ్లాకన్బొమ ; లింద్రనీలమణులా వేణీచయల్ ; తమ్మిలేఁ
దూండ్లాబాహువు ; లింతచక్కఁదనమెందుం గానమీజవ్వనిం
బెండ్లాడంగలవాఁడు చేసినదిసుమ్మీ భాగ్యమూహింపఁగన్ 27.

అని యామె యందచందములను మెచ్చుకొనినాఁడు.

మఱియు "........................
.........ఈ వినూతనతనూసౌందర్యమీక్షించినన్ దనుఁ
దామెచ్చు విధాత చిత్తమున నీతన్వంగితోఁ బోల్పఁగా
నెనలేదెచ్చటఁజూడ మా తుహినభూభృత్సేతుపర్యంతమున్ 28.

అని యాత్మసఖుడైన విశారదుఁడు చెప్పఁగా నర్జునునకనురాగమామెపై మఱింత పెరిగినది. అలఘుకులగుణశీలములుగల కన్యగనామె చిత్రింపఁబడినది. ఆమెను చేఁబట్టుటకర్జునుఁడు మలయధ్వజభూపాలునితో చెలిమిచేయఁ దలచినాఁడు. అతని వాంఛాసిద్ధికనుకూలముగఁగొన్ని శుభశకునములైనవి "మామకాగమన వార్తఁదెలుపుము 29" అను నర్జునునిపలుకులోఁగల శ్లేషను బట్టి యతఁడు మలయధ్వజునిమామగా భావించినట్లు, చిత్రాంగదను వివాహమాడనిశ్చయించుకొనినట్లును దెలియుచున్నది. అర్జునునికోరికపై విశారదుఁడు పెండ్లిరాయబారియైనాఁడు. అట్లే మలయధ్వజుఁడు గూడ "నాదు హితంబొనఁగూర్చి. నాదుహితం బెండ్లిసేయు నరనాథునకున్ 30" అని విశారదునర్థించినాఁడు. అట్టి సదవకాశమునకే యర్జునుఁ డెదురుచూచినాఁడు.

26. వి. వి. 1-132 ప. 27. వి. వి. 1-134 ప. 28. వి. వి. 1-135 ప.
29. వి. వి. 1-52 ప. 30. వి. వి. 2-10 ప.

శా॥ పంకేజాతములన్ దిసంతులడచున్ బాలామణీపాదముల్
వంకల్ దీర్చు మనోజసాయకములన్ హెల్చాపులేణాంకునిన్
శంకల్ నేయు మొగంబు జక్కవకవన్ జక్కట్లుదిద్దున్ గుచా
హంకారంబు మదాళిమాలికల నూటాడించు వేణీరుచుల్[31].

కం॥ హరిపతి నడుమునకోడెన్
గరువపునడకలకునోడె గజపతి యిఁక నీ
నరపతి లోనగుటరుదే
వరవర్ణిని మెఱుఁగుహెడిహెల్చాపులకున్[32].

అని యతనియతిశయమైన వలపునకుఁ దగినట్లుగ నామెను వేంకట కవి సాంగోపాంగముగ సరసశైలిలో వర్ణించినాఁడు. విశ్వేశ్వరానుగ్రహము వలన వివాహశుభముహూర్తము నిశ్చయమైనది. అనుకొనిన రీతిలో నాయి రువురికి నతివైభవముగ వివాహము జరిగినది. ఒక పెద్దమనిషిమధ్యవర్తి త్వములో, కన్యాప్రదాతయొక్క యనుమతిపై, పెద్దలసమక్షములో, సమం త్రకముగ జరిగిన యాచిత్రాంగదార్జునుల వివాహమును బ్రాహ్మ్యముగ భావింపవచ్చును.

ఉ॥ చక్కని కన్యకామణికిఁ జక్కనివాఁడగు ప్రాణనాథుఁడున్
జక్కనిశోభనాంగునకుఁ జక్కని యింతియుఁగల్గుటబ్బురం
బెక్కడ నిట్టులుండవలదే రతిదేవికిసాటివచ్చుఁబో
యిక్కనకాంగి మన్మథునకీడితఁడీడితరూపసంపదన్[33].

అని పెండ్లికివచ్చిన పెద్దలాయనురూపదాంపత్యమును కొనియాడిరి. ఆ పెండ్లిముచ్చట నైదాఱుపద్యములలో వర్ణించినాఁడు. పదిపద్యములలో పడక టింటిముచ్చట్లను మనోహరముగవర్ణించినాఁడు. నవమోహనాంగియైనచిత్రాం గదను పడకటింటిలోఁజూచి యర్జునుఁడే మోహాతిశయముతో ననేక మనోవి కారములను ప్రదర్శించినాఁడు. "కానుకగాఁగనిత్తుబిగికౌగిలి నల్లవెకీరవాణి[34] అని-"చక్కెరవింటి దేవరప్రసాదముఁగైకొనుమిప్పుడిందమోచక్కెరబొమ్మ[35]"

1. వి.వి. 2-16 ప 32. ,, 2-17 ప. 33. ,, 2-18 34. ,, 2-28 ప 35. ,,2-293

అనియు నపరిమితాసక్తితో నతఁడు పలికినాఁడు. ముగ్ధకు సహజమైన సిగ్గరి తనముచేనామె యతనిలో మాట్లాడలేకపోయినది. కాని యామెకామానితా కారునిపై మమత లేకపోలేదు. మౌనముగనేయుండి ప్రియుని యెడిలో పరవశురాలైనది. అనుపమాలింగనసుఖము ననుభవించినది.

ఉ॥ "డాసిన నింగితంబెఱిఁగి డాయఁగనేరక తత్తరంబునన్
జేసిన సేతకున్ బదులుసేయనెఱుంగక మేనుమేనుతా
రాసినయంతనే కళలు రంజిలుకౌఁగిట బాలయుండెఁబో
యీసుఖమింతయంత యననైనదిగాదుగదయ్యక్రీడికిన్[36]"

అను పద్యములో నాయికుపురి సంగమసన్నివేశము చక్కఁగ చిత్రింపఁ బడినది. అర్జునుఁడు మలయధ్వజునిల్లరికపుటల్లుఁడైనాఁడు. చిత్రాంగదతో నంగజరాజ్యవైభవసుఖాంబుధి నోలలాడినాఁడు. మధురానురాగఫలితముగా వారికి బభ్రువాహనుఁడను కుమారుఁడు గలిగినాఁడు. తన కుమారుని మల యధ్వజునకు వంశకర్తగనిచ్చి యర్జునుఁడుమరల తీర్థయాత్రను కొనసాగిం చినాఁడు. ఇట్టిశృంగారాత్మకసన్నివేశము మలయధ్వజుని మాన్యవంశ మును నిలఁబెట్టుటకు, చిత్రాంగదను పుంగళాంగినిగావించి మాతృమూర్తిగఁ జేయుటకు, విజయుని మనోవాంచాసిద్ధికిని మూలకారణమైనను నర్జునుని శారీరకమానసికశక్తులపైఁగాని, యతనివరవంశముపైఁగాని ప్రభావపూర్వక శాశ్వతముద్రనువేయఁజాలక పోయినదని చెప్పవచ్చును.

కావ్యమధ్యభాగములో వేంకటకవి యొక విచిత్రశృంగారమును సృ జించినాఁడు. అదినందాద్యప్సరస్సలకు చెందినది. నంద, లలిత, పద్మ, సౌర భేయి, సమీచి యను నైదుగురచ్చరలేమలొక వనములో —

మ॥ విహరించున్ మలయానిలంబిచటఁ దావింజిల్కి నెమ్మేనియా
విహరించున్ బికనాదముల్ చెలికిఁగావించుం జవుల్ పోదమా

36. వి. వి. 2-34 ప.

సహకారాళి పదంబుఁజూడఁ గవయస్వాహాళి వాటిల్లెడున్
సహకారాళిపదంబుఁజూడఁగవయస్వాహాళి యౌనేగదా ! 37

అనుచతురోక్తులతో పరస్పరము మేలములాడుచు, విహరించుచు నొక చోట తపస్సుచేయుచున్న యొకమునీంద్రునికడ కేగి, యతనితపస్సునకు భంగకరముగ తమ నెఱికురులు, కేలుఁజిగురులు, విఱిచన్నులు, విరివి కన్నులు, నింపుకకౌనులు, చిఱుఁదొడలు, నంచనడలు, మెఱుపులయొఱపులు ప్రదర్శించుచు నాట్యమాడఁజొచ్చిరి. కానియామదివతుల సయ్యాటలకు లొంగక యామునివర్యుఁడు కోపరసావేశరూక్షకుటిలేక్షణుఁడై యాదేవ కాంతలను మకరులగునట్లు శపించినాఁడు. వారాశాపమును భరింపలేక దీన వదనలై తమ ననుగ్రహింప వేడినారు. ''వారు మొసళ్ల రూపములలో నున్నపుడు తాము పట్టుకొనిన యేవీరుఁడు వారిని బయటికి విసరునో యావీరునివలన శాపవిముక్తి కలుగును'' అని యామునీంద్రుఁడా వనితలకు శాప మోక్షమును ప్రసాదించినాఁడు, ''వారు దక్షిణసముద్రసమీపమున నున్న పంచతీర్థములందు గ్రాహరూపములుదరించి నూరేండ్లున్న తరువాత తీర్థయాత్రలుచేయుచు నర్జునుఁడచ్చటికివచ్చి వారికి శాపవిమోచనముఁగలిగించు''నని నారద మునీంద్రుఁడు వారి శాపవిమోచనవిషయమును వివరించి చెప్పినాఁడు ఆ మహనీయుఁడనుగ్రహించిన విధముగనే సౌభద్రతీర్థమునందు మకర రూపములనున్న యాయప్సరస్స్త్రీలర్జునునివలన శాపవిమోచనమునొందిరి. స్వరూపము నొందిన నంద యాక్రిందివిధముగ వర్ణింపఁబడినది.

ఉ॥ వట్రువగుబ్బలున్ దొగరువాతెఱయున్ జిఱునవ్వువెన్నెలల్
త్రొట్రిలు ముద్దుమోమును దళుక్కను మేనువెడందసోగయై
వట్రిలుకన్నుదోయి నిడువాలుఁగురుల్ బటువౌపిఱుందులేఁ
గుట్రనుసుంగవున్ గలుగు కోమలియై యది ప్రోల నిల్చినన్ 38.

ఆమెను జూచి యర్జునుఁడచ్చరలేమయో లేక రతిదేవియో యనుకొనినాఁడు. ఆమె ముఖముతో చంద్రుఁడు సరిపోలఁడని, చనుగవకు బంగరు

37. వి. వి. 2-53 ప, 38. 2-46 ప.

గట్టొకమెట్టు తక్కువయని. నడుము పిడికిటిలో నణఁగునని, కన్నులు బేడి సమీలను గడకొత్తునని, జడయందము పాఁపజాతినిమించి యున్నదనియు నెంచినాఁడు. మిగిలిన లలితాద్యప్సరసలును నందవలెనే శాపవిముక్తినొంది విజయునెదుట నిలువ "వారిచెలువమువంటి చెలువమునేగణికలలోనైన నున్నట్లు తాను కలలోనైన చూడలేదని, వారు సకలలోలాక్షుల యందచంద ములను లోఁగొని చంద్రకళలవలె భాసించుచున్నారు" అని వారిసౌందర్యాతి శయమును మెచ్చుకొనినాఁడు. ఆ యచ్చరలేమలుగూడ నామోహనాంగునిట్లు ప్రశంసించినారు.

1. తే॥ సకలసద్గుణసౌందర్యసారమూర్తి
యనియు మును నారదుఁడుదెల్పవినియయుంటి
మిమ్మహాభుజునిప్పుడో కొమ్మలార !
కంటిమిగదమ్మ కన్నులకఱవుదీర[39]

2. తే॥ బాపు ! వలరాజుగర్వంబుఁబాపురూపు
బాఁగు ! రేరాజుకళల మించాఁగురేఖ
మేలు ! నలరాజునోయగమేలు చెలువ
మమ్మ ! యీ రాజుప్రతిగానమమ్మ యెచట[40]

3. తే॥ అందఱును నింద్రనీలనిభాంగుఁడందు
రింద్రనీలనిభాంగుఁడే యితఁడు గాకఁ
దంద్రిఁబోలిన రూపుమాత్రంబె కాద
యారె ! భూలోకదేవేంద్రుఁడు[41]...."

4. తే॥ "నీకు కళ్యాణమౌ రమణీయరూప !
నీకు వంశాభివృద్ధియౌ నృపకలాప !
నీకు జయముగు సాహస నీతి భరిత
నీకు సామ్రాజ్యమౌ మహనీయ చరిత ![42]"

39. వి. వి. 2-72 ప. 40. వి. వి. 2-75 ప. 41. వి. వి. 2-75 ప. 42. 2-73 ప.

అని యా దేవసుందరీమణులతనిని హృదయపూర్వకముగ నాశీర్వదించినారు. సుస్నిగ్ధహృదయులైన యా దేవకాంతాశిఖామణుల యాశీర్వచన ప్రభావమువలనే కాఁబోలుననంతరదశలో సుభద్రార్జునులకళ్యాణము, వారి తనయుఁడైన యభిమన్యునివలన కురువంశాభివృద్ధియును జరిగినవి. ఆయప్సరస్స్త్రీలకర్జునుఁడపూర్వసౌందర్యరాశిగఁగన్పట్టి వారిమనస్సులనెంతగా నాకర్షించినను సామాన్యాప్సరసలవలెవారు వికారములు ప్రదర్శించి యక్రమ మార్గములకు దిగలేదు. మాటలందు, చేతలందును గొప్పనిగ్రహమును ప్రదర్శించిరి. మమతలున్నను బయటపెట్టలేకపోయిరి. దానికి బలీయకారణము గలదు. అంతకుపూర్వమే వికారములు ప్రదర్శించి మునిశాపగ్రస్తలై చాలకాలము నికృష్టముగనుండి, యప్పుడే యా మహానీయుని యనుగ్రహమువలన తాముశాపవిముక్తి నొందినారు. తిరిగియట్టిదురవస్థవచ్చునేమోయను భయసంశయములొకవైపున పీడించుచుండ, వేఱొకవైపున తమను రక్షించిన యా పావనమూర్తిపై గౌరవభావమతిశయించుచుండ వారు మోహవిభ్రమములను ప్రకటింపలేకపోయిరి. అర్జునుని హృదయముఁగూడ తాత్కాలికముగా వారి రూపవిలాససంపదలచేతకొంత యాకర్షితమైనను నన్యాయత్తమైయున్నకారణమున నతఁడు కొంతనిగ్రహమును ప్రదర్శించినాఁడు. ఆ నిగ్రహమే యచ్చట పోషింపఁబడనిచో నర్జునుఁడు స్త్రీలోలుడుగా పరిగణింపఁబడెడివాఁడె. కవిగూడ నచ్చట గొప్పసంయమనమును ప్రదర్శించి యౌచిత్యమును పోషించినాఁడు.

స్థూలదృష్టితోచూచినచో విజయవిలాసమునందీయప్సరస్స్త్రీల వృత్తాంతమప్రస్తుతముగా, ననవసరముగానుతోచును. కాని సూక్ష్మదృష్టితోపరిశీలించినచో నాసన్నివేశమీప్రబంధమునకు జీవఁగఱ్ఱయని తేటపడును. "అర్జునుఁడీ ప్రబంధములో నాయకుఁడు," అనుటకుఁదగిన మహాసత్త్వగాంభీర్యదాక్షిణ్యావికత్థనత్వాదినాయకగుణము లీసన్నివేశములోనే ప్రదర్శింపఁబడినవి. మరియు నిది సుభద్రాకళ్యాణమునకు నాంది యనఁదగియున్నది.

"నీకు కళ్యాణమౌ రమణీయరూప !
నీకు వంశాభివృద్ధియౌ నృపకలాప !
నీకు జయమగు సాహసనీతిభరిత !"

మొదలగు నభిప్రాయగర్భితవాక్యములాయభిప్రాయమున కుపజీవకములు. కృతజ్ఞత, నిగ్రహము అను కవచము లు తొడుగుకొనిన శృంగారమది. మొత్తముమీద నాశృంగారము నట్లు తగినమోతాదులలో నరిపెట్టి వెంకటకవి నాయకునకుత్కర్షను గలిగించినాడు.

విజయవిలాసకావ్యపరమపట్టమైన సుభద్రార్జునుల ప్రణయవృత్తాంతములో ప్రదర్శింపబడిన సింగారపు తీరుతెన్నులు చిత్రములైనవి. సుభద్ర మధ్యానాయికగా చిత్రింపబడినది. "లజ్జామన్మథమధ్యస్థామధ్యమోదితయౌవనా"43 అని యాలంకారికులు మధ్యాలక్షణమును జెప్పియున్నారు. ఉదయించిన యౌవనముగలిగి, లజ్జయు, మదనాభిలాషయును సమానముగాఁ గలది మధ్యయని యభిప్రాయము.

సుభద్ర దేవకీవసుదేవుల ప్రియతనయ. శ్రీకృష్ణుని కనుంగు సోదరి. అర్జునకు మేనమఱదలు. లోకోత్తరసౌందర్యాతిశయముచేత, గుణాతిశయముచేతఁ బంధుత్వపుఁబాహర్మ్యపెంపుచేతను నా నవమోహనాంగి యర్జునుని సదయహృదయమునాకర్షించినది. గదునివలన సుభద్రాసౌందర్యాతిశయమును వినినప్పటినుండియునర్జునుని మనసామెపై లగ్నమైనది. ఆమెను వివాహమాడఁదలచి తదనుకూలసమయమునకెదురు చూచుచున్నాఁడు. ఇంతలో నదృష్టవశమున నతఁడు భూప్రదక్షిణము చేయవలసివచ్చినది. ఆ తీర్థయాత్రాముఖ్యఫలము సుభద్రార్జునుల వివాహము. పాండవవంశోద్ధారకుఁడైన యభిమన్యుఁడు పుట్టుటకావివాహము జరుగవలసియున్నది.

సుభద్రార్జునుల వివాహసన్నివేశమొక విచిత్రనాటకమనఁదగియున్నది. ఆ మహానాటకమునకు శ్రీకృష్ణుఁడే యజ్ఞాతసూత్రధారియైనాఁడు. యతులకు యాదవులు విధేయులగుదురని, యితరులు తన్నెరుగకుండవలయుననియు

భావించి యర్జునుఁడాత్మవాంఛాసిద్ధికొఱకు సన్న్యాసివేషమును ధరించినాఁడు. ఇదియొక విచిత్రసన్న్యాసత్వము అంగనలపొందురోసి సన్న్యాసియగుట లోక సహజము. తద్వ్యతిక్రమముగ నర్జునుఁడంగనామణిసిఁగోరి సన్న్యాసియైనాడు. అతఁడట్టి కపటవేషధారణమొనర్చుటకు బలీయకారణములు రెండుగలవు. వచ్చినవాఁడర్జునుఁడని తెలిసినచో సుభద్ర నునుసిగ్గుదొంతరల ప్రవాహముచే నతనికి కన్పట్టదు. కన్పించనిచో నామెరూపలావణ్యములను హావభావాదులను ప్రత్యక్షముగ నతఁడు చూచుటకవకాశముండదు, ఆమె కన్పించినను ధైర్యముగ నతనితో మాట్లాడలేదు వీలుకుదిరి మాట్లాడినను మనోనురాగ మును మఱియు తనకనుకూలుఁడుకాని బలరాముడు తనను జూచినచో తనకోరికను నెరవేరనివ్వఁడు ఈ ప్రయోజనముల న్నియు నెరవేరవలెనన్న తాను వేషమును మార్చుకొనవలయునని నిశ్చ యించుకొని యతఁడు యాదవుల యమాయకవిశ్వాసమునకుఁదగినట్లు కపట సన్న్యాసివేషమున ద్వారకానగరమునకేగినాఁడు. ఒక పనివలన రెండుప్రయో జనములు సిద్ధించినవి. కృష్ణునియాదేశానుసారమతఁడు రైవతకారామసీమ యందు బసచేసినాడు. కృష్ణునికోరికపై యాదవులురైవతకాచలోత్సవ సన్నాహములు చేసినారు. ఆ మహితోత్సవమునకు యాదవసుందరీమణు లందరువిచ్చేసినారు. వారితోఁగలసివచ్చిన సుభద్రయొక్క యతిలోకసౌందర్య మును చూచియతడు పరవశుఁడైనాఁడు.

ఉ॥ "చూడమె దేవతాసతుల శోభనకాంతివిలాసవైఖరుల్ ?
చూడమె నాగకన్యకల లోకమనోహరరూపసంపదల్ ?
చూడమె మర్త్యకామినుల సోయగమున్ దమకంబు పెల్లుబ్బీ
పాడఁగ? దీనివంటియొరపైన మిటారిని జూడమెందులన్?44

ఉ। కన్నులు దీర్ఘముల్ నగుమొగంబపురాతలకట్టు తమ్మిపూ
పున్నమ చందమామలకు బొక్కిలి చక్కదనంబుచెప్పఁగా
నున్నదె? మేలుబంతులు పయోధరముల్ మఱికౌనుసున్న యౌ
నెన్నక కెక్కు వాతఫలమివ్వరవర్ణినికిన్ నిజంబుగన్ 45

44 వి. వి 2–102 ప, 45. వి వి. 2–104 ప.

తే॥ భ్రమరక మనోహరంబౌటఁబద్మమగును
తారకాహృద్యమగుట సుధానిధియగు
రెంటి జిగతాలు మోమున నంటియుంట
నబ్జముఖియంట లెస్స యీ యలమఁబోణి46

మొదలగు పదిపద్యములలో నర్జునుఁడు సుభద్ర యందచందములను ప్రశంసించినట్లు చేమకూరవేంకటకవి జేగీయమానస్థాయిలో వర్ణించినాఁడు.

క॥ "అరచందమామ నేలిన
దొరగానెన్నుదురు నెన్నుదురు ఓత్తరికిన్
బరువంపు మెల్ల మొగ్గలఁ
దొరగాఁబల్కుదురుఁబల్కుదురు జవ్వనికిన్47

క॥ "అలకలు నీలములధరం
బల పగడము గోళ్ళు ముతియంబులు48......"

అని యనురాగాతిశయముచే నాసుందరాంగి సంతను ముందే పరోక్షముగ ప్రశంసించిన యర్జునుఁడా సౌందర్యాశిని ప్రత్యక్షముగఁజూచి యానందపరవశుఁడై మెచ్చుకొనుటలో నాశ్చర్యపడవలసిన యవసరములేదు.

బలరాముఁడా కపటత్రిదండిసిఁజూచి యుత్తమయతిగా భావించి యతనిని ద్వారకానగరమునకాహ్వానించినాఁడు. తన ముద్దుచెల్లెలగు సుభద్రనా సన్యాసికి సేవలొనర్ప నియమింపుమని కృష్ణునకాదేశించినాఁడు.

తే॥ "వలయువారును జక్కనివారు మీరు
మనసుమర్మంబులేమియు మనకుఁదెలిసి
యున్నయదిగావు సేవకునుపఁదగునె
కన్నె నదియేమొ తెలిసికొనుము49......"

46. వి. వి. 2-105 47. వి. వి. 2-78 ప. 48 వి. వి. 2-79 ప.

. అని కృష్ణుఁడు తనయన్న ముంగాళ్లకు బంధము వేసినాఁడు. ఆ మాటలలో కృష్ణునాశయము ధ్వనించుచున్నది.

క॥ "వీరు మహాత్ములు ఘనులప
చారంబగు నిట్టులాడ సంయములకు మున్
గోరిక వెలయఁగఁగన్యలె
గారా శుశ్రూష సేయఁగాఁదగువారల్ 50 ? "

అని బలరాముఁడు తన యభిప్రాయమును సమర్థించుకొనినాఁడు. అన్న యాజ్ఞచొప్పున సుభద్ర యా కుహనాసన్యాసికి సేవలు సేయఁ బొచ్చినది.

ఉ॥ "గెంటని ప్రేమ మేను పులకింపఁగిరీటికిఁబూలొసంగి వా
ల్గంటిగిరుక్కునన్ దిరుగ కమ్మనికస్తురితావి గ్రమ్ముకో
గింబెపుగబ్బిగుబ్బలజిగిన్ వెలిఁజిమ్మ నొయారిజిల్గు ప
య్యంటచెఱంగొకింత తనయంగముపైనటుసోఁకి సంతటన్"51

అను సహజసుందరవర్ణనమునుబట్టి యామెకొంగు తగులుటయే కోటివేలుగ నతఁడు భావించినాఁడు.

ఆమె బేడిసమీలవంటి చూపులను తలఁచుకొనుచునతఁడు జపమొనర్చినాఁడు. "చేసినదిజపము మఱివేసినది గాలము52" అనుమాట యతనిపట్ల సార్థకమైనది. ఆ కాంతయొక్క కెమ్మోవిఁజూచియతఁడు జపావృత్తి విమఱచినాఁడు. ఆమెలేఁగౌనుజూచి హరిస్మరణ మఱచినాఁడు. ఆ కృత్రిమ త్రిదండివేషమొక్కటితప్ప మిగిలినవన్నియు మఱచినాఁడు. అన్నయొక్క యాదేశానుసారమాకపటసన్యాసికిసేవలుచేయుచున్న సుభద్ర యొకనాఁడత నినిఁగూర్చి తనమనస్సులో నిట్లనుకొనినది.

ఉ॥ "వాసవి రూపచిహ్నముల వార్తలు మున్వినియుండుదున్గదా!
యాసొగనెల్లనేడు కననయ్యెడు వీరలయందు; నైన స

50. వి. వి. 2-120 51. వి. వి. 2-134 ప. 52 వి.వి. 2-135 వ

న్యాసమసంగతంబగు; మహాసుకుమారుఁడు రాకుమారుఁడా
గాసికినోర్చునే ? కలరెకా మఱి మానిసిఁబోలు మానిసుల్53"

కుహనావేషములోపల తాండవించుచున్న యతని సహజరూపరేఖా విలాససంపదను జూచి తాను విన్నరూపచిహ్నములనుబట్టి యతనినర్జునునిగ భావించినది గాని యామె యమాయకురాలు, అనుభవహీనయునైన, కారణమున నాభావమును నిలఁబెట్టుకొనలేక మానిసినిఁబోలిన మానిసియుండ వచ్చునని తనలేతహృదయమును సమాధాన పుచ్చుకొనినది.

అతఁడు మమతతో నామెను "బంగరుకుండతో జలముతెమ్మ, మంచి సుమములుదెమ్మ, బాగైనకొమ్మఫలములుదెమ్మ" అని యను రాగము స్పందించునట్లు వ్యంగ్యస్ఫూర్తితోమాట్లాడఁగనట్టి మాటల యాంతర్యమును గ్రహింపలేని ముద్దరాలామె. "ఓ తరుణీ ! తుమ్మెదవలెనున్నది యిటురమ్మ" అని యామె నెఱికొప్పును నిమిరి కొంతస్పర్శసుఖముననుభవించి. "నీవలంకరించుకొనిన నల్లకలువనుజూచి తుమ్మెదయని భ్రమపడితిని" అని చమత్కారముగఁబలికి తన హృదయదౌర్బల్యమును కప్పిపుచ్చుకొనినాఁడు. తానెవతెకోసము మారువేషములో వచ్చినాఁడో యా సౌందర్యరాశియే తనకు సేవలుచేయుచుండుట తన భాగ్యవిశేషముగ భావించినాఁడు. అదియేకాంతసేవయైనందులకు మఱింతసంతసించినాఁడు. ఆమెను జూచిన నాటినుండి యారసికాగ్రగణ్యుని హృదయములో నారాటము పెరుగఁ జొచ్చినది

మ॥ ఒడలుప్పొంగు నొయారిఁ జూడ జవరాలొద్దన్ మెలంగన్ గగు
ర్పొడచున్ ముద్దుఁగుమ్మ గంధకుసుమంబుల్ చేతికందిచ్చున
ప్పుడు వ్యాపారములన్నియున్ మఱచు నప్పూఁబోణి రాకుండినన్
గడిసేపౌక్క...హాయుగంబు ఖరణిన్ గ..ప్పట్టు రాచూలికిన్54

అ... పద్యములో నతని యెదలోరొదచేయుచున్న వలపుపెంపు

53. వి. వి. 2-139 54. వి. వి. 2-149

సూచింపఁబడినది. అర్జునుండామెనేతలంచుచు, నామెతోడిదె లోకముగ నెంచుచు ననురాగభావాతిశయముతో కాలయాపనచేయఁజొచ్చినాఁడు.

శా॥ కంగుల్ తీర్చిన పైఠిణీఱవిక చన్కట్టంటి రాణింపఁగా
చెంగల్వల్ నెఱికొప్పునందునొఱపై చెంతన్ గుబాళింపఁగా
బంగారందియ ముక్కునంగమచిపైపై నంచ యెల్గింపఁగన్
సింగారంబగు ముద్దుఁజిల్క తనకున్ జేదోడువాదోడుగా[55]

అను పద్యములో నామె శృంగారరసాధిదేవతయాయనునట్లు చిత్రింపఁబడినది. జగన్మోహనవిగ్రహయైనయామె యారాజోత్తముని మనస్సును పూర్తిగదోచుకొనినది. "త్వరలోనీకు వివాహముకాఁగలదు" అని జోస్యము చెప్పినాఁడు. ఆమె యుత్సుకతతో.

క॥ "మీరింద్రప్రస్థముఁగని
నారా ? పాండవులఁజూచినారా ? సుఖులై
వారందఱునొకచో ను,
న్నారా ? వీరాగ్రగణ్యు నరునెఱుఁగుదురా[56] ? "

అని యర్జునునిగూర్చి ప్రాస్తావికరీతిలో నడిగి యావీరవరునిపై తనకుఁగల యనురాగాతిశయమును సూచించినది. పాండవులలోనరునొక్కనిఁ గూర్చియేయడుగుట యారాగసంపత్తికి నిదర్శనము.

వలపుబరువు మోయలేక, తన నిజస్థితియామెకు తెలియకుండ మారువేషమున నుండలేక, మదనుని పదునైనబాణముల తాకిడికోర్వలేక యర్జునుఁడామెతో.

క॥ "ఆ కవ్వడి యతివేషముఁ
జేకొనియున్నాఁడు నీకుఁజెంతనె యెన్నా
ళ్లో కలడువచ్చి యింకను
నీ కీలకమించుకైన నీవెఱుఁగవుగా ? [57]

55. వి. వి. 2-157 ప. 56. వి. వి. 2-163 ప. 57. వి. వి. 2-174 ప.

అని యాందోళితహృదయుఁడై చెప్పఁగా నాసుందరాంగి సిగ్గున దిగ్గున లేచిపోయినది. "ఏలపోయెదు. నిలు నిలుము" అని యామె కరాంబుజము నొడిసిపట్టినాఁడు. ఆ మోహనాంగుని సుకుమారహస్తస్పర్శవలన నామెకుచప్రదేశము గగుర్పొడిచినది. లలాటపట్టికపై చెమటలు పుట్టినవి. కట్టుకొంగు కొంచెము దిగజారినది. అట్టిమోహపారవశ్యముననున్న యామెతో ''నన్ను గాంధర్వవిధిని వివాహమాడుము" అని సానునయముగ నర్థించినాఁడు. ఆ ప్రేమమయమూర్తులిరువురు నొకచిలుకను మధ్యస్థుఁడుకొని యాత్మభావాతిశయములను నివేదించుకొనినారు.

''ఈ చంద్రాననన్ గూర్చినన్ బ్రతికింపంగదె ముద్దుఁ
గీరమ సుధాబంధూభవద్గీరమా ! 58''

అని యర్జునుడామెతోడిదే తనబ్రతుకున్నట్లు తన యనుపమానురాగమును బ్రకటించినాఁడు. తదనుగుణముగ నామెకూడ.

తే॥ "మేరలా యివి మీయంతవారలకును ?
బెద్దలున్నారెఱిఁగి వారె పెండ్లిసేయఁ
గలరు వేగిరపాటింత వలదటంచు
విన్నపముచేయరాదె యోచిన్నచిలుక59"

అని సరసోక్తులతో హృద్గతభావసూచన చేసి తాత్కాలికముగ తప్పించుకొలినది. భారతీయసంప్రదాయబద్ధులైన యువతీయువకుల ప్రథమసమాగమస్థితిగతులారీతిగ నుండుట సహజము. అది వారియనురాగసౌధమునకు ప్రథమసోపానము. ఆ సన్నివేశములో సుభద్రయొక్కమాన్యమానసికస్థితిగతులు మనోజ్ఞముగ పోషింపఁబడినవి.

పెద్దల యనుమతిలభించి పెండ్లియగువఱకు సుభద్రార్జునులు కలసియుండుటకవకాశములేక దూరదూరముననుండవలసివచ్చినది. ఏకాంతజీవిత మిరువురకును దుర్భరమైనది. వియోగవ్యథల నాయిరువురును భరింపలేకపోయిరి. ఆరసభరితసన్నివేశములో వేంకటకవి విప్రలంభశృంగార వర్ణన

58. వి. వి. 2-184 ప. 59. వి. వి. 2-187 ప.

చేయుటలో తనకుఁగల సామర్థ్యమును పతాకస్థాయిలో ప్రదర్శించినాఁడు కృష్ణ కృష్ణా : యటంచు నాకీరవాణి, రామ : రామా : యటంచు నారాజ సుతుఁడును మదనతాపమున వెతనొందఁజొచ్చిరి. మనమునన్నది ముఖమున గనిపించును. గనుక సుభద్రమనమున నర్జునభావము గట్టిగా పాతుకొనియున్న కారణమున నామె ముఖమునందుఁగూడ నర్జునభావము (తెల్లఁదనము) గానవచ్చినది వారివారి మానసిక భావనలకుఁదగినట్లు భౌతిక పరిస్థితులుగూడ కలసివచ్చినవి. సుభద్రార్జునుల వివాహము నిశ్చయింపఁబడినది. భగవదనుగ్రహమువలన వారికోరికలు ఫలించినవి.

ఉ॥ "కట్టిరి మంచి లగ్నమునఁగంకణముల్ కరపంకజంబులన్
బెట్టిరి పేసలన్ నలుగు మేలిమృగీమదకుంకుమంబులన్
జుట్టిరి కైశికంబుల విశుద్ధమనోహరపుష్పమాలికల్
పట్టిరి పేరఁటాండ్రు ధవళంబులుపాడుచు నుల్లభంబులన్[60]"

మొదలగుపద్యములలో వైవాహిక సన్నాహము లతిమనోహరముగ వర్ణింపఁబడినవి. శ్రీకృష్ణుని యాధ్వర్యమున సుభద్రార్జునుల వివాహమతి వైభవముగ జరిగినది. విజయుండు యాదవవీరులపై విజయము సాధించి వీరోచితముగ నాసుభద్రను తీసికొనిపోయి చేసికొనిన యావివాహమును రాక్షసమనవచ్చును.

ఆ॥ మంచి మగఁడు వలయునంచుఁ గోరుచునుండ
మంచిమగఁడు గలిగె మఘవసుతుఁడు
మనసుభద్ర సుకృతమహిమయేమనవచ్చు
మనసు భద్రమయ్యె మనకునెల్ల[61]"

అని యామె కత్తెరా యిరువురిదాంపత్యమును సూచనచిత తె యభినుతించిరి. అర్జునుని చెంతనున్న సుభద్ర మృగమదముచెంత కుంకుమరేఖవలె, నీలమణిపొంత బంగరురేకువలె, మేఘముదగ్గఱ మెఱుపు

60 వి. వి. 3-76 పు. 61. వి. వి. 3-88 పు.

తీగవలె నున్నదట. కడపట సుభద్రార్జునులు పడంటింటి ముచ్చట్లు శృంగార విలాస కృత్యములభివర్ణింపబడినవి. అపరిమితానురాగఫలితముగ ననంతర దశలో నాదంపతులకొక ముద్దులపట్టికలిగినాఁడు ఆ ప్రియతనయుడే యభిమన్యుఁడు. అతఁడే కురువంశమునునిలబెట్టినాఁడు మహాభారత సంగ్రామములో నసహాయశూరుఁడై ప్రకృష్టపద్మవ్యూహమును ఛేదించి పలువురు వీరులనుహతమార్చి, కర్ణాదిమహావీరులయ్యక్రమసామూహికయుద్ధము వలన వీరస్వర్గమునలంకరించి భారతీయయుద్ధచరిత్రలో నపూర్వాధ్యాయమును సృజించిన వీరాగ్రగణ్యుడతఁడు. అట్టిలోకోత్తరవీరకుమారవరునిఁ గన్నతల్లిదండ్రులైన సుభద్రార్జునులుధన్యులు. అట్టిభద్రాంగియైన సుభద్రయొక్క కళ్యాణమును వర్ణించుప్రబంధమగుటచే దీనికి సుభద్రాకళ్యాణమను నామాంతరముకూడ సార్థకమైనది. ఇందుకవిస్వర్గమర్త్యపాతాళములనొకే కావ్యసూత్రముచే బంధించినాఁడు

ఇట్లాప్రబంధమునందలి త్రివిధసన్నివేశములలో శృంగారము మువ్విధములుగ చిత్రింపఁబడినది. చేమకూరవారి కవితాప్రతిభకామూఁడు ఘట్టములును చక్కని నిదర్శనములు. వివిధశృంగారకేళులకు నాలవాలమగునట్లు విజయవిలాసమును రచించి చేమకూర వేంకటకవి సరసశృంగారభంగిమలకు దక్షిణాంధ్రయుగములో మార్గదర్శకుఁడైనాఁడు.

# కవితాశిల్పము



చేమకూరవేంకటకవియొక్క విజయవిలాసకవితాశిల్పము బహుముఖ రమణీయమై వినుతగుణములతో విరాజిల్లుచున్నది. ఇతని విజయవిలాస ప్రబంధమాకారమున చిన్నదిగఁగానవచ్చుచున్నను గుణమున మిన్నయై యనల్పకవితాశిల్పముతో నలరారుచున్నది. ఈ కవీంద్రుఁడు తన ప్రబంధ రాజమును సకలప్రబంధకవితాగుణముల కొటపట్టు గావించి మధురవిస్తర కవితలను వెలయించిన దక్షిణాంధ్రయుగకవులకు మార్గదర్శకుఁడైనాఁడు. అనితరసాధ్యమైన పద్ధతిలోఁగవితాశిల్పనైపుణ్యమును బ్రదర్శించినాఁడు. కనుకనే సకలకళావేత్తయగు రఘునాథనాయకుఁడా కవితల్లజుని రమణీయ కవితామార్గమును "క్షితిలో నీమార్గ మెవరికిన్ రాదుసుమీ'' అని ప్రశంసించి నాఁడు.[1]

వేంకటకవి తన విజయవిలాసకవిత్వమును ప్రబంధకవితామర్యాదాను గుణముగనే సాగించినాఁడు. ఆలంకారికులుచెప్పిన రసవత్కవితాసంప్రదా యములను జాలవఱకు నిందుఁ బాటించియున్నాఁడు. జాతివార్తాచమత్కారము లకు, నర్థగౌరవమునకు, రసమయపదజాలమునకుఁ, బ్రసన్నతాసౌకుమార్య గాంభీర్య గుణాదులకును దనకవిత్వమాటపట్టై యున్నదని సూచించి యున్నాఁడు.[2]

వేంకటకవి వాడిన కవితాసామగ్రియంతయుఁ బ్రాచీనాలంకారికపద్ధ తులకనుగుణముగనున్నట్లు కానవచ్చును. శైలి, పాకము, శయ్య, వృత్తులు, రీతులు, వర్ణనలు, పాత్రచిత్రణము, ఛందోవిన్యాసములు, నలంకారములు మొదలగు సామగ్రియంతయు విజయవిలాసప్రబంధమునందు సాహిత్యశాస్త్ర మర్యాదానుగుణముగఁ బ్రతిపాదింపఁబడినది. ఇది కడుజాగరూకతతో రసోదం చితముగ రచింపఁబడిదిగనుకనే కావ్యలక్షణలక్షితమై యాంధ్రవాఙ్మయమున నధిక గౌరవమునుబొందినది. ఇందలి కథాసంవిధానము, కల్పనాచాతుర్యము,

1. వి. వి. — అవతారిక - ప. 50. 2. వి. వి. — ప. 31, ప్ర. అ. - ప. 145

చమత్కారవచోవిన్యాసము, వర్ణనసౌష్ఠవము నీకవీంద్రుని ప్రతిభావ్యుత్పత్తుల నడుగడుగునను వేనోళ్ళఁజాటుచున్నవి. దక్షిణాంధ్రయుగకవులలోఁజేమకూరవేంకటకవికి మించిన కవి మఱియొకఁడు గానరాఁడు. వసంతసమయమునఁజిగురాకు జొంపములలో దాగియుండి కర్ణరసాయనముగఁబాడు కోకిల గానమువంటిది యితనికమనీయకవిత్వము. ఇతనిమృదుమధుర కవితాధార సుధారసమునుగూడ మరపించును. శిరీషసుమపేశలములై, మనోహరభావబంధురములైన యితనిపలుకుబడులు రసార్ద్రహృదయులనానందాబ్ధి నోలలాడించును. రసమునకుఁజమత్కారమును జోడించి తెనుఁగుపదములలోఁ గూడ విచిత్రశ్లేషలనుసులభముగ సాధించియితఁడు రామరాజభూషణునిమించినాఁడు. శబ్దచిత్రముగాని, చమత్కారోక్తిగాని, భావసౌకుమార్యముగానిలేని పద్యమొక్కటియు నీ ప్రబంధమునలేదనిచెప్పుటయతిశయోక్తి కానేరదు. హృదయరంజకములైన వర్ణనలు కోకొల్లలుగఁగానవచ్చును. వేంకటకవి తెనుఁగునుడికారపువడుపులను, నొయ్యారములను దనపద్యహస్తములతో సరసులకందించినాఁడు. ఇతఁడీప్రబంధమునఁజూపిన పలుకుల మలుపులు, వలపులసొలపులు, తళుకులబెళుకులు, కలుకులకులుకులును రసికహృదయస్పందనముగావించును. దక్షిణాంధ్రయుగమునకుఁజెందిన సోయగములీప్రబంధమునఁ బరాకాష్ఠదశలోఁబ్రతిబింబించుచున్నవి. తెలుఁగుభాషలోని జీవము, చేవ, లాలిత్యమునిందంతటఁగానవచ్చును. "స్వకపోలకల్పితమనోజ్ఞకళాగతి కెట్టులౌనుసరి ఛాయాచోరకరుచిసందర్భంబు"[3] అని యితఁడు చెప్పిన ప్రజ్ఞాపూర్వకవాక్యమునుబట్టి యతని స్వతంత్రభావసమన్వితమనోహరకళావిన్యాస వైఖరి వ్యక్తమగుచున్నది.

*శైలి :* భావవ్యక్తీకరణమునకు కవి యుపయోగించుకావ్యభాష యొక్క సమున్నతస్థితిని శైలియనవచ్చును. సంస్కారసముపేతమైన సరస కావ్యభాషకిదియొక సాంకేతికవ్యవహారము. శైలియనునది శీలశబ్దము యొక్క పరిణామరూపము. శీల + అణ్ + జీష్ = శైలీ "శీలస్యేయం శైలీ" అనునది దీనికి వ్యుత్పత్తియని, యదియొకసంకేతమనియు శబ్దకల్ప

3. వి. — తృ. ఆ. .... ప. 91

ద్రుమమునందుఁజెప్పఁబడినది.[4] A short explanation of a grammatical aphorism (వ్యాకరణసూక్తియొక్క సంగ్రహవివరణము), a mode of eupression or interpretation (ఒకవిధమైనభావవ్యక్తీకరణములేక వ్యాఖ్యానము) అనునర్థముల నీశబ్దమునకుప్రసిద్ధ సంస్కృతాంగ్లనిఘంటుకారు లిచ్చియున్నారు.[5] దీనికాప్టేచెప్పినయర్థములలో నొకటిమాత్రమీసందర్భములో సమంజసమైనదిగఁదోచుచున్నది. ఒక విధమైనభావమును వ్యక్తీకరించు భాషయొక్కస్థితిని శైలిగాభావింపవచ్చును. ప్రక్రియాభేదమునుబట్టి భావనివేదనాత్మకపద్ధతులు మారుచుండును. అట్టి సాహితీపరిణామాత్మకదశలను బట్టి శైలీవైవిధ్యమేర్పడినది. కథాకథనాత్మకము (Narrative), వర్ణనాత్మకము (Descriptive), నాటకీయము (Dramatic) నను ముఖ్యశైలీభేదములు కావ్యరచనాత్మకసన్నివేశములలోఁ గానవచ్చును. సాధారణముగ పురాణములందు కథాకథనాత్మకశైలి, ప్రబంధములందు వర్ణనాత్మకశైలి, రూపకములందు నాటకీయశైలియుఁగన్పట్టును. కాని యొక్కొక్కమహాకవి కవితాసామర్థ్యమునుబట్టి తనకావ్యములో నీత్రివిధశైలీవిశేషములను బ్రదర్శించును. ఆంధ్రవాఙ్మయమునఁబ్రధానముగ నన్నయాదికవీంద్రుల శైలి కథాకథనాత్మకముగఁ, దిక్కనాది కవిముఖ్యులశైలి నాటకీయముగ, నెఱ్ఱనాదుల శైలి వర్ణనాత్మకముగనుగానవచ్చును. కవిత్రయ కవితాక్షేత్రములందు వారికభిమతములైన ప్రధానశైలీవిశేషములేగాక సందర్భానుగుణముగ నితర శైలీవిన్యాసములుగూడఁగన్పట్టును. అట్లేసమర్థులైనయాంధ్రకవులుగొందఱు తమ ప్రబంధముల నీత్రివిధశైలీవిన్యాసములతోఁ దేజరిల్లఁజేసినారు. ప్రబంధములందు వర్ణనలుప్రాధాన్యము వహించునుగనుక వర్ణనాత్మసశైలి వానియందుఁబ్రముఖపాత్రవహించును.

సాధారణముగఁగావ్యములు నవరసభరితములైయుండును. ఒక్కొక్క కావ్యమునందొక్కొక్కరసము ప్రాధాన్యమువహించినను మిగిలినరసములాయాసన్నివేశములలో నానుషంగికములుగవర్ణింపఁబడును. ఆయారసముల తీరుతెన్నులనుబట్టి తద్రసవ్యంజకశైలీవైవిధ్యమేర్పడినది.

4. శబ్దకల్పద్రుమము — పంచమ భాగము — పే 137

5. Sanskrit English dictionary (Part III)—V. S. Apte – p. 1568

శృంగారకరుణరసములతిసుకుమారములైనవి గనుక వానిని వర్ణించు పట్టున శైలి లలితలలితపదభూయిష్ఠమై యతిసుకుమారముగనుండవలెను. రౌద్రబీభత్సరసములత్యుద్ధతములైనవి గనుక వానిని వర్ణించునప్పుడుశైలి పరుషపదఘటితమై యతిప్రౌఢముగనుండవలెను. హాస్యశాంతాద్భుతరసము లీషత్సుకుమారములైనవి గనుక వానిని వర్ణించుసందర్భమునశైలి నాతిసుకుమారపదయుక్తమైయుండవలెను. వీరభయానకరసము లీషత్ప్రౌఢములైనవి గనుక వానినివర్ణించుసమయములోశైలి నాతిప్రౌఢపదాంచితమై యుండవలెను.

"అత్యంతసుకుమారౌద్వౌ శృంగారకరుణౌమతౌ
అత్యుద్ధతరసౌరౌద్రబీభత్సౌ పరికీర్తితౌ
హాస్యశాంతాద్భుతాః కించిత్సుకుమారాఃపరికీర్తితాః
ఈషత్ప్రౌఢౌ సమాఖ్యాతౌరసౌవీరభయానకౌ"[6]

అనుశ్లోకములలో విద్యానాథుఁడుపేర్కొనిన వివిధరసస్వరూప స్వభావములనుబట్టి శైలీపై విధ్యము నూహించుకొనవలెను.

చేమకూర వేంకటకవియొక్క శైలి రమణీయమై రసానుగుణముగ నుండును. శృంగారరసమయమైయున్న యతని విజయవిలాసమునందలి శైలికి సౌకుమార్యసారళ్యములు ముఖ్యగుణములైయున్నట్లు కన్పట్టును. బంధశైథిల్యముగాని, రసభంగకరములైన పరుషపదములుగాని యీ ప్రబంధమునందెచ్చటఁగా రావు. ఇట్టి యకుంఠితశైలియాంధ్రప్రబంధము లందరుదుగఁగానవచ్చును.

వేంకటకవి తన విజయవిలాసమునందు దత్సమాచ్ఛికపదముల కుఁదుల్యప్రాధాన్యమునిచ్చియున్నాడు. ఇతని పదగుంఫననైపుణ్యము నిరుపమానమైనది. ఇతని వలెఁజమత్కారచాతుర్యమును బ్రదర్శించినయాంధ్రకవి మఱియొకఁడు లేఁడనిచెప్పవచ్చును. ఇతరప్రబంధకవులవలె దీర్ఘ మా

6. ప్ర. రు. — వి. నా. — కా. ప్ర. — శ్లో. 17, 18

సములనధికముగ నితఁడువాడలేదు. వస్తుగౌరవము కొఱకు. రసస్ఫూర్తి కొఱకు నచ్చటచ్చట పరిమితముగ దీర్ఘసమాసములను వాడినాఁడు. అర్థవంతములైనయలతి యలతి పదములతోఁదనరసభరితరచనావిధానమును సాగించినాఁడు. భావనిర్భరములు, నభిప్రాయ గర్భితములునైన పదములతోఁదన శైలికొకవ్యక్తిత్వమును సాధించినాఁడు. శ్రుతిసుభగధ్వనిసహితపదజాలముతోఁగూడిన యితని పద్యములగతులు నిరర్గళధారాశుద్ధితో నొప్పారి మనోహరములై యుండును. ఇతని పద్యములు చాలవఱకుఁదాళలయాన్వితగతివిశేషములతోఁగూడియుండును. భట్టుమూర్తి వసుచరిత్ర రచనారూపమునఁజేసిన నాదబ్రహ్మోపాసనకుఁ జేమకూర వేంకటకవి విజయవిలాసరచనారూపమున జీవముపోసినాఁడు. ఆతని సరసశబ్దచిత్రాన్వితమనోహరపద్యగతి విశేషములు నవమోహననాట్యభంగిమలను దలపించుచుండును.

విజయవిలాసమున వచనములసంఖ్యమిక్కిలి తక్కువ. మూఁడాశ్వాసములందును మూఁడువచనములు మాత్రము గానవచ్చును. ప్రథమ తృతీయాశ్వాసములలోనున్న వచనములు రెండును దీర్ఘసమాసభూయిష్ఠములై యతని సంస్కృతపదప్రయోగచాతుర్యమునుజాటుచున్నవి. ద్వితీయాశ్వాసవచనము రసగుళికలవంటి రమణీయాచ్ఛికపదములతోఁగూడి యలతి యలతి పదములతోఁగూడిన యతని నిరాడంబరశైలికి నిదర్శనముగనున్నది.

విజయవిలాసమునందలి పద్యములు చాలవఱకు శబ్దార్థాలంకారమయములైయున్నకారణమున నతనిది యాలంకారికశైలియని కూడఁజెప్పవచ్చును. ఇతని ప్రబంధమున వర్ణనాత్మకశైలి ప్రముఖపాత్రవహించినట్లు కానవచ్చును. ఆయానువిశాలవస్తువర్ణనములతని వర్ణనాత్మకశైలికి నిదర్శనములు. ఉలూచీచిత్రాంగదాసుభద్రల సౌందర్యవర్ణనములందీశైలి పతాకస్థాయినందుకొనినది. మఱియునిందు నాటకీయశైలిగూడ సముచితస్థానము నాక్రమించుకొనియున్నది అయాపాత్రల సరసస భాషణధోరణులలో నీశైలీ విశేషవిన్యాసములు గానవచ్చును ఉలూచ్యర్జున సంవాదము, సుభద్రార్జునుల సంభాషణములుమున్నగునవి యతని నాటకీయశైలికి నిదర్శనములనఁదగియున్నవి.

ఉ॥ కోపమొకింతలేదు, బుధకోటికిఁగొంగుపసిండి సత్యమా
రూపము, తారతమ్యములెఱుంగు, స్వతంత్రుఁడు, నూతనప్రియా
టోపములేని నిశ్చలుఁడిటుల్కృతలక్షణుఁడై చెలంగఁగా
ద్వాపరలక్షణుండనఁగవచ్చునొకో యల ధర్మనందనున్.[7]

తే॥ మేరలాయివి మీయంతవారలకును
బెద్దలున్నా రెఱిఁగివారె పెండ్లి సేయఁ
గలరు; వేగిరపాటింత వలదటంచు
విన్నపము చేయరాదె యోచిన్నిచిలుక.[8]

మొదలగు పద్యములతని సరళశైలికుదాహరణములుగఁ బరిగణింప నగును. ఇట్టి సరళశైలీసమన్వితపద్యములనేకములు విజయవిలాసములోఁ గానవచ్చును.

చ॥ పొలయలుకల్ వహించి వలపుల్మొలపించు పిసాళి గబ్బిగు
బ్బల జవరాండ్రు మైగగురుపాటున "నేటికివచ్చెనమ్మయీ
పిలువనిపేరటం" బనుచు బెగ్గిలి, నాథులఁగౌగిలింపఁగాఁ
బొలుపుగనందుఁబెండ్లినడుపుల్ నడచున్ వలినాలి తెమ్మెరల్[9]

శా॥ పన్నీటన్జలకంబులార్చి, చలువల్పైఁగట్టఁగానిచ్చి మే
నన్నిండారఁగఁజందనంబలఁదిి, విన్నాణంబుగాఁగప్పురం
పున్నామంబిడి, క్రొమ్ముడిన్విరిసరంబున్నించి, హారావళుల్
చన్నుంగ్రేవలఁదార్చిరప్పుడుచెలువల్ చంద్రాస్యకున్నేర్పునన్[10]

మొదలగు పద్యములతనియాచ్ఛికపదబహుళమైన యమలినశైలి కుదాహరములుగఁ బేర్కొనఁదగియున్నవి.

చ॥ అతనిసుతింపశక్యమె జయంతునితమ్ముఁడు సోయగమ్మునన్
బత కులాధిపధ్వజుని ప్రాణసఖుండు కృపారసంబునన్

7. వి. వి.—ప్ర. అ. - ప. 23.  8. వి. వి.—ద్వి. అ. - ప. 187
9. వి. వి.—ప్ర. అ. - ప. 18.  10. వి. వి.—తృ. అ. - ప. 77

క్షితిధరకన్యకాధిపతికిన్ బ్రతిజోదుసమిజ్జయంబు నం
దతనికతం డెసాటిచతురబ్ధి పరీతమహీతలమ్మునన్.[11]

శా॥ ఇన్నాళ్ళ్రోదియొనర్పఁగేళివనిలో నింపొందు నమ్మాధవీ
పున్నాగంబులపెండ్లి సేయవలెఁబూఁబోండ్లార ! రారేయటం
చున్నేర్పుల్ దగనొండొరుంబిల్చికొంచున్ సత్యభామాదివి
ద్యున్నేత్రామణులప్పుడిర్వురకు విఁదుల్ సేసిరందందులన్.[12]

మొదలగు పద్యములతని యభిప్రాయగర్భితపదప్రయోగచాతుర్య మున కుదాహరణములుగభావింపనగును. ఈ పద్యములందలి "జయంతుని తమ్ముఁడు, పతగకులాధిపధ్వజుని ప్రాణసఖుఁడు, క్షితిధరకన్యతాధిపతికిఁ బ్రతిజోదు" అనువిశేషణములు, మాధవీ పున్నాగంబులపెండ్లి సేయవలెనను వాక్యమును సాభిప్రాయములుగ వాడఁబడినవి. జయంతుఁడు సౌదర్యరాశి గనుక నందచందములుగలపురుషుల నతనితోఁబోల్తురు. అట్లేయిచ్చట నర్జునుని జయంతునితోఁబోల్చినాఁడు. నిజముగనర్జునుఁడు జయంతునితమ్ముఁడను నభిప్రాయమిందు గర్భితమైయున్నది. జయంతుఁడింద్రతనయుఁడు. అర్జునుఁడుగూడ నింద్రతనయుఁడేగదా. మఱియునర్జునుఁడుదయారసమున విష్ణువునకు బ్రాణసఖుఁడని కవియిందువర్ణించియున్నాఁడు. విష్ణువుయొక్క యపరావతారమైన శ్రీకృష్ణుఁడు నర్జునుఁడు నాప్తమిత్రులను విషయమిందుగర్భితమైయున్నది. అతిసన్నిహితానుబంధము గలిగిననరనారాయణులే కృష్ణార్జునులుగ నవతరించినట్లు పురాణములుదెల్పుచున్నవి. యుద్ధవిజయమునందర్జునుఁడు శివునకుఁబ్రతిభటుఁడుగనిందు వర్ణింపఁబడినాఁడు. అర్జునుఁడుపాశుపతాస్త్రము కొఱకు తపస్సుచేయుచున్న సమయముననతనిని పరీక్షించుటకై కిరాతవేషమునవచ్చిన శివునితోపోరాడిన విషయమిందుగర్భితమైయున్నది. తరువాతనుదాహరింపఁబడిన పద్యములో సుభద్రార్జునుల వివాహమును దృష్టిలో నిడుకొని కవి మాధవీపున్నాగముల పెండ్లినిఁబేర్కొనియున్నాఁడు.

శా॥ పంకేజాతములన్ దిసంతులడచున్ బాలామణీపాదముల్
వంకల్ దీర్చు మనోజసాయములన్ వాల్చూపులేణాంకునిన్

11. వి. వి.—ప్ర. ఆ. - ప. 28. 12. వి. వి.—తృ. ఆ. — ప. 77

శంకల్ సేయు మొగంబు జక్కవకవన్ జక్కట్లుదిద్దింగుచా
హంకారంబు మదాళిమాలికలనూటాడించు వేణీరుచుల్.[13]

ఉ॥ కమ్మనిజాళువానొరయఁగల్గిన చెక్కుల సెక్కువాఁడు చొ
క్కమ్మగు జాతికెంపువెలగాఁగొను మోవిమెఱుంగువాఁడు స
త్యమ్మగు రూపసంపద ధనాధిపసూనుని ధిక్కరించువాఁ
డమ్మకచెల్ల ! నాహృదయమమ్మకచెల్లదు వీనికియ్యెడన్.[14]

మొదలగు పద్యములితని వర్ణనాత్మక శైలికి, గమకభేదములతో గూడిన గతివిశేషములకునుదాహరణములుగ స్వీకరింపనగును.

ఆ॥ నువ్వుఁబువ్వునవ్వు జవ్వనినాసిక
చివురు సవురు జవురు నువిదమోవి
మబ్బునుబ్బుగెబ్బు బిబ్బోకవతివేణి
మెఱపునొఱపుఁబఱపుఁ దెఱవమేను.[15]

క॥ రవరవలు నెఱపు నీలపు
రవరవణముతోడఁజెలి యరాళకచంబుల్
కవకవ నవ్వున్ వలిజ
క్కవకవఁ గలకంఠకంఠికఠినకుచంబుల్.[16]

మొదలగు పద్యములాకవీంద్రుని తాళలయాన్వితగతి విశేషములకు, శబ్దవిచిత్రవిన్యాసములకునుజక్కని నిదర్శనములు.

ఉలూచ్యర్జున సంవాదరూపముననున్న పద్యములలో,[17] సుభద్రార్జున సంభాషణరూపముననున్న పద్యములలోను[18] నితని నాటకీయశైలి సరసాకృతితో స్పష్టపడుచున్నది.

---

13. వి. వి. — ద్వి. ఆ. - ప. 15. 14. వి. వి. — ప్ర. ఆ. - ప. 70
15. వి. వి. — ప్ర. ఆ. - ప. 85. 16. వి. వి. — ,, ప. 85
17. వి వి. — ప్ర. ఆ. - ప. 88 నుండి 104 వఱకు
18. వి. వి. — తృ. ఆ. - ప. 159 నుండి 199 వఱకు

మ॥ తనకున్ గౌఁగిలియీవొకప్పుడును నాథా ! నీ కరస్పర్శనం
బునగిల్గింతలె యంచుఁబద్మిని కరాంభోజమ్మునన్ మందమం
దనటద్వాయుచలద్దళాంగుళులు కన్పట్టంగ నవ్వేల్గురా
యని రారా యని పిల్చెనాఁదగె ద్విరేఫాద్యంతదీర్ఘధ్వనుల్.[19]

ఉ॥ చందనగంధినెన్నుదురుచందురులో సగఁబాల బాల ము
ద్దుందెలిచూపులంగజుని తూపుల లోపల మేల్తరంబులిం
దిందిరవేణి మోవి యెలదేనియలో నికరంపుఁదేటయే
మందము మందయానమొగమందము మీఱు నహారవిందమున్[20]

మొదలగు పద్యములనుబట్టి యతని యాలంకారికశైలి యవగత మగుచున్నది.

క॥ విధుచకచకలును బంద్రే
ఢధనుర్ధరునంపసెకలు శుకపికశారీ
మధులిట్టులు మలయానిల
మధు లిట్టులు తనదు ధైర్యమహిమఁగలంపన్.[21]

క॥ ఏలే యాలేఖ్యాకృతి
యేలే ప్రాలేయకరముఖీ చూడవయో
యేలే శైలేయస్తని
యేలే బాలేందునిటల యేలాఁతినపే.[22]

మొదలగు పద్యములాకవీంద్రుని సంస్కృతపదమయ శైలికి నిదర్శనములు.

శా॥ చంద్రప్రస్తరసౌధఖేల నపరశ్యామాకుచద్వంద్వని
స్తంద్రప్రత్యహలిప్తగంధకలనాసంతోషితద్యోధునీ

19. వి. వి. — ప్ర. ఆ. - ప. 139. 20. వి. వి. — ప్ర. ఆ. - ప. 49
21. వి. వి. — ప్ర. ఆ. - ప. 148. 22. వి. వి. — ద్వి. ఆ. - ప. 193

సాంద్రప్రస్ఫుటహాటకాంబురుహ చంచచ్చంరీకోత్కరం
బింద్రప్రస్థపురంబు భాసిలు రమాహేలాకళావాసమై 23

అను పద్యము వంటి దీర్ఘసమాసభూయిష్ఠ పద్యములు విజయవిలాసమునసరుదుగఁగానవచ్చును. భుజంగప్రయాతాదివృత్తవిశేషములుగొన్నింటియందు, నాశ్వాసాంతపద్యములందును నట్టి దీర్ఘసమాసములుగానవచ్చును పురవర్ణనాత్మకమైనపైపద్యమును ప్రబంధకవితాసంప్రదాయమునసుసరించి దీర్ఘసమాసయుతముగావించినాఁడని భావింపనగును. అట్లే భుజంగప్రయాతాది విశిష్టవృత్తములందుఁగూడ గతివిశేషములు, వస్తుగౌరవము, రసస్ఫూర్తి మున్నగువానిని సాధించుటకొఱకు దీర్ఘసమాసములను వాడినట్లు తెలియనగును. కృతిపతియైన రఘునాథనాయకుని గుణగణములను ప్రశంసించురూపముననున్న యాశ్వాసాంతపద్యములందుఁదనప్రభువర్యుని గుణాధిక్యమును, వ్యక్తిత్వమును బ్రదర్శించుటకొఱకు దీర్ఘసమాసములనువాడినాఁడనిభావింపనగును. వేంకటకవి కడుజాగరూకుఁడై దీర్ఘసమాసములను బరిమితప్రదేశములందు మాత్రమే ప్రయోగించినాఁడు. అడుగడుగున నర్థరహితముగ దీర్ఘసమాసములను వాఁడు నితరప్రబంధకవులవలెఁగాక తద్వ్యవహారములందితఁడు నిగ్రహాశక్తిని బ్రదర్శించి పండితప్రశంసలకుఁబాత్రుఁడైనాఁడు.

శా॥ కంగుల్ తీర్చినపై తిణీలువిక చన్కట్టంటి రాణింపఁగాఁ
జెంగల్వల్ నెటికొప్పునందునొఱపై చెంతన్ గుబాళింపఁగా
బంగారందియమున్కునం గమచిపైపై సంచయొల్గింపఁగా
సింగారంబగు ముద్దుఁజిల్కతనకున్ జేదోడువాదోడుగాన్.24

మొదలగు పద్యములనతని శృంగారరసాత్మక సుకుమారశైలి కుదాహరింపవచ్చును.

ఉ॥ అంతటిలోఁబృథు శ్రవసుఁడాదిగఁగల్గిన వీరయోధుల
త్యంత కఠోరతోమరశరాసనబాణకృపాణపాణులై

23. వి. వి.—ప్ర. ఆ. - ప. 1. 24. వి. వి.—ద్వి. ఆ. - ప. 157

పంతములాడుచున్ బదరిపైఁబడఁజూచు బలంబులెల్లఁ దా
మంతటనంతటన్ నిలిపి యద్ధముగాఁజని యాధనంజయున్ [25]

పంచచామరము : హుటాహుటిన్ హలాయుధుండహో మహోగ్రుఁడై తనం
తటన్ దటాన నిప్పుడీవిధంబెఱింగి వచ్చెనో
ఘటాఘటీల నెల్లఁద్రోవఁగట్టిపట్టఁబంచెనో
యుటోయుటోయెటో ఘటోద్భటార్భటుల్ ఘటిల్లెడున్.[26]

మొదలగు పద్యములలోవీరరౌద్రరసాత్మకశైలీవిశేషవిన్యాసములు గానవచ్చుచున్నవి. మఱియుఁగొన్నిసన్నివేశములలో నద్భుతశాంతరసముల కాటపట్టులైనపద్యముల నీషత్సుకుమారశైలిలోఁనడిపినాఁడు.[27]

నయగారవులయలను బ్రదర్శించిన సీసపద్యములతనిశైలి కెనలేని వన్నెనుజేకూర్చినవి. సాధారణముగాఁబంచమాత్రాకములైన యింద్రగణము లనేవాడి సీసపద్యములందుఁజిత్రగతి విశేషములనుసాధించినాఁడు. శ్రీనాథ రామరాజ భూషణాదులవలెనితఁడుగూడ సీసపద్యములను దాళలయాన్వితగతి విశేషశిల్పరమణీయములుగఁ దీర్చినాఁడు. ఇట్లు వివిధవిన్యాసములతోఁదన ప్రబంధశైలిని రసానుగుణముగనడిపి వేంకటకవి సుసమానకీర్తి నార్జించి నాఁడు.

శయ్య : పదములయొక్క పరస్పరమైత్రిని శయ్యయందురు. కావ్యమునందుపయోగింపఁబడు పదములు పరస్పరముపొత్తుగలిగియుండవ లెను. పదవినిమయమును సహింపని బంధపటిష్ఠతగలిగి యిది కావ్యశోభ నినుమడింపఁజేయుచున్నది. "యాపదానాంపరాన్యోన్యమైత్రీ శయ్యేతిక థ్యతే"[28] అని విద్యానాథుఁడు చెప్పినశయ్యాలక్షణములో నీయభిప్రాయ ములు సూచింపఁబడినవి. దీనినే పక్వప్రత్యసహిష్ణుతయని వ్యవహరింతురు. దీనికిమైత్రి, ముద్ర యను నామాంతరములుగలవు.

25. వి. వి.—తృ. ఆ. - ప. 47. 26. వి. వి.—తృ. ఆ. - ప. 187

27. వి. వి. — ద్వి. ఆ. - ప. 45 నుండి 49 వఱకు, 81

28. ప్ర. రు. — వి. నా. - కా. ప్ర. - పే 49

క॥ "కదిసి పదంబులు ముందటి
పదములతోఁబరమమైత్రిఁబరగి సరపదా
స్పదమనకుండిన గతులం
దదిశయ్య............"29

అని భట్టుమూర్తి శయ్యాలక్షణమును జెప్పియున్నాఁడు. పూర్వోత్తర పదములు వినిమయాసహిష్ణువులై పరమమైత్రి గలిగి యుండుటనేశయ్య యందురని యతని యభిప్రాయము. శయ్యశబ్దధర్మము. మనశరీరములకెత్తు పల్లములులేని సుఖకరమగుశయ్య యెట్లవసరమో యట్లే కావ్యశరీరమునకుఁ గూడ హృదయంగమములగుశబ్దముల కూర్పవసరము. శయ్యనుసాధించుటకుఁ గవికిఁదగిననైపుణ్యమవసరము. సుకుమారశయ్యాసౌభాగ్యముతోఁ గూడిన రచనరమ్యముగనుండును.

"మాలాకారోరచయతియథా సాధువిజ్ఞాయమాలాం
యోజ్యంకావ్యేష్వవహిత ధియా తద్వదేవాభిధానం"

అని భామహుఁడు చెప్పినట్లుమాలాకారుఁడేపువ్వునేపువ్వునకుఁజేర్చిన బాగుండునో తెలిసి హారాలను మనోహరముగఁగట్టునట్లు కవియు నేపదము నేపదమునకుఁజేర్చిన బాగుగనుండునో గ్రహించియట్టి యన్యోన్యమైత్రిగల పద ములనుగూర్పవలెను. పదానుగుణ్యవిశ్రాంతియే శయ్యయని యభినవగుప్తుని యభిప్రాయము.

"పొసఁగముత్తెపుసరుల్ పోహళించినలీలఁ
దమలోన దొరయు శబ్దములుగూర్చి30........

అని పింగళిసూరనార్యుఁడు శయ్యాసౌభాగ్యసాధనము స పమాన యుతము గసూచించియున్నాఁడు. ముత్యములనుమనోహరహారముగఁ గూర్చు ట్లే పరస్పరమైత్రిగలశబ్దములను గావ్యములందు మనోహరముగఁగూర్చ వలె ని యతని యభిప్రాయము.

29. కా. సం. — ష, మూ. — ద్వి. ఆ. - ప. 89
30. క. పూ. — పిం. సూ. — ప్ర. ఆ. — ప. 82

"పదములొండొంటితోఁ గదిసి మేల్పరణి
గుదిరిన శయ్యనాఁ గొమరారు కృతుల"

అని చెలమచెర్లరంగాచార్యులుగారు శయ్యనుగూర్చి చెప్పియున్నారు.[30A]

ఈ శయ్యపై నాంగ్లకవిపండితులకుఁగూడ నిట్టి యభిప్రాయములే యున్నట్లుకానవచ్చును. దీనినే వర్డ్స్వర్త్ అనునాంగ్ల కవీశ్వరుఁడు "The Choice of best words in best place' అని చెప్పియున్నాఁడు. మంచిపదములనుత్తమ స్థానమునఁగూర్చుటయని యతని యభిప్రాయము. "Lord Macaulay in his essay on Milton expresses the same idea. He speaks of the magical influence of poetry. The expression in general means nothing; but applied to the writings of Milton. His poetry acts like an incantation .. . Change the structure of the sentence, substitute one synonym for another and the whole effect is destroyed. This felicity of expression of words is what sanskrit writers on poetics Called Maitri or Sayya"31 అని ప్రసిద్ధ కవితావిమర్శకులగు త్రివేదిగారు పేర్కొనియున్నారు. మిల్టన్ మహాకవియొక్క కవితాప్రతిభను బ్రశంసించుచు నతని పదములకూర్పు వినిమయమును సహింపదని మెకాలే సూచించినట్లు తెల్పుచు మనయాలంకారికులట్టిదానినే మైత్రి లేక శయ్య యని పేర్కొనినట్లు త్రివేదిగారుచెప్పియున్నారు.

"శబ్దాలంకారమాహుస్తాన్ కావ్యమీమాంసకావిదః
ఛాయాముద్రాతథోక్తిశ్చయుక్తిర్గుంఫనయాసహ
అభిప్రాయవిశేషేణ కవిశక్తింవివృణ్వతీ
సాముత్ప్రదాయినీముద్రా సైవశయ్యాపినోమతే"32

అని యగ్నిపురాణమునందు శబ్దాలంకారములలోఁజెప్పఁబడినముద్రనే శయ్యఁగా పరిగణింతుమని చెప్పియున్నారు.

30. A ఆ. ప్ర. య. భూ. — చె. రం. — కా. ప్ర. — ప. 29
31. Bhandarkar Commemoration Volume—Trivedi—P. 403
32. అగ్ని పురాణము — 342

"శయ్యేత్యాహుః పదార్థానాంఘటనాయాంపరస్పరమ్
సా(ప్రక్రాన్తేన కస్మింశ్చిదప్రకాన్తేనకుత్రచిత్"32A

అని బోజుఁడు చెప్పినలక్షణమునుబట్టి పదార్థపరస్పరయోజనయే శయ్యయనితెలియుచున్నది. మొత్తముమీద పరస్పరమైత్రిగల పదములను వినిమయమునకు వీలుగానట్లు కూర్చుటనే శయ్యయనుట సమంజసముగఁ దోచును. వర్ణపదరచనాదులుపరంపరగా రసవ్యంజకములగునని యానంద వర్ధనుఁడుచెప్పిన సిద్ధాంతమునుబట్టి శయ్యకుఁగూడ కావ్యసామగ్రిలో స్థాన మేర్పడినది.

వేంకటకవియొక్క విజయవిలాసకవిత్వమంతయుఁ జక్కని శయ్యా సౌభాగ్యసంపత్తితో నలగారుచుండును.

ఉ॥ ఆ పురమేలుమేలు బళియంచుఁబ్రజల్ జయవెట్టుచుండ నా
జ్ఞాపరిపాలనవ్రతుఁడు, శాంతిదయాభరణుండు, సత్యభా
షాపరతత్త్వకోవిదుఁడు, సాధుజనాదరణుండు దానవి
ద్యాపరతంత్రమానసుఁడు ధర్మతనూజుఁడుదగ్రతేజుఁడై.33

అను పద్యమునతఁడుసాధించిన శయ్యాసౌభాగ్యమునకొక యుదాహరణముగఁబరిగణింపనగును. ఇందు మొదటిపాదములో మేలు, అను పదముపై పైకర్థరహితముగఁబునరుక్తమైనట్లుకానవచ్చును. అట్టిపరస్థితిలో దానినిమార్చినచో బాగుగనుండునని సామాన్యులనుకొనవచ్చును. కానిఁ ఆపురము + ఏలు, మేలు, బళి, యనియన్వయించుకొనినచో నాపునరుక్తి దోషముపోవుటయేగాక యర్థవంతమైనశబ్దచమత్కారముగూడఁ గుదిరినది. కనుకనిది పదవినిమయాసహిష్ణువైనసన్ని వేశము. ఇట్టిపదములకూర్పిపద్య మునకెనలేనిసొగసుఁదనమునుజేకూర్చినది. మఱియునితని పదగుంఫనములోఁ గానవచ్చు సహజసౌకుమార్యలీలలితనిశయ్యకపూర్వావలంబములైనిలచినవి.

32A. స. కం. — భోజుఁడు — ద్వి. ప. — శ్లో. 54

33. వి. వి. — ప్ర. ఆ. ప. 10.

ఉ॥ నావుడుమోమునన్ మొలకనవ్వొలయన్ వలిగబ్బిగుబ్బచన్
దీవికిఁగానటించుక నటించు కవున్‌గనిపింపఁబల్కెరా
జీవదళాక్షి యోరసికశేఖర ! యోజనరంజనైకలీ
లావహరూప ! యోనుతగుణా ! తగునాయిటులానతీయఁగన్[34]

అను పద్యమునందతని సుకుమారశయ్యావైభవము పరాకాష్ఠదశనందు కొనినది. ఇందొకయక్షరముగూడ మార్చుటకవకాశములేనివిధముగ మనోహరఫణితిలోఁగూర్పఁబడినది. దేనినిమార్చినను నతని నిరుపమనిర్మాణశిల్పముదెబ్బతినును. శబ్దచమత్కారము, రసస్థాయి, యలంకారము, పదలాలిత్యము, నల్లికజిగిబిగిమున్నగునవి యతనిపదములకూర్పనెడిమూసకట్టులోఁబాగుగబిగింపఁబడియుండును. ఈ పద్యమునందుఁ దీవికిన్ + కానటు + ఇంచుక + నటించు, నసువిరుపులలో, నుతగుణా, తగునా, యిటులు + ఆనతీయ, అనుసుందరపదవిన్యాసములలోనుగానవచ్చు చమత్కారభంగిమలు, సుకుమారశయ్యావిలాసమును సహృదయహృదయైకవేద్యములు.

ఉ॥ నాయమెనీకుమేల్పడిన నాతినలంచుట యంత్రమత్స్యమున్
మాయఁగఁజేసి మున్ద్రుపదనందననేలవెయంగభూపతా
కాయతయంత్రమత్స్యమిపుడల్లనఁద్రెళ్ళఁగనేసియేలుకో
తీయఁగఁబంచదార వెసుతీయఁగఁబల్కినసున్ద్వితీయఁగన్[35]

అను పద్యములోఁ, దీయఁగా, పంచదార, ద్వితీయ, యనుపదములు హారమునందుమణులు గుదిరియున్నట్లు కుదురుకొనినవి. ఈ పదములే యీ పద్యమునకుజీవముపోసినవి. వానినిఁదొలగించినచోనచ్చటి సారస్యము దెబ్బతినును. పంచదార, ద్వితీయయనుశబ్దములిచ్చట శ్లేషచమత్కారగర్భితములైయున్నవిఁ. పంచదార, యను శబ్దమునకుఁ జక్కెర, ద్రౌపది యనురెండర్థములువచ్చుచున్నవి. అట్లేఁద్వితీయ, యనుశబ్దమునకు భార్య, రెండవదియనునర్థములు వచ్చుచున్నవి చక్కెరకంటె మధురముగఁబల్కి

34. వి వి.—ప్ర. ఆ. — ప. 35. వి. వి.—ప్ర. ఆ. - ప. 89

తనను భార్యగనేలుకొనుమని యులూచియర్జుననర్థించినట్లొకయభిప్రాయము వచ్చుచున్నది. ద్రౌపది తరువాత తనను రెండవభార్యగస్వీకరింపుమనియామె కోరినట్లు రెండవయభిప్రాయమువచ్చుచున్నది. వెనుతీయఁగ, ననుపద మునుబట్టి ద్రౌపదినిమించినస్థాయిలోఁదనను ప్రేయసిఁగస్వీకరింపుమని కోరినట్లుకూడ ధ్వనించుచున్నది. తీయఁగ, ననుపదమర్థభేదముతో పున రుక్తమగుటవలన యమకగమకముగూడఁజక్కఁగ నమరినది. ఇన్ని యభి ప్రాయవిశేషములతోఁగూడియున్న పదములను మార్చుట సాధ్యముగాదు. అట్లు చక్కఁగఁజెక్కి కూర్పఁబడిన చిక్కనిచొక్కపుమాటలతోఁదొణికిస లాడు వేఁకటకవిశయ్యారీతి విజయవిలాసమునకువినుతకీర్తి నార్జించిపెట్టినది.

మ॥ విహరించున్ మలయానిలంబిచటఁ దావింజిల్కి నెమ్మేనియా
విహరించున్ బికనాదముల్ చెవికిఁగావించుంజవుల్ పోదమా
సహకారాళి పదంబుఁజూడఁగ వయస్యాహాళివాటిల్లెడున్
సహకారాళి పదంబుఁజూడఁగ వయస్యాహాళియౌనేకదా 36

ఉ॥ కానుకగాఁగనిత్తుబిగికౌఁగిలి పల్కవె కీరవాణి నీ
దౌనుడితేనె నా చెవులనాఁగృపారసధారనానన
న్నాన నమెత్తిచూడునలినానన గోఁతనాననేలలో
నానఁజలంబునీకు మరునానను మీవిడునానయింతటన్. 37

మొదలగు పద్యములనేకములతని సుకుమారశయ్యకు నిదర్శనములై యున్నవి.

పాకము : పాకము బాగుగఁగుదిరిన వంటకములు రుచికరమై యాస్వా ద్యమానముగ నుండునట్లుకవితాపాకము బాగుగఁగుదిరినకావ్యముగూడ సహృదయనిర్భరమై సహృదయానురంజకముగనుండును. వివిధవస్తువులను జేరినై పుణ్యముతోవండుటవలన వంటకమునకెట్లు క్రొత్త రుచివచ్చునోయట్లే వృత్తిరీతిగుణాదుల సంయోగముపలనఁగనితాపాకమునందుఁగూడ రుచిభే దములేర్పడును. పాకమర్థధర్మముగ భావింపబడుచున్నది. వృత్తిరీతి,

36. వి. వి. — ద్వి. ఆ. .... ప. 53 38. వి. వి. — ప్ర. ఆ. - ప. 29

గుణముల కలయికవలననేర్పడిన యర్థాస్వాదమునే పాకమనవచ్చును. "అర్థగంభీరిమాపాకః"[38] అని విద్యానాథుఁడు పాకలక్షణమును దెల్పియున్నాఁడు. అర్థగాంభీర్యమే పాకమనియతని యభిప్రాయము. ఆ పాకలక్షణమును దద్వ్యాఖ్యాతయైన కుమారస్వామిసోమపీఠి "అర్థస్యశృంగారాదేః గంభీరిమా ఆస్వాద్యమానతావిశేషః" అని కొంచెము వివరించియున్నాఁడు. శృంగారాదిరసముల యాస్వాద్యమానస్థితివిశేషమునుపాకముగ నావ్యాఖ్యాత భావించియున్నాఁడు "పాకముదీరితార్థపరిపాకమనందగు" ననిభట్టుమూర్తి పాకలక్షణమును జెప్పియున్నాఁడు.[39] అర్థపరిపాకమే పాకమనఁబడుననియతనియభిప్రాయము. రసప్రతీతికి సహకరించు విధముగా శబ్దార్థములను గూర్చుటయే పాకమనఁబడును. "అమలరసాస్వాదనార్హమౌరచన, కమనీయపాకమైగ్రాలుకావ్యముల" అని చెలమచెర్లవారు పాకలక్షణమును జెప్పియున్నారు.[40]

"పాకస్తురసోచితశబ్దార్థనిబంధనమ్;
శ్రవణసుధాస్యంది నీపదవ్యుత్పత్తిః పాకఃఇత్యన్యే:
పదానాంపరివృత్తివైముఖ్యంపాకఇత్యపరే"

అని విద్యాధరుఁడు పాకలక్షణవిషయమునఁగల యభిప్రాయభేదములను దనయేకావళియందుఁబేర్కొనినాఁడు. రసోచితమైనశబ్దార్థనిబంధనము పాకమని యొకవాదము. ఈ వాదముతో విద్యాధరుఁడేకీభవించినాఁడు. వీనులవిందుగావించు పదవ్యుత్పత్తి పాకమని మఱియొకవాదము. పదవినిమయవైముఖ్యమే పాకమని కొందఱివాదము. ఈ చివరివాదము విద్యానాథుఁడుచెప్పిన శయ్యాలక్షణమునకు సరిపడును.

విద్యానాథుఁడు ద్రాక్షానారికేళపాకములను మాత్రమే పేర్కొనియున్నాఁడు."ద్రాక్షాపాకస్సకథితోబహిరంతః స్ఫురద్రసః" అనిద్రాక్షాపాకము

38. ప్ర. రు — వి. నా. — కా. ప్ర. — పే 49

39. కా. సం. — భ. మూ. — ద్వి. ఆ. — ప. 31

40. ఆం. ప్ర య. భూ. — చె. రం. .... కా. ప్ర. ప. 31

సకు, "సనారికేళపాకః స్యాదన్తర్గూఢరసోదయః" అని నారికేళపాకమునకును లక్షణములనతఁడుదెల్పియున్నాఁడు. బాహ్యాంతరములందు రసస్ఫూర్తిగలిగి యున్నదానినిద్రాక్షాపాకమని, యంతర్నిగూఢమైనరసస్ఫూర్తిగలదానినినారి కేళపాకమనియునందురని యతనియభిప్రాయము. పైకి కఠినముగనున్నను లోపలమృదువైనదినారికేళపాకమని ధర్మసూరిచెప్పియున్నాఁడు. విద్యానాథు నివలె భట్టుమూర్తిగూడ నారెండుపాకములనేపేర్కొనియున్నాఁడు. ద్రాక్షాపా కమునితఁడు గోస్తనీపాకమనినాఁడు. "గోస్తనీపాకమసంవృతార్థపరిపాక నివేద్యము" అని, "నారికేళపాకాకలనంబుగూఢనిబిడార్థవిచార్యము'' అనియు భట్టుమూర్తి తనకావ్యాలంకారసంగ్రహమునందు ద్రాక్షానారికేళపాకముల లక్షణములనుదెల్పియున్నాఁడు. ద్రాక్షాపాకమనఁగా నిగూఢమైనయర్థపరి పాకమని, నారికేళపాకమనఁగా గూఢార్థరుచియనియు నతఁడుభావించినట్లు తెలియుచున్నది. ద్రాక్షాఫలము ననుభవించుటతేలిక. అట్లే యెక్కువ శ్రమ పడి యాలోచించవలసినయవసరము లేకుండ సుకరముగనవగతమగు నర్థ విశేషమును ద్రాక్షాపాకమందురు. నారికేళముననుభవించుటమిక్కిలి కష్టమై నట్లే నారికేళపాకములోనున్నకవిత్వము నర్థముచేసికొనుటగూడ కష్టమగును. నారికేళమువలె నీపాకముగూడ నతికష్టముచే ననుభవయోగ్యమగునుగనుక దీనికి నారికేళపాకమను నామము సార్థకమైనది.

కదళీపాకమను మఱియొక కవితాపాకముప్రచారములోనున్నది. విద్యానాథాద్యాలంకారికులు గొందఱు కదళీపాకమునుజెప్పకపోయినను దీనికిఁ గావ్యక్షేత్రమునందుఁదగినవ్యాప్తియున్నది. ద్రాక్షాఫలముకంటె కదళీఫలము ననుభవించుట కొంచెము కష్టము. కాని నారికేళముకంటె దీనిననుభవించుట తేలిక. కనుక నాతికఠినము, నాతిసులభమునైన యర్థభేదమును గదళీపాక మనవచ్చును. సాధారణముగఁ గవులకవితారీతులు సమయానుకూలములగు రసస్థితిగతులనుబట్టి ద్రాక్షాకదళీపాకములలోనడచును. ప్రౌఢకవితామయ సన్నివేశములందు మాత్రము నారికేళపాకముగానవచ్చును. ప్రౌఢకావ్యము లందచ్చటచ్చట ద్రాక్షాకదళీపాకములును, సరళకావ్యములందచ్చటచ్చట నారికేళపాకమునుగానవచ్చును. కేవలము కావ్యమంతయు నొకేపాకములో నడచుటకష్టము.

పిచుమంద, బదర, మృద్వీకా, తింత్రిణీ, సహకార, క్రముక, త్రాపుష,నారికేళములను నవవిధపాకములను రాజశేఖరుఁడనునాలంగారికుఁడు పేర్కొనియున్నాఁడు. వీనిలో నారికేళపాకమునకుఁదప్ప మిగిలినవానికిఁ గావ్యజగత్తులోవాడుక తక్కువ.

పాకములు గుణములను, వృత్తులను, రీతులను నాశ్రయించి యుండును. ద్రాక్షాపాకము, మాధుర్యగుణమును కైశికీవృత్తిని, వైదర్భి రీతిని నాశ్రయించియుండును. నారికేళపాకమోజోగుణమును నారభటీ వృత్తిని, గౌడీరీతిని నాశ్రయించియుండును. కదళీపాకము ప్రసాదగుణ మును సాత్వతీవృత్తిని, పాంచాలీరీతిని నాశ్రయించియుండును.

చేమకూర వేంకటకవి తన విజయవిలాసకవిత్వమును ద్రాక్ష కదళీ పాకములతోనింపినాఁడు. కఠినమైన నారికేళపాకముజోలికతఁడు సాధారణ ముగవెళ్ళఁడు. అతని పద్యములు చాలవఱకు ద్రాక్షాపాకసమన్వితములై యున్నవి. అచ్చటచ్చటఁగొన్ని పద్యములందుఁ గదళీపాకముగానవచ్చును. నారికేళపాకములో నడుపఁబడినపద్యములు మిక్కిలి యరుదుగఁగన్పట్టును.

తే॥ చెఱకువిలుకాని బారికి వెఱచినీదు
మఱుఁగుఁజేరితిఁ జేపట్టిమనుపునన్నుఁ
బ్రాణదానంబుకన్నను వ్రతముగలదె
యెఱుఁగవేధర్మపరుఁడవు నృపకుమార ! 41

ఉ॥ ఏమనఁబోయెదన్ దగులమెంచక నీవిటులాడఁదొల్లి శ్రీ
రామకుమారుఁడైన కుశరాజు వరింపఁడెమాకుముద్వతిన్
గోమలచారుమూర్తి పురుకుత్సుఁడు నర్మదఁబెడ్లియాడఁడే
నీ మనసొక్కటేకరఁగనేరదుగాని నృపాలకాగ్రణీ ! 42

శా॥ పన్నీటన్‌జలకంబులార్చి చలువల్ పైఁగట్టఁగానిచ్చి మే
నన్నిండారఁగఁ జందనంబలఁది విన్నాణంబుగాఁగప్పురం

41. వి. వి. — ప్ర. ఆ. - ప. 93. 42. వి. వి. — ప్ర. ఆ. - ప. 101

పున్నామంబిడిక్రొమ్మొడిన్ విరిసరంబుల్ నించి హారావళుల్
చన్నుంగ్రేవలఁదార్చిరప్పుడు చెలుల్ చంద్రాస్యకున్
నేర్పునన్.43

మొదలగు పద్యములీకవీంద్రుని ద్రాక్షాపాకయుతకవితాపాటవ మునకు నిదర్శనములు. ఇట్టిపద్యములనేకములితని విజయవిలాసమునందుఁగానవచ్చును. పైపద్యములు స్థాలీపులాకన్యాయముగను దాహరింపఁబడినవి.

"తారసపుష్టిమై...." అను నవతారికాపద్యములో "ప్రసన్న గంభీర గతిన్" అనుచోట ప్రసాదగుణమును, గవితాపాకమును సూచించియున్నాఁడు.

ఉ॥ అంగజరాజు పాంథనిచయంబులపై విజయంబొనర్పనేఁ
గంగఁదలంచునంత మునుగల్గఁగదాసులువట్టుజాళువా
బంగరుటాలవట్టముల భంగిఁగనంబడెఁబూర్వపశ్చిమో
త్తుంగమహీధరాగ్రములఁదోయజశాత్రవమిత్రబింబముల్.44

ఉ॥ ఇత్తరళాక్షి మేనిజిగియేలిక మేలికడాని పైఁడికీ
గుత్తపుగుబ్బలాఁడిజడ కూఁకటిచీఁకటి మూలదుంపకీ
పుత్తడి బొమ్మకన్నుఁగవపోలికవాలికగండుమీలకీ
బిత్తరిముద్దునెమ్మొగము పిన్నమపున్నమచందమామకున్.45

ఉ॥ కల్లరిత్రాచునిప్పుకలుగై కొను కేకిచకోరపాళికిన్
జెల్లినఁజెల్లుఁగాక ! సరసీజబిసంబులిగుళ్లు మేసి భా
సిల్లెడు మీకయో ! విషము చిల్కఁగవేఁడిమిగుల్కఁబల్కఁగాఁ
జెల్లునె యోమదాళపికశేఖరులార ! వచింపుడింపుగన్.46

మొదలగు పద్యములలోఁ గదళీపాకముగానవచ్చును. ఇట్టిపద్యముల రము సికొనుటకుఁగొంచెము శ్రమపడవలసియుండును. విజయవిలాస

43. వి. వి. — ప్ర. ఆ. - ప. 93. 44. వి. వి. — ప్ర. ఆ. - ప. 143
45. వి. వి. — ద్వి. ఆ. - ప. 108. 46. వి. వి. — తృ. ఆ. - ప.193

పద్యములు చాలవఱకు చమత్కారమయములై యున్నవి గనుక తద్విశేష ములనవగతము చేసికొనుటకుఁ గొంతయాలోచనాశక్తియవసరము

ఉ॥ ఊఁదుకపోవుశంఖము నహోగళరేఖ........ 47

మ॥ తనకుంగౌఁగిలియీవొకప్పుడునునాథా........ 48

సీ॥ కలిగెఁబోయీయింతి కులుకుగుబ్బలఁజూడ........ 49

మొదలగు పద్యములలో నీకవీంద్రుఁడర్థగాంభీర్యములను బతాక స్థాయిలోఁ బ్రదర్శించినాఁడు.

*వృత్తులు* : కవితాసామగ్రిలో వృత్తులు ముఖ్యములైనవి. ఇవి రసోపస్కారకములై రసానుగుణముగాఁగవిత్వమును నడుపుటలోఁగవికిఁగల సామర్థ్యమును నిరూపించుచుండును. కావ్యములకు వృత్తులు మాతృకలని భరతముని యభిప్రాయము.

"వర్తతే ఇతి వృత్తిః" అనువ్యుత్పత్తినిఁబట్టి యిది సార్థకనామమై నట్లుతోచును. "వర్తతే అనయాచిత్తమితి కరణసాధనోఽయంవృత్తిశబ్దః" అనిరత్నేశ్వరుఁడు వృత్తిశబ్దవ్యుత్పత్తినిఁగొంచెము వివరించియున్నాఁడు.[50] దీనివలనమనస్సు వికాసాదులయందువర్తించును గనుక దీనికి వృత్తియను సార్థకవ్యవహారమేర్పడినదని యాయాలంకారికునియభిప్రాయము. చిత్త వికాసాదులకిదిసాధనముగూడ నగుననియతఁడు సూచించియున్నాఁడు.

వృత్తులు శబ్దాశ్రితములు నర్థాశ్రితములు నని రెండు విధములుగ విభ జింపఁబడినవి. అభిధాదులు శబ్దవృత్తులుగను, కైశిక్యాదులర్థవృత్తులుగను బరిగణింపఁబడుచున్నవి. రసానుకూలవ్యాపారములేయర్థవృత్తులుగ పేర్కొ నఁబడుచున్నవి. ఇవినాట్యాశ్రయములుగనుక సాక్షాద్రసోపస్కారములై యున్నవి. ఈ వృత్తులర్థాశ్రితములనిచెప్పుసందర్భములో నర్థమనఁగా రస మను నాలంకారికాభిప్రాయమునుగ్రహింపనగును. ఈ యభిప్రాయములనే

47. వి. వి. — ప్ర. ఆ. .... ప. 69    48. వి. వి. — ప్ర. ఆ. - ప. 29

49. ,, — ద్వి. ఆ. — ప. 111    50. స. కం.—రత్నేశ్వరవ్యాఖ్య-పే. 159

క్రోడీకరించుచు రాఘవన్‌గారు "They keep the Concept of the four ancient Vrittis derived from Natya, kaisiki etc. and hold them, as Anandavardhana did, as the name of the development or delineation of such ideas. Artha as are in the Consonance with Rasa"51 అని చెప్పియున్నారు.

అర్థవృత్తులైన యీ కైశిక్యాదులు నాట్యాశ్రయములై కేవలము నాటకములకే పరిమితములై యున్నను దశాంతరములో వానిని పండితులు శ్రవ్యకావ్యములకును సమన్వయించిరి.

ప్రాచీనాలంకారికులు చెప్పినవృత్తి లక్షణములు :

"రసోచితార్థ సంబద్ధపదసంతానశాలినీ
మనోవికాససంకోచవర్తనాత్‌వృత్తి రుచ్యతే"52

అని ప్రకాశవర్షుఁడు చెప్పియున్నాఁడు మనస్సునకు వికాస సంకోచములు గలిగించునట్టి రసోచితార్థపదసముదాయముగలది వృత్తియనియతని యభిప్రాయము.

"రసాద్యనుగుణత్వేనవ్యవ హారోఽర్థశబ్దయోః
ఔచిత్యవాన్ యస్తాఏ వవృత్తయో ద్వివిధాఃస్థితాః"53

అని యానందవర్ధనుఁడుచెప్పియున్నాడు. రసానుగుణమై, యౌచిత్యయుక్తమైన శబ్దార్థవ్యాపారమే వృత్తియని యాయాలంకారికప్రముఖుని యభిప్రాయము.

ఈ సందర్భములోనేధ్వన్యాలోకవ్యాఖ్యానమునందు "రసోచితఏవ చేష్టావిశేషోవృత్తిః"54 అని యభినవగుప్తుఁడు చెప్పియున్నాఁడు. రసోచిత చేష్టావిశేషమే వృత్తియని యభిప్రాయము. మఱియు నితఁడు "వాఙ్మనః

51. S. C. A. S. — V. Raghavan— P. 190
52. రసార్ణవాలంకారము — ప్రకాశవర్షుఁడు — III - 24
53. ధ్వన్యాలోకము — ఆనందవర్ధనుఁడు — III - 33
54. ధ్వ. లోచనవ్యాఖ్య — అభినవ గుప్తుఁడు III లోచన

కాయవ్యాపారము.లవై చిత్ర్యముతోఁగూడిన చేష్టలువృత్తులు'[55]అను నభిప్రాయమును దన యభినవభారతి యను నాట్యశాస్త్రవ్యాఖ్యానము నందుఁదెల్పియున్నాఁడు.

"వృత్తిర్నియతవర్ణగతో రసవిషయోవ్యాపారః"[56] అని మమ్మటుఁడుచెప్పియున్నాఁడు. నియతవర్ణములతోఁగూడిన రసవిషయకవాగ్వ్యాపారము వృత్తియని యతని యభిప్రాయము.

"చతస్రోవృత్తయో హ్యేతాఃసర్వనాట్యస్యమాతృకాః
స్యుర్నాయకాది వ్యాపారవిశేషాఃనాటకాదిషు"[57]

అని విశ్వనాథుఁడు చెప్పియున్నాఁడు. నాటకాదులందలి నాయకాదుల వ్యాపారవిశేషములే రూపకములకు మాతృకలనఁదగినవృత్తులై యున్నవని యతని యభిప్రాము.

"యావికాసేఽథ విక్షేపే సంకోచే విస్తరేతథా
చేతసోవర్తయిత్రీస్యాత్ సావృత్తిః సాపి షడ్విధా"[58]

అని భోజుఁడుచెప్పియున్నాఁడు. దేనిచేఁజిత్తవికాస, విక్షేప, సంకోచ, వస్తరములుగలుగునోయది వృత్తియనఁబడునని భోజుని యభిప్రాయము.

కైశిక్యారభటీభారతీసాత్వతీ వృత్తులు నాల్గును ప్రసిద్ధములైనవిగాఁ బేర్కొనఁబడుచున్నవి. విద్యానాథుఁడీనాల్గింటినర్థవృత్తులుగాభావించియున్నాఁడు కాని ప్రవృత్తులనుబట్టి భారతీవృత్తిని శబ్దవృత్తిగాను, కైశిక్యారభటీ సాత్వతీవృత్తులు మూఁడిటినర్థవృత్తులుగాను బరిగణింపనగును. ఈ విషయమును సింగభూపాలుఁడు "ఆసాంచమధ్యే వృత్తీనాంశబ్దవృత్తిస్తుభారతీ,

55. నాట్య. వ్యా. అ. భా. — అ. గు. — సం, 3., పే. 72

56. కా. ప్ర. — మమ్మటుఁడు — IX

57. సా. ద. — వి. నా, — VI - 723

58. స. కం. — భోజుఁడు - ద్వి. ప. - శ్లో. 34

తిస్రోఽర్థవృత్తయశ్శేషాః"[59] అని తన రసార్ణవసుధాకరములో స్పష్ట పఱచియున్నాఁడు.

"అత్యర్థసుకుమారార్థసందర్భా కైశికీమతా,
అత్యుద్ధతార్థసందర్భా వృత్తిరారభటీస్మృతా;
ఈషన్మృద్వర్థసందర్భా భారతీవృత్తిరిష్యతే
ఈషత్ప్రౌఢార్థసందర్భాసాత్వతీవృత్తిరిష్యతే"[60]

అని విద్యానాథుఁడీ నాల్గువృత్తుల లక్షణములను జెప్పియున్నాఁడు. విద్యానాథుఁడు చెప్పినయభిప్రాయములనే భట్టుమూర్తి.

మ॥ చెలఁగుంగైశికి కోమలార్థరచనా శ్రీసుద్ధతార్థక్రమా
చలితాడంబరమూర్తి యారభటి యీషత్ప్రౌఢసందర్భ ని
శ్చల యౌభారతిపొల్చు సాత్వతియునీషత్కోమలార్థ క్రమం
బుల నీ వృత్తులకున్ యథోచితరసస్ఫూర్తుల్ నిరూపించెదన్.[61]

అను పద్యములోఁ గ్రోడీకరించియున్నాఁడు. అత్యంతసుకుమారార్థమును వర్ణించుట కైశికీవృత్తి. అత్యుద్ధతార్థమును వర్ణించుటయారభటీవృత్తి. ఈషత్ప్రౌఢార్థమును వర్ణించుట సాత్వతీవృత్తి. కాని యీ పద్యములో సాత్వతీ భట్టుమూర్తి భారతీవృత్తుల లక్షణములను దారుమారుగ వర్ణించి యున్నాఁడు.

"కైశికమనఁగాఁ గేశసమూహమనియర్థము. కైశికమువలె చిత్త ద్రుతికారియగు సుకుమారార్థసందర్భముగల కైశికీవృత్తి. ఆరాత్ + భటీ= ఆరభటి. ఉత్సాహముగలభటులకు సంబంధించినదియారభటీవృత్తి. ఇది చిత్తదీప్తికారియగు ప్రౌఢార్థసందర్భముగలిగియుండును. భరతదేశ స్థులచేఁ బ్రయుక్తమగునది భారతీవృత్తి. కొంచెము మృదువైనయర్థసందర్భముగల వృత్తియిది, సత్త్వప్రకాశమైనది మనస్సు. మనః ప్రభవములైన హర్ష

59. ర. సు. — సిం. భూ. — 1, 285
60. ప్ర. రు. — వి. నా — కా. ప్ర. - శ్లో. 25, 26
61. కా. సం. — భ. మూ. - ద్వి. ఆ. - ప. 73

శౌర్యత్యాగాదులు సాత్వతములు. అవి ప్రధానముగాఁగలది సాత్వతీవృత్తి. ఈషత్ప్రౌఢార్థముగలది సాత్వతి"[62] యని చర్లగణపతిశాస్త్రిగారు చెప్పియున్నారు.

ఆలంకారికులిట్లువృత్తుల స్వరూపస్వభావములను వివరించియున్నారు.

*రీతులు :* రీతులు శబ్దాశ్రితములు. అవివృత్తులనాశ్రయించి యుండును. అట్లే వృత్తులు గూడరీతులసహాయమునపేక్షించును. కనుక నివి యన్యోన్యాశ్రయములై యుండును. వృత్తులుసాక్షాద్రసోపస్కారములుకాఁగా రీతులు పరంపరగా రసోపస్కారములగుచున్నవి.

"రియంతే పరంపరయా గచ్ఛంతీతిరీతిః" అని కొందఱు రీతికివ్యుత్పత్తినిఁజెప్పియున్నారు.[63] పరంపరగావచ్చుచున్నవి గనుక వానికిరీతులను వ్యవహారమేర్పడినదనియభిప్రాయము. "రీఙ్ గతావితి ధాతోః సావ్యుత్పత్త్యా రీతిరుచ్యతే"[64] అని భోజుఁడుచెప్పిన వ్యుత్పత్తినిబట్టి గత్యర్థకమగురీఙ్ ధాతువువలనరీతిశబ్దము సిద్ధమైనట్లుతెలియుచున్నది. "రిణంతి గచ్ఛంతి అస్యాంగుణాఃఇతి, రీయతేక్షరతి అస్యాం వాఙ్మధుధారా ఇతివా రీతిః" అని కామధేనువునందురీతివ్యుత్పత్తులు చెప్పఁబడినట్లుసన్నిధానమువారు తెల్పియున్నారు.[65] దీనియందుగుణములునడచును లేక దీనియందు వాఙ్మధుధార స్రవించునని యావ్యుత్పత్తులయభిప్రాయము.

రుచి, గతి, మార్గము, పంథ, వర్త్మము మున్నగునవి రీతికి పర్యాయపదములుగవాడఁబడినవి.

## ప్రాచీనాలంకారికులు చెప్పిన రీతినిర్వచనములు :

"దేశరుచ్యావచోన్యాసోరీతిరిత్యభిధీయతే''[66] అని ప్రకాశవర్షుఁడు నిర్వచించియున్నాఁడు ఆయాదేశీయుల యభిరుచినిఁబట్టి కవులుప్రదర్శించు వాగ్విన్యాసమేరీతియనఁబడునని యతని యభిప్రాయము.

62. సా. సౌం. ద. - చ గ. - సంఘటనా ప్రకరణము - 347, 448, 350, 351
63. సా. సౌం. ద. — చ. గ. — సం. ప్ర. — పే 341
64. స. కం. — భోజుఁడు — II శ్లో॥ 27
65. కా. సం. — స. సూ. సా. — ద్వి. ఆ. — పే 183
66. ర. ఆ. — III — 16

"రీతి రాత్మా కావ్యస్య; విశిష్టపదరచనారీతిః"[67] అని వామనుఁడు చెప్పియున్నాఁడు. కావ్యమునకురీతియే యాత్మయని గుణవిశిష్టపదరచనయే రీతియనియు నతనియభిప్రాయము.

"వచనవిన్యాసక్రమోరీతిః"[68] అని రాజశేఖరుఁడు చెప్పియుండుటను బట్టియతఁడు వాగ్విన్యాసక్రమమునురీతిగాఁబరిగణించినట్లు తెలియుచున్నది.

"రీతిః స్యాత్పదన్యాసభంగీ"[69] అని సింగభూపాలుఁడు చెప్పియున్నాఁడు. పదవిన్యాసపద్ధతి నతఁడు రీతిగాభావించియున్నాఁడు.

"సత్యర్థేసత్సు శబ్దేషు సతిచాక్షరడంబరే
శోభతేయంవినానోక్తిః సపంథాఇతిఘుష్యతే"[70]

అని నీలకంఠదీక్షితుఁడు చెప్పియుండుటనుబట్టి కావ్యశోభాకరమైనది పంథయనితెలియుచున్నది. ఇచ్చట పంథయనఁగా రీతియని యభిప్రాయము.

"రీతిర్నామ గుణాశ్లిష్ట పదసంఘటనామతా"[71]అని విద్యానాథుఁడురీతి లక్షణమును జెప్పియున్నాఁడు. గుణయుక్తములైన పదములకూర్పేరీతియని యతని యభిప్రాయము.

ఇట్లు ప్రాచీనాలంకారికులు రీతుల స్వరూపములను సందర్భానుగుణముగఁదెల్పియున్నారు.

కవితాకాంతకు రీతులంగసౌందర్యమును జేకూర్చును. ఆయా దేశీయులాశ్రయించిన సన్నివేశములనుబట్టి యాయా రీతులాయాదేశనామములచే వ్యవహరింపఁబడుచున్నవి. విదర్భదేశీయులాశ్రయించినరీతి వైదర్భియని, గౌడదేశీయులాశ్రయించినరీతి గౌడి యని, పాంచాలదేశీయులాశ్రయించినరీతి పాంచాలి యనియు వ్యవహరింపఁబడుచున్నవి.

67. కా. అ. సూ. — వామనుఁడు — 1, 2, 6, 8.
68. కా. మీ. — రాజశేఖరుఁడు III — పే. 29
69. ర. సు. — సింగభూపాలుఁడు — I - 327
70. గం. అ. — నీలకంఠ దీక్షితుఁడు — I - 10
71. ప్ర. రు. — వి. నా. — కా. ప్ర. - పే. 46

*రీతిభేదములు* : వైదర్భి, గౌడి, పాంచాలియు ననవి ముఖ్య రీతులుగాఁ బరిగణింపఁబడుచున్నవి. భోజరాజాదులు లాటీయవంతికాదిరీతులను బేర్కొనియున్నను వైదర్భ్యాదిరీతిత్రయమే ప్రచురప్రచారమునొంది ప్రసిద్ధిఁగాంచినది.

> "బంధపారుష్యరహితా శబ్దకాఠిన్యవర్జితా
> నాతిదీర్ఘసమాసాచ వైదర్భీరీతి రిష్యతే
> ఓజఃకాంతిగుణోపేతా గౌడీయారీతిరిష్యతే,
> పాంచాలరీతిఃవైదర్భీగౌడీ రీత్యుభయాత్మికా"72

అని విద్యానాథుఁడువైదర్భ్యాదుల లక్షణములను దెల్పియున్నాఁడు. బంధపారుష్యము, శబ్దకాఠిన్యము, నతిదీర్ఘసమాసములును లేనిదివైదర్భీరీతి. అది సమాసరహితమై, శ్లేషాదిగుణసమంచితమై, విపంచీస్వరసౌభాగ్యయుతమై యుండునని భోజుని యభిప్రాయము. సమాసరహితమై లేక యల్ప సమాసయుక్తమై, వర్గద్వితీయబహుళమై, స్వల్పప్రాణాక్షరయుక్తమై, దశగుణోపేతమై యారీతి యుండునని రుద్రటునియభిప్రాయము. ఓజః కాంతి గుణములతోఁగూడినరచనావిశేషమును గౌడీరీతియందురు. ఇది పరుషాక్షరములతో, కఠినశబ్దములతో, దీర్ఘసమాసములతోనుగూడి యుండును. కొంత భాగము మృదుపదములతో, మఱికొంతభాగము పరుషపదములతో, దీర్ఘ సమాసములతోను గూడియున్న రచనను పాంచాలీరీతి యందురు.

ఇట్టి విశిష్టరచనాత్మకములైన రీతులు రసోపస్కారములై కావ్య శోభనినుమడింపఁజేయుచున్నవి.

వృత్తి, రీతి, గుణ, పాక, రసముల పరస్పర సంబంధమును దెలుపు పట్టిక :

| | *వృత్తి* | *రీతి* | *గుణము* | *పాకము* | *రసము* |
|---|---|---|---|---|---|
| 1) | కైశికి | వైదర్భి | మాధుర్యము | ద్రాక్ష | శృంగార, కరుణములు. |
| 2) | ఆరభటి | గౌడి | ఓజస్సు | నారికేళము | రౌద్రబీభత్సములు. |

72. ప్ర. రు. — వి. నా. — క. ప్ర. - చే. 47, 48.

| | | | | | |
|---|---|---|---|---|---|
| 3) | భారతి | పాంచాలి | ప్రసాదము | కదళి | హాస్య, శాంతా, ద్భుతములు. |
| 4) | సాత్వతి | పాంచాలి | ఔదార్యము | కదళి | వీర, భయానకములు. |

చేమకూర వేంకటకవి తన విజయవిలాసమునందీకవితా సామగ్రి నంతను బాగుగవినియోగించుకొనితన ప్రబంధమునకుత్తమకావ్య గౌరవము లభింపఁజేసినాఁడు. రసానుగుణపదవిన్యాసపై ఖరి యెచ్చటను జెడకుండఁగడు జాగరూకతతోఁదన శైలినినడిపినాఁడు. విజయవిలాసపద్యములను గొన్నిటిని పరిశీలించినచో నతని రసానుగుణశైలీవిన్యాసములు తేటపడును.

ఉ॥ అంటిన ప్రేమజాహ్నవికి సప్పుడ తోడ్కొనివచ్చి యల్లహా
ల్గంటి నిజేశ్వరున్ దనదు గబ్బిచనుంగవఁజేర్చిబాష్పముల్
కంటఁదొరంగుచుండఁ దిరుగంగఁగొంచుఁ గ్రమ్మఱెన్
జంట దొలంగినంజను వెనంటుచు జక్కవపెంటియుంబలెన్.[73]

ఉలూచి తన ప్రియుఁడైన యర్జునుని గంగానదీతీరమునకుఁదీసికొని వచ్చి ప్రేమపూర్వకముగనాలింగనము చేసికొని వెనుదిరిగివెళ్ళుటను జక్కని యుపమానముతోమనోహరముగ వర్ణించినాఁడు. ఇది శృంగారరసాత్మక వర్ణనము. సమాసరహితమై మృదుమధురపదములతోఁగూడియున్న యీపద్య శైలి కైశికీవృత్తిలోను వైదర్భీరీతిలోను నడుపఁబడినట్లుస్పష్టపడుచున్నది.

చ॥ చందన గంధివెన్నుదురుచందురులో నగఁబాల బాలము
ద్దుందెలి చూపులంగజుని తూపులలోపలమేల్తరంబు, లిం
దిందిరవేణిమోవి యెలదేనియలో నికరంపుఁదేటయే
మందము మందయానమొగమందముమీఱునహొవిందమున్.

మ॥ ఒడలుప్పొంగు నొయారిఁజూడ జవరాలొద్దమెలంగన్ గగు
ర్పొడుచున్; ముద్దులగుమ్మగంధకుసుమంబుల్ చేతికందిచ్చున
ప్పుడువ్యాపారములన్నియున్ మఱచు; నప్పూఁబోణిరాకుండినన్
గడెసేపొక్కమహాయుగంబు కరణిన్ గన్పట్టురాచూలికిన్.

73. వి. వి. ప్ర. ఆ. ప 114

ఉ॥ బాలసమీరణంబు పయిపాటున నించుకసోఁకి న్ గడుం
దూలుచునుండుఁ గౌనల పసోదపుసుద్దుల ముద్దుఁజిల్క పై
వ్రాలిసఁ గందుఁ గేలు పువ్వువ. టిది నీననుమేనిదేగతిం
దాళనయో వియోగశిఖి దానెదలోదరికోఁదలోదరీ.[74]

మొదలగు పద్యములీకవీంద్రుని కైశికీవృత్తి వైదర్భీరీత్యాత్మక రచనా రీతికిఁ జక్కని యుదాహరణములు. విజయవిలాసమునందలి పద్యములు చాలవఱకు నిట్టిశైలిలోనే సాగింపఁబడినట్లు కానవచ్చును.

సీ॥ అతులభూరి ప్రతాపార్కదీధితిచేత
గట్టిగాఁ గాకలుపుట్టు పిదప,
ఘోరారి గళరక్తధారాళవృష్టిచే
నాని దుక్కికిఁ బదనైన పిదప,
హయఘట్ట ఖురపుట హల్యాముఖంబున
నంతట దున్నినయట్టి పిదప,
మొలచి నీకీర్తి మొలకలు తఱుచుగా
వెదపెట్టి పెరుగావించు పిదపఁ

తే॥ గాపునిలుపలె బేతాళగణమునెల్ల
నట్టిపట్టుల కరిగి నీవరుల నోదె
చేసితివనుట యేపాటితలఁప
సమరనిశ్శంకరఘునాథ సాహసాంక !

ఉ॥ అంతటద్వారకాపురమునందు సభాపరిపాలుఁడర్జునో
దంతము యాదవుల్ దెలియునట్లు హజారమునందు భేరియ
త్యంతరుషాకషాయితహృదంతరుఁడై చఱపించె మించెది
గ్దంతిఘటాశ్రవఃపుటభిదాచణభీషణభూరిభాంకృతుల్.

ఉ॥ వంచనచేసియిట్లు చెలువన్ గొనిపోవఁ బలంబవైరి సై
రించునె దుర్మదాధిపవరేణ్యుల భూములుదున్ని ధూళిగా

74. వి. వి. — ప్ర. ఆ. 149, ద్వి. ఆ. 149, తృ. ఆ. 32

వించఁడె పిండిపిండిగఁ బ్రవీరవిరోధి కిరీటరత్నము
ల్దంచఁడె ఘోరసీరముసలంబులవ్యర్థములే ధరించుటల్.[75]

మొదలగు పద్యములు రౌద్ర బీభత్సరసాత్మకారభటీవృత్తిగాఢీ రీతులకాటపట్టులైయున్నవి.

క॥ ఎడమకరంబుననేయా
యెడమకరముఁబట్టి బయటికీడిచివైవన్
వడిభూమిక్రఁజూపినకై
వడిఁదొల్లిటిరూపువాసి వాసియెసంగన్.

సీ॥ మృగనాభితిలకంబు బుగబుగల్గల లలా
టముపై మృదూర్ధ్వపుండ్రంబుదీర్చి,
తపనీయకౌశేయ ధౌరేయమగు కటీ
రమునఁగాషాయ వస్త్రముధరించి,
శరణాగతాభయసంధాయకంబైన
దక్షిణపాణిఁద్రిదండముూని,
రణచండకోదండగుణకిణాంకంబైన
డాకేలనునుఁగమండలువు దాల్చి

తే॥ యుండెఁబో శాంతరసమెల్ల నుట్టిపడఁగ
నంగనలవొందురోసి సన్న్యాసియగుట
గద యుచితమెందు నానవమదనమూర్తి
యంగనామణిఁగోరి సన్న్యాసియయ్యె.[76]

మొదలగు పద్యములు భారతీవృత్తికి, పాంచాలీరీతికి నాటపట్టులై యద్భుతశాంతరస నిలయములై యలరారుచున్నవి.

సీ॥ ఏరాజు భుజశౌర్యమేదురలక్షానాది
వ్రజీల చెలిమికివశ్యవిద్య,

75. వి. వి. — అవతారిక - ప. 44, తృ. ఆ. - ప. 160, 164
76. వి. వి. — ద్వి. ఆ. - 45, 81

యేరాజు విక్రమసారంబు విద్వేషి
మహిమపలాయనమంత్రశక్తి

సీ॥ ఘన ఘనాఘనముల కొలసఁ కెలఁకబెట్టు
పాండ్యునివెన్నాడి పాఱఁడఁటిమెఁ,
దుండీరనాథుండు దురమునఁబఱవంగఁ
జూచి ప్రాణము దయఁగాచివిడిచె

ఉ॥ గాళకులావురీభటశిఖామణులెక్కటి యుక్కుతుక్కలా
ఖీలతరాళనుల్ చిదిమిపెట్టినబంటులు వైరికెల్ల

ఉ॥ అమ్మెయి వాజి వారణభటావళిఁగప్పిన తూపులేమనన్

సీ॥ కొండలవలెనున్న కొమ్ముఁగత్తుల భద్ర
దంతావళముల మొత్తములు బలిసి,
యంబుధితెరల చందంబునఁదుటుములై
ఖాసిల్లుకంఖాణ బలములెదిగి,
విరివియై మేఘముల్ పెరిగివచ్చిన జోక
ఘన పతాకలశతాంగములు హత్తి,
వెదురుపొదల్ పేర్చు విధమునఁగనిపించు
గడల పౌజులు సమగ్రముగఁగూడి,

తే॥ యుక్కుపొడిరాల రోషంబు పిక్కటిల్ల
నొకరొకరిఁగేకవెట్టునత్యుగ్రసింహ
రవములుసెలంగ సైనికప్రభులు తార
సిలి రుదారశిలీముఖార్చులునటింప.[77]

మొదలగు పద్యములు సాత్వతీవృత్తిసమేతములు, వీరభయానకరస నిలయములునై యొప్పియున్నవి.

---

77. వి. వి. — ద్వితీరిక—ప. 56, 58 - ప్ర. ఆ. — ప. 10. తృ. ఆ.—ప. 156. 152.

ఇట్లు వేంకటకవితన ప్రబంధశైలిని రసానుగుణవృత్తి, రీతి, పాక విన్యాసవిశేషములతోఁబరాకాష్ఠదశలో నడిపి యాంధ్రకవీంద్రులలోనపూర్వ కీర్తినార్జించినాఁడు.

**అలంకారములు :** అలంకారములు కావ్యశోభా హేతువులై యల రారును. అవి పరంపరగా రసోపస్కారకములై కావ్యస్వరూపమును రమణీ యముగావించును.

"కావ్యశోభాకరాన్ ధర్మానలంకారాన్ ప్రచక్షతే"[78]అని దండి యలం కారములను కావ్యశోభాకరములుగాఁబేర్కొని యున్నాఁడు.

"ఉపస్కుర్వన్తి తంసన్తంయేఽఙ్గద్వారేణ సంశ్రితాః
హారాదివదలంకారాస్తేఽను ప్రాసోపమాదయః"[79]

అని మమ్మటుఁడలంకారస్వభావమును జెప్పియున్నాఁడు. హారనూ పురాదులు శరీరమునలంకరించుచున్నట్లు అను ప్రాసోపమాద్యలంకారములు కావ్యాంగములగుశబ్దార్థముల కుత్కర్షమును గలిగించుచు ముఖ్యమగురస మును విలసిల్లఁజేయుచున్నవని యతని యభిప్రాయము.

"అలంక్రియతేఽనేనేతి చారుత్వహేతురలంకారః; యథాకరచరణాద్య వయవగతైః వలయనూపురాదిభిః తత్తదలంకారతయాప్రసిద్ధైరవయవ్యేహాలం క్రియతే తథా శబ్దార్థావయవగతైరనుప్రాసోపమాదిభిః తత్తదలంకారతయా ప్రసిద్ధైరవయవీభూతంకావ్యముపస్క్రియతే; ఆశ్రయాశ్రయి భావేనాలం కార్యాలంకారభావోలోకవత్ కావ్యేఽపి సంమతః"[80] అని విద్యాధరుఁడు మమ్మటునభిప్రాయమును విశదీకరించియున్నాఁడు.

దీనిచేత కావ్యమలంకరింపఁబడుచున్నది గనుక నిది కావ్యసౌందర్య హేతువై యలంకారమని వ్యవహరింపఁబడుచున్నది. శరీరావయవములగు

78. కావ్యాదర్శము — దండి — ద్వి. ప. — పే. 93, శ్లో. 1
79. కా. ప్ర. — మమ్మటుఁడు — viii — 57.

కరచరణాదులకలంకరింపఁబడిన కంకణనూపురాద్యాభరణములచే నవయవియగు శరీరమే యలంకరింపఁబడినట్లు కావ్యావయవములగు శబ్దార్థములనాశ్రయించియుండు ననుప్రాసోపమాద్యలంకారములచే నవయవియగు కావ్యమేయలంకరింపఁబడును. కనుక నలంకారములు కావ్యమున భూషణభూష్యభావరూపమున నన్యోన్యసంబంధము గలిగియుండును. ఆశ్రయాశ్రయిభావముచేత నలంకార్యాలంకారభావములోకమునందు వలెఁగావ్యమునందుఁగూడ నంగీకరింపఁబడినది.

"చారుత్వంహివైచిత్ర్యాపరపర్యాయం ప్రకాశమానమలంకారః" "శబ్దార్థయోర్వైచిత్త్రిరలంకారః" 81 అని వ్యక్తి వివేకవ్యాఖ్యాత యలంకారమును గూర్చి చెప్పియున్నాడు. వైచిత్ర్యపర్యాయమైన చారుత్వమే యలంకారమని యతని యభిప్రాయము. "యావన్తోహృదయావర్జకాఅర్థప్రకారాః తావన్తోఽలంకారాః'' 82 అను వాక్యములో నిమిసాధువు హృదయావర్జకములైన యర్థప్రకారములపై నలంకారములాధారపడియుండునని తెల్పియున్నాఁడు.

"తత్ప్రతిపాదినోవాచ్య విశేషాఏవరూపకాదయోఽలంకారాః" 83 అని యానందవర్ధనుఁడు రసప్రతిపాదకవాచ్యవిశేషములే రూపకాద్యలంకారములుగఁ బరిగణింపఁబడుచున్నట్లు తెల్పియున్నాడు.

తే॥ "ఇఁకనలంకారనికరంబులేర్పఱింతు
నవియుఁ గవితాలతాంగికిహారకటక

80. ప్ర. రు.— వి నా. — శ. అ. ప్ర. — పే. 244.
81. వ్య. వి. వ్యా. — పే. 4, 44, T S.S.
82. కా. అ. వ్యా. — పే. 140.
83. ధ్వ. ఆ. ఆ. వ. — పే. 87.
84. కా. సం. భ. మూ. — చ, అ. ప. 71.

కంకణాదుల క్రియనలంకరణకరణ
పరిణతులచే నలంకారభావమొందు" 84

అను పద్యములో భట్టుమూర్తి యలంకారపదసార్థకతను దెల్పియున్నాఁడు. హారకటకకంకణాదులవలె నలంకారములు కావ్యకన్యనలంకరించుచున్న కారణమున వానికాపదము సార్థకమైనదని యావిద్వన్ముఖ్యునియభిప్రాయము.

"A figure of speech is a deviation from the plain and ordinary mode of speaking, for the sake of greater effect: it is an unsual form of speech" 85 అని బైన్ అను నాంగ్లవిద్వాంసుఁడ లంకారమునుగూర్చి చెప్పిన విషయమీసందర్భములో నుదాహరింపఁదగి యున్నది. పఠితల మనస్సులపై నధికప్రభావముఁజూపుటకై చెప్పబడునలం కారవాక్యము సామాన్య వాగ్ధోరణికంటె భిన్నమైనదని, యదియసాధారణ వాగ్విన్యాసమనియు నావిపశ్చిద్వరేణ్యుఁడు భావించియున్నాఁడు. "Alankara is the beautiful in Poetry and the beautiful form" 86 అను వాక్య ములో డా. రాఘవన్‌గారు "సౌందర్యమేయలంకారము" అను వామనునభి ప్రాయమును సూచించియున్నారు.

ఇట్లు ప్రాచీనార్వాచీనాలంకారికులు చెప్పిన నిర్వచనములనుబట్టి యలంకారస్వరూపస్వభావములు సువ్యక్తములగుచున్నవి.

అలంకారములు ప్రధానముగ శబ్దార్థభేదములచే రెండువిధములుగ విభజింపఁబడినవి. శబ్దమును మాత్రమే యాశ్రయించునది శబ్దాలంకారము. అర్థమును మాత్రమే యాశ్రయించునది యర్థాలంకారము. శబ్దపరివృత్తిని సహింపనిది శబ్దాలంకారమని, యర్థపరివృత్తిని సహింపనిది యర్థాలం

85. Rhetoric and Composition — C. F. Bain —1
86. S, C. A. S. — V. Raghavan — P. 50.

కారమనియు మమ్మటుఁడు దెల్పియున్నాఁడు. శబ్దచమత్కారమును ప్రదర్శించునది శబ్దాలంకారమని, యర్థచమత్కారమును ప్రదర్శించునది యర్థాలంకారమని కూడ నూహింపనగును.

చేమకూర వేంకటకవి తన విజయవిలాసప్రబంధమును ప్రధానముగ నాలంకారికశైలిలో నడిపినాఁడు. ఆ కవితాశిల్పపారగుని పద్యములన్నియు నలంకారమయములై చెక్కఁబడిన జాతిరత్నములవలెఁ గానవచ్చును. అతని ప్రబంధములో నలంకారచమత్కారములేని పద్యమొక్కటియులేదనుట యతిశయోక్తికానేరదు. సహజముగనతనికి శ్లేషయమకాలంకారములపై ప్రీతి మెండు. శ్లేషయమకములను శిల్పరమణీయముగఁ బరాకాష్ఠదశలోఁ జిత్రించిన భట్టుమూర్తికి సాటిరాఁగలవాఁడాంధ్రవాఙ్మయమున చేమకూర వేంకటకవి దప్ప మఱియొకఁడులేఁడని చెప్పవచ్చును. కనుకనే "శ్లేషయమకచక్రవర్తి" యను బిరుదమతనికివలెనితనికిని సార్థకమైనది. అచ్చికశబ్దవిన్యాసరీతులందు విచిత్రశ్లేషలను, సంస్కృతాంధ్రపదపునఃపునరావృత్తరీతులందు శబ్దచమత్కారవిశేషములను నధికసంఖ్యలోనలవోకగా సాధించుటయందు వేంకటకవి భట్టుమూర్తినిఁగూడమించినాఁడని చెప్పవచ్చును. కనుకనే రాజకవియైన రఘునాథనాయకుఁడతనినిఁ ప్రతిపద్యచమత్కారసాధకునిగా, ననన్యసామాన్యకవితామార్గము గలవానినిఁగను ప్రశంసాపూర్వకముగఁ బేర్కొని యున్నాఁడు.

ఒక్క యమకమునేగాక తదితరశబ్దాలంకారముల, నట్లేశ్లేషనేగాక తదితరార్థాలంకారములను నాయాసందర్భములందీకవీంద్రుఁడు మనోహరముగఁజిత్రించియున్నాఁడు. కొన్ని సన్నివేశములలో నొక్కొక్కపద్యము నందనేకాలంకారములను సాధించుటయందతఁడు ప్రదర్శించినప్రౌఢిమ యపూర్వమైనది.

శబ్దాలంకారములలో వృత్త్యనుప్రాసయమకముల, నర్థాలంకార ములలో రూపకోత్ప్రేక్షార్థాంతరన్యాసశ్లేషకావ్యలింగపరికరాద్యలంకారములను దఱచుగవాడియున్నాఁడు. మిగిలినశబ్దార్థాలంకారములీ ప్రబంధమునఁబరిమిత సన్నివేశములందుఁగాననగును. అతని యాలంకారిక ప్రతిభకు నిదర్శనము లైన కొన్నిపద్యములను స్థాలీపులాకన్యాయముగఁ బరిశీలించుటయీసందర్భ ములో నవసరమైయున్నది.

శా॥ చంద్రప్రస్తరసౌధఖేలనపర..................87

అను పద్యములో నతిశయోక్త్యుదాత్తాలంకారములుగానవచ్చును. ఇంద్రప్రస్థపురమునకు నాకాశగంగయందలి బంగరుపద్మములపై మూగిన తుమ్మెదలకును సంబంధములేకపోయిననున్నట్లు వర్ణించుటచేతనిందతి శయోక్త్యలంకారముగలదు. మఱియు చంద్రకాంతశిలలు, మంచిగంధము, బంగారపుపద్మములు మున్నగు సమృద్ధవస్తువులను మనోహరముగ వర్ణించుటచే నిందుదాత్తాలంకారముగూడఁగలదు.

ఉ॥ నీ సరియైన దేవతటినీంగలఁగించెద..........88

అను పద్యములో నుత్ప్రేక్షశ్లేషాలంకారములు గన్పట్టును. ఇంద్ర ప్రస్థపురమునందలికోటకొమ్మలయొక్క, కందకముయొక్కయు మహో న్నత గంభీరస్థితిగతులవి బాసలుచేసికొన్నరూపములోఁజమత్కారజనకముగ నూహింపఁబడినవిగనుకనుత్ప్రేక్షాలంకారముగలదన వచ్చును. మఱియు నిందలి విష్ణుపద, బలిపీఠశబ్దములు శ్లేషించుచున్నవి. విష్ణుపదము = విష్ణువు యొక్క పాదము, ఆకాశము. బలిపీఠము = దేవాలయమునందలి బలిపీఠము,

87. వి. వి. — ప్ర. ఆ. — ప. 1,
88. ,, — ,, — ప. 5.

పాతాళలోకము. ఇట్లనేకార్థక శబ్దములతోఁగూర్పఁబడినయీపన్ని వేళమునందు శ్లేషాలంకారము గలదనవచ్చును. ఇదియభంగశ్లేష.

క॥ పంచామరతరులో హరి
పంచాయుధములొ గిరీశపంచాస్యములో.........89

అను పద్యమునందుపమానములైన పంచామరతరు పంచాయుధ పంచాస్యములు, నుపమేయమైన పంచపాండవులును సాదృశ్యమువలన సందేహవిషయములుగ వర్ణింపఁబడుటచేత సందేహాలంకారము గలదు. అనిశ్చితసందేహస్థాయి యగుటచేనిది శుద్ధసందేహము.

చ॥ అతనినుతింపశక్యమె జయంతునితమ్ముఁడుసోయగంబునన్ 90

అనుపద్యములో "అతనికతండెసాటి...." అనుచోటనర్జునుఁడేయుప మేయముగనుపమానముగను వర్ణింపఁబడుటచేత ననన్వయాలంకారము, మఱియునుపమేయమైనయర్జునుఁడే ప్రయోజనాపేక్షతో జయంతసహోదరాది రూపములలోననేకవిధములుగ వర్ణింపఁబడుటచేత నుల్లేఖాలంకారమును గలదనవచ్చును.

చ॥ అతివకుచంబులున్ మెఱుఁగుటారును వేనలియున్....91

అనుపద్యమునందు సుభద్రయొక్కకుచములు, మెఱుఁగుటారు, వేనలియనునుపమేయవస్తువులక్రమముననుసరించిధరాధిపోన్నతి, యహీన భూతి, ఘనాభ్యుదయముననునుపమానవిషయములు నిక్కుట, నీల్గుట, విఱ్ఱ

89. వి. వి. — ప్ర. ఆ. — ప. 25.
90. వి. వి. — ,, — ప. 28.
91. ,, — ,, — ప. 34.

వీగుటయను వానిస్థితులును జెప్పఁబడుటచేతఁ గ్రమాలంకారము (యథాసంఖ్యము), "క్షితినటుగాదెయొక్కొకనికిన్ నడుమంత్రపుఁగల్మికల్గినన్" అను లోకసామాన్యవిషయముచేతఁ బ్రకృతసుభద్రాయౌవనస్థితి సమర్థింపఁబడుటచేత నర్థాంతరన్యాసాలంకారమును గలవు.

క॥ కడు హెచ్చుకొప్పు దానిం
గడవన్ జనుదోయి హెచ్చు కటియన్నిటికిన్
గడుహెచ్చు హెచ్చులన్నియు
నడుమే పసలేదుగాని నారీమణికిన్. 92

ఇందు సారవ్యాజస్తుత్యలంకారములు గలవు. ఇచ్చట సుభద్ర యొక్క కొప్పు, చనుదోయి, కటియు నొకదానికంటె మఱియొకటి హెచ్చని వర్ణించుటచేత సారాలంకారము గలదు. మఱియును పద్యము యొక్క చివరిపాదములో నా సుందరాంగియొక్క నడుమే పసలేనిదని నిందాపూర్వకముగాఁ జెప్పుటలో నామె నడుము సన్నముగ నందముగను నున్నదను స్తుతి గమ్యమానమగుచున్నది గనుక వ్యాజస్తుత్యలంకారము గలదని భావింపనగును.

ఆ॥ హిమరసైకసైకతము నందు విహరించు
కైరవేషు వేషు ఘననిభాంగు
నెనరు దవుల దవుల నేచూచి క్రీడిగా
నెఱిఁగియౌర ! యౌరగేందు వదన 93

92. వి. వి. — ప్ర. ఆ. — ప. 39.
93. ,, — ,, — ప. 59.

అను పద్యమునందు ముఖ్యముగ సైక, వేషు, యౌర యను వ్యంజనముల జంటలు వ్యవధానము లేకుండఁ బునరావృతము లైనందువలన ఛేకానుప్రాసమను శబ్దాలంకారము గలదు.

ఆ॥ నువ్వుఁ బువ్వు నవ్వు జవ్వనినాసిక
చివురు సవురు జవురు నువిదమోవి
మబ్బు నుబ్బు గెబ్బు బిబ్బోకవతివేణి
మెఱపు నొఱపుఁ బఱపుఁ దెఱవమేను. 94

అనుపద్యమునందు మొదటిపాదములో ద్వితృయుక్తవకారము, ద్వితీయపాదములో 'వురు' అనువ్యంజనద్వయము, తృతీయపాదములో ద్విరుక్తబకారము, చతుర్థపాదములో 'అపు' అనువ్యంజనద్వయమును జమత్కారజనకములుగఁబునఃపునరావృత్తినొందుటవలన వృత్త్యనుప్రాసమనుశబ్దాలంకారము గలదు. మఱియునిందుపమేయములైన నాసిక, మోవి, వేణి, మేనునుపమానములైన నువ్వుఁబువ్వు, చిగురుటాకు, మబ్బు, మెఱపు ననువానికంటెనధికములైనట్లు మనోహరముగవర్ణించుటచేత వ్యతిరేకాలంకారముగూడఁగలదనవచ్చును.

ఉ॥ శయ్యకుఁదార్పఁగాఁదుఱుముజాఱెనదఁతటఁజక్కదిద్దఁబోఁ
బయ్యెదజాఱె..... .... 95

అనుపద్యమునందు కారణమాలార్థాంతరన్యాసాలంకారములుగలవు. అర్జునుఁడులూచిని శయ్యకుఁజేర్పఁగానా మెకొప్పుజాఱినట్లు, దానిని సరిచేయఁ బోగా పయ్యెదజాఱినట్లు, దానిని సవరించుకొనుసంచలనములోనీవి జాఱి

94. ,, — ,, — ప. 84.
95. వి. వి. — ప్ర. ఆ. — ప. 107.

నట్లును వర్ణించుటలోను త్తరోత్తర సంఘటనలకుఁబూర్వపూర్వములు కారణములగుటవలననచ్చటకారణమాలాలంకారముగలదనిచెప్పవచ్చును. మఱియు "ఎయ్యెడమేలెచూతురు గణింపరు జాణలుజాఱుపాటులన్" అనులోక సామాన్యవిషయముచేతఁ బ్రస్తుతవిశేషము సమర్థింపఁబడుట వలన నిచ్చట నర్థాంతరన్యాసాలంకారముగూడఁగలదనియెఱుంగునది.

తే॥ ఈవెలందియొడల్ పైడిలోవెలంది
యీనెలంతలలాటంబులేనెలంత
యీసుపాణిరదశ్రేణియేసుపాణి
యీబిడారుమృగీమద శ్రీబిడారు 96

ఈ పద్యమాకవీంద్రునియలంకారమయకవితాశిల్పమునకొక చక్కని మచ్చుతునక. ఇందు యమక రూపకాలంకారములు గలవు. ఇందు వెలంది, నెలంత, సుపాణి, బిడారు శబ్దము లర్థభేదముతోఁ జమత్కార జనకముగఁ బునరుక్తములైనవిగనుక యమకమను శబ్దాలంకారము గలదు. మఱియు నా చిత్రాంగదయొక్క శరీరమునకు మేలిమి బంగారమునకు, లలాటమునకుఁ జంద్రరేఖకు, రదశ్రేణికి జాతిముత్తెములకు, నూగారునకు మృగీమదశ్రీకి నభేదవర్ణనము మనోహరముగాఁ జేయఁబడినది గనుక నిటరూపకమను నర్థాలంకారము గూడఁ గలదు.

మ॥ తనకుం గౌఁగిలియీవొకప్పుడును నాథా! నీకరస్పర్శనం
బునగిల్గింగతలె .... .... .... ... 97

96. ,, — ,, — ప. 130.
97. వి. వి. — ప్ర. అ. — ప. 139.

# గుణములు

గుణములు కావ్యశోభాకరములు. మానవునకు గుణములవసరము లైనట్లు కావ్యమునకుఁ గూడ గుణములు ముఖ్యావసరములు. గుణహీనుని లోకులు నిందించునట్లు గుణహీన కావ్యమును నీరసకావ్యముగ నిందింతురు. అలంకారములు లేకపోయినను లోపముండదుగాని గుణములు లేనిచో కావ్యము లోపభూయిష్ఠముగఁగన్పట్టును. గుణములు నిత్యములు. అలంకారముల నిత్యములు. "కావ్యశోభాయాః కర్తారోగుణాః; తదతిశయహేతవస్త్వలంకారాః; పూర్వే నిత్యాః" అను వామనుని వాక్యములీ విషయమును స్పష్టపఱచుచున్నవి.

"శ్లేషాదయోగుణాస్తత్రశౌర్యాదయ ఇవస్థితాః"100 అను వాక్యమును బట్టి విద్యానాథుఁడు శ్లేషాదికావ్యగుణములను శౌర్యాది మానవగుణముల వంటివిగా భావించినట్లు తెలియుచున్నది. శౌర్యాదిగుణములు మానవుని యాత్మధర్మములైనట్లు ప్రసాద మాధుర్యాదిగుణములు కావ్యరసధర్మములగును. అంగియైన రసము నాశ్రయించి గుణములుండును. గుణములు కావ్యమునకు మహోచ్ఛాయ ననుగ్రహించునని యగ్ని పురాణమునందు జెప్పఁబడినది. అవి సంఘటనాధర్మములని భట్టోద్భటాదులు చెప్పియున్నారు. "ప్రయోజకత్వంచాదృష్టాది విలక్షణం శబ్దార్థరసరచనాగతమేవ గ్రాహ్యమ్"101 అని జగన్నాథపండితరాయలు చెప్పియుండుటను బట్టి యతడు గుణములను శబ్దార్థరసరచనా గతములుగ భావించినట్లు తెలియుచున్నది.

100 ప్ర. రు. —— వి. నా. — కా. ప్ర. -

101 ర. గం. ధ. — జ. పం. ప్రథమాననమ్ — పే. 208.

"గుణములు రసవస్త్వలంకార ధ్వనిగతములు, వాచ్యాలంకారాది గతములునై సహృదయాస్వాద యోగ్యములగును" 102 అని ధరణికోట వేంకట సుబ్బయ్యగారు గుణములను గూర్చి చక్కఁగఁ జెప్పియున్నారు.

ఆలంకారికులు పేర్కొనిన గుణములలోఁ గొన్ని దోషపరిహార రూపమున, మరికొన్ని సహజముగఁ గావ్యోత్కర్ష హేతువులగుటవలనను గుణములనుచున్నవి వానిలో స్వతస్సిద్ధముగఁ జారుత్వాతిశయ హేతువులైనవే యుత్కృష్టగుణములుగఁ బరిగణింపఁ బడుచున్నవి.

భరతుఁడు తన నాట్య శాస్త్రమునందు దశగుణములను బేర్కొని యున్నాఁడు. భామహుఁడా దశగుణములను బేర్కొని, వానిలో ప్రసాద మాధుర్యోజోగుణములు మూఁడే ముఖ్యములని చెప్పియున్నాఁడు. దండి, వామనుఁడును భరత మార్గము ననుసరించి యా దశగుణములనే బేర్కొని యున్నారు. ఆనందవర్ధన మమ్మటాదులు మాత్రము ప్రసాదమాధుర్యోజో గుణములను మూఁడిటినే పరిగ్రహించినారు.

"అలంకృత మపి కావ్యం నకావ్యం గుణవర్జితమ్
గుణయోగస్తయోర్ముఖ్యో గుణాలంకార యోగయోః" 103

అని భోజుఁడు గుణరహితమైనది కావ్యము కాదని వక్కాణించియున్నాఁడు. భోజుఁడు, విద్యానాథుఁడు నిరువదినాలుగు గుణములను బేర్కొని యున్నారు. సాధారణముగాఁ దన కావ్యాలంకార సంగ్రహ రచన మునందు విద్యానాథుననుసరించిన భట్టుమూర్తి యీ సందర్భములో వామనా దుల మతముననుసరించి దశగుణములనే బేర్కొనియున్నాఁడు. మొత్తము

102 రసగంగాధరవరివస్యావివరణము .... .... ధ. వేం. సు .... అధి,1 .... పే. 289
103. స. కం ... భోజుడు .... పరిచ్ఛేదః _ 1 శ్లో. 59

మీద నాలంకారికులలో సర్వసంఖ్యాకులు దశగుణములకే ప్రాధాన్యమొసంగి నట్లు కానవచ్చుచున్నది.

గుణములు రసధర్మము లగుటవలన గుణము లెచ్చటనుండునో రస మచ్చటనుండునని, యట్లే రసమెచ్చటనుండునో గుణములచ్చట నుండు ననియుఁ దెలియుచున్నది.

శ్లేషము, ప్రసాదము, మాధుర్యము, సౌకుమార్యము, సమత, అర్థవ్యక్తి, ఔదార్యము, కాంతి, ఓజస్సు, సమాధియనునవి దశగుణములు.

చేమకూర వేంకటకవియొక్క విజయవిలాసప్రబంధము గుణగరిష్ఠమై రసభరితరమణీయకావ్యముగ రాజిల్లుచున్నది. సన్నివేశమునుబట్టి, రసస్థితిని బట్టియు నాప్రబంధరాజమునందలి పద్యములాయాగుణముల కాట పట్టులై యలరారుచున్నవి.

**శ్లేషము :—** వేఱువేఱు పదములు సంధివలసఁ బరస్పరము కలసి యేకపదముగ భాసిల్లుట. దీనికి గాఢము, మసృణత్వ మను నామాంతరములు గలవు.

ఉ॥ ఎంచను విద్యమేలెఱుఁగరెవ్వరెఱింగినఁ
గొంతమాత్రమే .... .... 104

ఉ॥ కోపమొకింతలేదు, బుధకోటికిఁ గొంగుఁబసిండి........105

ఉ॥ ఇత్తరళాక్షి మేనిజిగియేలిక మేలికడానిపైడికీ.... .... 106

మొదలగు పద్యములు శ్లేషగుణభూయిష్ఠములై యలరారుచున్నవి.

104. వి. వి. — అవతారిక. — ప. 55
105 ,, — ద్వి. ఆ. — ప. 23.
106. ,, — ద్వి. ఆ. — ప. 108.

2. ప్రసాదము :- సులభముగ నర్థములగు ప్రసిద్ధపదములను వాడుట.

ఉ॥ ఆ దరహాసచంద్రికలయందము, నాప్తులమీదఁ
జిల్కు .... .... 107

మ॥ ఒడలుప్పొంగు నొయారిఁజూడ జవరాలొద్దన్
మెలంగన్ .... .... 108

శా॥ పన్నీటన్ జలకంబులార్చి చలువల్ పైఁ గట్టఁగానిచ్చి
.... .... 109

మొదలగు పద్యములలోఁ బ్రసాదగుణము గానవచ్చును. ప్రసిద్ధము లైన లోకోక్తులతో, జాతీయములతోను నిండియున్న విజయవిలాస పద్యములు చాలవఱకు ప్రసాదగుణయుక్తములై యుండును.

3. మాధుర్యము :- దీర్ఘసమాసముల జోలికి పోకుండ సరసములగు విడివిడి పదములను గూర్చుట. "పృథక్పదత్వంమాధుర్యం" అని వామనుఁడు చెప్పిన లక్షణముగూడ నీయభిప్రాయమును స్పష్టపఱచుచున్నది.

ఉ॥ చెక్కులయందమున్ మొగముచెల్వమ్ముఁ జన్గవనీటు
.... .... 110

చ॥ బలిమిని బట్టఁగాఁ దివురుఁ బట్టిన నొప్పకయిట్టటన్నచో
.... .... 111

107. వి. వి. — ప్ర. ఆ. — ప. 68.
108. ,, — ద్వి. ఆ. — ప. 149
109. ,, — తృ. ఆ. — ప. 38.
110. ,, — ప్ర. ఆ. —, ప. 86.
111. ,, .... ద్వి. ఆ. — ప. 145.

మొదలగుపద్యములలో మాధుర్యగుణము కాననగును.

4. సౌకుమార్యము :- అనుస్వారయుతములైన కోమలవర్ణములు గల పదముల కూర్పు. "సుకుమారాక్షరప్రాయం సౌకుమార్యం తదుచ్యతే; సుకుమారత్వం నామ సానుస్వార కోమలవర్ణత్వమ్. .... .... 112

అను వాక్యములలో సౌకుమార్యగుణలక్షణమును విద్యానాథుఁడు చక్కఁగాఁ బ్రతిపాదించియున్నాఁడు. "అపారుష్యం సౌకుమార్యం" అను వామనుని లక్షణమునుబట్టి పరుషవర్ణములులేని పదబంధమును గూడ సౌకుమార్యముగ భావింపవచ్చును.

ఉ॥ చందనగంధినెన్నుదురు చందురులోసగఁబాల .... .... 113

ఉ॥ అంగము జాళువాపసిడియంగము క్రొన్నెలవంక
నెన్నొసల్ .... .... .... 114

ఉ॥ చంద్రకిపింఛలాంఛనుఁడు చంద్రికలీనెడు
నవ్వుమోముతో ... ... ... 115

మొదలగు పద్యములలో నీ సౌకుమార్య గుణము సరసస్థాయిలోఁగాన వచ్చుచున్నది.

5. సమత :– వైషమ్యము లేకుండ పాదములను సమానప్రతిపత్తితో నడుపుట. పద్యము నేమార్గమున నుపక్రమించెనో యా మార్గముననే మిగిలిన పాదములనన్నిటిని నడుపుచు ముగించవలెనని యభిప్రాయము.

112. ప్ర. రు. — వి. నా. — గు. ప్ర. .... పే. 235.
113. వి. వి. — ప్ర. ఆ. — ప 149
114. ,, .... ,, .... ప 40
115. ,, ... తృ. ఆ. ... ప 131

ఉ॥ మాటలనేర్పులా! సరసమార్గములా! కొలువుండు
రీతులా! .... 116

శా॥ దేవబ్రాహ్మణభక్తిప్రోవు, ప్రియవక్తృత్వంబు
కాణాచి .... 117

సీ॥ ఎగుబుజంబులవాఁడు మృగరాజమధ్యంబు
పుడికి పుచ్చుకొను నెన్నడుమువాఁడు .... 118

మున్నగు పద్యములలో సమతాగుణము సక్రమముగ పాటింపఁబడినది.

6. *అర్థవ్యక్తి* :- వినినవెంటనే యర్థమును స్పష్టముగ గోచరింపఁజేయు పదముల కూర్పు. దీనినర్థదీపన మనిగూడవ్యవహరింతురు.

ఉ॥ చక్కఁదనంబు రూపునఁబొసంగుటెకాదు
గుణంబులందునున్ .... 119

ఉ॥ సుందరి రానిచో నెదురుచూచుచు నుండనెపట్టె .... 120

ఉ॥ ఎక్కడనైన వేడుక మెయిన్ శుభవేళలఁబాను
పెక్కుచో ... 121

మొదలగు ననేక పద్యములర్థవ్యక్తికుదాహరింపఁదగియున్నవి. వెంకటకవి సాధారణముగ నిగూఢార్థయుతపదములను పరిహరించి శబ్దార్థసారళ్యములను దన విజయవిలాసమునందు సాధించినాఁడు.

116. ,, — అవతారిక .... ప 28
117. ,, .... ప్ర. ఆ. .... ప 20
118. ,, .... ద్వి. ఆ. .... ప 164
119. ,, ... ప్ర. ఆ. .... ప 158
120. ,, .... ద్వి. ఆ. .... ప 147
121. ,, .... తృ. ఆ. .... ప 202

7. ఔదార్యము :- వికటాక్షరయుక్తములైన పదముల కూర్పు. "వికటాక్షరబంధత్వమార్యైరౌదార్యమిష్యతే" అను విద్యానాథునియౌదార్యలక్షణమును వ్యాఖ్యానించుచు కుమారస్వామి సోమపీథి "ఔదార్యం నామ వికటాక్షరబంధత్వం; తచ్చ నర్తనబుద్ధ్యుత్పాదకపదవిన్యాసః" ... .... 122 అని వికటాక్షరబంధవిన్యాసవైఖరిని స్పష్టపఱచియున్నాఁడు. నర్తించునట్లుండు వర్ణములతోఁ గూడిన పదముల కూర్పని యభిప్రాయము. వామనుఁడు గూడ "వికటత్వముదారతా" యని దీని లక్షణమును బేర్కొనియున్నాఁడు. "కతిపయ సంయుక్తాక్షరవితతం ఔదార్యము" 123 అని భట్టుమూర్తి దీని లక్షణమును నూతన ధోరణిలోఁ జెప్పియున్నాడు.

శా॥ చంద్రప్రస్తరసౌధఖేలనపరశ్యామాకుచద్వంద్వ 124

భుజంగప్రయాతము :- సునాసీరసూనుండు సూచెన్నిమజ్జ
జ్జనౌఘోత్పతత్పంకశంకాకరాత్మ 125

పంచచామరము :- జొహారు మీకుఁజల్లఁగాఁగఁజూచుఁడో సమీరకం
జహారులార ! 126

మున్నగు పద్యములలో నౌదార్య గుణము తారస్థాయిలోఁగానవచ్చుచున్నది.

8. కాంతి :- అత్యుజ్జ్వలపదబంధము. శ్రవణసుభగ పద గుంఫనమని యభిప్రాయము. దీనిని విచిత్రవర్ణావృత్తులుగల పదముల కూర్పుగ భట్టుమూర్తి భావించియున్నాడు.

122. ప్ర. రు. .... రత్నాపణవ్యాఖ్య .... పే 236
123. కా. అ. సం .... చ. అ. .... ప 65
124. వి. వి. — ప్ర. ఆ. ... ప 1
125. ,, .... ,, .... ప 47
126. ,, తృ. ఆ. — ప 49

ఆ॥ హిమరసైక సైకతమునందు విహరించు
 కైరవేషు వేషు ఘననిభాంగు.... .... 127

ఆ॥ నలినలీల సంచు నలినలిగావించు
 నించుమించులాడు నించుమించు .... .... 128

క॥ అన్నన్న! మొగము వెన్నని
 యన్నన్న జయించఁగన్నులన్నన్ .... .... 129

మొదలగు పద్యములలోఁగాంతి గుణము కమనీయస్థితిలోఁగానవచ్చుచున్నది.

9, ఓజస్సు :—దీర్ఘసమాసయుక్తమగు రచన. విద్యానాథుఁడు "ఓజస్స మాసభూయస్త్వమ్" అని చెప్పిన లక్షణములో నీవిషయము సూచింపఁబడినది. "గాఢ బంధత్వమోజః" అని వామనుఁడు చెప్పియున్నాఁ సంయుక్తద్విత్వాక్షరములతోఁగూడిన సమాసభూయిష్ఠమగు రచనమని యభిప్రాయము.

సీ॥ ఘోటకఖురపుటక్షుణ్ణధరాజాత
 పాంసువు పైనుల్లభంబుగాఁగ .... ... 130

ఉ॥ అమ్మెయి వాజి వారణభటావళిఁగప్పిన తూపులేమనన్ 131

ఉ॥ అంతట ద్వారకాపురమునందు సభాపరిపాలుఁడు ....132

మొదలగు పద్యములలో నోజోగుణముగానవచ్చుచున్నది.

---

127. వి, వి, — ప్ర. ఆ. — ప 59
128. ,, — ,, — ప 38
129. ,, — ,, — ప 83
130 ,, — అవతారిక — ప 40
131 ,, — కృ. ఆ — ప 156
132 ,, — ,, — ప 160

10. సమాధి:– ఒక వస్తువుయొక్క ధర్మమును వేఱొక వస్తువుపై నారోపించుట. "ఆరోహావరోహక్రమస్సమాధిః" అని వామనుఁడు దీని లక్షణమును జెప్పియున్నాఁడు. ఆరోహణక్రమమున గుర్వక్షరముల, నవరోహణక్రమమున లఘ్వక్షరములనుగూర్చుటయని యభిప్రాయము.

మ॥ రసికుండౌరఘునాథుకీర్తిసతి యౌరా! తొల్లివాగ్బంధమున్ 133

సీ॥ బలవైభవంబుచే గెలుచుమాత్రమెకాదు
గమనలీలనుగెల్చుగంధకరిని.... 134

సీ॥ కలిగెఁబో యీయింతి కులుకు గుబ్బలఁజూడ
శీతశైలాదులసేవ ఫలము .... 135

మొదలగు పద్యములలో సమాధి గుణము సరసస్థాయిలోఁ గానవచ్చుచున్నది.

ఇట్టి ప్రముఖపదబంధములతోఁగూడిన రమణీయపద్యములు చేమకూర వేంకటకవియొక్క గుణగరిష్ఠరసవత్కవితారీతిని వేనోళ్ళఁజాటుచున్నవి.

## వర్ణనములు

ప్రబంధములందు వర్ణనములు ప్రముఖపాత్ర వహించును. ప్రబంధ కవిత్వమునకవి చైతన్యప్రదములు. ఆంధ్రవాఙ్మయమునందేకాక ప్రపంచ సాహితీక్షేత్రములందుఁ గూడ నాంధ్రప్రబంధములకవి యొక విలక్షణస్థానము నంపాదించిపెట్టినవి. కవీంద్రుల భావనాపటిమలకవి ప్రబలనిదర్శన

133 వి వి ... అవతారిక .... ప 18
134 ,, .... ద్వి ఆ ... ప 72
135 ,, .... ,, .... వ 111

ములు. వస్తుసమగ్ర చిత్రణమునకవి యాధారభూతములు. సమయానుగుణ ములగు వివిధవర్ణనముల మూలమున కవి తనకావ్యమునందు రసస్ఫూర్తిని గలిగించును.

"కవనీయంకావ్యం" అని యభినవగుప్తుఁడు చెప్పిన కావ్యలక్షణ మును బట్టి, వర్ణింపఁదగినది కావ్యము, అని తెలియుచున్నది. కావ్యము నకు వర్ణనములకు నవినాభావసంబంధముగలదు. అట్లే "కవయతీతికవిః" అను విద్యాధరుని వాక్యమునుబట్టి వర్ణించు సామర్థ్యము గలవాఁడు కవియని తెలియుచున్నది. లోకోత్తర వర్ణనానైపుణ్యము గలవాఁడే కవియని మమ్మ టుఁడు తెల్పియున్నాఁడు. ఈ ప్రముఖాలంకారికవచనములను బట్టి కావ్యము లందు వర్ణనములకుఁగల ప్రాధాన్యము వ్యక్తమగుచున్నది.

ఆంధ్రవాఙ్మయమవతరించిన నాఁటినుండి నేటివఱకు వర్ణనాత్మక కవిత్వమువర్ధిల్లుచున్నది. నన్నయతిక్కనల యాశయముల కనుగుణముగ వారి కవిత్వములందు వర్ణనములు సంగ్రహరూపమునఁగానవచ్చును. నన్నె చోడుఁడు తన కుమారసంభవమునందు వర్ణనాత్మక కవిత్వమున కతివేల ప్రాధాన్యమునిచ్చి ప్రబంధకవితాసౌధనిర్మాణమునకుఁ దగిన పునాది వేసి నాడు. ప్రబంధకవితాసుందరికి తొలిరూపరేఖలు తీర్చిదిద్దినవాఁడతఁడే. ఆంధ్ర సాహితీక్షేత్రమునఁ ప్రబంధకవితాబీజములు చల్లి యెఱ్ఱన ప్రబంధపరమేశ్వ రుఁడుకాఁగాఁ, దత్కవితాలతను సర్వాంగసుందరప్రబంధరచనారూపమున ఫలింపఁజేసి పెద్దనార్యుఁడాంధ్ర కవితాపితామహుఁడై నాఁడు, "భారతమున వ్యక్తావ్యక్తముగ, నెఱ్ఱనలో నంకురముగను, సోమునిలో మొలకగనుబొడ సూపిన ప్రబంధలత శ్రీనాథుని కాలమునఁ గొనలుసాగి చిగిర్చి మారాకు వైచి, శ్రీకృష్ణదేవరాయల కాలమున పుష్పఫల సమన్వితయైనది." 136

136. ఆ. ప్ర. అ. వి. — కె. వి. ఆర్. నరసింహము .... ఉపోద్ఘాతము — పే. 9.

అని కాకర్ల వేంకటరామనరసింహముగారు విజ్ఞతాపూర్వకముగననిన మాటలీ సందర్భమున స్మరణీయములై యున్నవి

ప్రాచీనాలంకారికులు పేర్కొనిన నిబద్ధకావ్యమునే ప్రబంధముగాఁ బరిగణింపనగును. పూసలను దారము దగ్గరకుఁ జేర్చునట్లు ప్రబంధము నందుఁ బూర్వోత్తరపద్యములకితివృత్తము సంబంధమును గూర్చును. సూత్రప్రాయముగా పురాణములనుండి స్వీకరించిన యితివృత్తమును సర్వాంగసుందరముగవిస్తరింపఁజేయుటకు వర్ణనలత్యావశ్యకములు. అట్టి వర్ణనము ప్రబంధ కవిత్వమునకు ముఖ్యాంగము. ఈ వర్ణనములే పురాణములకుఁ ప్రబంధలకునుగల భేదమును నిరూపించుచున్నవి. అష్టాదశవర్ణనాత్మకములైన ప్రబంధములుత్తమములుగఁ బరిగణింపఁబడుచున్నవి.

"నగరార్ణవశైలర్తుచంద్రార్కోదయవర్ణనమ్
ఉద్యానసలిలక్రీడామధుపానరతోత్సవాః
విప్రలంభోవివాహశ్చ కుమారోదయవర్ణనమ్
మంత్రద్యూతప్రయాణాజినాయకాభ్యుదయాఅపి
ఏతానియత్రవర్ణ్యంతేతన్మహాకావ్యముచ్యతే
ఏషామష్టాదశానాంమ్యైః కైశ్చిదూనమపీష్యతే" 137

అని విద్యానాథుఁడష్టాదశవర్ణనములనుబేర్కొని, యవియెచ్చటవర్ణింపఁబడునోయది మేమహాకావ్యమనఁబడునని, యాపదునెనిమిదివర్ణనములలోఁ గొన్నిలోపించిననుమహాకావ్యత్వమునకుభంగము గలుగదనియుఁజెప్పియున్నాఁడు. ఈనగరసముద్రపర్వతాదివర్ణనములను కేవలముసాంకేతికధోరణి

137. ప్ర. రు. — కా. ప్ర — శ్లో. 68, 69, 70.

లోఁగాక కథాక్రమసందర్భమునకనుగుణముగఁదగినమోతాదులలోఁజేయవ లెను. వస్తువును పాఠకులహృదయములకు హత్తుకొను నట్లుచేయుటయేవర్ణ నములపరమలక్ష్యమైయుండవలెను. వర్ణనాత్మకసన్నివేశములలోనిగ్రిహాళ క్తినిఁబ్రదర్శించినయాంధ్రప్రబంధకవులరుదుగఁ గానవత్తురు. వస్తుబాహ్యా కారవర్ణనముతోనే తనివిఁజెందకయాంతరప్రకృతినిఁగూడఁగవిసమగ్రముఁగ వర్ణించినప్పుడే ప్రబంధవర్ణనము పరాకాష్ఠదశనొందును.

చేమకూర వేంకటవి సమయోచితములైన సరసవర్ణనలతోఁదనవిజయ విలాసమును సర్వాంగసుందరముగఁదీర్చిదిద్దినాఁడు. సూత్రప్రాయమైన యితి వృత్తమునువివిధవర్ణనలతోఁబెంచి మూఁడాశ్వాసముల ప్రబంధముగ విస్తృత పఱచినాఁడు.అష్టాదశవర్ణనలకు సందర్భపూర్వకస్థానములుగల్పించి తనగ్రంథ మునకుఁబ్రముఖప్రబంధగౌరవమునుసాధించినాఁడు. ఈప్రబంధమునందున్న మొత్తము672 పద్యములలో525 పద్యములు వర్ణనాత్మకవిన్యాసములతోఁ గూడియున్నవి. మిగిలిన147పద్యములుమాత్రమే ప్రధానకథాగతితోఁబ్రత్యక్ష సంబంధము గలిగియున్నవి. ఇట్టి వర్ణనాత్మకపద్యసంఖ్యాధిక్యమునుబట్టి విజయవిలాసమునందు వర్ణన లత్యధికస్థానము నాక్రమించుకొనియున్నట్లు తెలియుచున్నది.

ప్రబంధకవితాసంప్రదాయానుగుణముగవేంకటకవి తనవిజయవిలాస మునందు మొట్టమొదటనింద్రప్రస్థపురమును,చాతుర్వర్ణ్యమును, ప్రాకారపరి ఖలను,సౌధములను,గజతురగపదాతులను,పుష్పలావికలను.నాట్యకత్తెలను, వారకాంతలను మనోహరముగ వర్ణించియున్నాఁడు[138] అనంతరమైదుపద్య

138. వి. వి. — ప్ర. ఆ. — ప. 1 నుండి 18 వఱకు.

ములలో ధర్మతనూజుని ధార్మికప్రవృత్తిని, శాంతిదయాద్యుత్తమ గుణగణము లను, పరిపాలనాదక్షతను మనోజ్ఞముగవర్ణించినాఁడు.139 కవి యర్జునుని సౌశీల్యమును వర్ణించినసందర్భమునఁబ్రత్యక్షముగను.140 ఉలూచి యర్జునునిఁ జూచి యతనిసోయగమును బ్రశంసించిన సందర్భమున, 141 నర్జునుడుమణిపురమునకేగినపుడతని యందచందములనుజూచి పురజనులు, మలయధ్వజుఁడును మెచ్చుకొనినసన్నివేశమునందు, 142 నర్జునుఁడునందాద్యప్సరసలకుశాపమోచనముగావించి నపుడు వారుకృతజ్ఞతాసూచకముగ నతనినభినందించిన సందర్భమున, 143 నర్జునుని యోగక్షేమములనుగూర్చిసుభద్ర కపటసన్న్యాసినడిగినసమయమున, 144 కోపించిన బలరాముని శాంతపఱచుచు శ్రీకృష్ణుఁడర్జునుని బలపరాక్రమములను బ్రశంసించనసందర్భము నందును145 బరోక్షముగను, యాదవవీరులతో నర్జునుఁడుయుద్ధముచేసి నపుడతనిశరలాఘవమునుగొనియాడినపుడు 146 మరలప్రత్యక్షముగను నాయకవర్ణనచేసి తదుత్కర్షనుప్రదర్శించి వేంకటకవి ప్రాబంధికమర్యాదను పాటించినాడు.

విజయవిలాసమునందు సుభద్రావర్ణనము ప్రముఖస్థానమునలంకరించియున్నది. అదిప్రధాననాయికావర్ణనమై శృంగారరసపరాకాష్ఠదశకాటపట్టయియున్నది. సుభద్రావర్ణనమీప్రబంధమున రెండు చోట్లఁజేయఁబడినది అర్జునుని కడగదుఁడు కావించిన సుభద్రాసౌందర్యప్రశంసాత్మక

| | | | | | |
|---|---|---|---|---|---|
| 139. | ,, | | — | ప. 19 నుండి 23 వఱకు. | |
| 140. | ,, | | — | ప. 27 నుండి 30 వఱకు. | |
| 141. | వి. వి. | ప్ర. ఆ. | .... | ప | 64 నుండి 71వఱకు |
| 142. | ,, | ,, | .... | ప | 156 నుండి 158 ,, |
| 143. | ద్వి.ఆ | ,, | — | ప | 73 ,, 75 ,, |
| 144 | ,, | ,, | — | ,, | 164, |
| 145 | తృ.ఆ | ,, | .... | ,, | 169 ,, 172 ,, |
| 146 | ,, | ,, | — | | 153, 154 |

వర్ణనమొకటి ప్రథమాశ్వాసప్రారంభదశలోఁ గానవచ్చును. [147] అర్జునుఁడు ప్రవాసతీర్థమునఁ గ్రీడించుచు సుభద్రారూపరేఖావిలాసములు స్మరించిన ఘట్టమున రెండు పద్యములలోను, [148] సుభద్రా సుందరాంగి నతఁడు ప్రత్యక్షముగఁజూచి యామె సౌందర్యాతిశయమును బ్రశంసించిన సన్నివేశము నందు మరలపదిపద్యములలోద్వితీయాశ్వాసమునందు సుభద్రా వర్ణనచేయఁబడినది. [149]

వేంకటకవిచేసిన మొదటి సుభద్రావర్ణన మీప్రబంధమున శృంగార రసాంకురస్థితికి, వస్త్వైక్యమునకు, ప్రధాన నాయికా వృత్తాంత ప్రాధాన్య మునకు, నాయికపై నాయకునకను రాగోదయమైనట్లు సూచించుటకును బాగుగఁ దోడ్పడినది.

అట్లే యులూచీవర్ణనము గూడఁ బ్రథమాశ్వాసమునందు రెండు చోట్లఁ జేయఁబడినది. అర్జునుడుఁ నాగలోకమున సౌందర్యరాశియైన యులూచినిఁజూచి యాశ్చర్యపడిన సన్నివేశమునందు, [150] నాగలోకము నుండి గంగాతీరమునకుఁ దిరిగివచ్చి యర్జునుఁడు దన చెలికాఁడైన విశార దునితో జరిగిన వృత్తాంతమును జెప్పిన సందర్భమునందు నులూచీ వర్ణన ముగాన వచ్చును. [151] మఱియు నులూచ్యర్జున సంవాదఘట్టమీ ప్రబంధము నందు శృంగారరసవర్ణనాత్మకమై ప్రముఖపాత్రవహించి సరసపాఠక లోకమునాకర్షించుచున్నది.

సుందరాగుఁడగు నర్జునునిఁ జూచినప్పుడులూచీహృదయములో

147 ప్ర. ఆ — ,, .... 32 నుండి 40 వరకు

148 ద్వి. ఆ. .... ,, .... 78, 79

149 ,, .... ,, .... 102 నుండి 111

150 వి వి ప్ర. అ ప. 76, 82నుండి 86వరకు.

151. 117 121

గలిగిన భావసంచలనము "గుట్టసియూగ గబ్బిచను గుట్టలపైఁ బులకాంకుఁ రావఁకల్ ......152" అను పద్యములో మనోహరముగ వర్ణించినాఁడు. ఇందుఁ గొన్ని సాత్త్వికభావములను వర్ణించినాఁడు. ఆమెచలింపకుండ దండ కట్టుకొని నిలఁబడి యర్జునునిఁ జూచినట్లు వర్ణించుటవలన స్తంభము, వక్షోజములపై పులకాంకురావఁకులేర్పడినట్లు వర్ణించుటవలన రోమాంచమునను సాత్త్వికభావము లిచ్చట సూచింపఁబడినవి. ఇది యాకవీంద్రుని రసనిర్భర ప్రబంధస్థితికిఁ గూడ సూచికయని భావింపఁగును.

రసోత్పత్తికి దోహదముచేయు విభావాదులలో సాత్త్వికభావములు ముఖ్యమైనవి. "పరగతసుఖాదిభావనాభావితాంతఃకరణత్వం సత్త్వం, తతో భవాః సాత్త్వికాః"153 అని విద్యానాథుఁడు సాత్త్వికభావలక్షణమును దెల్పియున్నాఁడు. ఇతరులకష్టసుఖములనుభావించుటవలన మనస్సునకుఁగల్గుతన్మయత్వము సత్త్వమని, దానివలననేర్పడునవి సాత్త్వికభావములనియు నతని యభిప్రాయము. అట్టిసాత్త్వికభావములచేత, విభావానుభావవ్యభిచారిభావములచేత నాస్వాద్యమానముగఁజేయఁబడు స్థాయీభావమే రసమని యాలంకారికుల యభిప్రాయము.

"విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః
ఆనీయమానస్వాదుత్వం స్థాయీభావో రసః స్మృతః"" 154

అని ధనంజయుఁడు చెప్పిన రసలక్షణము వలన నీవిషయము ద్యోతకమగుచున్నది.

విజయ విలాసకారుఁడు వర్ణనాత్మక సన్నివేశములలో నిట్టి ప్రామాణిక సూచనలు చేసియుండుట వలన నతని కవిత్వము కు లాక్షణికప్రతి

152. ,, ,, ,, 61
153. ప్ర. రు. ర. ప్ర. పే. 159.
154. ద. రూ. ధనంజయుడు VI. ..

పత్తి, తత్కారణమున నతని ప్రబంధమునకుఁ గవి పండితసమాదరణ స్థితియు లభించినవి

చేమకూర వేంకటకవి తన విజయవిలాసమును శృంగారరస మయము గావించినాఁడు. సంభోగవిప్రలంభరూపములలో శృంగారము రెండు విధములుగ విభజింపఁబడినది. సాధారణముగఁ బ్రబంధకవులు విప్రలంభశృంగారమునే విరివిగా వర్ణింతురు. నాయికానాయక సమాగమ సన్నివేశములందు సంభోగశృంగారమును సంగ్రహముగ వర్ణింతురు. ప్రవిలంభశృంగారమునకే కావ్యమునందుఁ బ్రాధాన్యము నీయవలెనను నియమమునకనుగుణముగఁ బ్రబంధయుగమునకుఁ జెందిన పర్బంధకవులు తమ ప్రబంధములందు విప్రలంభశృంగారమునకే యత్యధికప్రాధాన్యము నిచ్చియున్నారు. కాని విజయవిలాసకారుఁడాశృంగార భేదములు రెండిటికిఁ బ్రాధాన్యము నిచ్చియున్నాఁడు. విజయవిలాసశృంగారాత్మకవర్ణనములను జాగరూకతతోఁ బరిశీలించినచో విప్రలంభశృంగారమునకు కంటె సంభోగశృంగారమునకే సమధికప్రధాన్యము నిచ్చినట్లు తేటపడును. తృతీయాశ్వాసమునందు సుభద్రార్జున ప్రణయవృత్తాంతమును విపులముగ వర్ణించిన సందర్భములో విప్రలంభశృంగారమును విశేషస్థాయిలో నీ కవీంద్రుడుఁ వర్ణించియున్నాఁడు. ఆ విప్రలంభశృంగారమును దృతీయాశ్వాసములో నఱువదిమేడు పద్యములలో మనోహరముగా వర్ణించియున్నాఁడు. అందు నాయికానాయకులైన సుభద్రార్జునుల మదనతాపములు, విరహతాపసూచకపదజాలముతో మిత్రవిందాదులు సుభద్రతో మేలములాడుట, విరహతాపోపశమనార్థము చెలికత్తెలు సుభద్రకు శైత్యోపచారములు చేయుట, మన్మథమలయానిలచంద్రకోకిలాద్యుపాలంభనములును మనోజ్ఞముగా వర్ణింపఁబడినవి. ఈ సన్నివేశములన్నియు విప్రలంభశృంగారవర్ణనాత్మకపరాకాష్ఠదశను సూచించుచున్నవి.

విజయవిలాసమునందలి మూడు ప్రధానఘట్టములందును సంభోగ శృంగార వర్ణనము సమధికస్థాయిలోఁ జేయఁబడినది. ఉలూచీచిత్రాంగదా వృత్తాంతములందు కేవలము సంభోగ శృంగారము వర్ణింపఁబడినది.

ఏడు పద్యములలో నులూచ్యర్జునుల సంగమసుఖము వర్ణింపబడినది.[155] చిత్రాంగదార్జునుల పడుకటింటి ముచ్చటలు పదిపద్యములలో వర్ణింపఁ బడినవి.[156] అంతటితోఁ దనివిఁజెందక సుభద్రార్జున వివాహఘట్టమున మరల పడుకటింటి చక్కఁదనము నేడు పద్యములలో వర్ణించియున్నాడు.[157] ఈ పడకటింటి కథలో తెలుఁగు కావ్యములలో నిద్దరు చాలా గొప్పవారు. ప్రభావతీ ప్రద్యుమ్నములో పింగళి సూరన్న. విజయ విలాసములో చేమకూర వేంకన్న. తరువాత తరువాతి కవులు చాల మంది చేసిరికాని యీ విద్యలో పునాదులు వేసి మేడలు కట్టినది వీరిద్దరునుఁ"[157A] అని విశ్వనాథ సత్యనారాయణగారితనిని ప్రశంసించుచుఁ బల్కిన వాక్యములీ సందర్భములోఁ బేర్కొనఁదగియున్నది. ఈ ప్రబంధాంతిమ సన్నివేశమునందు సుభద్రార్జునుల శృంగార విలాస కృత్యములను వర్ణించు రూపమున మరల పదునేడు పద్యములలో సంయోగ శృంగారమును సరస పదజాలముతో వర్ణించితత్ప్రాధాన్యమును సూచించి నాఁడు.[158] ఇట్లీ కవీంద్రుఁడు తన విజయవిలాసము నందు సలలిత పద జాలముతో ముగ్ధమోహనఫణితిలోఁ జేయఁబడిన సంభోగ శృంగారాత్మక వర్ణనా ప్రాధానరీతియే యితర దక్షిణాంధ్ర యుగ కవులకు మార్గదర్శకమైనట్లు తోచును. దక్షిణాంధ్రాయుగకవులలోఁ బలువురు తమ ప్రబంధములలో సంభోగశృంగారమునకే ప్రాధాన్యమిచ్చిరి.

"సంయుక్తయోస్తుసంభోగోవిప్రలంభోవియుక్తయోః" అను శృంగార

155. వి. వి. ... ప్ర. ఆ. ... ప. 104 నుండి 110 వరకు
156. ,, .... ద్వి. ఆ. .. ,, 26 ,, 35 ,,
157. ,, .... తృ ఆ .... ,, 189 ,, 195 ,,
157. వి. వి. .... పీఠిక .... పే. 30.
158. ,, ... ,, ... ,, 210 ,, 226 ,,

తిలక వాక్యము నుదాహరించి విద్యానాథుఁడు "సంభోగస్య పరస్పరావలోకన సంభాషణాలింగన చుంబనాద్యనేక వ్యాపారమయత్వేనానన్త్యాదేకవిధత్వేన గణనాకృతా; విప్రలంభఃపునరభిలాషేర్ష్యా విరహప్రవాసహేతుకత్వేన చతుర్విధః" 159 అని సంభోగ విప్రలంభ శృంగారములను గూర్చి చెప్పియున్నాఁడు. కలిసియున్న నాయికానాయకుల శృంగారమును సంభోగమని, యెడఁబాటునొందిన నాయికానాయకుల శృంగారమును విప్రలంభమనియు, నాయికానాయకులు పరస్పరము చూచుకొనుట సంభాషించుకొనుట యాలింగనము చేసికొనుట మొదలగు ననేక వ్యాపారములలో నిది యిన్నివిధములని చెప్పుటకు వీలుగాకపోవుటచేత సంభోగ శృంగారమంతయు నొకేవిధముగఁ బరిగణింపఁబడుచున్నదనియు, నభిలాషేర్ష్యా విరహప్రవాస కారణములచేత విప్రలంభశృంగారము నాల్గువిధములనియు నాయాలంకారిక ప్రముఖుని యభిప్రాయము. వివిధ వ్యాపార సమన్విత సంభోగ శృంగారమును విజయవిలాసకారుఁడు సమగ్రముగ వర్ణించినాఁడు. కాని చతుర్విధ విప్రలంభ శృంగారములలో నభిలాష విరహ భేదములను రెండిటినే వర్ణించియున్నాఁడు. ఈ తారతమ్యమును బట్టి కూడ నతఁడు సంయోగ శృంగారమునకిచ్చిన ప్రాధాన్యమును గుర్తింప వచ్చును.

అర్జునుని తీర్థయాత్రాసందర్భమునఁ బదిపద్యములలో గంగానది నతిమనోహర శైలిలో సమయోచితముగ వర్ణించియున్నాఁడు. 160 శివుని శిరస్సుపై గంగయుండుట నీ సందర్భములో "తాసైరింపక పర్ణయుండఁగ ... ...." అను చక్కనిపద్యములో నెంతయో యుక్తియుక్తముగ సమర్థించియున్నాఁడు. మఱియునదే సందర్భములో

159. ప్ర. రు. .... ర. ప్ర. .... పే. 199

160 వి. వి. ... ప్ర. ఆ — ప. 47 నుండి 56 వఱకు.

గంగానదీతరంగముల మీదనుండి వచ్చు మందపవనమును వర్ణించుచు వాయుగుణములైన శైత్యత్వ, మాంద్యత్వ, సౌరభ్యములను "సకల శుభమ్ము లిమ్మనుచు .... .... " అను[161] పద్యములోఁ జక్కఁగ సూచించియున్నాఁడు. అట్టి వాయుగుణములను వర్ణించుట యొక కావ్య మర్యాద.

"పదియాఱువన్నె గుబ్బలి రాచకూఁతురు

పట్టంపురాణిగాఁ బరఁగుజాణ .... ... " 161 అను సీసపద్యములో హిమవత్పర్వత వర్ణనము సందర్భానుగుణముగఁ జేయఁ బడినది.

అగస్త్యవటమణి శృంగారాది ప్రసిద్ధ పుణ్యక్షేత్రముల నొక దీర్ఘ వచనములో వర్ణించుచుఁ బూర్వసముద్రతీరమున నున్న యంతర్వేదిని, తత్ప్రాంతముననున్న సాగరసంగమస్థలిని, దక్షిణనీరాకరమును, తత్తీరస్థ రామేశ్వరమును దీర్ఘసమాసములతో వర్ణించినాఁడు. 163

సూర్యాస్తమయ చంద్రోదయములను రెండు పద్యములలో నీకవీంద్రుఁడు మనోజ్ఞముగ వర్ణించినాఁడు. 164 మన్మథుఁడు పాంథులపై దండెత్తునపుడతని సేవకులుపట్టు మేలిబంగారపుటాలవట్టములవలె నుదయాస్త గిరిశిఖరములపైఁ జంద్రసూర్యబింబములు గానవచ్చినవట. సాయంసమయమునందు సూర్యుఁడు క్రమముగ నొక్కొక్క మెట్టు దిగుచున్నట్లు, చంద్రుఁడొక్కొక్క మెట్టెక్కుచున్నట్లును గానవచ్చు నన్ని వేళము నీలోక

161 ,, ,, 52.
162 ,, వ. 127.
163. వి, వి, ప్ర. ఆ. , ప 128
164. ,, — ప. 143 144.

ములో నొకరాజు బలహీనుఁడుకాఁగా మఱొకరాజు నానాఁటికి మహోన్నతి నొందునను లోకోక్తితో రెండవ పద్యమునందు సరసస్థాయిలో సమర్థించి యున్నాఁడు.

"క్షితిపై వట్టిమూర్ఖఁకులుచిగిర్ప .... ... 165" అను రసవత్పద్య రత్నమునందు వసంత చంద్రి విజృంభణము నీకపీందుర్రఁడు వర్ణించుచుఁ దుదిపాదమున వాడిన చక్కని లోకోక్తిలో నాత్మనిర్వేదమును సూచించి యున్నాఁడు.

ప్రథమాశ్వాసాంత సన్నివేశమునఁ జేయంబడిన యీ సూర్యాస్త మయచంద్రోదయాది వర్ణనములర్జుని మనోభావగతుల కనుకూలమ్ముగ నుండుటయేగాక యా సమయమునందలి శృంగారాత్మక వాతావరణమునకుఁ గూడఁ దగియున్నవి.

"తనకున్ గౌఁగిలియీ వొకప్పుడును నాథా .... ... .... 166అను పద్యము వేంకటకవియొక్క వర్ణనాత్మక సామర్థ్యమునకుఁ బ్రబల నిదర్శనము. అందు ద్విరేఫదీర్ఘధ్వను లద్భుతో త్ప్రేక్షారూపమున వర్ణింపఁబడినవి.

సమకాలిక సంప్రదాయముల కనుగుణముగ వైవాహిక కార్యకలాపములు విజయవిలాసములో విశేషముగా వర్ణింపఁబడినవి. ఈ ప్రబంధము నందు మూఁడు చోట్ల వివాహవర్ణన చేయఁబడినది. చిత్రాంగదార్జునుల వివాహవైభవమును పదమూఁడు పద్యములలో వర్ణించియున్నాఁడు. 167 ద్వారకలో జరిగిన సుభద్రార్జున వివాహమును నలుబది తొమ్మిది పద్యముల లోను, 168 మరల నింద్రప్రస్థములో జరిగిన వివాహము నైదుపద్యముల

165. ,, — ,, — వ 145.
166 వి. వి. — ప్ర. ఆ. — ప. 139
167 ,, .... ద్వి. ఆ. — ప. 12 నుండి 24 వరకు.
168 ,, .... తృ. ఆ. — ప. 75 నుండి 128 ,,

లోను వర్ణించినాఁడు. 169 చిత్రాంగదా వివాహమును సంగ్రహముగ, సుభద్రా వివాహము నతివిపులముగను వర్ణించుటనుబట్టి యీ ప్రబంధమున సుభద్రావివాహప్రాధాన్యము వ్యక్తమగుచున్నది. ఏ తద్వృత్తాంతప్రాధాన్యమునుబట్టియే యీ ప్రబంధమునకు సుభద్రాపరిణయమను నామాంతరముగూడ నేర్పడినట్లు గ్రహింపనగును.

సుందరాంగియగు చిత్రాంగదను జూచి యామెను వివాహమాడవలెనను కాంక్షతో ననురక్త హృదయుఁడై యొక యెలమావి క్రిందనున్న యర్జునుని వర్ణించిన సందర్భములో నన్నిహంగులతోఁ గూడిన వసంతవాతావరణము నతి సుందరముగఁ జిత్రించినాఁడు. శుకపికారావములు, తుమ్మెదరొదలు, మలయానిలము, పండువెన్నెలలు నామనినొంపునింపఁగా నాసమయములో నరుఁడు మరుఁడో యను నట్లున్నాఁడని కవిమనోహరముగ నుత్ప్రేక్షించి యున్నాఁడు. 170

విజయవిలాస ప్రబంధమునందలి వర్ణనములన్నియు సందర్భోచితములై యాయా సన్నివేశముల కనుకూలముగఁ జక్కఁగ నతుకుకొని రస పుష్టినిఁ జేకూర్చినవి. అట్టి సమయోచిత వర్ణనలా ప్రబంధమునకెనలేని శోభను, గౌరవమును దెచ్చినవి. ప్రయోజన రహితములైన వర్ణనములిందు సాధారణముగఁ గానరావు. ఒండు రెండు సన్నివేశములలో వర్ణనములు పునరుక్తములైనట్లు గానవచ్చినను నాటకీయరీతికొఱకో, పాత్ర చిత్రణముకొఱకో, సన్నివేశప్రాధాన్యముకొఱకో, వస్త్వాధిక్యసూచన కొఱకో, సంప్రదాయముకొఱకో తత్ప్రసక్తి నాకవీంద్రుఁడాదరించినట్లు భావింపనగును.

---

169 ,, .... ,, — వ. 184 నుండి 184 ,, .

170 ,, ... ప్ర. ఆ. — వ. 147.

వేంకటకవి తన విజయవిలాసమునందు శృంగారరసమును బ్రధానముగ వివిధ విన్యాసవిశేషములతో సర్వాంగసుందరముగ వర్ణించినాఁడు. తదితరరసములనుగూడ నప్రధానముగ నాయాసన్నివేశములలో వర్ణించి తనప్రబంధమును నవరసభరితము గావించినాఁడు. అర్జునుఁడు యాదవవీరులతోఁజేసిన యుద్ధమును వర్ణించుపట్టునవీరము, నందాద్యప్సరసలు మునిశాపమునకు గుఱియైన సన్నివేశమునఁ గరుణము, బలరామాదుల కోపోద్రేకములను వర్ణించిన ఘట్టమున రౌద్రము, మిత్రవిందాదులు సుభద్రతో మేలములాడినప్పుడు హాస్యము, యాదవుల చతురంగసైన్యభయంకర విజృంభణమును వర్ణించుచోట భయానకము, సౌభద్ర తీర్థమునందు స్నానముచేయుచున్న యర్జుననొక మొసలి పట్టినప్పుడు దానినిఁ దన చేతితోఁబట్టి బయటికి విసరినపుడది యప్సరస్స్త్రీరూపమును దాల్చినట్లు చెప్పుటలో నద్భుతము, పార్థుని యతివేషమును వర్ణించిన సందర్భమున శాంతము, "తలలు వీడఁగఁబాఱు ధరణీశ్వరులఁజూచి ... .... " యను నవతారికా భాగాంతర్గత సీసపద్యములో బీభత్సరసమును మనోహరముగ వర్ణింపఁబడినవి.

సీ॥ మంగళస్నాన సంభ్రమముఁ దెల్పెడిరీతిఁ
గెలనఁ గెందామరకొలనఁదేలి .... 171" అను

పద్యమునందుఁ జిత్రాంగద తన చెలికత్తెలతోఁ గలిసి వనవిహారము సల్పినట్లు, జలక్రీడలాడినట్లును సూచనాప్రాయముగ వర్ణించినాఁడు.

ఈ ప్రబంధమున రెండుచోట్ల నుత్సవవర్ణనము గూడఁ జేయఁబడినది. యాదవులుచేసిన రైవతకోత్సవమును పదమూఁడు పద్యములలో, 172 నంతర్ద్వీపమున శివునిజాతరను మూఁడుపద్యములలోను వర్ణించినాఁడు. 173

---

171 వి. వి. .... ప్ర. ఆ. — ప. 129.
172 ,, .... ద్వి. ఆ. .... ప. 88 నుండి 100 వఱకు.
173 ,, .... తృ. ఆ. .... 72 . 74 .

అర్జునుఁడు వివిధ పుణ్యక్షేత్రములను దర్శించుటకై చేసిన దేశసంచారమును వర్ణించిన ఘట్టమును, 174 సుభద్రార్జునుల యింద్రప్రస్థపురీ ప్రయాణమును వర్ణించిన సన్నివేశమును 175 ప్రయాణవర్ణనములుగఁ బరిగణింపనగును.

కుమారోదయ వర్ణనము మూఁడుచోట్లఁ జేయఁబడినది. ఇలావంతుని జననము, 176 బభ్రువాహన జననము, 177 నభిమన్యుజననమును 178 వర్ణింపఁబడిన సన్నివేశములను కుమారోదయ వర్ణనాత్మకములుగ నెన్నఁదగును.

విజయవిలాస కథాఘట్టముల కప్రసక్తములుగనున్న మధుపాన మంత్రద్యూతములు దప్ప మిగిలిన పదునైదు వర్ణనములను సహాయానుకూలముగఁ జేసి వెంకటకవి తన ప్రబంధమున కమితగౌరవమును సంపాదించినాఁడు. ఆవలి వర్ణనములు సంగ్రహములు, సరసములు సంప్రదాయబద్ధములునై యాకవీంద్రుని కవితాశక్తిని వేనోళ్లఁ జాటుచున్నవి

## పాత్ర చిత్రణము

వేంకటకవి తన విజయవిలాసము నందలి పాత్రలను మిక్కిలి మెలఁకువ తనముతో జిత్రించియున్నాఁడు. ఆకవీంద్రుని పాత్రచిత్రణాత్మక ప్రతిభ యపూర్వమైనది. అతని యమృతలేఖినీ ప్రభావముచేత నీప్రబంధపాత్రలు

---

174 ,, .... ప్ర ఆ .... ప. 128

175 ,, — తృ ఆ — ప. 130 నుండి 139 వఱకు,

176 ,, — ప్ర. ఆ. — ప. 211

177 ,, — ద్వి. ఆ. — ప. 38,

178 ,, — తృ ఆ. — ప. 229.

చైతన్యశక్తితోఁ దేజరిల్లుచున్నవి. అతని పాత్రచిత్రణాత్మక కవితాప్రతిభచే సజీవములైన పాత్రలు సరసహృదయుల నాకర్షించి వారి సదమలహృదయములపై శాశ్వతముద్రలు వేసినవి. కనుకనే విజయవిలాసమును దెఱచినవెంటనే రసగ్రహణపారీణులైన పాఠకుల మనస్సులు ప్రముఖపాత్రల వైపు మరలు .

ఆ మహాకవియొక్క చతురచిత్రణమునకు శ్రీకృష్ణార్జున విశారదులను పురుషపాత్రలు, సులూచీ చిత్రాంగదా సుభద్రలను స్త్రీపాత్రలును పాత్రములైనవి. అతఁడాయా ప్రముఖపాత్రల బాహ్యతత్త్వములనే గాక యాంతరప్రకృతి విశేషములనుగూడ నతివిచిత్రముగఁ జిత్రించియున్నాఁడు. వీనిలో నొక్కవిశారదపాత్ర తప్ప మిగిలినవన్నియు మహాభారతమునందుఁ బ్రఖ్యాతిగాంచినవే. ఆపాత్రలను మొదట సంస్కృతభారతమున వ్యాసమునీంద్రుడును, తరువాత నాంధ్రభారతమున నన్నయయును జిత్రించి పాఠకలోకమునకుఁ బ్రాథమిక పరిచయము గావించినారు మరల నాపాత్రలనే వేంకటకవి చిత్రించి రసజ్ఞుల మెప్పువడసి యుండుటనుబట్టి తత్ప్రతిభయందతఁడెంత దిట్టయో యూహింపుకొనవచ్చును.

శ్రీకృష్ణపాత్ర చిత్రణము నందాకవీంద్రుఁడు నిరుపమ నైపుణ్యమును బ్రదర్శించినాఁడు. శ్రీకృష్ణుఁడు లోకజ్ఞానసంపన్నుఁడుగ, వ్యవహారదక్షుఁడుగ, నిస్తులకార్యశూరుఁడుగను జిత్రింపబడినాఁడు.

అర్జునుని మనోగతాభిప్రాయమును గ్రహించి శ్రీకృష్ణుఁడు బలరామునకుఁ దెలియకుండ సుభద్రార్జునుల వివాహము జరిపించుటకుఁ బూనుకొనినాఁడు. జగన్నాటకసూత్రధారియైన శ్రీకృష్ణుఁడు దలఁచినట్లు సన్నివేశములన్నియు సానుకూలములగును. తనయన్నయగు బలరాముఁడు కౌరవపక్షపాతియని, యతఁడీవివాహము నంగీకరింపఁడని ముందేగ్రహించి యతని

క్కి దెలియకుండ సుభద్రార్జునవివాహమును జరుపనెంచినాఁడు అతని యమో ఘాభిప్రాయమునకర్జునుని సన్న్యాసివేషమనుకూలవాతావరణము నేర్ప ఱచినది. అంగనామణిసేఁగోరి సన్న్యాసియై వచ్చిన యర్జునుని యతీంద్రుఁ నిఁగ భావించి, యతనిని ద్వారకానగరమున కాహ్వానించి, యచ్చటనతఁడు చాతుర్మాస్యదీక్షను సాగించుటకుఁ దగిన యేర్పాటులు గావించి యతనికుచిత సేవలు చేయుటకై సుభద్రను నియోగింపుమని బలరాముఁడు శ్రీకృష్ణునా దేశించినాఁడు, ఆయవకాశము నాధారముగఁ జేసికొని భావిపరిణామములకను కూలముగ

"వయసు వారును జక్కని వారు వీరు
మనసు మర్మంబులేమియు మనకుఁ దెలిసి
యున్నయవిగావు సేవకు సుసుపఁదగునె
కన్నెను............................179"

అని యాత్మరక్షకకవచముగ నగ్రజుని కాళ్లకు ముందుగనే బంధము వేసినాఁడు.

"వీరు మహాత్ములు ఘను లప
చారంబగు నిట్టులాడ; సంయములకుమున్
గోరికవెలయఁగ గన్యలె
గారా శుశ్రూషసేయఁగాఁ దగువారల్;

నెమ్మది సంశయింపకిది నీవొనరింపుము."180 అని యనినయన్న వాక్యములపై నర్జునుని సేవించుటకు సుభద్రను నియోగించినాఁడు.

179 వి. వి. ద్వి. ఆ. ప. 119.
180 ,, ప. 120, 121.

బలరామునకుఁ దెలియకుండ సుభద్రార్జునుల వివాహముజరిపింపవలె లనియెంచి శ్రీకృష్ణుఁడంతర్ద్వీపమున నింద్రుధరోత్సవముఁజేయఁదలపెట్టి, యా మిషతో బలరామాదులనచ్చటికిఁ బంపి ద్వారకలో సుభద్రార్జునుల వివాహమున కనుకూలవాతావరణము నేర్పఱచినాఁడు. యతివేషముననున్న వాఁడర్జునుఁడే యని, సుభద్రను వివాహమాడఁగోరి యతఁడువచ్చినాఁడనియు రుక్మిణీ సత్యభామాదులకుఁ దెలియఁజేసి యావివాహమును గడుజాగరూకతతో నిర్వహించినాఁడు అనంతర మర్జునుఁడు సుభద్రనింద్రప్రస్థమునకుఁ దీసికొనిపోవుటకుఁ దగినయేర్పాటుచేసినాఁడు. సుభద్రార్జునులవివాహమును వారియింద్రప్రస్థపురీప్రయాణమును దెలిసికొనిబలరాముఁడు కోపోద్రిక్తుఁడై యర్జునునితో యుద్ధముచేయుటకుఁ బూనుకొనిన సమయమున శ్రీకృష్ణుఁడర్జునుని బలపరాక్రమములను, పాండవులతోఁ దమకుఁగల బంధుత్వమును విన్నవించి తనయన్న సుశాంతచిత్తునిఁగావించినాఁడు. అనంతరము శ్రీకృష్ణుఁడు బలరామాదులతోఁ గలిసి యింద్రప్రస్థమునకేగి యచ్చటమరల సుభద్రార్జునుల వివాహము నతివైభవముగ జరిపించినాఁడు. వేంకటకవి యావిధముగ శ్రీకృష్ణునిఁ గార్యదక్షునిగ, లోకజ్ఞానసంపన్నునిగను జిత్రించి పాత్రపోషణమునం దుఁదనకుఁగలసామర్థ్యమును బ్రకటించుకొనినాఁడు.

అర్జునుఁడీప్రబంధమునఁ ధీరోదాత్తుఁడుగఁ జిత్రింపఁబడినాఁడు. ఆవీరాగ్రగణ్యుని ధార్మికకాముకప్రవృత్తులు రెండును బాగుగ వర్ణింపఁబడినవి. అతనిశరణాగతత్రాణపరాయణత్వము, బ్రాహ్మణభక్తి, నియమపాలన వ్రతము, తీర్థయాత్రాసక్తి, యసహాయశూరత్వము, నిరుపమధైర్యసాహసములు, దైవభక్తి (కృష్ణభక్తి), దాక్షిణ్యస్వభావము, కాముకత్వము మొదలగుగుణములిందు మనోహరముగాఁ జిత్రింపఁబడినవి కేవలము సుభద్రతోనేగాక యులూచీచిత్రాంగదలతో నతఁడుసాగించిన ప్రణయవ్యాపారములను బట్టి యిందుఁ గాముకుఁడుగఁ జిత్రింపఁబడినట్లు స్పష్టపడుచున్నది. మఱి యునతఁడులూచ్యాదినాయికలందు వైషమ్యరహితమైనయనురాగము గలిగి

యుండి యా ముగ్గురిని వివాహమాడి కామోపభోగముల ననుభవించినట్లు వర్ణింపఁబడుటచేత దక్షిణనాయకుఁడుగఁగూడఁ జిత్రింపఁబడినట్లు భావింప నగును. నందాద్యప్సరోవృత్తాంతమర్జునపాత్రోత్కర్షావహముగ నమరి యున్నది. అందతఁడు సౌభద్రాదిపంచతీర్థములందలి మహోగ్రాహములను వెలికి విసరి తనశౌర్యధైర్యములనుజూపి, నందాద్యప్సరసలకు శాపమోక్షము గావించి వారిమనఃపూర్వకప్రశంసల నందుకొని తనయుదాత్తశీలమును బ్రకటించినాఁడు. అట్లాసన్ని వేశములోఁగాముకవ్యాపారమునకు గుఱికాకుండ నాయకోత్కర్షకనుకూలముగ నర్జునపాత్రపోషణ గడుజాగరూకతతోఁజేయఁ బడినది. ఈసన్ని వేశములో నతనిలోకరక్షణపరాయణత్వము, ధీరోదాత్తత యును బాగుగఁబోషింపఁబడినవి.

తే॥ పాఱఁజూచినఁబరసేన పాఱఁజూచు
వింటికొరగిన రిపురాజి వింటికొరగు
వేయునేటికి నలపాండవేయుసాటి
వీరుఁడిలలేఁడుప్రతి రఘువీరుఁడొకఁడె181

ఉ॥ ఆపురమర్దనుండయిన నాతనినడ్డముదాఁకి నిల్వఁగా
నోపఁడు. .... .... ....
.... .... .... ....
మూపులుమూఁడగున్ రిపుచమూపులఁగన్నపుడే కిరీటికిన్. 182

క॥ అతిలోకసమీకజయో
న్నతిచే ధర్మజునకింపొనర్చుచు వినయా
న్వితుఁడై సమస్తజన
సమ్మతుఁడై నరుఁడుండె నిటులమానుషచర్యన్. 183

181 వి. వి. .... ప్ర. ఆ. — ప. 29.
182 ,, .... తృ. ఆ. .... ప. 170
183 ,, .... ప్ర. ఆ. .... ప. 30

మొదలగు పద్యములలో నతఁడు శౌర్యనిధిగ, నసమాన వీరాగ్రి గణ్యుఁడుగ, నపరిమిత యుద్ధోత్సాహిగ, గురుభక్తి తత్పరుఁడుగ, వినయ భూషణుఁడుగ, నతిమానుషశక్తియుక్తులు గలవాఁడుగ, సర్వజన సమ్మతుఁడుగను జిత్రింపఁబడినాఁడు. తన గోధనము చోరాపహృతమైనదని యొక బ్రాహ్మణుఁడు దెలియఁజేయఁగా నతఁడు వెంటనే బయలుదేరి చోరులను హతమార్చి యాగోధనమును దెచ్చి యిచ్చుటనుబట్టి యతని పరోపకారపారీణత్వము, సాహసౌదార్యగుణములును వెల్లడియగుచున్నవి. గదుఁడు సుభద్రాసౌందర్యమును దనయెదుట వర్ణింపఁగా నర్జునుఁడా సుందరాంగియందనురక్తుఁడై యామెను జూచుటకై తమకించుటనుబట్టి యిష్ట వస్తువును బొందుటకై యతఁడు చూపునారాటము, ప్రభులక్షణమైన యతని నూతనప్రియత్వమును వ్యక్తములగుచున్నవి. భూప్రదక్షిణముతో సమానమైన గోప్రదక్షిణముచేసిన సరిపడునని ధర్మజుఁడు చెప్పినను తీర్థ యాత్రకతఁడు బయలుదేరుటనుబట్టి యతనిసమయనిర్వాహణాత్మకసామర్థ్యము వెల్లడియగుచున్నది భాగీరథ్యాదిపావనతీర్థములందు స్నానము చేసి దానధర్మములతో దైర్థికులను సంతోషపెట్టి యుండుటవలన నతని పూర్వాచారపరాయణత్వము, దానధర్మనిరతియు వ్యక్తములగుచున్నవి. సుభద్రను బొందుటకొఱకతఁడు యతివేషమును ధరించి, బలరామాది యాదవముఖ్యుల యభిమానమును జూఱఁగొని, సుభద్రతో సన్నిహిత పరిచయము నేర్పఱచుకొని, తానునుకొనిన రీతిగఁ జివరికామెను వివాహ మాడుటను బట్టి యతని కార్యసాధకశక్తి వ్యక్తమగుచున్నది.

విజయవిలాసమునందు విదూషకపాత్రకుఁ బ్రత్యేకస్థానము గలదు. ఆకవీంద్రుని స్వకపోలకల్పితమనోజ్ఞకళాగతికాపాత్ర యొక ప్రముఖ నిదర్శనము. పాండవుల పురోహితుఁడైన ధౌమ్యుని తమ్మని కుమారుఁ డతఁడు. ధర్మతత్త్వజ్ఞుఁడు. అర్జునుని తీర్థయాత్రాసందర్భమున నతనికిఁ జేదోడువాదోడుగ నుండుటకై ధర్మరాజతనిని బంపినాఁడు. వేడుక చెలి

కాఁడుగ నావీరాగ్రిగణ్యు ననుగమించినాఁడు. ఉలూచీ ప్రణయవృత్తాంత మును విని సంతోషించిన శ్రోతగనితఁడు మొదటిఘట్టమునఁ జిత్రింపఁ బడినాఁడు. చిత్రాంగదావృత్తాంతమున నీపాత్రకుజీవము పోయఁబడినది. చిత్రాంగదార్జునుల వివాహమున కతఁడు రాయబారియైనాఁడు. అర్జునుని కోరికపై నతఁడు మణిపురాధీశ్వరుఁడగు మలయధ్వజునికడకేగి యర్జు నునిఁగూర్చిచెప్పి యతనికిఁ జిత్రాంగద నిచ్చి వివాహము చేయుటకుఁ దోడ్పడినాఁడు. అర్ణవపతితో బాంధవమొనర్చిన మాధవునివలె మలయధ్వ జార్జునులకు బంధుత్వముఁగూర్చినాఁడు. చివరికి రాయబారసాఫల్యముగ "హితుఁడన విశారదుఁడెకాక యెందుఁగలరె" 184 అను ప్రశంస నందుకొని నాఁడు. అట్లీపాత్ర యానన్ని వేశములోఁ గడు చైతన్యవంతముగఁబోషింపఁ బఁడినది.

విజయవిలాసకారుఁడు దన పరిబంధముయొక్క తొలిఘట్టమున ధర్మజపాత్ర నతని సహజ ధార్మికప్రవృత్తి కనుగుణముగఁ దీర్చిదిద్ది యున్నాఁడు. ధర్మరాజు శాంతి, దయా, సత్య, దానాది గుణాభరణుఁడు, సాధుజనాదరణుఁడు, నాజ్ఞాపరిపాలనవ్రతుఁడు, దేవబ్రాహ్మణభక్తుఁడు, ప్రియభాషణుఁడు, విద్యావివేకసంపన్నుఁడు, ధర్మతత్త్వవేత్త, హితశిష్ట సంతోషణుఁడు నని వర్ణించి యామహితాత్ముని శీలసంపదకైదు పద్యము లలో కై వారముపటినాఁడు. 185

ఉలూచీపాత్రచిత్రణమున నీకవీంద్రుని ప్రతిభాలత సినలుసాచినది. అతని కమనీయకవితాస్పర్శచే సజీవములైన స్త్రీపాత్రలలోనది ముఖ్యమైనది. ఆచిలువచెలువ నాగరికనారీమణిగా, జాణతనము నేర్చిన చానగాను జిత్రింపఁ బడినది. మఱియు నామె యాఘట్టమునఁ బ్రౌఢానాయికగా వర్ణింపఁబడినది.

184 ,, .... ద్వి. ఆ. — ప. 11

185 వి. వి. — ప్ర. ఆ. .... ప. 19, 20, 21, 22, 23

"యామినీవిటకులశేఖరున్ గొ... చు వే పురికిన్ జని నిల్పి నట్టియున్నటులనె మాయయచ్చుపడ నల్లభుజంగి నిజాంగణంబునన్"[186] అనిచెప్పినచోట నర్జునుని విటునిగ, నులూచిని విటిగను భంగ్యంతరమున సూచించియున్నాఁడు "రూపవిభ్రమరేఖాఖను లెందు నాగకన్యలె"[187] అని యామె యందచంద ములు మెచ్చుకొనుచుఁ బలికిన పలుకులనుబట్టి యామె సౌందర్యరాశి యని తెలియుచున్నది. గంగానదీతీరమునుండి సాహసించి పాతాళలోకమునకామె తనను దెచ్చి యుండుటకాశ్చర్యపడి "ఎంతఘనసాహసమింతులకు"[188] అని యర్జునుడనుటనుబట్టి యామెసాహసగుణము వ్యక్తమగుచున్నది. "ప్రాణ దానంబు కన్నను వ్రతముగలదె"[189] అని సందేశాత్మకముగ నామెపలుకు టనుబట్టి యామె నీతిశాస్త్రకోవిదత్వము వెల్లడియగుచున్నది. "కన్నియఁ గాని వేఱొకతెఁగానుమనోహరరూప .... ..."[190] అను పద్యములో నామె కన్యగాఁజిత్రింపఁబడినది. అర్జునునితోచేసిన వాదములోనామెవాక్చా తుర్యము వ్యక్తమగుచున్నది.

తే॥ నాగరికముద్రగల మంచి బాగరియఁట
నాగవాసములో వింతనటనలదఁట
కులుకుగుబ్బలపాపియంపుఁగోమలియఁట
వలచి వలపింపదే యెంతవారినైన.[191] అనుపద్యమా

మె వ్యక్తిత్వమునకెత్తినపతాకముగ నలరారుచున్నది,

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 186. | వి. వి. | — | ప్ర. ఆ. | — | ప. | 73. |
| 187. | ,, | — | ,, | — | ,, | 82. |
| 188. | ,, | — | ,, | — | ,, | 87. |
| 189. | ,, | — | ,, | — | ,, | 93, |
| 190. | ,, | .... | ,, | — | ,, | 97. |
| 191 | ,, | .... | ,, | — | ,, | 110. |

చిత్రాంగదముగ్ధానాయికగాఁ జిత్రింపఁబడినది. మాయామర్మము లెఱుఁగని మానినీమణి. మనసునందనురాగము నింపుకొని ప్రియునియెదుట భాషింపనేరని ముద్దరాలామె. మాట్లాడకుండఁగనే మమతను ప్రదర్శించి తననాథుని సుఖడోలికలలో నూగించి యాత్మవాంఛను దీర్చుకొనిన యాదర్శనారీమణి యామె.

"కానుకగాఁగనిత్తు బిగికౌగిలి పల్కవె కీరవాణి ... .... " 192
అను పద్యములో నామె ముగ్ధాత్వమును ముద్దులొలికించు పదములతో మూటఁగట్టినాడు.

వెంకటకవి సుభద్రాపాత్రప్రాధాన్యమును గుర్తించి తన ప్రబంధమునకుఁగల సుభద్రాపరిణయమను నామాంతరవ్యవహారమునకుఁ దగినట్లుగ సుభద్ర నందుఁబ్రధానపాత్రగాఁ జిత్రించియున్నాడు. ఆమె మధ్యానాయికగాఁ జిత్రింపఁబడినది.

"చూడమె దేవతాసతుల శోభనకాంతివిలాసవైఖరుల్ .... " 193
అను పద్యములో నామె యప్రతిమానసౌందర్యరాశిగఁ జిత్రింపఁబడుట యేగాక యులూచీచిత్రాంగదలకంటె నందగత్తెగా సూచింపఁబడినది. కనుకనే యామె లోకాతీతసౌందర్యాతిశయము ననేకపద్యములలో వర్ణించియున్నాఁడు, అన్న యాజ్ఞననుసరించి యామె కుహనాసన్న్యాసికిఁ జిత్తశుద్ధితో సేవలు చేయఁబూనుకొనుటను బట్టి యామె భాసురభ్రాతృవిధేయతాగుణము వ్యక్తమగుచున్నది. ఆమె యర్జునుని యోగక్షేమములను గుఱించి యాకుహనాసన్న్యాసి నడిగిన తీరుతెన్నులను బట్టి యామెకతనిపైనున్న యనురాగతిశయమవగతమగుచున్నది.

192 వి. వి. ద్వి ఆ. ప. 28
193 ,, 102

"ఎగుబుజంబులులవాఁడు మృగరాజమధ్యంబు

పుడికిపుచ్చుకొను నెన్నడుమువాఁడు ...... " 194

అను పద్యములో నామె తన హృదయసౌధమునందుఁ బదిలముగ నిడుకొని యారాధించుచున్న ప్రియమూర్తిని సమగ్రముగఁగవి చిత్రించియున్నాఁడు.

"మేరలా యివి మీయంతవారలకును .... .... "195

అను మనోహరపద్యములో నామె సరసోక్తిచాతుర్యము, గురుభక్తి, సంప్రదాయగౌరవమును ప్రకటితములైనవి.

"తడవు నేసె ముహూర్తంబు దగ్గఱించె
నేమెకో యన్నరాఁడు " 196

అని యామె తన యన్నయగు కృష్ణునిరాకకై యెదురుచూచుచు నాందోళిత హృదయయై పలికిన పలుకులవలన నామె మనోరథము వ్యక్తమగు చున్నది.

"తేరుగడపంగ మాయన్న దిద్దెనన్ను
నేయ నేరిపె వింటనొక్కింతనాకు
నావదినె సత్యభామ .... .... " 197

అను పద్యములో నామెకు రథసారథ్యమునందు, విలువిద్యయందును నైపుణ్యముగలదని చెప్పి యర్జుననకామె తగినపత్ని యని సూచించియున్నాఁడు

194 ,, — ,, — ,, 164
195 ,, — ,, — ,, 187
196 వి. వి. — తృ. ఆ. — ప. 96
197 ,, — ,, — ,, 14?

తే॥ మృగమదము చెంతఁ గుంకుమరేఖవోలె
నీలమణిచెంత నుదిరి పొన్రేకువోలె
మేఘము సమంగటను దీఁగెమెఱుపువోలె
నర్జునుని చెంగట సుభద్ర యలరె నపుడు. 198

అను పద్యరత్నము నాదంపతుల సౌందర్యగరిమకు, సన్యోన్యత్వమునకును శాశ్వతప్రతీకగాఁజెక్కియున్నాఁడు.

## ఛందోవిన్యాసములు

విజయవిలాసమునందలి వివిధచ్ఛందోరీతులు రసానుగుణవిన్యాస వైఖరులతో విరాజిల్లుచున్నవి. రసస్ఫూర్తికి, భావోద్వేగమునకు, వస్తు వర్ణనమునకు, చమత్కారభంగిమలకు ననుగుణములైన వృత్తములను, జాత్యుపజాతులను వేంకటకవి యెన్నుకొనినాఁడు. సాధారణముగఁ గవులరు దుగవాడు వృత్తములను గొన్నిటిని సమయానుకూలముగ వాడియు న్నాఁడు. అట్టి యరుదైన వృత్తములాయాసన్నివేశములలో సందర్భ శుద్ధితోఁ జక్కఁగానతుకుకొని యతని రసోచితశైలికి వన్నెఁదెచ్చినవేకాని బలవంతముగఁ గూర్చినట్టివిగావు.

సాధారణముగ శృంగార కరుణరసములను వర్ణించునపుడుత్పల మాలాచంపకమాలలను, వీరరౌద్రభయానకరసములను వర్ణించునపుడు శార్దూలమత్తేభవిక్రీడితములను రసౌచిత్యమును బాటించుకవులు వాడుదురు. మదనవిజృంభణమును, యౌవనగర్వము మున్నగు శృంగారాత్మకసన్ని వేశములను సూచించుటకును శార్దూలమత్తేభవృత్తములనువాడు సంప్ర దాయముగూడఁ గలదు. అట్లే వీరరస సామాన్యస్థితిగతులను, ప్రాథమికా

వస్థను వర్ణించునప్పుడుత్పలమాలనుగూడ వాడు సంప్రదాయము గలదు. ఉద్రేకోద్వేగములను సూచించుటకు నుత్సాహమును బెంపొందించుటకును భుజంగప్రయాతపంచచామరాదివృత్తములను వాడుదురు. వస్తువైవిధ్యమును, గుణబాహుళ్యమును, సంఘటనానుక్రమణికను నొకచోట వర్ణింపవలసివచ్చినపుడు సీసపద్యమును వాడు సంప్రదాయముగలదు. అట్లే సంగ్రహవర్ణనలందు, చమత్కారములను సులభముగ సాధించుటకొఱకుఁ దదితరప్రయోజనములకొఱకు నాటవెలఁది, తేటగీతి, కందపద్యములను వాడుదురు.

వేంకటకవి తన విజయవిలాసమున సాధారణాసాధారణ వృత్తములను, జాత్యుపజాతులను సందర్భశుద్ధితో వాడినతీరును స్థాలీపులాకన్యాయముగాఁ బరిశీలింతము.

శార్దూలవృత్తముతో నిష్టదేవతాస్తుతికి శ్రీకారముఁజుట్టి తన ప్రబంధమును ప్రారంభించి సత్సంప్రదాయమును పాటించినాఁడు. "శ్రీవాణీగిరిజాః .... .... " అను శార్దూలవృత్తాత్మక శ్లోకముతో నన్నయభట్టారకుఁడాంధ్రమహాభారతమును ప్రారంభించినాఁడు. తొలిపద్యము ననుసరించి శుభదాయకమైన శ్రీకారమును మేళవించి యుత్పలమాలాద్వయముతో శ్రీరంగనాథ వేంకటేశ్వరస్వాములను గైనేసినాఁడు ఆవిధముగ భక్తిభావబంధురములైన మూఁడు శార్దూలవృత్తములతో, రెండు మత్తేభవిక్రీడితములతో, రెండుత్పలమాలలతో, నొక తేటగీతితోను నిష్టదేవతాస్తుతి చేసినాఁడు. అవతారికలో రఘునాథనాయకుని గుణగణములను, విఖ్యాతవిజయములను గొలువున్నతీరును, సాహసకార్యములను గ్రమముగ వర్ణించురూపమునఁ బదునైదు సీసపద్యములను గూర్చినాఁడు. షష్ఠ్యంతములకు కందపద్యములనే వాడి సంప్రదాయమును బోషించినాఁడు. కృతిపతిగుణములను గొన్నిటి నుత్పలమాలాదివృత్తములలోఁగూడ వర్ణించి

నాఁడు. ఆరాజేంద్రుని వంశచరిత్రను సంగ్రహించుటకుఁ గందపద్యము లను, తద్వంశపూర్వప్రభువుల గుణవిశేషములను వర్ణించుటకు చంపక మాలాశార్దూలవృత్తముల నెన్నుకొనినాఁడు. రఘునాథుఁడు తనను బ్రశం సించిన విధమును స్పష్టముగాఁ జెప్పుటకుఁ గందములను, దేటగీతులను పాడినాఁడు. ఇట్లవతారికయందు సమయానుకూలముగఁ బ్రసిద్ధములైన వృత్తములను, జాత్యుపజాతులను వాడియున్నాఁడు.

ఇంద్రప్రస్థపుర వైభవమును వర్ణించుటకు సుదీర్ఘసమాస భూయిష్ఠముగా శార్దూలవృత్తమును వాడినాఁడు. చాతుర్వర్ణ్యవర్ణనమున కనుకూలముగా సీసపద్యమును సంతరించినాఁడు. ఎత్తైన కోటగోడలను, లోతైన కందకమును, సమున్నతసౌధములను, గజతురగపదాతులను వర్ణించుటకుఁ దగిన యుత్పలమాలలనే వినియోగించినాఁడు. మలయ పవనమునకుఁ జంపకమాలలతో సౌరభమును జేకూర్చినాఁడు. పుష్ప లావికల పూదండలబేరముల నుత్పలమాలతో జతపఱచినాఁడు. నాట్య కత్తెల యాంగికవిన్యాసములను, వారకాంతామణుల విలాసకృత్యములను, ధర్మజుని గుణగణములను వర్ణించుట కనుకూలగతివిశేషములతోఁ గూడిన సీసపద్యముల నెన్నుకొనినాఁడు.

ఉరకలువేయుచున్న సుభద్రయొక్క యౌవనాతిశయమును సూచిం చుటకు, నట్టి సుందరాంగినిఁ బొందుటకై యర్జునుని హృదయము నుర కలు వేయించుటకును దగిన యురకలువేయు గతివిశేషములతోఁ గూడిన పంచచామరవృత్తము నుపయోగించినాఁడు. 199 సుభద్రయొక్క మదన తాపము క్రమముగ నతిశయించుచున్న తీరును, మన్మథమలయానిల చంద్రాదుల నామెచెలికత్తెలు క్రమముగ నిందించిన విధమును సూచించు

199 వి. వి. ద్వి. ఆ. ప. 82

టను, యాదవవీరుల యార్భాటమును వర్ణించుటకును పంచచామరములనే వినియోగించియున్నాఁడు. 200 శబ్దచమత్కారసుందరిని కందపద్యములందుఁ గదముద్రొక్కించినాఁడు. ఆటవెలఁదులందాటలాడించినాఁడు

పరివళ్లుద్రొక్కుచుఁ బ్రవహించుచున్న గంగానదిని వర్ణించుటకుఁ దదనుకూలగతివిశేషముతోఁ గూడిన భుజంగప్రయాతవృత్తమును వాడియున్నాఁడు. 201 రఘునాథనాయకుని స్తుతించురూపమున మఱొక భుజంగప్రయాతమును గూర్చియున్నాఁడు 202 ఈవృత్తమే యతని కవితాసుందరీ నాట్యభంగిమల కనుకూలముగ మేళవించిన ఛందోవిన్యాసమృదంగ నిస్వనముల కడపటి ముక్తాయింపుగఁ గానవచ్చుచున్నది. ఉలూచ్యర్జున ప్రణయవృత్తాంతమును జాలవఱకు నుత్పలచాంపేయసౌరభాంచితము గావించినాఁడు. ఆశ్వాసాంతసన్నివేశములందు తోటకస్రగ్విణ్యాదివృత్తములను వాడి ప్రాచీనాంధ్ర కవితామర్యాదను బాటించినాఁడు. శైశవావస్థకుఁ దగినట్లు కుమారోదయవర్ణనమునకుఁ గందపద్యములనే గూర్చినాఁడు.

సుభద్రావిరహాతిశయమును వర్ణించుసందర్భములో నగములెక్కుచు మిన్నుముట్టుచు నహంకరించు చంద్రునినిందించుటకై యావాతావరణమున కనుకూలమగు తాళలయాన్వితగతివిశేషములతోఁగూడిన తరలవృత్తము నెన్నుకొనినాఁడు. 203

పరిణయమూర్తులైన సుభద్రార్జునుల యారాటమునకు, బలరామా

200 ,, — తృ ఆ. — ,, 42, 49 142
201 ,, .... ప్ర, ఆ, .... ,, 47
202 స, వి. .... తృ, ఆ. — వ, 239
203 — .... , 64

దుల యాటంకములేకుండ వారివివాహమును త్వరితగతిని జరిపింపవలెనను గృష్ణాదుల యభిప్రాయమునకును దగినట్లుగ నర్జునుని పెండ్లికొడుకుగఁ ద్వరపడియలంకరించుటను దెలుపుటకు ద్వరితగతి విశేషములతోఁగూడిన లయవిభాతిని వాడినాఁడు. 204

ఇట్లు సమయానుకూలరసస్ఫూర్తికొఱకుఁ దగిన ఛందోరీతుల నెన్నుకొనుటలోఁ జేమకూర వేంకటకవి కడు నైపుణ్యమును బ్రదర్శించినాఁడు.

విజయవిలాసమునందుఁ గందపద్యములధికసంఖ్యలోఁ గానవచ్చును. తరువాత నుత్పలమాలలు ప్రాధాన్యము వహించినవి. అనంతరము తేటగీతులు ప్రముఖపాత్ర వహించినవి. అటుపై సీసములు, చంపకమాలలును గొంచెమించుగాఁ దుల్యప్రాధాన్యము వహించియున్నవి. మత్తేభములు, శార్దూలములు, నాటవెలఁదులు మున్నగువానికిఁ గ్రమముగా సంఖ్యాబలము సన్నగిల్లినది. దీనినిబట్టి యతని రసోచితపద్యనిర్మాణాత్మక శిల్పమవగతమగుచున్నది,

వేంకటకవి తన విజయవిలాసమునందు వాడిన వివిధ పద్యముల సంఖ్య (అవతారికాపద్యములతోఁ గలిపి) :—

| పద్యనామము | — | సంఖ్య |
|---|---|---|
| శార్దూలములు | | 24 |
| మత్తేభములు | | 32 |
| ఉత్పలమాలలు | | 146 |
| చంపకమాలలు | | 60 |
| పంచచామరములు | | 4 |

204 ,, — 81

| | | |
|---|---|---|
| భుజంగప్రియాతములు | — | 2 |
| తరలము | — | 1 |
| లయవిభాతి | — | 1 |
| తోటకము | — | 1 |
| స్రగ్విణి | — | 1 |
| కందములు | — | 228 |
| సీసములు | — | 62 |
| తేటగీతులు | — | 96 |
| ఆటవెలఁదులు | — | 10 |
| మొత్తముపద్యములు | — | 668 |
| గద్యములు | — | 4 |
| మొత్తము గద్యపద్యముల సంఖ్య | — | 672 |

## జాతివార్తలు

ఆంధ్రసాహిత్యములో దక్షిణాంధ్రయుగకవులు జాతివార్తావ్యవహారమును విరివిగచేసినట్లు కానవచ్చుచును. సంస్కృతాలంకారికులు, నైఘంటికులును జాతివార్తాలక్షణములను తెల్పియున్నను వానిని దక్షిణాంధ్రయుగకవీంద్రులు వెలుఁగులోనికి తెచ్చినట్లుకన్పట్టును. భట్టికావ్యాదిపరిమితక్షేత్రములందుతప్ప తదితరసంస్కృతకావ్యప్రపంచమున జాతివార్తాప్రసక్తికానరాదు. దక్షిణాంధ్రయుగమునకుచెందిన కవీంద్రులు సహృదయనాయకరాజులపోషణలో నవనవోన్మేషప్రతిభాసమన్వితులుగవర్ధిల్లి తమ సరసకావ్యరచనాధోరణులలో జాతివార్తాప్రసంగములుచేసియున్నారు.

చేమకూరవేంకటకవి తన విజయవిలాస పీఠికలో రాజకవీంద్రుఁడైన రఘునాథనాయకుని కవితాగుణములను ప్రశంసించుచుచెప్పిన —

ఉ॥ తారసపుష్టిమై పరిశతదంబున జాతియువార్తయున్ జమ
త్కారము నర్థగౌరవముఁగల్గ ననేకకృతుల్ ప్రసన్నగం
భీరగతిన్ రచించి మహిమిఁ చినచో నిఁక శక్తులెవ్వర
య్యా రఘునాథభూపరసికాగ్రణికిన్ జెకసోకఁజెప్పఁగన్[1]

అనుపద్యములో జాతివార్తాచమత్కారాదులను పేర్కొనియున్నాఁడుఁ అవి రఘునాధుని కవిత్వములోఁగానవచ్చు కవితాగుణవిశేషలుగ పేర్కొనఁ బడినను తనకవిత్వమునందుకూడ నాప్రముఖగుణములుకానవచ్చునని వ్యంగ్య ధోరణిలో సూచించినట్లయినది. వేంకటకవికూడ నట్టిఘనకవితాగుణసంప న్నుఁడు కనుకనే యారాజకవిశిఖామణి యతనిని చమత్కారముతో తొణికిస లాడునట్లు ప్రతిపద్యమును చెప్పగలసైపుణ్యముగలవాఁడని, సుందరకావ్య నిర్మాణముచేయఁగల సమర్థుఁడని క్షితిలోనతనిమార్గమెవరికినిరాదని, రసానందజనకముగ రమణీయకావ్యరచనచేసి తనప్రయోజకత్వమును నిరూ పించుకొనినాఁడనియును తనప్రముఖవాగ్జాలముతో ప్రశంసించియున్నాఁడు.[2] రఘునాధుఁడు తనను ప్రశంసించుచు పలికినపలుకులు, తానతనిని ప్రశంసిం చుచుపలికిన పలుకులును తనవేగనుక రఘునాథనాయకుని కవితాగుణములుగ పేర్కొనఁబడిన జాతివార్తాములు వెంకటకవికిఁగూడచెందునట్లు గ్రహింప నగును. జాతివార్తలు పరస్పరసంబంధముగలవిగతోచును.

జాతి :- ప్రాచీనాలంకారికులు కొందఱు జాతియను పదమును స్వభావోక్త్యలంకారమునకు పర్యాయపదముగ తమ యలంకారగ్రంథము లందు పేర్కొనియున్నారు.

శ్లో॥ నానావస్థంపదార్థానాంరూపంసాక్షాద్వివృణ్వతీ
స్వభావోక్తిశ్చజాతిశ్చేత్యాద్యాసాలంకృతిర్యథా.[3]

1 వి. వి. పీఠిక, ప. 31.
2. వి. వి. పీఠిక, ప 50, 51.
3 కావ్యాదర్శము .... దండి . P.

అను శ్లోకములో దండి స్వభావోక్తిలక్షణమును దెల్పుచు తత్పర్యాయ పదముగ జాతిని పేర్కొనియున్నాఁడు. "సాఅలంకారేషు ప్రసిద్ధా ఆద్యా ప్రథమముద్దిష్టా అలంకృతిః స్వభావోక్తిశ్చ జాతిశ్చేతి నామద్వయవతీ తాన్వయః పదార్థానాం జాతిక్రియగుణ ద్రవ్యాణాం నానా అనేకా అవస్థా విశేషోయస్య తద్రూపవర్ణసంస్థానాద్యాత్మక మసాధారణం ధర్మస్య మిత్యర్థః. వర్ణనావిశేషేణవస్తునః సూక్ష్మస్వరూపస్ఫుటీకరణం స్వభావోక్తిరితి లక్షణం" అనునా శ్లోకవ్యాఖ్యానమునందు కూడ స్వభావోక్తి, జాతి యను పదములు తుల్యార్థకములుగ వాడఁబడినవి. వస్తువుయొక్క సూక్ష్మ స్వరూపమును స్పష్టముగ వర్ణించుట యీయలంకార లక్షణముగ తెలియు చున్నది. ఈసందర్భములో దండిచెప్పిన యభిప్రాయమును విశ్వేశ్వరకవి చంద్రుఁడు సమర్థించుచు -

"నానావస్థాసుసిద్ధానియానిరూపాణివస్తునః
సాక్షాద్విదధతీ తానిజాతిరిత్యభిధీయతే." 4

అను శ్లోకములో జాతిలక్షణమును చెప్పియున్నాఁడు. వివిధావస్థలయందు సిద్ధించిన వస్తుస్వరూపములను ప్రత్యక్షముగ వర్ణించునదని యభిప్రాయము. జాతియనునదొక యర్థాలంకారభేదమని, దానినే స్వభావోక్తియని కూడ వ్యవహరింతురని యాంధ్రనైఘంటికులు కూడ పేర్కొని 5 "తారస పుష్టిమై ప్రతిపదంబున జాతియునార్థయున్ .... .... " అను విజయ విలాసపద్యము నుదాహరించియున్నారు.

మమ్మటుని కావ్యప్రకాశమునందలి స్వభావోక్త్యలంకారవ్యాఖ్యలో "ఏనామేవ జాతిరితికేచిద్వ్యవహరంతి" అనిచెపఁబడినది. స్వభావోక్తినేజాతి యనికొందఱువ్యవహరించుచున్నారనిదానియభిప్రాయము. "జాతిమివఅలంకృతీ

4 చ. చం. — విశ్వేశ్వరకవిచంద్రుడు - సప్తమోవిలాసః- శ్లో. 4, P 110.
5, సూ. అం. ని. 3సం॥, P. 430.

నాం .... .... అధికముద్భాసమానాం"6 అనిజాతినొకయలంకార భేదముగ ధనపాలుఁడుపేర్కొనియున్నాఁడు "నవోఽర్థోజాతిరగ్రామ్యా .... ...." అను హర్షచరితావతారికాశ్లోకములో బాణుఁడు జాతి గ్రామ్యముకారాదని చెప్పిజాతిస్వభావోక్త్యలయభేదత్వమును సూచించియున్నాఁడు. "Jati is the old name of Swabhavokti. It is a poet's Statement of the natural State of things 7" అని యీ సందర్భములో రాఘవన్‌గారు జాతికి స్వభావోక్తికిని భేదములేదని తెల్పియున్నారు. విద్యానాథుఁడు తనప్రతాపరుద్రయశోభూషణములో "స్వభావోక్తిరసౌచారు యథావద్వస్తువర్ణనమ్8" అని స్వభావోక్తిలక్షణమును చెప్పియున్నాఁడు గాని జాతిప్రస్తావనచేయలేదు. ప్రతాపరుద్రీయవ్యాఖ్యాతయైన కుమారస్వామి స్వభావోక్తిలక్షణమును వ్యాఖ్యానించుచు "చారు సమ్యగగ్రామ్యమ్" అని చారుశబ్దమునకగ్రామ్యమను నర్థము చెప్పియున్నాఁడు. కనుక బాణుఁడు వాడిన యగ్రామ్యపదమునకుఁ గూడ నాచారుత్వార్థమునే చెప్పవలసియున్నది.

'జన్' అను ధాతువునుండి 'జా' యనుశబ్దముపుట్టినట్లు తెలియుచున్నది. "జనీప్రాదుర్భావే" అని దీనికర్థము చెప్పఁబడినది. అనఁగా పుట్టుకయని యర్థము. "జాతిస్సామాన్యజన్మనోః" అని యమరసింహుఁడు పేర్కొనియున్నాఁడు. కాని దీనికినాలంకారిక పరమైన నిర్వచనము వేరుగ కానవచ్చుచున్నది. వస్తుస్వరూపస్వభావములను యథాతథముగ మనోహర పద్ధతిలో చిత్రించునది జాతియనియలంకారశాస్త్రీయ ధోరణిలో నిర్వచింపఁబడినది. సజాతీయవస్తుసామాన్య లక్షణములను ప్రత్యేకస్థాయిలోనిది వర్ణించుచు జాతినిగూర్చి పూర్వశాస్త్రకారులు రెండు ముఖ్యవాదములు చేసియు

---

6, తి. మం. —ధనపాలుఁడు — P. 130.

7. S. C. A, S. Dr. V-Raghavan, P. 93.

8, ప్ర. రు. య. భూ. [p, by Balamanorama Press.] విద్యానాథుఁడు P297

9. అ. కో. — గురుబాలప్రబోధిక — P. 756.

న్నారు. జాతి పదార్థసంబంధమైనదని వాజపేయాయనులు వాదించియున్నారు. అది వ్యక్తికి నాకృతికినిసంబంధించినదని మీమాంసకులు వాదించియున్నారు. వృక్షములు, పక్షులు, మృగములు మొదలగునవి యాయాజాతుల ప్రత్యేక లక్షణములకనుగుణముగ నిందు చిత్రింపబడును. అట్లొక జాతియొక్క లక్షణములను సహజసుందరముగ చిత్రించురూపమున నిదిసార్థకనామము వహించినట్లు భావింపఁగును. ప్రాకృతికవస్తువర్ణన చేయునలంకారములలోనిది మొదటిదిగా పరిగణింపఁబడుచున్నది. జాతి, ద్రవ్య, గుణ, క్రియలను స్వభావోక్తి విభాగములనుగ దండి పేర్కొనియున్నాఁడు.

"స్వభావోక్తిశ్చ జాతిశ్చేత్యాద్యాసాలంకారకృతిర్యథా
జాతిక్రియాగుణద్రవ్యస్వభావాఖ్యానమీదృశమ్" 10

అని జాత్యాదులను స్వభావోక్తివిభాగములుగ పేర్కొనియున్నాఁడు. పక్షీజాతికిచెందిన శుకములను మనోహరముగ వర్ణించుచు

"తుండైరాతామ్రకుటిలైః పక్షైః హరితకోమలైః
త్రివర్ణరాజిభిః కంఠైః ఏతే మంజుగిరశ్శుకాః" 11

అను శ్లోకమును రచించి దండి జాతిస్వభావోక్తి భేదమునకుదాహరణముగ నిచ్చియున్నాఁడు. వస్తువుల స్వరూపస్వభావములను వాస్తవికముగ చిత్రించు నలంకారములను మొదటి వరగతికి చెందిన వానినిగ రుద్రటుఁడు పేర్కొనియున్నాఁడు.

కాని యట్టివానిలో నాలంకారికవైచిత్ర్యమంతగా కానరాదు. అట్టివాస్తవిక

10. కావ్యదర్శము — దండి — II. 8.
11. ,, — ,, — ,, — II. 13.

చిత్రణము చేయునలంకారజగత్తులో జాతిముఖ్యమైనదని నిమిసాధువను నాలంకారికుఁడు పేర్కొనియున్నాఁడు. శబ్దవైచిత్ర్యాతిశయములేకుండ కేవలము వస్తుస్వాభావికస్థితిని చిత్రించునదగుటచే నీజాతి నర్థాలంకారముగ పరిగణించి, తదలంకారసమూహములో మొదట పేర్కొనియున్నాఁడు. భోజుఁడు తనశృంగారప్రకాశములో కావ్యభాషౌచిత్యమునుగూర్చి వివరించుచు శబ్దాలంకారసముదాయమును పేర్కొనియున్నాఁడు ఆప్రబంధభాషౌచిత్యము జాత్యలంకారముగను, అది వాక్యాలంకారవిస్తరణమైన జాతిగను పరిగణింపఁబడినది. [12]

వార్త :- "వృత్తిరస్యాం అస్తీతి వార్తా" అనువ్యుత్పత్తి శబ్దకల్పద్రుమమునందుచెప్పఁబడినది, దీనియందు వృత్తికలదని యభిప్రాయము. వృత్తి, యను శబ్దమునకు "ప్రిజ్ఞాశ్రద్ధార్చావృత్తిభ్యోణః" అనుసూత్రచేత "ణః" అనునదిరాగా, నటుపై 'టాప్' అనునదివచ్చి "వార్తా" అను రూపమేర్పడి నట్లు తెలియుచున్నది. దీనికి వాచస్పత్యమునందారోగ్యా, సార, నిరామయ, వృత్తిశీల, దుర్గా, కృషికర్మ, జనశ్రుతి, వృత్తాంతాద్యర్థములు పేర్కొనఁబడినవి.

దక్షిణాంధ్రయుగ కవీంద్రులు జాతివార్తాచమత్కారములను ప్రముఖ కవితాగుణములనుగ పేర్కొనియున్నారు. జాతివార్తల కవినాభావ సంబంధము కలిగియున్నట్లవి జంటగనే కావ్యములందు ప్రయోగింపఁబడినవి. ఉక్తిచాతుర్యము లేకుండ కేవలము విషయనివేదనాత్మకముగ నున్నది వార్త యనఁబడునని దీనికి సామాన్యాభిప్రాయము చెప్పఁబడుచున్నది. ఈసామాన్యాభిప్రాయమునే Dr. V. రాఘవన్‌గారు "If the Vakratha is not to be found, the expression is mere news, mere information giving; it is Varta" [13] అను వాక్యములో సూచించియున్నారు.

12 S, P, — Bhoja — Med. M S. — Vol. ii, P, 432
13 S. C, A, S. — Dr. V. Raghavan — P. 96.

"గతోఽ స్తమర్కో భాతీందుః యాన్తివాసాయపక్షిణః
ఇత్యేవమాదికింకావ్యం ? వార్తామేనాంప్రచక్షతే" 14

అను శ్లోకముసు చెప్పి "సూర్యుఁడ స్తమించినాఁడు, చంద్రుఁడు ప్రకాశించు చున్నాఁడు, పక్షులు తమ నివాసమునకేగుచున్నవి" యను కేవలాభిప్రాయ ప్రకటనాత్మకములైన సామాన్య వాక్యములు చమత్కారరహితములై యున్న కారణమున కావ్యగౌరవమును పొందఁజాలవని, యట్టి సామాన్యాభిప్రాయమును తెల్పుదానిని వార్తయనియు వ్యవహరింతురని భామహుఁడు తెల్పియున్నాఁడు. వార్త జాతికంటె భిన్నమైనది బాణుఁడు దీనిని "గ్రామ్యజాతిః" అని పేర్కొనియున్నాఁడు. కేవలము సామాన్యాభిప్రాయమును ప్రకటించునది వార్తయని, వస్తుస్వరూపమును ప్రకృతిసిద్ధముగ కవితాస్పర్శతో చిత్రించునది జాతి లేక స్వభావోక్తి యనియు తెలియుచున్నది. కొందఱు జాతివార్తల భేదమును సడలించి యారెండిటిని పర్యాయపదములుగ ప్రకటించియున్నారు. అతిశయోక్తి, యథాసంఖ్యము, ఉత్ప్రేక్ష యను నలంకారములు తరువాత వార్తను భట్టి తన కావ్యములో నుదాహరణపూర్వకముగ చిత్రించియున్నాఁడు.

"విషధరనిలయే నివిష్టమూలం శిఖరశతైః పరిమృష్టదేవలోకమ్
ఘనవిపులనితంబపూరితాశం ఫలకుసుమాచితవృక్షరమ్యకుంజమ్" 15

భట్టికావ్యములో నీశ్లోకము వార్తకుదాహరణముగ పేర్కొనఁబడినది. మహేంద్రగిరిని వర్ణించుచుచెప్పఁబడినశ్లోకమిది. ఇందు మహేంద్రగిరి సహజసుందరముగ మనోహరస్థాయిలో చిత్రింపఁబడినది దీనినిబట్టి భామ

14 K. A. — Bhamaha — 11.87
పాఠాంతరము "ఇత్యేవమాదికం కావ్యం"

15 భ కా. — X 45.

హునకు పూర్వము జాతివార్తలు పర్యాయ పదములుగ పరిగణింపఁబడినట్లు తెలియుచున్నది. వస్తుస్వరూపసహజచిత్రణమును స్వభావోక్త్యలంకార ముగ కొందఱు గుర్తించిరి. కొందఱు "జాతి" గ భావించిరి. మరి కొందఱు "వార్త" గ పేర్కొనిరి అట్టిదానిని భట్టి వార్తగ భావించియున్నాఁడు. "Vartha and Swabhavokti may be taken to be the same" 16 అని కాణే పండితుఁడా రెండిటియొక్క యభేదత్వమును పేర్కొనియున్నాఁడు. విష్ణుధర్మోత్తరమునందిది వార్తగ పేర్కొనఁబడినట్లు "యథా స్వరూప కథనం వార్తేతి పరికీర్తితమ్" అను వాక్యమునుబట్టి తెలియుచున్నది. వార్త స్వభావోక్తికంటె భిన్నమైనదని, వక్రోక్తి మూలకమైన కవితా స్పందనలేనిది వార్తయగునని భామహుఁడు భావించియున్నాఁడు దండి జాతి స్వభావోక్తులను పర్యాయపదములుగ వాడియున్నాఁడు.

భట్టికావ్యమునకు చెందిన జయమంగళవ్యాఖ్యలో వార్తకు విశిష్ట లక్షణము చెప్పఁబడినది. "వార్తేతి తత్త్వార్థకథనాత్. సా విశిష్టానిర్విశిష్టాచ. తత్రయాపూర్వాసాస్వభావోక్తి రుదితా" అని తద్వ్యాఖ్యాకారుఁడు చెప్పి "స్వభావోక్తిరలంకారఃఇతికేచిత్ప్రచక్షతే. అర్థస్య తాదవస్థ్యేచ స్వభావోఽభి హితోయథా" 17 అను భామహుని శ్లోకమును పేర్కొనియున్నాఁడు. అనంతరము జయమంగళవ్యాఖ్యానమునవిట్లు చెప్పఁబడినది. "నిర్విశిష్టా వార్తానామాలంకాంఃయథోక్తం

శ్లో॥ గతోస్తమర్కః భాతీందుః యాన్తివాసాయపక్షిణః
ఇత్యేవమాదికంకావ్యం వార్తామేనాంప్రచక్షతే 18 "ఇతి"

---

16 H. S. P. — P. V. Kane — P. 69 foot note.
17 కావ్యాలంకారము — భామహుఁడు — 11, 93.
18 under X, 46, N. S. edn.
(భామహుఁడు — కావ్యాలంకారము — 11.87 పాఠభేదము)

అని యావ్యాఖ్యాత వార్తాలంకార వివరణ చేసి తత్సంబంధమైన భామహ శ్లోకమునీషత్పాఠభేదముతో నుదాహరించియున్నాఁడు. జయమంగళ వ్యాఖ్యాకారుఁడీసందర్భములో వార్తాసంబంధములైన విశిష్టా, నిర్విశిష్టావిభాగములను పేర్కొని విశిష్టావిభాగమే స్వభావోక్తియని, నిర్విశిష్టావిభాగమే వార్తాలంకారముగ వ్యవహరింపఁబడుచున్నదనియు స్పష్టపఱచినాఁడు వస్తువుల ప్రాకృతిక స్థితిగతులను యథాతథముగ చిత్రించునట్టి ప్రధానవార్తాలంకారమే విశిష్టానిర్విశిష్టావిభాగములుగ విభజింపఁబడినదని, విశిష్టవార్తయే స్వభావోక్తియని, నిర్విశిష్టావార్తయే వార్తయని, ప్రత్యేకముగ నొకవస్తువుయొక్క స్వరూపస్వభావములను సహజసుందరముగ వర్ణించునది విశిష్టావార్తయని, సామూహిక ప్రకృతిని సహజసుందరముగ వర్ణించునది నిర్విశిష్టావార్తయనియు జయమంగళవ్యాఖ్యాకారుఁడు భావించినట్లు తెలియుచున్నది. మఱియు మహేంద్రగిరిని వర్ణించుచు భట్టిచెప్పిన "విషధరనిలయే ... .... " అనుశ్లోకమును విశిష్టావార్తకుదాహరణముగ, సూర్యాస్తమయాదిప్రాకృతికసన్నివేశసముదాయమును చిత్రించుచు భామహుఁడు చెప్పిన "గతోఽస్తమర్కః భాతీందుః ... ...." అను శ్లోకమును నిర్విశిష్టావార్తకుదాహరణముగను నాయాలంకారిక ప్రముఖుఁడు భావించినాఁడు. [19]

భామహుఁడు తన కావ్యాలంకారములో పేర్కొనిన వార్త యలంకారము కాదని డా. రాఘవన్‌గారభిప్రాయపడియున్నారు. వార్తాలంకారమును దండి పేర్కొనియున్నాఁడు. [20] భామహుఁడు దీనినలంకారముగ పరిగ్రహింపలేదని యొకచోట, [21] స్వభావోక్తియను నభిప్రాయముతో దీనినలం

19. S. C. A. S. — Dr. V. Raghavam — P 98.
20. కావ్యదదర్శము — దండి 1.85
21. H. S. P. — Dr. S. K. De. — Vol. II, P.36

కారముగ భావించినాడని మఱియొకచోట[22] Dr. S. K. డె గారు పేర్కొని యున్నారు. వార్తకలంకార గౌరవము లేదని కాణే పండితుడుకూడ చెప్పి న్నాడు.[23] కాని జయమంగళ వ్యాఖ్యానమునందు పేర్కొనబడిన "గతోఽస్తమర్కః ... .. " అను వామహుని శ్లోకములోని రెండవ పాదము "ఇత్యేవమాదికంకావ్యం .. .... అను పాఠభేదముతో పేర్కొ నబడి వార్తాలంకారముయొక్క యునికి స్పష్టపఱుపబడినది.

దండి కాంతిగుణమును వివరించుచు వార్తాప్రసక్తి తెచ్చియున్నాడు. "కాంతంసర్వజగత్కాంతం లౌకికార్థానతిక్రమాత్, తచ్చవార్తాభిధానేషు వర్ణనా స్వపి దృశ్యతే" అని యాప్రముఖాలంకారికుడు స్వభావోక్తితో సంబంధము కలిగియున్న కాంతిగుణము వార్తాభిధానములయందు, వర్ణనలయందును కానవచ్చునని చెప్పి వార్తాభిధానమున కుదాహరణముగ,

"గృహాణినామ తాన్యేవ తపోరాశిర్భవాదృశః
సంభావయతి యాన్యేవం పావనైః పాదపాంసుభిః" [24]

అను శ్లోకమును పేర్కొనియున్నాడు. ఈసందర్భమున దండి యభిప్రా యములను వివరించుచు "This Varta is a Sweet Complement or word of welcome or enquiry on the occasion of the arrival of a worthy guest. It is thus clear that Varta here is not any alankara nor the alankara which the Jayamangala says and is illustrating" [25]
అని డా. రాఘవన్‌గారు చెప్పియున్నారు ఉత్తమాతిథిని గూర్చి చేయు మధురప్రశంసగాని, స్వాగతవచనముగాని, యోగక్షేమముల నడుగుటగాని యిచ్చట వార్తయనబడునని యది జయమంగళవ్యాఖ్యానమునందు పేర్కొన

22. H, S. P. — Dr. S. K, De — Vol.II.P.109
23, H. S. P. — P. V Kana — P, 70
24 కావ్యాదర్శము — దండి — Ch. — 1-85-87
25 S.C. A. S. — Dr. V. Raghavan — P. 104

బడి, భట్టికావ్యమునందుదాహరింపఁబడిన వార్తాలంకారము మాత్రము కాద నియు రాఘవన్‌గారి యభిప్రాయము. ''వార్తానామ అన్యోన్యకథనః" అని హృదయంగమవ్యాఖ్యానము (కావ్యాదర్శము) నందు చెప్పఁబడినది. ఒక రితోనొకరు చెప్పుటను వార్తయందురని యభిప్రాయము. దండిపేర్కొనిన కాంతిగుణమును గూర్చి వివరించు సందర్భములో ప్రసంగవశమున వార్తా వర్ణనలను వ్యాఖ్యానించుచు ''తత్రఉపచారవచనం వార్తా, ప్రశంసావచనం వర్ణనా'' 26 అని హేమచంద్రుఁడు చెప్పియున్నాఁడు. మెచ్చుకొనునట్టి వచనము వార్తయనఁబడునని యభిప్రాయము. "వార్తానామ కుశలప్రశ్న పూర్వికాసఙ్కథా" 27 అని సింగభూపాలుఁడు చెప్పియున్నాఁడు. వార్త యనఁగా కుశలప్రశ్న పూర్వక సంభాషణమని యాభూపాలుని యభిప్రాయము. ''అనామయే ప్రియాలాపే వార్తం వార్తాచ కీర్త్యతే" 28 అని రత్నేశ్వరుఁడు చెప్పియున్నాఁడు. అమయరహితమైన ప్రియాలాపమును వార్తయందురని యతని యభిప్రాయము

"వార్తాఅనామయప్రియాపః. అనామయప్రియాలాపః వృత్తిః వార్తా చకథ్యతే" అని జీవానందవిద్యాసాగరుఁడు కూడ తన కావ్యాదర్శవ్యాఖ్యాన ములో రత్నేశ్వరుఁడు చెప్పినట్లే వార్తాలక్షణమును చెప్పియున్నాఁడు. ఈ సందర్భములో నితిహాస వర్ణనమును గూడ వార్తాపరిధిలోనికితెచ్చిరి, కాని యా నిర్వచనము సంతృప్తికరముగా లేనికారణమున నాయభిప్రాయము త్రోసిపుచ్చఁబడినది. ఇట్టి యాలంకారికాభిప్రాయములను పర్యవేక్షింపఁగ దండిపేర్కొనిన వార్తను తదితరులలంకారముగ పరిగణించలేదని తెలియుచున్నది.

---

| | | |
|---|---|---|
| 26 | Kavyanusasanam — Hemachandra | P. 200 |
| 27 | T. S S. Edn. — | P. 67 |
| 28 | S.K.A. Commentary — Ratneswara | 1, P. 114 |

వాస్తవ, ఔపమ్య, అతిశయ, శ్లేష అని నాల్గుభాగములుగ నర్థాలంకారములను రుద్రటుఁడు విభజించియున్నాఁడు.

"వాస్తవమితితత్‌జ్ఞేయంక్రియతే వస్తు స్వరూపకథనంయత్
పుష్టార్థమ్ అవిపరీతం నిరుపమమ్ అనతిశయమ్ అశ్లేషమ్" 29

అనుశ్లోకములో రుద్రటుఁడు వాస్తవలక్షణమును చెప్పియున్నాఁడు. వస్తుస్వరూపముయొక్క యథార్థకథనము వాస్తవమని, తత్కథన పద్ధతి పుష్టార్థముతో కూడి, విపరీతార్థములకుఁ గాని యనేకార్థకములకుఁ గాని దారితీయకుండ, నౌపమ్యవిరహితమై యతిశయోక్తిరహితమై యుండవలెననియు నతని యభిప్రాయము, సహోక్తి, సముచ్చయము, జాతి, యథాసంఖ్యము, పర్యాయము, విషమము మొదలగునవి వాస్తవాలంకారముల కోవలో చెర్పఁబడినవి. వీనిలో జాతియనునది వాస్తవికతయొక్క పాలధికముగఁ గలయలంకారముగ పరిగణింపఁబడుచున్నది. రుద్రటుఁడు జాతిరూప భేదములను పేర్కొని పిల్లలు, కన్యలు మొదలగువారిని జాతికి విషయములుగ నుదాహరించియున్నాఁడు. వాస్తవమనఁగా వస్తువునున్నదానిను న్నట్లు చెప్పుటయని, జాతియనఁగా మనస్సులోనున్న యనుభవపూర్వక వస్తువును స్పష్టముగ చిత్రించుటయనియు రుద్రటునికావ్యాలంకారమునకు వ్యాఖ్యానమును రచించిన నిమిసాధువు చెప్పియున్నాఁడు "జాతిస్తుఅనుభవం జనయతి; యత్రతంపరస్థంస్వరూప వర్ణ్యమానమేవ అనుభవమివైతీతిస్థితమ్" అనువాక్యములలో జాతి యనుభవమును కలిగించునని, పరగతస్వరూప వర్ణనమేయనుభవమనియును వ్యక్తముగావింపఁబడినది.

"నానావస్థాసు జాయంతే యానిరూపాణివస్తునః
స్వేభ్యఃస్వేభ్యోనిసర్గేభ్యఃతానిజాతింప్రచక్షతే

29. K. A. ... Rudarta .. VIII,10.

అర్థవ్యక్తేరియం భేదమ్ ఇయతా ప్రతిపద్యతే
జాయమాన ప్రియం వక్తిరూపం సా సార్వకాలికమ్'' 30

అను శ్లోకములలో భోజుఁడు జాత్యలంకారలక్షణమును చెప్పియున్నాఁడు. అవస్థాభేదములనుబట్టి వస్తువులు పొందు సహజరూపములు జాతివిషయములుగ నా ప్రసిద్ధాలంకారికుఁడు పరిగణించియున్నాఁడు. రామసింహుఁడను వ్యాఖ్యాత యాశ్లోకములను వ్యాఖ్యానించుచు ''కవి ప్రతిభామాత్ర పరికాశనీయరూపోట్టంకనం జాతిరితిలక్షణమ్'' అని చెప్పి జాతిలక్షణములో కవి ప్రతిభకు కూడ ప్రాధాన్యము నిచ్చియున్నాఁడు. భోజుఁడు జాతిలక్షణమును చెప్పుచు ''స్వైభ్యః స్వైభ్యః నిసర్గేభ్యః...'' అని వక్కాణించియున్న కారణమున వస్తుగతసృష్టులు, ఆలోచనలు మున్నగు బాహ్యసంబంధములను జాతిపరిధిలోనికి తీసికొనిరాకుండ విడిచిపెట్టినాఁడని రత్నేశ్వరుఁడు చెప్పియున్నాఁడు.

వామనుఁడర్థవ్యక్తియను నొకగుణమును పేర్కొనియున్నాఁడు. ఇది స్వభావోక్త్యలంకారముయొక్క గుణముగ భావింపఁబడుచున్నది. ''అపిచ జాతిర్నామాయమలంకారఇతి''31 అను వాక్యమును బట్టి వామనుఁడు పేర్కొనిన యర్థవ్యక్తి జాత్యలంకారము తప్ప మఱియొకటికాదని హేమచంద్రుఁడు భావించినట్లు తెలియుచున్నది. అర్థవ్యక్తికి స్వభావోక్తికిని భేదము కలదని నిరూపించుటకు భోజుఁడు ప్రయత్నించినాఁడు. వస్తువుయొక్క సార్వకాలికరూపమును చిత్రించునది యర్థవ్యక్తియని, వివిధావస్థలలో నేర్పడిన వస్తురూపములను వర్ణించునది స్వభావోక్తియనియు నతని

30. S. K. A. Bhoja ... III. 4, P. 312.
31 కావ్యానుశాసనము — హేమచంద్రుఁడు — P. 199.

యభిప్రాయము. అగ్నిపురాణమునందు స్వభావోక్త్యలంకారము స్వరూపాలంకారముగ పేర్కొనఁబడినది. ఆ స్వరూపాలంకారము నిజము, ఆగంతుకమనని రెండువిధములుగ విభజింపఁబడినది ఈసందర్భములో భోజుఁడు పేర్కొనిన సార్వకాలికాగంతుక (జాయమాన) రూపభేదములకీ స్వరూపాలంకారభేదములు మూలములైనవి. భోజుఁడు స్వభావోక్తియు జాతియు నభిన్నములని భావించి తన సరస్వతీకంఠాభరణములోఁజెప్పిన విషయముకంటె సదనముగా తన శృంగారప్రకాశములో "తత్రఉపమాద్యలంకారప్రాధాన్యేవక్రోక్తిః, సోఽపిగుణప్రాధాన్యేస్వభావోక్తిః, విభావానుభావవ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తౌరసోక్తిః" 32 అని చెప్పియున్నాఁడు. అలంకార ప్రాధాన్యమునందది వక్రోక్తిగను, గుణప్రాధాన్యమునందు స్వభావోక్తిగను, రసప్రాధాన్యమునందు రసోక్తిగను పరిగణింపఁబడునని యతని యభిప్రాయము. కుంతకుఁడు స్వభావోక్తి నలంకారముగఁగాక యలంకార్యముగ పరిగణించియున్నాఁడు. రుయ్యకుఁడు జాతిని సూక్ష్మస్వభావముగను, విద్యాధరుఁడుచైన్స్వభావముగను, కుంతకుఁడు విశిష్టస్వభావముగను భావించియున్నారు. ఆంధ్రాలంకారికులలో భట్టుమూర్తికూడ స్వభావోక్తికి జాతికి నభేదత్వము పాటించి క॥ "సహృదయహృదయంగమమై, మహినున్నది యున్నయట్లు మాటలతేటల్ బహుళంబులుగాఁ జెప్పిన, మహిలోక్తియె జాతియయ్యె .... ... " 33 అని తన కావ్యాలంకార సంగ్రహములో జాతియొక్క లక్షణముఁ దెల్పియున్నాడు.

ఇట్లు ప్రాచీనాలంకారికులు జాతివార్తలను గూర్చి తమ యభిప్రాయములను వ్యక్తీకరించియున్నారు. ఇఁకనాధునికులు వీనినిగుఱించి తెల్పిన యభిప్రాయములను తెలిసికొందము.

---

32 శృం. ప్ర. — భోజుఁడు — Madras MS., Vol. II, Ch. XI, P. 372

33 కావ్యాలంకార సంగ్రహము - సన్నిధానం వారి వ్యాఖ్యతో — సం. ఆ., P. 627

జాతియనఁగా స్వభావమని, వార్తయనఁగా వృత్తి [34] యనియు వేదము వెంకటరాయశాస్త్రిగారు చెప్పియున్నారు. జాతియనసభావోక్తియని, వార్తయన నర్థానర్థవివేచనశక్తి [35] యనియు బులుసు వేంకటరమణయ్య గారు వ్యాఖ్యానించియున్నారు. ఆరుద్రగారు జాతికి ''హాస్యోక్తి'' (జోక్) అని నిర్వచనము చెప్పి, జాతిచెప్పి నవ్వించుట యానాటి పరిపాటియని, కవిత్వములో నవ్వించుగుణముండవలెనని వేంకటకవియొక్క యభిప్రాయ మనియు, నాకవియొక్క యుద్దేశములో వార్తయన సామెత [36] యని యును చెప్పి ''జాతిచెప్పిన నవ్వునోయంచు ........ " [37] అను నవరము చిననారాయణకవియొక్క ప్రయోగమును జాతికిని, "మోక్షమునకుఁబోవ మొసలెత్తుకొనిపోయె" [38] అను వేంకటకవియొక్క సామెతను వార్తకును దృష్టాంతములుగ నిచ్చియున్నారు. మఱియు ''రసపుష్టికల కావ్యంలో జాతితోపాటు వార్త ఉండాలనడంలో వారి ఉద్దేశ్యం సముచితమైన సామె తలు వాడడమే అనవచ్చును. నవ్వు పుట్టించేజాతి, నలుగురికీ తెలిసే నానుడిలాంటి వార్త, సవ్యార్థాల చమత్కారాలు ఉన్న కావ్యంలో నిజానికి పొల్లుమాటలు ఉండకూడదు'' అని యీసందర్భములో నారుద్రగారు తమ సమగ్రాంధ్ర సాహిత్యములో వేఱొక పర్యాయము జాతివార్తల యవినాభావ సంబంధమును తమ స్వేచ్ఛాభావసంపత్తి కనుకూలముగ పేర్కొని యున్నారు.

దండ్యాది ప్రాచీనాలంకారికులు జాతివార్తాలక్షణములను తెల్పియు న్నను తెలుఁగు కవులే ప్రత్యేకదృష్టితో వానిని పాటించియున్నారు.

34 వి. వి. వ్యాఖ్యానము - వేదము వెంకటరాయశాస్త్రిగారు — P. 14
35 వి. వి. ముకురవ్యాఖ్యానము - బులుసు వేంకటరమణయ్యగారు — P. 23
36 సమగ్రాంధ్ర సాహిత్యము - ఆరుద్ర - 10 సం॥, — P. 100
37 కు. చ. - నవరము చిననారాయణకవి - 4-4 సీ. 4 పా. (కువలయాశ్వ చరిత్ర)
38 వి. వి. - చే. వేం. - 2-43.

దక్షిణాంధ్రయుగమునకు చెందిన తెలుగుకవులే జాతివార్తలకు బహుళప్రచారగౌరవము లభింపజేసిరని చెప్పవచ్చును

"జాతియుస్వభావోక్తియునొక తెగకు చెందినవే కాని కొంతభేదమున్నది. స్వభావోక్తియనగా నొకపాత్రయొక్క స్వాభావికమగు నవస్థను చిత్రించునది. ఈపాత్రల స్వభావమే కొన్ని తాత్కాలిక మనఃపరిణామములకు లోనైవానినిమిత్తముగా చిత్రింపబడునపుడు జాతియనవలెను వార్తయనగా లోకసముదాచారముల చిత్రణము. దేశకాల పాత్రాదికమును చిత్రించెడి యుచిత్రమగు సంప్రదాయవిశేషము, మర్యాదలు మొదలగునవి వార్త" [39] యని వేదాల తిరువెంగళాచార్యులుగారి యభిప్రాయము. దేశకాలపాత్రాది పరిజ్ఞానములేని కవియొక్క కవిత్వమునకు గౌరవముండదు ఆయాపాత్రల నిజస్థితిగతులు, తదితర విశేషములును తెలిసికొనుటకు వార్త పాఠకులకు మిక్కిలి తోడ్పడును. పాత్రల దేశకాలపరిసరముల కడకు సమగ్రభావన యనెడి సరససాధనముతో పాఠకుని చేర్పగల శక్తిగలది వార్తయొక్కటియే యని చెప్పవచ్చును.

"జాతివార్తాచమత్కార ప్రదర్శనముపై ప్రత్యేకదృష్టినుంచిన కవులలో నగ్రస్థానీయులు దక్షిణాంధ్రయుగకవులు. స్వభావోక్తియే జాతి యనవచ్చును. రమణీయమైన వస్తువుయొక్క యథార్థవర్ణనమే స్వభావోక్తి. నిరలంకృతమై, సాహిత్యప్రతిపత్తి సాధకములలోనిదైన శయ్యానైగనిగ్యము, పదబంధనచాతురి మున్నగునవి లేక కథా సన్నివేశమును, సందర్భోచితిని, పాత్రస్వభావమును మున్నగువానిని పురస్కరించుకొని మఱియొక పాత్రతోడి ప్రసంగసందర్భమున ప్రవర్తిల్లునటువంటి భాషాశ్రయమైన చమత్కారమే వార్తయనవచ్చును. "A pointed expression without any literary

39. చేమకూరవేంకటకవి (సమీక్షావ్యాసము — వేదాల తిరువెంగళాచార్యులుగారు విజ్ఞానసర్వస్వము, 4సం॥ (తెలుగు సంస్కృతి) — P. 996.

exuberance" అని యాంగ్లమున సంక్షిప్తముగ చెప్పవచ్చును. వార్తలా డుటయని ప్రియోగము" [40] అని శ్రీ రావూరు ప్రసన్న సత్యనారాయణగారు జాతివార్తలనుగూర్చి తమ యభిప్రాయములను తెల్పియున్నారు.

రఘునాథనాయకుని కవితారీతులను వివరించు సందర్భములో శ్రీ S. గంగప్పగారు జాతి వార్తలను గూర్చి వేదాలవారు తెల్పిన యభిప్రాయములనుటంకించుచు "జాతియనఁగా పాత్రలాయాసమయానుగుణముగా, మనోహరముగా చిత్రింపఁబడువిధము" అని, "వార్తయనఁగా లోకమందు సముదాచారముల చిత్రణము [41] అనియును స్పష్టపఱచినారు.

సీ॥ ఒక్కనాఁడైనను జక్కఁగాఁగను విచ్చి
బెళుకుఁజూపులఁజూచు ప్రేమలేక .... [42]" అను రఘునాథుని

పద్యము జాతికి, —

క॥ "గువ్వకరకట్లు మెకముల
క్రొవ్వుల బొటుగులును, గునుకుగుడుములునేయున్
నివ్వరికూడును నింటన్
బువ్వంబునఁగుడువ కిట్లు పొక్కఁదగునే [43]" అను పద్యము

వార్తకునుదాహరణములుగ నివ్వఁబడినవి. పైన పేర్కొనఁబడిన సీస పద్యములో మునీంద్రులు సర్వసంగపరిత్యాగముచేసి మోక్షకాంక్షతో తమస్సు

40. ఆ. సం. .... (నమీక్షావ్యాసము) శ్రీ రావూరి ప్రసన్నసత్యనారాయణ స్రవంతి సెప్టెంబరు 1959.

41 "వాల్మీకి చరిత్ర — రఘునాథరాయలరచనారీతులు" (వ్యాసము)— S. గంగప్ప — ఆంధ్రప్రభ (దినపత్రిక) — ఆదివారము, 9-7-'72.

42 వా. చ. — రఘునాథనాయకుఁడు — 1-33

43 ,, — ,, — 2-138

చేయుచున్న పరిస్థితి వారి మనఃపరిణామమునకనుగుణముగ వర్ణింపఁబడినది గనుకనది జాతికుదాహరణముగ భావింపఁబడుచున్నది తరువాతనుదాహరింపఁ బడిన కంద పద్యములో కిరాతులకలవాటైన మృగయావిహారభోజనవిధానము మనోహరముగ వర్ణింపఁబడినది గనుక నదివార్తకుదాహరణముగ భావింపఁ బడుచున్నది.

శ్రీ తాపీ ధర్మారావుగారు తమ విజయవిలాసహృదయోల్లాస వ్యాఖ్యలో వేంకటకవియొక్క "తారసపుష్టిమై .... అను పద్యమును వ్యాఖ్యానించు సందర్భములో జాతి వార్తలను వివరించుచు జాతిలక్షణమును దెల్పునట్టి" సహృదయ హృదయంగమమై .... ... మహితోక్తియె జాతియయ్యె మహినెట్లన్నన్" అను నరసభూపాలీయపద్యమును పేర్కొని "దీనినే స్వభావోక్తి అనికూడ అంటారు జాతికీ, స్వభావోక్తికీ స్వల్పమైన భేదములేకపోలేదు. వార్త అనగా వర్ణిస్తున్న విషయంగాని, కథావస్తువు గాని కంటికి కట్టినట్టు, హృదయానికి హత్తినట్టు అనుగుణమైన దేశ కాలాదివాతావరణంతో వాస్తవమా అనిపించేలాగ రచించడం అనవచ్చును సుక్ష్మంగా చెప్పాలంటే కథాకథననైపుణ్యమనవచ్చును" 44 అని చెప్పియున్నారు.

చేమకూర వేంకటకవి తంజావూరు రఘునాథనాయకుని నాస్థానకవులలో ప్రఖ్యాతిఁగాంచి సర్వాంగసుందరముగ తాను రచించిన విజయవిలాసము నా రసికరాజశేఖరునకే యంకితము గావించినాఁడుగనుక నాప్రాంతమునందలి యాంధ్రుల జాతీయములను, పలుకుబడులను, తదితర చమత్కారాదులను తన ప్రబంధమునందును సముచితముగ ప్రవేశపెట్టినాడని, యాయభిప్రాయములను ప్రతిబింబములుగ జాతివార్తాచమత్కారాది పద

44 వి. వి. - హృదయోల్లాసవ్యాఖ్య P. 60

ములను వాడినాఁడనియుఁ గొందఱు పండితులు చెప్పియున్నారు.

శివకవులు ప్రతిజ్ఞాపూర్వకముగ జానుతెనుఁగులో తమ రచనలను కొనసాగించినట్లే దక్షిణాంధ్రయుగకవిప్రముఖులుగూడ దీక్షతో తమ ప్రబంధములను జాతివార్తాచమత్కారమయములు గావించినట్లు తోచును. శివకవుల కాలము (12వ శతాబ్దము) నాఁటి సాంఘికపరిస్థితుల ననుసరించి శైవమతవ్యాప్తికి జానుతెనుఁగే యనుపమాలంబనమైనది. అట్లే దక్షిణాంధ్రయుగసామాజికస్థితిగతుల ననుసరించి రసికజనమనోభిరామములగు సరసశృంగారవర్ణనాత్మకవిన్యాసములకు జాతివార్తాచమత్కారాదికవితాగుణములావశ్యకములైనవి. అవి కేవలము కవితావాసనావాసితములేగాక తెలుఁగుఁదనముయొక్క తీరుతీయములకుఁగూడ నాటపట్టులై యలరారుచున్నవి. అట్టి యాంధ్రజాతీయతకు భిన్నముగ నసహజధోరణిలో కవిత్వము చెప్పుటను కొందఱు కవులంగీకరించలేదు. ''జాత్యముగామినొప్పయిన సంస్కృతమెయ్యెడఁజొన్ప .... ... " 45 అని తిక్కనార్యుఁడు ప్రతినఁబూనినట్లు చెప్పియున్నాడు. జాత్యముగానిదానిని ప్రవేశపెట్టనని ముక్తకంఠముతో నాకవిబ్రహ్మ చెప్పియున్నాఁడు. తెనుఁగుఁదనముపై నాకవితల్లజునకున్న యనుపమాభిమానమునకిది ప్రబలనిదర్శనము. జాత్యమను పదమునకు మంచికులమునందు పుట్టినది, చక్కనిది, మేలైనది 46 యను నర్థములను నైఘంటికులు చెప్పియున్నారు. 'జాత్య' అను శబ్దమునకు "Of the same family, noble, sprung from noble family, lovely, beautiful, pleasing" 47 అను నర్థముల నాప్టేగారిచ్చియున్నారు. చక్కని సజాతీయ పదజాలమును దృష్టిలో నిడుకొని తిక్కన "జాత్యము" అను పదము ప్రయోగించినట్లు తోచును. కనుకనే యాకవీంద్రుఁడు చైతన్యవంతములైన తెలుఁగు పలుకుబడులతో నాత్మకవితాసుందరిని తీర్చిదిద్దినాఁడు

45 వి. ఉ. రా. — తిక్కన — అవతారిక, ప. 14
46 శ. ర — బహుజనపల్లి సీతారామాచార్యులు P. 300.
47 S. E. D. — V. S. Apte — P. 220.

తెనుగుఁదనముపై నట్టి యపూర్వాభిమానము గలవాఁడుగనుకనే యాంధ్రావళి మోదముంబొరయునట్లుగ కృతులు రచించెదనని [48] యాత్మవిశ్వాస సంపన్నుఁడై యాకవిశ్రేష్ఠుఁడు చెప్పియున్నాఁడు. వస్తుసహజస్థితిగతులను సూచించునట్లే భాషాసాహితీసహజమర్యాదలనుగూడ జాతి యనుపదము సూచించునని భావించినచో తిక్కనవాడిన జాత్యమునకిది సన్నిహితముగ నుండునని తలంపవచ్చును.

మొత్తముమీద జాతివార్తలనుగూర్చి ప్రాచీననవీనవిద్వాంసులనేకులనేకవిధములుగ యుక్తియుక్తముగ చెప్పియున్నను దక్షిణాంధ్రయుగ కవులహృద్గతభావనలకవి సరిపడునట్లు సమగ్రముగలేవు. జాతివార్తలను పదములు రెండును ద్వ్యక్షరఘటితములై చిన్నవిగ పైకికానవచ్చుచున్నను సువిశాలభావ సంపన్నములై, యాంధ్రజాతీయతాసహజసంప్రదాయములకు శాశ్వతప్రతీకలై దక్షిణాంధ్రయుగప్రబంధములందలరారుచున్నవి. అట్టిపరిస్థితిలో నాలంకారికులు చెప్పిన సంగ్రహనిర్వచనములు పాక్షికముగ కానవచ్చుచున్నవి. ఆలక్షణములన్నియు కలిపినను సమగ్రనిర్వచనము కాఁజాలదు. పరిణామశీలములై, దినదినప్రవర్ధమానములగుచున్న యాంధ్రభాషాసాహితీస్థితిగతులలో దక్షిణాంధ్రయుగచైతన్యచిహ్నములనఁదగిన జాతివార్తలకు ప్రాచీనులు చెప్పిన లక్షణములు పాక్షికములుగ, పరిమితములుగను పొడకట్టును. అట్టి స్పందనాత్మకశక్తి సమంచితసరసకవివ్యవహారములు సహృదయహృదయైకవేద్యములై యుండును. అట్టివానికెట్టి ప్రతిభావంతుఁడు చెప్పిన లక్షణములైన నసమగ్రములుగతోచును. ఐనను లోకముకొఱకాత్మభావముల నెఱుకపఱచుట యవసరము.

సజాతీయవస్తువాస్తవికస్వరూపస్వభావములను తత్తదవస్థాభేదములకనుగుణముగ చమత్కారాంచిత శబ్దజాలముతో సహజసుందరముగ

48 ఆం. మ. భా. విరాటపర్వావతారిక — తిక్కన ప. 30.

వర్ణించుటను జాతియనవచ్చును. అది విపరీతార్థములకుఁగాని, కఠినార్థములకుఁగాని దారితీయకుండ పుష్టార్థయుక్తమై, యతిశయోక్తిరహితమై యుండవలెను. ఇఁక వార్తయనఁగా దేశకాల పాత్రానుగుణముగ లోకసముదాచారములను చక్కనినానుడులతో వర్ణించుట యనవచ్చును. అది వక్రోక్తి మూలకముగాక పరిసంగవశమున ప్రవర్తిల్లు భావాశ్రియచమత్కారమున కొటపట్టైయలరారుచుండును.

ఇఁక విజయవిలాసమునఁ గానవచ్చు జాతివార్తావిశేషములను పరికింతము.

ఉ॥ ఆణిమెఱుంగు ముత్తైపుటొయారపు ప్రముగ్గులు, రత్నదీపికా
శ్రేణులు, ధూపవాసనలు హృద్యనిరంతర వాద్యఘోషముల్
రాణఁటొసంగఁ బ్రోలుమిగులం గనువిందొనరించు నిత్యక
ల్యాణము పచ్చతోరణమునై జను లెల్లరు నుల్లసిల్లఁగన్॥ 49

అనుపద్యమునందు వార్త కానవచ్చుచున్నది. ఇందు వేంకటకవి మనోహర పదజాలముతో నింద్రప్రస్థపురమును చక్కఁగా వర్ణించినాఁడు. దేశీయసముదాచారములను సందర్భశుద్ధితో మనోహరముగ చిత్రించినాఁడు. ఇందలి పలుకుబళ్లు నిరాడంబమరలై యడుగడుగునను తెనుఁగుఁదనమును నిరూపించుచున్నవి. ముగ్గులు, దీపశ్రేణులు, ధూపవాసనలు, వాద్యధ్వనులు. పచ్చతోరణములు మున్నగునవి లోకాచారసంప్రదాయసూచకములు, ఇంద్రప్రస్థముత్తరహిందుస్థాన నగరమైనను దానినిట వర్ణించిన కవీంద్రుఁడాంధ్రుఁడైన కారణమున నీవర్ణనమాంధ్రతాముద్రతో నలరారుచున్నది. ముత్తైపుముగ్గులు, రత్నదీపికలు, ధూపవాసనలు, నిరంతరవాద్యఘోషలును నాటిజాతీయవైభవమునకు నిరుపమ నిదర్శనములు, మఱియునిందు

49 వి. వి. — ప్ర. ఆ., ప. 18.

"నిత్యకల్యాణము పచ్చతోరణము" అను లోకోక్తి కూడ సమాయానుకూలముగ వాడఁబడినది. ముత్తైపుముగ్గులు, రత్నదీపికలును నేత్రములకు, ధూపవాసనలు ముక్కునకు, వాద్యఘోషలు చెవులకును నానందదాయకము లై యున్నవని భావించుటలో నొక చమత్కారవిశేషము, సరసస్పందనయును గానవచ్చును. ఇట్టి విశిష్టవాతావరణములో చేయఁబడిన వర్ణన వార్తకాటపట్టగును.

శా॥ దేవబ్రాహ్మణభక్తిప్రోవు, ప్రియవక్తృత్వంబుకాణాచి వి
ద్యావైదుష్యముదిక్కు, ధర్మమునకుందార్కాణ, మర్యాదకున్
తా, నౌచిత్యముజీవగఱ్ఱ, హితశిష్టవ్రాతసంతోషణ
శ్రీవజ్రాంగి యజాతశత్రుఁడు మహీభృన్మాత్రుఁడే
చూడఁగన్ 50

అను పద్యము జాతికి నిదర్శనముగ కానవచ్చుచున్నది. ఇందు ధర్మజుని గుణగణములు సహజసుందరముగ వర్ణింపఁబడినవి. అతడు దేవభక్తికి, బ్రాహ్మణభక్తికి, ప్రియభాషణమునకు, పాండితీపటిమకు, ధర్మమునకు. మర్యాదకు, నౌచిత్యమునకు• శిష్టరక్షణమునకు నాటపట్టుగ నిందు చిత్రింపఁబడినాఁడు. ఇవియన్నియు నాయజాతశత్రుని సహజగుణములే. ధర్మజుని మానసికౌన్నత్యమునకుఁ దగినట్లుగనే యతని యుత్తమ గుణగణములొక క్రమపద్ధతిలో నిందు వర్ణింపఁబడినవి. అతని యపూర్వ దైవభక్తియు, బ్రాహ్మణభక్తియు నతనిని మానవోత్తమునిఁ గావించుటయేగాక శ్రీకృష్ణుని యాదరాభిమానములకుఁ గూడ పాత్రుఁడగునట్లు చేసినవి. అతని ప్రియభాషణ మతని మానసిక నైర్మల్యమునకు నిదర్శనమై యతని యజాతశత్రుత్వమునకుఁ తోడ్పడినది. అతని వైదుష్యమాత్మసంస్కార

50 వి. వి. — ప్ర. ఆ., ప. 20.

మునకు బాహ్యచిహ్నమై యతని ప్రియభాషణమునకు మెఱుఁగులు దిద్దినది. అతని ధార్మికబుద్ధి యతని గుణాధిక్యమును సూచించుటయేగాక యతని పావననామమును సార్థకము గావించుచున్నది. అతని మర్యాదౌచిత్యగుణములతని లోకజ్ఞానసంపన్నత్వమునకు, పాత్రాపాత్రవివేకపరిజ్ఞానమునకును నిదర్శనములు. శిష్టరక్షకత్వమతనిని దైవతుల్యునిగావించినది. కనుకనే యతఁడు సామాన్య భూపాలుఁడుకాఁడని వేంకటకవి వర్ణించినాఁడు. ఇట్లతని గుణగణములు క్రమప్రాధాన్యముతో కడు సహజధోరణిలో చిత్రింపఁబడినవి. ఈ పద్యమును జాతీయపదమయము గావించినాఁడు. కాణాచి, జీవగఱ్ఱ, దిక్కు, తావు, పోఁడిమి అనునవి యిందలి జాతీయములు. ఈ పద్యము చివరిపాదములో వాడఁబడిన "వజ్రాంగి" అను పదముకూడ "రక్షణము" అను నర్థములో జాతీయముగ వాడఁబడినట్లు శ్రీ తాపీ ధర్మారావుగారు తమ వ్యాఖ్యలో వ్రాసియున్నారు. 51 మఱియు నీపద్యము శ్రుతిసుభగధ్వనిసముపేతశబ్దసముదాయముతో నిండి రసవంతముగ నున్నది. ఈ సందర్భములో నీకవీంద్రుఁడు రఘునాథనాయకుని దృష్టిలో నిడుకొని ధర్మజును వర్ణించినట్లు కానవచ్చుచున్నది. ఇట్లు సహజవాతావరణములో ధర్మజుని గుణగణములు సక్రమముగ మనోహరస్థాయిలో చిత్రింపఁబడినవి గనుక నిట జాతియున్నదని చెప్పవచ్చును.

చ॥ జలరుహగంధిపీనుల పసల్ నవసంఖ్యనదేమిలెక్కనున్
జెలువనఖాంకురాళి నెలచేడియసైకముఁదానుచుక్కనున్
బొలఁతుకగబ్బిచన్నుఁగవపువ్వులచెండ్లనులేదుబంతనున్
గలికి ముఖారవిందమల కల్వలరాయనిఁద్రోసిరాజనున్ 52

అను పద్యమును జాతికి మఱొక నిదర్శనముగ చెప్పవచ్చును. ఇందు

51 ,, — హృదయోల్లాస వ్యాఖ్య — తా. ధ. రా. — P. 145
52 వి. వి. — ప్ర. ఆ. — ప. 37.

సుభద్రయొక్క యవయవసౌష్ఠవము మనోహరముగ వర్ణింపఁబడినది. వీనులు నవసంఖ్యను, నఖములు చుక్కలను, కుచములు పూలచెండ్లను ముఖము చంద్రుని తిరస్కరించుచున్నట్లు వర్ణించినాఁడు. సాధారణముగ కవులు నాయికల చెవులను నవసంఖ్యతోను, గోళ్లను చుక్కలతోను, కుచములను పూలబంతులతోను, ముఖములను చంద్రబింబములతోను పోల్చుట సహజము. కాని సౌందర్యరాశియైన సుభద్రయొక్క ముఖాద్యవయవములు చంద్రాదులను మించినట్లు మనోజ్ఞముగ నిచ్చుట వేంకటకవి వర్ణించినాఁడు. స్థూలదృష్టికీవర్ణనమతిశయోక్తిభరితముగఁ గానవచ్చినను సూక్ష్మదృష్టికి సహజోక్తిగనే గోచరించును. ఆ లోకోత్తరసౌందర్యరాశికీ యుపమానములు తీసికట్టుగనే కానవచ్చును. ఇందనాదరసూచకములుగ వాడఁబడిన యదేమిలెక్క, ఉచుక్క, లేదుబంతి, త్రోసిరాజు అనునవి చక్కని జాతీయ ప్రయోగములు. బంటును త్రోసిరాజను సన్నివేశములో చదరంగపుటాటయందు త్రోసిరాజు, అను వ్యవహారము ప్రసిద్ధినొందినది. ఇట్టిపలుకుబళ్లతో సుభద్రయొక్క స్వరూపమును కన్నులకుఁ గట్టినట్లచ్చుట చిత్రించుటచేత దీనిని జాతికుదాహరణముగ భావింపవచ్చును.

ఉ॥ గుట్టసియాడ, గబ్బిచనుగుట్టలపై పులకాంకురావళుల్
తెట్టువగట్టఁ గోరికలు తేటలువెట్టఁగ, వేడుకల్ మదిం
దొట్టికొనంగ, నచ్చెరువుతొంగలిఱెప్పలవీఁగనొత్తఁగాఁ
బెట్టిసిదండతీయక విభీతమృగేక్షణ చూచెనాతనిన్ 53

ఈ పద్యమునందుఁ గూడ జాతిలక్షణములు చక్కఁగ కానవచ్చుచున్నవి.

అపూర్వమోహనాంగుఁడైన యర్జునునిఁ జూచుటతోడనే జరిగిన

53 ,, — ,, — ప. 61.

యులూచి శారీరకమానసికపరిణామములిందు రసోదంచితముగ కడుసహజ వాతావరణములో చిత్రింపఁబడినవి. అనవమదనమూర్తిని చూచుటతోడనే యాసుందరాంగి గుట్టుచలించినది. వక్షములుపులకించినవి. వాంఛలతిశయించినవి. వేడుకలకొలఁది మనస్సుత్తలూగినది. ఆశ్చర్య మామెహృదయము నావరించినది. అతనిని చూచుటతోడనే యామెలో జరిగిన సహజపరిణామములివి. మఱియు నామెదండకట్టుకొని నిలబడి తదేకదీక్షతో నతనినితనివిదీర చూచుచు కోరికలను పెంచుకొనినదట. ఇట్టి మనఃపరిణామానుగుణ రూపచిత్రణము వేంకటకవియొక్క కవితాశిల్పమునకొక పరాకాష్ఠదశ. ఉలూచి యర్జుననిఁజూచినతీఱు, తత్ప్రభావమువలన నామెలో జరిగిన పరిణామమును కన్నులకుఁ గట్టినట్లు మనోజ్ఞముగ చిత్రింపఁబడినవి. మఱియు నిందుభావము రసరూపముగ పరిణామము చెందిన పరిస్థితిగూడ కొంతవఱకు వ్యంగ్యధోరణిలో సూచింపఁబడినది. ఆమె మానసికపరిణామమును రసపరిణామముగ నూహింపవచ్చును. రోమాంచమను సాత్త్వికభావమిందు సూచింపఁబడినది.

శ్లో॥ విభావైరనుభావైశ్చ సాత్త్వికైర్వ్యభిచారిభిః
ఆనీయమాన స్స్వాదుత్వం స్థాయీభావోరసః స్మృతః. 54

అని రసలక్షణమును విద్యానాథుఁడు చెప్పియున్నాడు. విభావానుభావసాత్త్విక వ్యభిచారిభావములచేత నాస్వాద్యమానముగ చేయఁబడిన స్థాయీభావమే రసము. అట్టిరసోత్పత్తికిఁ దగిన వేదికనిచ్చుట నేర్పఱచినాఁడు. ఇట్టి వస్తుసహజస్వరూప స్వభావచిత్రణాత్మకశిల్పపారమ్యము నందినయీ పద్యము జాతికి చక్కని యుదాహరణముగ భావించవచ్చును.

54. ప్ర. య. భూ. — విద్యానాథుఁడు — 6. 1.

క॥ నిను గీతిసాహితీమో
హనవాణులు చెవులువట్టి యాడింపఁగాఁ గనియుండి కాముకుఁడఁగా
ననిపల్కినవాఁడు [illegible] ! 55

ఇందు వార్తావిన్యాసము కానవచ్చును. గీతి, సాహితియనెడి సుందరీమణులర్జునుని వశపఱచుకొనియుండఁగాను కాముకుఁడను గానని పల్కుట విశ్వసింపఁదగినది కాదని యభిప్రాయము. సంగీత సాహితీ మోహనవాణులు సరసుఁడైన రఘునాథభూపాలుని చెవులుపట్టి యాడించెడివని, యతఁడు రసికశేఖరుఁడైన కాముకుఁడనియును భంగ్యంతరభావనావిశేషమువలన తెలియుచున్నది. దక్షిణాంధ్ర యుగప్రభువులు కళాభిమానులై సరససంగీతసాహిత్యములను పోషించెడివారని, నాటి సంగీతసాహితీ కళాకారిణులగు సుందరీమణులు తమ కళాప్రావీణ్యముతో సరసరాజన్యులను చెవులుపట్టి యాడించెడివారని, యట్లుగా నట్టి సుందరీమణులకు వారు వశులై వర్తించెడివారని తద్రూపముగ నారాజేంద్రులు తమ కోరికలను నెరవేర్చుకొనెడివారనియును తెలియుచున్నది. రామభద్రాంబ, మధురవాణియను కవయిత్రులు రఘునాథుని సేవించి, రంగాజమ్మయను కవయిత్రి విజయరాఘవుని సేవించియు వన్నెకెక్కిరి. ఇట్లు దక్షిణాంధ్రయుగసంప్రదాయములను వ్యంగ్యమర్యాదా పురస్సరముగ తెలియఁజేయుచున్న యీపద్యము సార్థకాటపట్టై యలరారుచున్నది.

55 వి. వి. — ప్ర. అ. — ప. 90.

సీ॥ మంగళస్నానసంభ్రమముఁ దెల్పెడురీతిఁ
గెలనఁగెందామర కొలనఁదేలి,
ధవళముల్ విని చొక్కు హవణుఁదెల్పెడులీల
హాళిఁగోయిలపల్కు లాలకించి,
తలఁబ్రాలు వోయుబిత్తరముఁ దెల్పెడుచాయఁ
గొన్నసల్ దోయిళ్ల కొలదినొసఁగి,
బువ్వాన భుజియించు పొలుపుదెల్పెడిజాడ
గుమిఁగూడుకొని మరందముఁబ్రోలి,

తే॥ తనకుఁదోడ్తోడనగు పెండ్లికనఁబడంగఁ
జేయునటువలె గారాబుఁ జెలులఁగూడి
వనవిహారంబు గావించి చనెడుపాండ్య
రాజసుతఁజూచి యా పాండురాజసుతుఁడు 56

ఈ పద్యములో వేంకటకవి యాంధ్రదేశీయ వైవాహికసంప్రదాయములను సమయోచితముగ సూచించియున్నాఁడు. మంగళస్నానము, ధవళములు పాడుట, తలఁబ్రాలుపోయుట, పంక్తిభోజనము మున్నగునవి యాంధ్రుల వివాహసంబంధములైన వేడుకలు. మఱియు నావేడుకలు కాఁబోవు చిత్రాంగదార్జునుల వివాహమును సూచించుచున్నవి. అట్టి దేశీయసంప్రదాయములు మనోహరముగ వర్ణింపఁబడుటచేత నిందు వార్తావిశేషము కలదనవచ్చును. ఉద్యానవనములో కానవచ్చిన ప్రాకృతికవిశేషములే వైవాహిక వినోదములుగ సమయోచిత పద్ధతిలో చతురచిత్రణము చేయుట యిందలి చమత్కారాతిశయము.

56 వి. వి. — ప్ర. ఆ. — ప. 129.

ఉ॥ కన్నియఁగాని వేఱొకతెఁ గాను మనోహరరూప ! నీకునే
జన్నియపట్టియుంటి నెలజవ్వనమంతయు నేఁటిదాఁక! నా
కన్నులయాన ! నావలపుఁగస్తురినామముతోడు నమ్ము ! కా
దన్నను నీదుమోవిమధురామృత మానియు బాససేసెదన్. 57

ఈ మనోహరపద్యము జాతికాటపట్టుగ కానవచ్చుచున్నది. అర్జునుఁడులూచి యొక్క కన్యాత్వము శంకించిన సందర్భములో నామెమనోహరవాక్పణితిలో తన కన్యాత్వమును నిరూపించుకొనినది. తన లేతయౌవనమంతయు నాటి వఱకు ముడుపుగట్టి యతనికొఱకు వేచియున్నట్లు బాసచేసి చెప్పినది. తన కన్నులమీద, వలపుఁ గస్తురినామముమీద నొట్టుపెట్టి తనకన్యాత్వముపై నతనికి విశ్వాసము కలుగఁజేసినది. అతని యధరామృతము నాస్వాదించి బాసచేసెదనని యతనికి నచ్చఁజెప్పినది. ప్రేమాస్పదవస్తువులను, ముఖ్యాంగములను, మాంగల్య చిహ్నములనునంటి ప్రమాణములు చేయుటపరిపాటి. అట్లే యులూచికూడ ప్రేమాస్పదములైన నేత్రములను, మాంగల్యచిహ్నమైన కస్తురిబొట్టునునంటి సంప్రదాయబద్ధముగనే బాసలుచేసినది. అప్పటికిని నమ్మకము కుదరనిచో నధరామృతమాస్వాదించి బాసచేసెదని హృదయము స్పందించునట్లు చెప్పినది. అదిప్రేమికులతాదాత్మ్యస్థితి. నిష్కల్మషహృదయయైన యులూచి యట్లు తనప్రియునిపైఁగల యనురాగాయతిశయమును వ్యక్తముగావించినది. ఈవర్ణనము సహజసుందరముగ నుండుటయేగాక తన కన్యాత్వమును నిరూపించుకొనుటకై యా సుందరిపడిన తహతహను, అతని తాత్కాలిక సందేహమువలన నామెపొందిన యాందోళనమును, ఒట్టులు పెట్టి తనవలపుపై నీతనికి విశ్వాసము కుదురునట్లుచేయుటకై యామెపడిన యవస్థను చక్కఁగావ్యక్తీకరించుచున్నది. "కన్నియఁగాని వేఱొకతెఁగాను, జన్నియ పట్టియుంటి, కన్నులయాన, వలపుఁ గస్తురినామముతోడు, బాస

57 వి. వి — ప్ర ఆ. — ప. 97.

నేయు" అను సజాతీయపదములతో సుయాచియొక్క మానసికస్థితిగతులను వేంకటకవి చక్కఁగ చిత్రించినాఁడు, ఇట్టి సహజచిత్రణమే జాతికిజీవము.

ఆ॥వె॥ మోక్షమునకుఁ బోవ మొసలెత్తుకొనిపోయె
ననెడువార్త నిక్కమగునటంచుఁ
గ్రుంకవెఱతు రెవ్వరు; మీరటుపోకుఁ
డనిన నవ్వుకొనుచు నర్జునుండు.[58]

ఈపద్యములో వార్త చక్కఁగా కుదురుకొనినది. అర్జునుఁడు సౌభద్రతీర్థమునందు స్నానమొనరింపఁ బోవ నందు మొసలికలదని, యాతీర్థములో దిగవద్దని, మోక్షమునకుఁబోవ మొసలెత్తుకొని పోయినట్లగుననియు నచ్చట మునులతనిని హెచ్చరించిరి. "మోక్షమునకుపోవ మొసలెత్తుకొని పోయెను" అను సామెతచేత నామునీంద్రుల హెచ్చరిక సమర్థింపఁబడినది. ఆ పవిత్రతీర్థమునందు స్నానముచేసిన మోక్షము సిద్ధించును. అచ్చట మొసలి యున్నదిగనుక నందు దిగినవారినది యెత్తుకొనిపోవుటయు సహజమే. మొసలియున్న సన్నివేశములోనే యీసామెతను వాడుట యొక చమత్కారము. శాపప్రభావమున నక్రరూపములను దాల్చియున్న నందాద్యప్సరసలకీ పుణ్యమూర్తివలన శాపవిమోచనము కావలసియున్నది. కనుక నీసామెతలోని మోక్షశబ్దము వారి శాపవిమోచనమును సూచించుట మఱియొక చమత్కారము. ఇట్టి చమత్కారయుతమైన సామెతతోఁగూడిన యీపద్యము వార్తకాటపట్టైయున్నది. మఱియు నిందు వార్తకలదని తెలియఁజేయుటకు కాఁబోలు కవియే యీపద్యము రెండవపాదములో వార్తాశబ్దమును వాడియున్నాఁడు.

58 వి. వి. — ద్వి. ఆ — ప 43.

క॥ చేసెజపమతఁడుకడు వి
శ్వాసము చెలిచూపు బేడిసలపైనిగుడన్
జేసినయది జపమున్మఱి
వేసినయది గాలమనుట వృథగాకుండన్ 59

ఈ పద్యమునందుఁగూడ వార్తావిశేషస్థితి కానవచ్చుచున్నది. యాదవులు యతులకు విధేయులగుదురని తలంచి యర్జునుఁడు సుభద్రికొఱకు సన్యాసివేషమున ద్వారకానగరమునకు వచ్చినాఁడు. అతని వాంఛాసిద్ధి కొఱకు శ్రీకృష్ణుఁడతని కంతఃపురసమీపోద్యానవనములో బస నేర్పాటు చేసినాఁడు. బలరాముని యాజ్ఞచొప్పున నతని కుచితసేవలు చేయుటకు సుభద్రి నియుక్తయైనది. నటనకు మాత్రమతఁడు జపముచేయుచున్నాఁడు కాని యతని మనస్సు సుభద్రపైనే కేంద్రీకృతమై యున్నది. ఆమె చూపు బేడిసలపైనే శ్రద్ధనుంచి యతఁడు ధ్యాననిమగ్నుఁడై యున్నట్లు నటించినాఁడు. అచ్చటి యతని ప్రవృత్తి "చేసినది జపము, వేసినది గాలము" అను సామెతకు సరిపడినది. ఈ సామెతను సమయోచితముగ నతుకుకొనునట్లు చక్కఁగా నీకవీంద్రుఁడు వాడియున్నాఁడు. మఱియు నతఁడామెచూపు బేడిసమీలపై దృష్టినుంచుటకు గాలము వేయుటకును కార్యకారణభావము కుదిరినది. గాలమువేయుట చేపలకొఱకేకదా. ఇట్లు చమత్కారావహముగ నీలోకోక్తిచేత నర్జునుని మనస్తత్త్వము మనోజ్ఞముగ చిత్రింపఁబడినది గనుక నిచ్చట వార్త చక్కఁగా కుదురుకొని యున్నది.

59 వి. వి. — ద్వి. ఆ. — ప. 135

సీ॥ కరముసాఁచి నహంబు కలశమీ విడివడ్డ
కుంకుమాంకపుముద్దుఁ జఒకమెఱుపు
ననలుదేఁబోఁగాళ్లఁ బెనఁగునంచనదల్పఁ
జూచు జంకెన వాఁడిచూపుబెళుకు
పూరెమ్మవంచుచో జాఱుపయ్యెంట దాఁ
గిలి మూఁతలాడు గుబ్బలబెడంగు
"పొలఁతి! కాయోపండొ పోయినపని" యన్న
చిలుకమాటకు నవ్వు సొలపుఁదేట

తే॥ మఱియు మఱియును జూడనే మనసుపాఱి
హరికుసుమఫలంబులఁ దేరఁబనుచుఁ
దొలుతటివి చాలవని యావధూలలామ;
నేమనఁగవచ్చు నివ్వచ్చు నేమమింక! 60

ఈ పద్యము జాతికాటపట్టుగ కానవచ్చుచున్నది. సన్యాసివేషధారియై వచ్చిన యర్జునుని పూజావిధికి కావలసిన పుష్పఫలతోయములను దెచ్చుటకు సుభద్రచేసిన ప్రియత్నమును, తత్ప్రయత్నములో నతని కోరికల నీరికలెత్తించుచు కానవచ్చిన యాసుందరాంగియొక్క యవయవసౌందర్యమును సహజసుందరముగ వర్ణించినాఁడు. ఆమోహనాంగియొక్క యవయవసౌందర్యమును మాటిమాటికిని చూడఁగోరిన యతని మానసిక చాంచల్యమిందు సూచింపఁబడినది. కాళ్లపెనఁగు, దాగిలిమూతలాడు, కాయోపండో మొదలగు జాతీయములగు పలుకుబళ్లతో సుభద్రార్జునుల శారీరక మానసిక స్థితిగతులను మనోజ్ఞముగ చిత్రించి వేంకటకవి తన కవితాప్రతిభను ప్రకటించుకొనినాఁడు.

---

60 వి. వి. — ద్వి. ఆ. — ప. 141.

చ॥ శివుఁడిటురమ్మటంచు దయచేసినచోఁ దలకెక్కి తుగ్రవై
భవమునఁ జూచుచో నడుగువట్టితివేమనవచ్చు నీగుణం ?
బవునవునందినన్ సిగయు నంచకయున్నను గాళ్లఁబట్టుకొం
దువు హరిణాంక ! వేలకొలఁదుల్ గద నీనడకల్ తలంపఁగన్ 61

ఈపద్యము వార్తకాటపట్టై యలరారుచున్నది. చంద్రోపాలంభనాత్మక పద్యమిది ఈశ్వరుఁడు రమ్మని యాదరించినపుడు చంద్రుఁడతని తలపై కెక్కినాఁడు. దక్షాధ్వరధ్వంసము చేసినపుడు శివుఁడు వీరభద్రావతారరూపమున నుగ్రముగఁ జూచినపుడు కాళ్లుపట్టినాఁడు. ఈసన్నివేశమును "అంది నన్ సిగయు నందకయున్నను గాళ్లుపట్టుకొందువు" అను లోకోక్తితో చక్కఁగా సమర్థించినాఁడు "వేలకొలఁదుల్ గద ! నీనడకల్" అనుచోట (వేల) యనుశబ్దము వేలసంఖ్యను, సాదృశ్యమును బట్టి (వేళ) యని తీసికొన్నచో చంద్రుని గతివిశేషములు సమయముపై నాధారపడియుండునను చమత్కారార్థమును గూడ నిచ్చుచున్నది. ఇట్టి చమత్కారవిశేషముతోను, చక్కని లోకోక్తితోను కూడుకొనియున్న యీ పద్యమును వార్తకొక యుదాహరణముగ భావింపవచ్చును.

లయవిభాతి :— చలువలొసఁగెన్ సఁగిఁ జెలువయపుడొక్కరితె,
వలఁతితని మెప్పనొక పొలఁతి తడ్డియొత్తెన్,
గొలఁదిగ జహదినొక వెలఁదితలఁబూసె, నొక
జలరుహదళాక్షి సిగకలరుసరిచుట్టెన్,
దిలకమిడియెన్ నిటుల ఫలకమునసొక్కసతి
తెలినిలువుటద్దమొక చెలి నిలిపె ప్రేమోలన్,
గలయ జవరాలొకతె మలయజమలందె, నొక
లలన విసరెన్ సురటి యలనరునకర్థిన్ 62

61 ,, — తృ ఆ. — ప. 51.
62 వి. వి. — తృ. ఆ. — ప. 81.

ఈపద్యమునందు జాతి నెలకొన్నట్లు కానవచ్చును. సుభద్రార్జునుల వివాహసందర్భములో నర్జునుని పెండ్లికొడుకుగఁ జేయుటకు ముందు మంగళస్నానాదులు చేయించి యతని నలంకరించిన విధానమిందు మనోహరముగ వర్ణింపఁబడినది. ఒక కాంతయతనికి తడియొత్తినది. ఒకతె చలువలిచ్చినది. అతని తలకొకతె జవాదిపూసినది. మఱొకతె యతని శిఖకు పూలమాలను చుట్టినది. ఒకతె యతని ఫాలతలమున తిలకమును మనోహరముగ తీర్చినది. ఒకసతి యతనిదగ్గర తెలినిలువుటద్దమును నిలిపినది. ఒకతె యతని శరీరమునకు మంచిగంధము పూసినది. మఱొకకాంత విసనకఱ్ఱపట్టి వీచినది. ఈకార్యక్రమమంతయు త్వరితగతిని సాగింపఁబడినదని సూచించుటకు కవి గతివిశేషముతోఁ గూడిన లయవిభాతి వృత్తము నెన్నికొనినాఁడు. పెండ్లికొడుకు నలంకరించునప్పుడు కానవచ్చు నాంధ్రదేశీయసంప్రదాయములిందు మనోహరముగ ప్రకటింపఁబడినవి. మగవారు కూడ తమ శిరోజములను పొడవుగ పెంచుకొని సిగఁజుట్టి యలంకరించుకొను నాచారము పూర్వకాలములో నాంధ్రదేశమున నుండెడిదని యీపద్యము రెండవపాదములో వేంకటకవి చేసిన వర్ణనమును బట్టి స్పష్టపడుచున్నది. మఱియు నతనిని స్త్రీలే యలంకరించుట యొక విశిష్టజాతీయ సంప్రదాయముగఁ గానవచ్చును. అచ్చికశబ్దజాలముతో నీవర్ణనమును సహజసుందరముగ నడిపియుండుటను బట్టి యిది జాతికిఁ దగిన యుదాహరణమని చెప్పవచ్చును.

ఇట్లు జాతివార్తానిశేషముల కాటపట్టులైన సన్నివేశము లెన్నేని యీ విజయవిలాసములోఁ గానవచ్చును.

## చమత్కారము

ఆలంకారికులు చమత్కారమును ప్రముఖరసాదివిశేషముగఁ పేర్కొనియున్నారు. అభినవగుప్తపాదుఁడు క్షేమేంద్రుఁడు, విశ్వనాథుఁడు, ధర్మదత్తుఁడు, విశ్వేశ్వరకవిచంద్రుఁడు జగన్నాథపండితరాయలు, హరిప్రసాదుఁడు మున్నగు ప్రాచీనాలంకారికులు తమ యలంకారగ్రంథములందు చమత్కారమును సముచితరీతిలో వివరించియున్నారు. చమత్కారమునకు ప్రముఖస్థానమునిచ్చి, యుత్తమకావ్యమునందది ప్రధాన పాత్రి వహించునని పేర్కొని, దానిపై తనకుఁగల విశ్వాసము నాధారముగఁ జేసికొని విశ్వేశ్వరకవిచంద్రుఁడు తన యలంకారగ్రంథమునకు చమత్కారచంద్రిక యను పేరిడి చమత్కారచతుర్భంగిమలనెందు సోపపత్తికముగ నిరూపించియున్నాఁడు హరిప్రసాదుఁడు చమత్కారమును కావ్యాత్మగ పరిగణించియున్నాఁడు, అనేకసన్నివేశములలో ధ్వని, వక్రోక్తి, యౌచిత్యముననునవి చమత్కారవిశేషములుగ పేర్కొనఁబడినవి. అభినవగుప్తపాదుఁడు వైచిత్ర్యమును చమత్కారపర్యాయపదముగ వాడియున్నాఁడు రసభావనవలె చమత్కారభావనకూడ పాకశాస్త్రమును బట్టి యలంకారశాస్త్రమునకు సంక్రమించినది. నైఘంటికులు చమత్కారమున కాశ్చర్యము, కవితాభిరుచి యను నర్థములను చెప్పియున్నారు. ఆప్టేయను ప్రసిద్ధనిఘంటుకారుఁడు చమత్కారః అను శబ్దమునకు Admiration (ప్రశంస), Surprise (ఆశ్చర్యము), Poetical Charm (కవితాసౌందర్యము) [1] అను నర్థముల నిచ్చియున్నాఁడు. ప్రఖ్యాతాలంకారికవిమర్శకులగు Dr. V. రాఘవన్‌గారు "It is a Srking Coincidence that like the Concept of Rasa, the Concept of Chamatkara also Come into the Alankarasastra from the paka Sastra. its early semantic history is indistinct and dictionaries

1 ,, S. E. D. — V. S.—Apte — p. 203

record only the later Meanings, the Chief of Which are astonishment and poetic relish. It appears to me that originally the Word Chamatkara was an Onomatopoeic Word refering to the ClicKing Sound we made with Our tongue when taste Some thing snappy and in the Course of its semantic enlargements, Chamatkrara came to mean a Sudden fillip relating to any feeling of a pleasurable type" [2] అని చమత్కారమును గూర్చి తామేర్పఱచుకొనిన యభిప్రాయములను చెప్పియున్నారు. మౌలికముగ నీశబ్దము ధ్వన్యనుకరణాత్మకమైనదని, మనమొక పదార్థమును రుచిచూచునపుడు నాలుకతోచేయు నొకవిధమగు ధ్వని ననుకరించు రూపములో నీ చమత్కార శబ్దము సముత్పన్నమైనదని, కాలక్రమమున జరిగిన యర్థవిపరిణామమును బట్టి "ఆకస్మికముగ కలిగిన యానందమయభావము" అను నర్థము దీనికి చెప్పఁబడుచున్నదనియును Dr. రాఘవన్‌గారు భావించియున్నారు. చమత్కారముపై పరిశోధన సల్పిన శ్రీమతి D. C. సరస్వతిగారు "విశ్వేశ్వరుని చమత్కారప్రస్థానము" [3] అను శీర్షికపై వ్రాసిన విపుల వ్యాసములో రాఘవన్‌గారి యభిప్రాయములను బలపఱచుచు విశ్వేశ్వరకవి చంద్రుఁడు ప్రతిపాదించిన చమత్కారవిశేషములను సవిమర్శముగ వివరించియున్నారు.

చమత్కారమనఁగా చిత్తవిస్తారమని, రసానుభూతిభేదములన్నియు చమత్కారస్వభావములేయని, యద్భుతరసముదానికి చక్కని యుదాహరణమనియును నారాయణుఁడను ప్రాచీనాలంకారికుఁడు పేర్కొనియున్నాఁడు. ఈచమత్కార ప్రసక్తి ధ్వన్యాలోకమునందుఁ గూడ కానవచ్చును.[4] అభినవగుప్తపాదుని లోచనవ్యాఖ్యానము (ధ్వన్యాలోకవ్యాఖ్యానము)నందాశబ్దమదేయర్థములో పదునాలుగు పర్యాయములు వాడఁబడినది "చమత్కార

2 ,, S. C. A. S. — Dr. V. Raghavan —PP. 268, 269

3 ,, భారతి — 1960, జనవరి — సంపుటము 37 — సంచిక 1 — P18

4 ,, ధ్వన్యాలోకము — ఆనందవర్ధనుఁడు — N. S. , P. 144.

స్వభావమేరసము [5] '' అని యభినవగుప్తుఁడు చెప్పియున్నాఁడు. భట్టనాయకుఁడు, కుంతకుఁడు ... నాలంకారికులుగూడ నాశబ్దము నదేయర్థములో వాడియున్నారు. చారుత్వము, వైచిత్ర్యము, రమణీయత, వక్రోక్తి మున్నగు పదములను చమత్కారమునకు పర్యాయపదములుగ నాలంకారికులు వాడియున్నారు. ఆత్మచైతన్యము, చమత్కారము, రసమును సమానములని[6] యగ్నిపురాణమునందు చెప్పఁబడినది. గుణాలంకారరసధ్వనులయందు, చివరి కౌచిత్యమునందును చమత్కారముండవలెనని. చమత్కార సహిత కావ్యమే సహృదయహృదయాహ్లాదజనకమగునని, చమత్కారరహిత కావ్యము కావ్యమే కాదనియును చమత్కారవాదుల యభిప్రాయము.

అవిచారితరమణీయము, విచారితరమణీయము, సమస్తసూక్తవ్యాపి సూక్తైకదేశదృశ్యము, శబ్దగతము, నర్థగతము, శబ్దార్థగతము, నలంకారగతము, రసగతము, ప్రఖ్యాతవృత్తిగతము. [7] నను దశవిధచమత్కారములను క్షేమేంద్రుఁడు పేర్కొనియున్నాఁడు. విశ్వేశ్వరకవిచంద్రుఁడు తన చమత్కారచంద్రికయందు చమత్కారస్వరూపస్వభావములను సమగ్రముగ చిత్రించియున్నాఁడు.

"చమత్కారస్తు విదుషామానందపరివాహకృత్
గుణంరీతిం రసం వృత్తిం పాకంశయ్యామలంకృతిమ్
సప్తైతాని చమత్కారకారణం బ్రువతే బుధాః" [8]

అని విశ్వేశ్వరకవిచంద్రుఁడు చమత్కారలక్షణమును. తత్కారణములను పేర్కొనియున్నాఁడు. చమత్కారము సహృదయానందజనక

5 ,, లోచనవ్యాఖ్య — అభినవగుప్తుఁడు — P. 65.
6 ,, అగ్నిపురాణము — Ch. 339, S. 1, 2.
7 ,, K. K. A. — IV., P. 129.
8 ,, చ. చం. — P.2., శ్లో. 6, 7.

మైనదని, గుణము, రీతి. రసము, వృత్తి, పాకము, శయ్య, యలంకారము ననునవి యేడును చమత్కారకారణములనియు నతని యభిప్రాయము.

శ్లో॥ విశిష్టశబ్దరూపస్య కావ్యస్యాత్మాచమత్కృతిః
ఉత్పత్తిభూతిః ప్రతిభామనాగప్రతోపపాదితమ్"

అని హరిప్రసాదుఁడను నాలంకారికుఁడు "చమత్కారము కావ్యాత్మ" యని తన కావ్యాలోకమునందు చెప్పియున్నాఁడు.

జగన్నాథపండితరాయలు తన రసగంగాధరములో కావ్యలక్షణమును "రమణీయార్థప్రతిపాదకఃశబ్దః కావ్యమ్; రమణీయతాచ లోకోత్తరాహ్లాద జనకజ్ఞానగోచరతా: లోకోత్తరత్వంచాహ్లాదగతః చమత్కారత్వాపరపర్యాయః అనుభవసాక్షికో జాతివిశేషః"[9] అని చమత్కారప్రసక్తితెచ్చి లోకోత్తరత్వమునాహ్లాదగతమైన చమత్కారాపరపర్యాయముగ భావించియున్నాఁడు, "The essence of poetry is poetic Charm or Chamatkara" [10] అని శ్రీ వేలూరి సుబ్బారావుగారు చమత్కారమును కవితామనోహరగుణముగ భావించియున్నారు. "వాగర్థౌ సచమత్కారౌ కావ్యంకావ్యవిదోవిదుః" [11] అని చమత్కారయుతములైన వాగర్థములను కావ్యముగ విశ్వేశ్వరకవిచంద్రుఁడు పేర్కొనియున్నాఁడు. శిక్షయేకావ్యప్రయోజనమని, చమత్కారయుతముగనాశిక్షబోధింపఁబడినచో స్థిరత్వమునొందుననియు నాయాలంకారికుఁడు పేర్కొనియున్నాఁడు. కావ్యవిమర్శలో చమత్కారమునకు ప్రాధాన్యమునిచ్చి, దానిని వివరించినగౌరవము విశ్వేశ్వరకవిచంద్ర జగన్నాథ ండితులకు దక్కినది. వీరు చమత్కారమును రసానందముగ

9. రసగంగాధరము — P. P 9, 10. (Chaukhamba Publication)
10 Foreword to Chamatkara Chandrika by Prof. V. Subba Rao. Edited by Sri P. Sri Ramamurthy — P. 9.
11. చ. చం. — వి. క. చం. — ప్రథమ విలాసము — P. 2, శ్లో 11.

భావించి యున్నారు."In Common parlance, the term Chamatkara Means Wonder. It denotes poetic delight"[12] అని Dr. P. శ్రీరామ మూర్తి గారు చమత్కారము నాశ్చర్యార్థద్యోతకముగ రసానందదాయకము గను నూహించియున్నారు

చమత్, అనునది 'చమ్, అను ధాతువుయొక్క వర్తమానాన మాపకరూపము. ఈధాతువునకు "చుచిచూచు"లేక "తినుట" అనునర్థములు గలవు. "ఆనందమునసుభవించు" లేక "సుఖించుట" అనుభావార్థములు గూడ చెప్పఁబడుచున్నవి. దీనికి కృధాతువును చేర్పఁగా "చమత్కారము" అను రూపమేర్పడినది. పరిణామక్రమములో దీనికి "రసానందము" అను నర్థముగూడ చెప్పఁబడుచున్నది "It is compounded of Camat and Kara; Camat which occurs only in the expression, is probably no more than any interjuction expressing surprise or wonder while, Kara, means the act of emitting such an interjuction, of finding one-self in this state of conciousness. It may be said equally that Camat is a non-discursive phonic expression consisting of a vocality animated by a form of conciousness which arises from the very rhythm of interior movement" అని Gnoli చమత్కారమునుగూర్చి సవివరముగ చెప్పియున్నాఁడు. చమత్కారమునాశ్చర్యార్థకపదముగ నితఁడు భావించియున్నాఁడు.

అభినవగుప్తుని యభినవభారతిలో నీచమత్కారశబ్దము మొట్ట మొదట తలయెత్తినది. దాని ప్రథమరూపరేఖాత్మకవిన్యాసమున కభినవ భారతి యాటపట్టయినది. ఆయాలంకారిక ప్రముఖుఁడందు రసచర్చ చేయుచు చమత్కారమును రసమునకు పర్యాయపదముగ వాడియున్నాఁడు. 13

12. Introduction to Chamatkara Chandrika
— Dr: P. Sri Ramamurthy — P. 34.

13 Some Poblmes of Sanskrit poetics — S. K. De. - PP. 227 - 228

శ్లో॥ సాచావిఘ్నా సంవిచ్చమత్కారః
తజ్జోఽపి కంపపులకోల్లసనాదివికారశ్చమత్కారః"

వ. తథాహి. సచాతృప్తివ్యతిరేకేణాచ్ఛిన్నో భోగావేశఇత్యుచ్యతే. భుంజానస్యాద్భుతభోగస్పందావిష్టస్యచ మనఃకరణం చమత్కారఇతి. సచ సాక్షాత్కారస్వభావో మానసాధ్యవసాయోవా సంకల్పోవా స్మృతిర్వా తథాత్వేన స్ఫురన్నస్తు."

అని యుక్తియుక్తముగ చేసిన వివరణమును బట్టి యావిద్వన్ముఖ్యుఁడు కంపపులకోల్లసనాదివికారము చమత్కారమని భావించియున్నాఁడు. మఱియు విఘ్నములు లేకుండ చేసికొను పరిజ్ఞానముగూడ చమత్కారముగ భావింపఁబడినది. అది యొకవిధమగు నిరాటంకసానుభూతివిశేషము.

"చమత్కారః చిత్తవిస్తారరూపో విస్మయాపరపర్యాయః"

అని విశ్వనాథుఁడు చమత్కారలక్షణమును చెప్పియున్నాఁడు. చమత్కారమనఁగా చిత్తవిస్తారరూపమైన విస్మయమని యతని యభిప్రాయము.

"రసేసారశ్చమత్కారః సర్వత్రాప్యనభూయతే
తచ్చమత్కారసారత్వే సర్వత్రాప్యద్భుతోరసః .... .... " 14

అనియు నతని సాహిత్యదర్పణమునందు చెప్పఁబడినది రసము, అలంకారము, ఔచిత్యము మున్నగు కవితామూలముల సారమే చమత్కారమని యాయాలంకారికుని ముఖ్యాభిప్రాయము.

14. సా ద. — విశ్వనాథుఁడు — — III - 3, P. 72, 73.

"చతుర్వర్గఫలాస్వాద మప్యతిక్రమ్య తద్విదామ్,
కావ్యామృతరసేనా న్తశ్చమత్కారో వితన్యతే" 15

అను శ్లోకములో కావ్యామృతరసాస్వాదమువలన చమత్కారము సిద్ధించునని కుంతకుఁడు సూచించియున్నాఁడు.

"ఏకేనకేనచిదనర్ఘమణిప్రభేణ
కావ్యంచమత్కృతిపదేనవినాసువర్ణమ్
నిర్దోషలేశ మపి రోహతికస్యచి త్తే
లావణ్యహీన మివ యౌవన మంగనానామ్"

అను శ్లోకములో క్షేమేంద్రుఁడు దృష్టాంతపూర్వకముగ చమత్కార ప్రాధాన్యము నుగ్గడించినాఁడు. అనర్ఘమైన మణిని పొదగనిచో బంగారము రాణింపదు. కాంతాయౌవనముగూడ లావణ్యహీనమైనచో నాకర్షకముగ నుండదు. అట్లే చమత్కారరహితకావ్యముగూఁడ రసానందదాయకము కాఁజాలదని యతని యభిప్రాయము.

"సుకవిరతి శయార్థీవాక్చమత్కారలోభాత్
అభిసరతి మనోజ్ఞే వస్తు శబ్దార్థశోభే,
భ్రమరఇవ వస న్తే పుష్పకా న్తేవనా న్తే
నవకుసుమ విశేషామోదమాస్వాదలోలః" 16

అను శ్లోకములో క్షేమేంద్రుఁడు కవియొక్క చమత్కారాస్వాదక శక్తి నుపమానబద్ధముగ నిరూపించియున్నాఁడు. భ్రమరము వివిధ పుష్పములనుండి మకరందమును సేకరించి యొకచోటికి చేర్చి యాస్వా

15 వక్రోక్తిజీవితము — కుంతకుఁడు — 1 — 5.

16 కవికంఠాభరణము — క్షేమేంద్రుఁడు — సంధి-3 — చమత్కారకథనము

దించునట్లు కవికూడ నలంకారరసగుణాదికావ్యాంగములనుండి చమత్కార మును సాధించి యనుభవించునని యతని యభిప్రాయము.

జగన్నాథపండితరాయలు కావ్యలక్షణమునుదెల్పి తద్వివరణము చేయుసందర్భములో "ఇత్థంచ చమత్కారజనకభావనావిషయార్థప్రతిపాదక శబ్దవత్త్వమ్, యత్ప్రతిపాదితార్థవిషయకభావనాత్వం చమత్కారజనకతా వచ్ఛేదకం తత్త్వమ్, స్వవిశిష్టజనకతావచ్ఛేదకార్థప్రతిపాదకతాసంసర్గేణ చమత్కారత్వవత్త్వమేవవా కావ్యత్వమ్"[17] అనిచెప్పి విశ్వేశ్వరకవి చంద్రుఁడు పేర్కొనిన చమత్కారప్రధానతత్త్వమును ప్రోత్సహించి నాఁడు. రమణీయార్థమును ప్రతిపాదించు శబ్దము కావ్యమని, లోకో త్తరమైన యాహ్లాదమును గలిగించు జ్ఞానమునకు గోచరమగునది రమణీ యతయని, యనుభవసాక్షికమై యాహ్లాదగతమైన చమత్కారత్వముయొక్క పర్యాయపదమే లోకోత్తరత్వమనియును జగన్నాథుఁడు భావించినాఁడు. మొత్తముమీద చమత్కారమనగా రసానందమని యతనివాదసారమైనట్లు గ్రహింపనగును.

చమత్కారి, చమత్కారితరము, చమత్కారితమమునని కావ్యజాతిని త్రివిధములుగ విశ్వేశ్వరకవిచంద్రుఁడు విభజించియున్నాఁడు.

"శబ్దచారుత్వతాత్పర్యే చమత్కారితికథ్యతే,
వాచ్యచారుత్వతాత్పర్యే చమత్కారితరంమతమ్,
వ్యంగ్యస్య గుణీభావే తదేవాహుర్మనీషిణః
పర్యాయార్థస్య చారుత్వే చమత్కారితమం మతమ్"[18]

అని యీ త్రివిధకావ్యలక్షణములను పేర్కొనియున్నాఁడు.

---

17 ర. గం. ధ. .... జగన్నాథపండితరాయలు.... చౌఖాంబాపబ్లికేషన్ PP. 9, 10, 11.

18 చ. చం. .... విశ్వేశ్వరకవిచంద్రుఁడు....ఆంధ్రాయూనివర్సిటీ పబ్లికేషన్. PP. 55, 58

కేవలము శబ్దచారుత్వముతోఁ గూడియున్న కావ్యమును చమత్కారి యని, యర్థచారుత్వముతోఁ గూడి వ్యంగార్థము ప్రధానమైయున్న కావ్యమును చమత్కారితరమని, వ్యంగ్యార్థప్రాధాన్యముగల కావ్యమును చమత్కారితమ మనియు నతఁడు భావించినాఁడు.

ఇట్లు ప్రాచీనాలంకారికప్రముఖులు చేసిన వివరణములను బట్టి చమత్కారవిశేషములు విశదము లగుచున్నవి.

విజయవిలాసమును చమత్కారితమకావ్యముగ పరిగణింపవచ్చును. ఈ మధుర ప్రబంధమునందు చమత్కారము విశ్వరూపము ధరించి విశృంఖల విహారము సల్పినది. చమత్కారరహితమైన పద్యము విజయవిలాసములో లేదనిచెప్పుట యతిశయోక్తి కానేరదు. ఏ పద్యములోనైన నేదోయొక విధమగు చమత్కారము కానవచ్చును. ప్రతిపద్యమునందు చమత్కారమును చతురోక్తులతో పలికించి పరవళ్ల ద్రొక్కించినాఁడు గనుకనే చేమకూర వేంకటకవిని రఘునాథనాయకుఁడు

క॥ ప్రతిపద్యమునందుఁ జమ
త్కృతిగలుగఁజెప్పనేర్తు వెల్లెడ బెళుకౌ
కృతివింటి మహారముగా
క్షితిలో నీ మార్గమెవరికిన్ రాదనుచున్. 19

అని ప్రశంసించినాఁడు ప్రతిపద్యమునందును చమత్కారమును మనోహరముగ ప్రదర్శించినందువలన నతని ప్రబంధమెల్లెడ బెళుకైనదని, యీ చమత్కారాంచితమార్గము క్షితిలో నెవరికిని రాదనియు నారాజేంద్రుని యభిప్రాయము. ఈ ప్రబంధమునందాదినుండి యంతమువఱకు శబ్దచమత్కారములు వివిధవిన్యాస రూపములలో వెల్లివిరిసినవి. అవి యప్రయత్నసిద్ధ

19 వి. వి. అవతారిక .... ప. 50

ములై రసపుష్టికిభంగము కలిగింపకుండ కావ్యశోభనినుమడింపఁజేసినవి. ఈ రమణీయరసవత్కావ్యసౌధమునకు మనోహరశబ్దచమత్కారవిన్యాస వైఖరియే ప్రథమసోపానమైనది. ఎన్నోజన్మల తపఃఫలమీజన్మలో కేంద్రీకృతమైన కారణమున వేంకటకవి తనవిజయవిలాసములో చమత్కారరీతుల నతివేలస్థాయిలో వెలయింపఁగలిగినాఁడు. కొన్ని సందర్భములలో నర్థచమత్కారమీ ప్రముఖప్రబంధమునకు నిరుపమసౌందర్యమునుచేకూర్చినది. కొన్ని పద్యములలో శబ్దార్థగత చమత్కారములు రెండునుగానవచ్చును. మఱి కొన్నిపద్యములలో కేవలమలంకారగత చమత్కారముతోచును. కొన్నిచోట్ల లోకోక్తిగతచమత్కారము గానవచ్చును. మఱికొన్నిచోటులందు రమ్య రసగతచమత్కారము గన్పట్టును. కొన్నిసన్నివేశములలో విచారిత స్థాయిలో, మఱికొన్ని సన్నివేశములలో నవిచారితస్థాయిలోను చమత్కార విశేషములు గాననగును. కొన్నిచోట్ల వృత్తిగతచమత్కారముగూడ కానవచ్చును. ఆయా సన్నివేశములందలి పద్యములను పరిశీలించినచో విజయవిలాసము వివిధచమత్కారములకాటపట్టని తేటపడును.

ఉ॥ రేలమృతాంశులో శశము రెమ్మదమంచుఁదలంచి జాళువా
మేలిపసిండి నోయగపు మేడల గుజ్జనగూళ్ళ నందడిన్
బాలికలుండి, యావలఁజనంగని చింతిలి వంటయింటి కుం
దేలిదియెందుఁ బోఁగలదు నేఁటికి నేమనియందురందులన్. 20

వేంకటకవియొక్క మధురలేఖిని నుండి వెలువడిన ప్రముఖ పద్య రత్నములలో నిదియొకటి. చమత్కారాంచితపద్యమిది. నిరాడంబరములైన యలఁతియలఁతిపలుకుబళ్లతో నీపద్యమునందాలోచనామృతమైన యర్థ చమత్కారము సాధింపబడినది. ఇంద్రప్రస్థపురమునందలి మహోన్నత సౌధములను చమత్కారముగ వర్ణించుట యిందలి లక్ష్యము. చంద్రునిలో

20 వి. వి — ప్ర ఆ. — ప. 67.

నున్న కుందేటిని బయటికి లాగవలెనను కోరికతో నాపట్టణమునందలి బాలి కలు రాత్రిసమయమున తమ మేడలలో గుజ్జనగూళ్ళాడుకొను సందడిలో చంద్రునిసంగతి విస్మరించియుండఁగా చంద్రుఁడు వారి నతిక్రమించి కొంతదూరము వెళ్లినతరువాత నతనిఁజూచి “ ఇది వంటయింటి కుందేలు, నేఁడు తప్పించుకొని వెళ్లినప్పటికిని రేపు తప్పించుకొని పోలేదుగదా, రేపు తిరిగి వచ్చినప్పుడు పట్టుకొనవచ్చును'' అని యాత్మవిశ్వాసముతో ననుకొనుచు తిరిగి తమ యాటపాటలలో నిమగ్నలై యుందురట. చంద్ర బింబము వారికందుఁబాటులో నున్నపుడే యందలి కుందేటిని రెమ్మటకు పీలుపడును. అది దగ్గరగా నున్నప్పుడే యాబాలికల కట్టికోరిక కవకాశము గలదు. తిరిగి మర్నాడదే మార్గముగుండ చంద్రుఁడు తప్పక రాఁగలఁ డను నిశ్చయజ్ఞానము వారికిఁ గలదు. ఈ సన్నివేశములో “అమృతాం శుఁడు” అను పదము నీకవీంద్రుఁడభిప్రాయగర్భితముగ వాడియు న్నాఁడు. అమృతకిరణుఁడని దీనియర్థము. చంద్రుఁడు తన కిరణముల ద్వారా అమృతమునందించునని ప్రతీతి. చంద్రునిలోఁ గానవచ్చుమచ్చను కొందఱు కుందేలుగ భావించిరి. కనుకనే చంద్రుని శశాంకుఁడని కూడ వ్యవహరింతురు, శశమనఁగా కుందేలనియర్థము. చమత్కారముకొఱకు కవులు చంద్రుని వంటిల్లుగ వర్ణింతురు. శశాంకుని వంటిల్లుగ వర్ణించినపు డందలి శశమును వంటయింటి కుందేలుగ వర్ణించుట యిందలి చమత్కా రావహసన్నివేశము. ఇతరజంతువులవలె కుందేలుకూడ నలవాటుపడిన చోటికి ప్రతిదినము వచ్చుట సహజము. దూరారణ్యభూములలోనున్న కుందేటిని పట్టుకొనుట సాధ్యపడకపోవచ్చునుగాని దగ్గరగా, వంటింటిలో నున్న కుందేటిని పట్టుకొనుట తేలిక. అట్టిదాని ననుభవించుటయు తేలి కయే. మొత్తముమీద నాసౌధములు చంద్రమండలమువఱకు వ్యాపించి సమున్నతములై యున్నవని వ్యంజింపఁజేయుట యిందలి చమత్కారము. చంద్రమండలము నవి సమీపించినవనుట యతిశయోక్తి భరితముగ కాన

వచ్చుచున్నారు వాని సమృద్ధికౌన్నత్యమును సూచించుట యీవర్ణనము యొక్క సారాంశము. చేమకూర వేంకటకవి తంజావూరు నాయకరాజ సౌధములను, తదితర సంపన్నగృహస్థుల సౌధరాజములను జూచి యిందిర్ప్రస్థపురసౌధములను వర్ణించినట్లు తోచును. మఱియు నీపద్యములో కానవచ్చు "వంటయింటి కుందేలు" అను జాతీయవ్యవహారము "గుజ్జనగూళ్లు" అను తెనుగువారికి సహజమైన క్రీడావిశేషమును కమనీయ కవితాచమత్కారమునకు చక్కని నిదర్శనములు. ఈ చమత్కారములు విచారితరమణీయములై విరాజిల్లుచున్నవి.

2) ఉ॥ ప్రాయపునాయకుల్ వెలనెపానసెగాదిగఁజూడ "నేర్పులా
రాయివిదండమీఁదఁగొసరందొరకొంటిరి మంచిసాములే
పో యటులైనచో సరసముల్ గద మీకివు"డంచు నప్పురిన్
గాయజుతూపులమ్ముదురు కందువమాటల పుష్పలావికల్[21]

వేంకటకవి యీపద్యములో పుష్పలావికలను మనోహరముగ వర్ణించినాఁడు వీరు పువ్వులమ్ముపద్ధతి చమత్కారముగ చిత్రింపఁబడినది. వయసులో నున్న నాయకులు వెల నెపముతో నెగాదిగఁజూడఁగా వారితో సరసములాడుచు పుష్పలావికలు కందువమాటలతో పుష్పముల నాపట్టణములోనమ్ముదురట. ఇందు నాయకులు, వెల, దండ, సరసము, కాయజుతూపులమ్మ కందువమాటలు అనుపదములు చమత్కారార్థద్యోతకములుగ వాడఁబడినవి యౌవనములోనున్న శృంగారనాయకులు పూలమాలలవెలయడుగునెపముతో పుష్పలావికలనెగాదిగఁజూడఁగ వారితో పుష్పలావికలు చమత్కారపుమాటలతో సరసములాడుచు పుష్పములమ్ముచురట. ఇచ్చట నాయకశబ్దముచేత తంజావూరునాయకులు సూచింపఁబడినారు. ఈసరసనన్నివేశమునుబట్టి

21 వి. వి. .... ప్ర. ఆ. ప. 14.

నాయకరాజులయొక్క రసికత వ్యక్తమగుచున్నది. వెలయునఁగా కేవలము పూలమాలంవెలమేగాక శృంగారాత్మకసంగమాపేక్షతోఁగూడినదేరపువెల యనునభిప్రాయముధ్వనించుచున్నది. దంటయను శబ్దముద్వారా యూవింగన సుఖానుభూతికేర్పఱచు కై దంటను వ్యంజింపఁజేయుట చమత్కారము. ఇచ్చట సరసశబ్దము చౌకబేరము, రసనహితము (మధురయుక్తము), సరసమాడుట యను నర్థవిశేషములనిచ్చుచున్నది, "కాయజుతూపులు" అను సమాసము గూడ చక్కని చమత్కారార్థములలో వాడఁబడినది. కాయజుతూపులనఁగా మన్మథబాణములని యర్థము. పుష్పములని యభిప్రాయము. పుష్పలావిక లమ్ముచున్న పుష్పములు యువకుల హృదయములలో మదనోద్రేకమును రేకెత్తించుచున్నవి గనుకనట్టి విశేషార్థవ్యంజకమైన "కాయజుతూపులు" అను పదము సాభిప్రాయముగ వాడఁబడినట్లు తెలియుచున్నది. ఇందు 'కందువ' యనుశబ్దము గూడ కడు చమత్కారార్థములలో వాడఁబడినది. "కందువ మాటలు" అనుసమాసపదముద్వారా సంకేతపుమాటలు, చమత్కారపుమాటలు, నిపుణములగుమాటలునను నర్థవిశేషములు స్ఫురించుచున్నవి తనమాటలు చమత్కారాంచితములైనవని వేంకటకవి పరోక్షముగ సూచించినట్లు కూడ భావింపనగును. 'కందువ'యనుశబ్దమునకు జాడ, సంకేతస్థలము, ఋతువు, ఏకాంతము, చమత్కారము, ప్రదేశము, సామర్థ్యము, తెగయనునర్థములు శబ్దరత్నాకరమునందు పేర్కొనఁబడినవి. ఈ శబ్దమునకుఁగల చమత్కారార్థమును ధ్రువపఱచుటకే చేమకూర వేంకటకవి యొక్క "నెలయుచయించు నప్పుడల .... ... కందువమాటలాడుచున్ ... .... విశారదుఁడెవ్వఁ డుండఁదగన్" 22 అను విజయవిలాసపద్యమే యుదాహరణముగ నీనిఘంటువులో పేర్కొనఁబడినది. మఱియు నీ పద్యప్రథమపాదములో "ఎగాదిగా జూడన్ + ఏర్పులు" అని విడఁదీయుటవలన నొకయర్థము, "ఎగాదిగఁ జూడ + నేర్పులు" అనివిడఁదీయుటవలన మఱొకయర్థమునువచ్చుట

22 వి. వి. ప్ర. ఆ. — ప. 142.

చమత్కారము. ఇట్టిపద్యము చమత్కారముల గనివలె కానవచ్చుచునది.

3, చ॥ అతనినుతియింపశక్యమె జయంతుని తమ్ముఁడు సోయగమ్మునన్
జతగకులాధిపద ధ్వజుని ప్రాణసఖుండు కృపారసంబునన్
క్షితిధరకన్యకాధిపతికిన్ బ్రతిజోదు సమిజ్జయంబునం
దతనికతండెసాటి చతురబ్ధిపరీతమహీతలమ్మునన్.[23]

ఈపద్యమునందలంకారచమత్కారాతిశయము కానవచ్చుచున్నది. ఇందు ల్లేఖానన్వయస్వభావోక్తుల నేకోన్ముఖముగ నీకవీంద్రుఁడు నడిపినాఁడు. ఒక వస్తువనేక విధములగ చమత్కార జనకముగ వర్ణింపఁబడుట నుల్లేఖాలం కారమందురు. ఇచ్చట నర్జునుఁడు సోయగములో జయంతుని తమ్ముఁడు గను. కృపారసములో శ్రీకృష్ణుని ప్రాణసఖుడుగను, యుద్ధవిజయము లందు పరమేశ్వరునకు ప్రతివీరుఁడుగ వర్ణింపఁబడినాఁడు. అనఁగా నతఁడు జయంతునివంటి సుందరుఁడని, శ్రీకృష్ణునివంటిదయాపూరితహృదయుఁడని పరమేశ్వరునెదిరించి పోరాడఁగల వీరుఁడనియు నభిప్రాయము. అతఁడు నిజముగ జయతుని తమ్ముఁడు; శ్రీకృష్ణుని ప్రాణమిత్రుఁడు, పరమేశ్వ రుని ప్రతిజోదునై యున్నకారణమున నీవర్ణనము సహజోక్తినమంచి తమై చమత్కారావహము గనున్నది. అట్టి దేవాధికులతో పోల్చుటవలన నా వీరాగ్రిగణ్యునిలోకాతీతశక్తిసామర్థ్యములు,సౌందర్యగరిమయును వ్యక్తము లగుచున్నవి. "అతనికతండెసాటి" యనిచెప్పినచోట ననన్వయాలంకారము గలదనిచెప్పవచ్చును. ఒకేవస్తువుపమేయముగ, నుపమానముగను వర్ణింపఁబడినచో ననన్వయలంకారమగును. ఇచ్చట నర్జుననకతఁడేసాటి యని వర్ణించుటవలన నతని యసదృశవ్యక్తిత్వము స్పష్టపడుచున్నది. "అతని కతండెసాటిచతురబ్ధిపరీతమహీతలమ్మునన్" అని యతని ఘనతను మానవ

23 ,, — ,, — ప. 28.

లోకమునకు మాత్రమే పరిమితమైయున్నట్లు వర్ణించుటవలన నది యతిశయోక్తిభరితముగానుండ చూపఁబడినది. ఈ యలంకారభూయిష్ఠవర్ణనము నుండి యిట్టిచమత్కారములనేకము లుట్టిపడుచున్నవి.

4, పంచచామరము. కనన్సుభద్రకున్ సమంబుగాఁగ నేమృగీవిలో
కనన్ నిజంబుగాఁగ నే జగంబునందుఁజూచికా
కనన్; దపింపవర్ణనీయహావభావధీవయః
కనన్మనోజ్ఞరేఖలెన్నఁగాఁదరంబెగ్రిక్కనన్ ? 24

ఇందనేకవిధచమత్కారములు కానవచ్చుచున్నవి. శబ్దవృత్తివృత్తగతచమత్కారములిటముప్పిరిగొన్నవి. ముమ్ముందుగనిందలి శబ్దచమత్కారము హృదయముల నాకర్షించుచున్నది. అట్లేసుభద్రాశారీరకసౌందర్యము గూడ హృదయాకర్షణముగ నున్నదని సూచించుచున్నట్లున్నది. నాలుగు పాదములయందును మొదట 'కనన్' అను పదము చమత్కారజనకముగ నర్థభేదములతో వాడఁబడినది. ఇట్టియేకపదపునరావృత్తి వలన శ్రుతిసుభగధ్వనులేర్పడి పద్యగద్యములు చదువుటకు, వినుటకును మనోహరములుగనుండును. ఇందు మొదటి 'కనన్' అనుపదానికి 'చూడలేదు' అని యర్థము. రెండవ 'కనన్' అనుదానిని సమాసగతమైనదిగ గ్రహించి, దానితోఁగూడియున్న 'మృగీవిలోకనన్' అనుసమాసమునకుఁఆడులేడి కన్నుల వంటి కన్నులు గలదానిని, అనునర్థము చెప్పుకొనవలెను. మూఁడవ 'కనన్' అనుదాని నిజస్వరూపమదికాదు. సంధిరూపమున పూర్వపదముతో కలిసి యట్లుకన్పట్టుచున్నది. "చూచికాక + అనన్" అనివిడఁదీసి చూడకుండ పల్కను" అనునర్థము చెప్పుకొనవలెను. అట్లే నాల్గవ 'కనన్' అనునది కూడ (కనత్ + మనోజ్ఞ' అనుపదము లనునాసికసంధిరూపములోఁ

24 వి. వి. — ప్ర. ఆ. — ప. 24

గలిసి 'కనన్మనోజ్ఞ' అనికానవచ్చుచున్నది కాని 'కనత్' అనునదే తత్పద సహజరూపమని గ్రహింపవలెను. 'కనత్' అనఁగా ప్రకాశించుచున్న యనియర్థము. ఇట్లర్థభేదముతోఁగూడిన శబ్దపునరుక్తి చమత్కారజనకముగ నిందుఁగానవచ్చుచున్నది, మఱియు మొదటిరెండుపాదములలోను గకారజ కారములు, తృతీయపాదములో 'తదీయ, వర్ణనీయ' అనుచోటులందీయ చ్ప్రత్యయము 'హావభావధీవయః, అనుచోట వకారమును పునః పునరావృత్తములైనవి. మనోహరనాదవంతములైన నకారపుపొల్లు, పూర్ణబిందువును మొత్తముమీద నాల్గుపాదములలోను పునారావృత్తినంది చమత్కారావహములై యొప్పియున్నవి.

ఈపద్యములో శృంగారరసము వర్ణింపఁబడినది. సుభద్రియొక్క యందచందములు, నాసుందరాంగియొక్క హావభావములు నిందు సూచింపఁ బడినవి. అవి యారసరాజమునకు మూలములు. ఈ శృంగారాత్మక రచనావిధానమిందు కైశికీవృత్తిలో సమపఁబడినది. ఇట్టి వృత్తిపూర్వక రచన రసోపస్కారకమై యలరారుచున్నది. కోమలపద సమూహముతో నిందలి రచనను సాగించి కవీంద్రుఁడిచ్చట కైశికీవృత్తికిఁ దగిన వాతావరణము కల్పించినాఁడు. "అత్యర్థసుకుమారార్థసందర్భా కైశికీమతా. యత్ర శృంగారకరుణావతికోమలేన సందర్భేణ వర్ణ్యతే తత్రకైశికీ" 25 అని విద్యానాథుఁడు కైశికీవృత్తిలక్షణమును చెప్పియున్నాఁడు. ఈ విశిష్ట వృత్తివర్ణనద్వారా శృంగారమును వ్యంజింపఁజేయుట చమత్కారము.

సమయసందర్భములకుఁ దగిన క్రొత్తవృత్తము నెన్నుకొనుట మఱియొక చమత్కారము. చేమకూర వేంకటకవి యీ సన్నివేశములో తన కవితాప్రతిభ కనుగుణముగ పంచచామర వృత్తము నెన్నుకొనినాఁడు.

25 · ప్ర. రు. య.భూ — విద్యానాథుఁడు .... కావ్యప్రకరణము .... P. 43. Pablished by Balamonoram Press, Madras.

తాళలయాన్వితమైన యొక ప్రత్యేకగతివిశేషముతోఁ గూడిన వృత్తమిది. ఇది జ, ర, జ, ర, జ, గ యను గుణములతోఁ గూడి యురకలువేయు చున్న నడక గల్గియుండును. ఉరకలు వేయుచున్న యాసుభద్రా యౌవ నము, ఆ సుందరాంగిని కలిసికొనుటకు త్వరపడుమని గదుఁడర్జునుని హెచ్చరించుట నీప్రత్యేక గతివిశేషముతోఁ గూడిన వృత్తముద్వారా సూచించుట చమత్కారవిశేషము. కవిత్రయము వారివలె రసానుగుణముగ వృత్తవిశేషముల నెన్నుకొనుటలో నీకవీంద్రుఁడుగూడ కడు సామర్థ్యమును ప్రదర్శించినాఁడు. జ, ర, అను జంటగణములు తిరిగివచ్చుటవలన నాపై జగణము మరలవచ్చుటవలనను నీవృత్తమునకు చమత్కార గతివిశేషము లభించినది.

5. ఆ॥ నలినలీల నంచు నలినలి గావించు
నించుమించు లాడు నించు మించు
లేమ నగవుఁజూపు లేమన నగుఁజూపు
జగమెఱుంగు దాని జగమెఱుంగు. [26]

ఈ పద్యమునందు శబ్దచమత్కారము పరాకాష్ఠదశలోఁ గానవచ్చు చున్నది సుభద్రయొక్క నగవుఁజూపులను కవి యందు మనోహరశబ్ద చమత్కారభంగిమలతో చక్కఁగ చిత్రించినాఁడు. ఆమె చూపులు పద్మ విలాసమును, విద్యుల్లతాసౌందర్యమును తిరస్కరించు చున్నవి. ఇందు పద్మములకు, మెఱుపునకు నేశబ్దములు వాడినాఁడో యాశబ్దములనే పున ప్రయోగము చేసి తిరస్కార భావమును దెల్పుట చమత్కారము. ఆమె నగవుఁజూపులు నలినలీలను నలినలి గావించును: ఇంచుమించును ఇంచు మించులాడును. నలినలీలను=పద్మవిలాసమును, నలినలిగావించును=మిక్కిలి

26 వి. వి. ప్ర. ఆ. వ.

నలిపివేయును, ఇంచుమించును=సొగసైన మెఱపును, ఇంచుమించు లాడును=ఎక్కువతక్కువ లాడును (తిరస్కరించును). ఇట్లన్వయక్రమాను గుణముగ నా చమత్కారశబ్దవిన్యాసరీతుల కర్థములు చెప్పుకొనవలెను. మఱియు నిచ్చట నగవుఁజూపుల నేకవస్తువుగ భావించక నగవును, చూపులను విడఁగొట్టి యన్వయించుకొనినచో నగవు నలినవిలాసమును తిరస్కరించునని, చూపు మెఱపును తిరస్కరించుననియును క్రమపద్ధతిలో నర్థము తోచి చమత్కారజనకముగ నుండును. ఇంచుమించు, జగమెఱుంగు మున్నగునవి యిందర్థభేదముతో పునరుక్తములగుటచే యమకమను శబ్దాలంకారము గానవచ్చుచున్నది. ఇట్లీపద్యము నాల్గుపాదములలోను శబ్దవైచిత్ర్యము కానవచ్చుచున్నది.

6. ఆ॥ నువ్వుఁ బువ్వు నవ్వు జవ్వని నాసిక
చివురు నవురుజవురు నువిదమోవి
మబ్బు నుబ్బు గెబ్బు బిబ్బోకవతివేణి
మెఱపు నొఱపుఁ బఱపుఁ దెఱవమేను. 27

ఇదియు శబ్దచమత్కారమున కాటపట్టయి యలరారుచున్నది. ఉలూచి యొక్క నాసికను, మోవిని, వేణిని, మేనును మనోహరోపమానములతో కవి వర్ణించినాఁడు. ఆమె నాసిక నువ్వుపువ్వును నవ్వుచున్నదట. ఆమె పెదవి చిగురుటాకు నందమును కొట్టివేయునట. ఆమె వేణి మేఘగర్వము నణఁచునట ఆమె శరీరము మెఱుపుయొక్క సౌందర్యమును దూరముగ పారఁదోలునట. ఆమె నాసిక నువ్వుపువ్వును, మోవి చిగురుటాకును, వేణి మేఘమును, మేను మెఱపును మించియున్నవని సూచించుట యిందలి చమత్కారము. మఱియు చమత్కారజనకశబ్దసాధర్మ్యము వలన

27. ,, .... ,, — వ, 84.

నాసుందరాంగియొక్క యౌవనవికాసము, విలాసవిశేషము, శారీరక సౌంద ర్యాతిశయమును ప్రస్ఫుటములగుచున్నవి. ఇందలి మధుర శబ్ద చిత్రణము వలన నీపద్యమెట్లింపుగ నున్నదో యట్లే యులూచికూడ మనోహరాంగియై రసికుఁడైన యర్జునుని హృదయమును నాకర్షింపఁ జొచ్చినదని యీకవీంద్రుఁ డిందు ధ్వనింపఁజేసినాఁడు. మొదటి పాదములో ద్విత్వవకారము, రెండవ పాదములో 'వురు' అను నక్షరములజంట, మూడవపాదములో ద్విత్వటకా రము, నాల్గవపాదము లో 'అవు' అను నక్షరముల జంటయును చమత్కార జనకముగ పునఃపునరావృత్తములగుట వలన వృత్త్యనుప్రాసమను శబ్దా లంకారము గలదనవచ్చును. గతివిశేషముతోఁ గూడిన ద్విత్వాక్షరపున రుక్తి పరవళ్లు ద్రొక్కుచున్న యాసుందరి యౌవనమతనిని కవ్వించు చున్న పరిస్థితిని సూచించుచున్నది, అట్లు కవ్వించుచున్నట్లు కానవచ్చు చున్న యామె యౌవనవిలాస మాంసికావతంసమునకు నయనానందకర ముగ నుండి యామెను కలియుటకై యతని సరసహృదయము చురకలు వేయుచున్నట్లు గూడ కానవచ్చుట యిందలి మఱొక చమత్కారవిశేషము. అట్టి యురకలకు తగినట్లుగనే యీపద్యమును ఖండగతిలో నడుపుట యింకొక విశేషము. ఊహించుకొనువలది యిట్టి చమత్కారములెన్నోవి యితని పద్యములలో కానవచ్చును.

7. ఉ॥ నాయమెనీకు మేల్పడిన నాతినలంచుట ? యంత్రమత్స్యమున్
మాయఁగఁజేసి మున్ ద్రుపదనందననేలవె ? యంగభూపతా
కాయతయంత్రమత్స్యమిపుడల్లన. ద్రెళ్ళఁగనేసి యేలుకో
తీయఁగ వంచదార వెనుతీయఁగఁ బల్కినమున్ ద్వితీయఁగన్[28]

ఇందు శబ్దార్థచమత్కారములు లెంతును కానవచ్చుచున్నవి. తనను చేపట్టి ప్రాణదానము చేయుమని యులూచి దీనదీనముగ నర్జును నర్థించు

28 వి. వి. ప్ర. ఆ. ప. 94.

చున్నది. వలచినకాంతను బాధపెట్టుట న్యాయముకాదని, మత్స్యయంత్రి మును గొట్టి ద్రౌపదినేలకొనినట్లే మదనధ్వజమత్స్యమును పడఁగొట్టి పంచదారకంటె మధురములైన మాటలు మాట్లాడి తనను భార్యగనేలుకొనుమని యామె యర్జునుని సవినయముగ నర్థించినది పంచదార, ద్వితీయ, యను శబ్దములను చమత్కారముగ నామెచే పలికించినాఁడు. ఈరెండు పదములును సందర్భోచితముగ శ్లేషించినవి 'పంచదార' అను పదములో చకారమును దంత్యముగ నుచ్చరించినచో 'చక్కెర' యను నర్థము, తాలవ్యముగ నుచ్చరించినచో నైదుగురి భార్యయైన ద్రౌపదియను నర్థమును వచ్చును. అట్లే 'ద్వితీయ' యనఁగా భార్యయని యొక యర్థము, రెండవదని మఱియొక యర్థమును వచ్చును. మొదటి భార్యయైన ద్రౌపది తరువాత నను రెండవ భార్యగా స్వీకరింపుమని యామె కోరినట్లు ధ్వనింపఁజేయుట యిచ్చటి చమత్కారము. ఆమె యనురాగబద్ధములైన మాటలధోరణిలో "తీయఁగ - తీయఁగ - తీయఁగ" అని ముమ్మాఱు పలుకుటలో నర్జునుని లోకోత్తర హాస్యమాధుర్యము, ఆమె హృదయములో పేరుకొనియున్న యనురాగమాధుర్యమును చమత్కారముగ సూచింపఁబడినవి. చేమకూర వేంకటకవి శ్లేషయమకచక్రవర్తియను పెద్దల కతపత్రమునకు తగినట్లుగనే యీపద్యచతుర్థపాదమందు శ్లేషయమకాలంకారములు రెండును కానవచ్చుట యొక విశేషము. "ఒకానొకచో జకారంబు భయంబునగును" అను సూత్రముతో ప్రౌఢవ్యాకర్త చకారమునుగూడ చేర్చి వేంకటకవివంటి ప్రామాణిక కవులయొక్క "పంచదార" మున్నగు ప్రయోగములను సాధించియున్నచో బాగుగనుండెడిది.

8. మ॥ "తనకున్ గొంగిలియీవొకప్పుడును నాథా ! నీ కరస్పర్శనం
బున గిల్గింతలె యంచుఁ గది కరాంభోజమ్మునన్ మందమం
దనటద్వాయుచలద్దళాంగుళుల కన్పట్టంగ నవ్వేల్పురా
యని రా ! రా ! యని పిల్చె నాఁదగె ద్విరేఫాద్యంత
దీర్ఘ ధ్వానులన్. 29

ఈ పద్యమునందద్భుతమైన యర్థచమత్కారము గలదు. ద్విరేఫ ముల దీర్ఘ ధ్వనులను సందర్భశుద్ధితో మనోహరముగ సమన్వయించినాఁడు. సుందరాంగియగు చిత్రాంగదను చూచుటతోడనే యర్జునుని కనురాగభావ మంకురించినది. ఆమెతో గాఢాలింగనసుఖము ననుభవించవలెనను కోరిక యతనికి కలిగినది. కాని యామె దూరముగ నున్న కారణమున నాసుఖ మున కతఁడు నోచుకొనలేదు. అయినప్పటికి నామె హావభావాదులు చూడఁగ నాలింగనసుఖమునిచ్చుట కతని నాహ్వానించుచున్నట్లు కానవచ్చు చున్నది. అచ్చట ప్రాకృతికపరిస్థితి యప్పుడాత్మభావానుగుణముగ నున్నట్లూహించుకొనినాఁడు. ఆకసమున సూర్యుఁడు లేచిరిల్లుచున్నాఁడు. పద్మములు వికసించియున్నవి. మకరందముకొఱకు తుమ్మెదలు ముసురు చున్నవి. మందపవనాహతికి పద్మములు మందమందముగ చలించు చున్నవి. నిలకడలేని తుమ్మెదలు రొదలుచేయుచున్నవి. అర్జునుఁడా రిమ ణీయధ్వనుల నాత్మభావానుకూలముగ నూహించుకొనినట్లు ధ్వనింపఁజే యుట యిందలి చమత్కారము. "ఓనాథా ! నీకరస్పర్శనము గిలిగింతలు పెట్టుటయేకాని నాకొకప్పుడు నాలింగనసుఖమునిచ్చుట లేదని" పద్మిని మందపవనాహతికి కదులుచున్న రేకులనెడి వ్రేళ్ళు కన్పట్టఁగ పద్మహస్త మునెత్తి తనప్రియుఁడైన సూర్యుని రా రా ; యని పిలుచుచున్నదా యను నట్లు ద్విరేఫముల యాద్యంతదీర్ఘధ్వనులొప్పియున్నవని యర్జునుఁడు

విశారదునితో చెప్పినాడు. అర్జునుడిచ్చట పద్మినిని చిత్రాంగదగ పద్మము నామెహస్తముగ, పద్మపత్రముల నంగుళులుగ, ద్విరేఫదీర్ఘ ధ్వనులను రా రా ! యను నామె పిలుపుగ, తనను సూర్యునిగను భావించు కొనుట యిందలి చమత్కారాతిశయము. ఇందు కర, ద్విరేఫ శబ్దములు శ్లేషించి యర్థచమత్కారమునకు మూలములైనవి. ఇచ్చట 'కర' శబ్దము హస్తము, కిరణమునను నర్థములను, 'ద్విరేఫ' శబ్దము తుమ్మెద, రెండు రేఫములను నర్థములను నిచ్చుచున్నవి. భ్రమరమనగా తుమ్మెదయని యర్థము. ఈ శబ్దములో రెండు రేఫలున్నవిగనుక తుమ్మెదకు ద్విరేఫ మను నామాంతరము కలిగినది. కాని యీశబ్దములోని రెండు రేఫలకును దీర్ఘములులేవు. ఆరెండురేఫలకు దీర్ఘములిచ్చినచో 'రా రా' యను ధ్వను లేర్పడును. వీనినే ద్విరేఫాద్యంతదీర్ఘధ్వనులని కవి చమత్కరించినాడు. ఆద్యంతములనున్న రకారముల యచ్చులకు దీర్ఘములు చేయగా 'రా రా' యని యేర్పడునని యభిప్రాయము. "ద్విరేఫాత్యంత దీర్ఘధ్వనుల్"30 అను పాఠాంతరముతో నీపద్యమును తాపీ ధర్మారావుగారు పేర్కొని యున్నారు. ద్విరేఫముయొక్క మిక్కిలి దీర్ఘధ్వనులను నర్థమీ పాఠము నను చెప్పవలసియుండును. మొత్తముమీద నీసమాసమున 'తుమ్మెదల దీర్ఘములైన రొదలు' అను సామాన్యార్థముకంటె 'రా రా' యను రీతి నేర్పడిన దీర్ఘయుతములైన రెండురేఫలు, అను విశేషార్థము ప్రతీయ మానమగుట యిందలి చమత్కారము. చిత్రాంగదపై తనకు కలిగిన యనురాగాతిశయమును ప్రకటించుట యీపద్య విశేషవిషయముగ భావింప నగును. ఇట్టి యర్థచమత్కారవిశేషముల కిందలి యుత్ప్రేక్ష, రూపక, శ్లేషాలంకారములు కారణములైనవి. తుమ్మెదల రొదలను పద్మిని పిలుపుగ చమత్కార జనకముగ నూహించుట యుత్ప్రేక్ష. "కరాంభోజము"

30 హృదయోల్లాసవ్యాఖ్య — తాపీ ధర్మారావుగారు — పు. 318 — ప. 204.

అనుచోట కరమునకు సంబోజము సకును, "దళాంగుళులు, అనుచోట పద్మ దళములకు నంగుళులకును చమత్కార పూర్వకముగ నభేదవర్ణన చేయుట రూపకము. కరద్విరేఫ శబ్దములు శ్లేషించి చమత్కారార్థముల నిచ్చుట శ్లేష. ఇట్టి చమత్కార విశేషములకిది నిలయమైయున్నది.

9) చ॥ క్షితిపయి వట్ట్రిమ్రాఁకులుచిగిర్ప వసంతుఁడుదా రసోపగుం
ఫితపదవాసనల్ నెఱప, మెచ్చక చంద్రుఁడుమిన్ను సంప్రస
న్నతయు, సౌకుమార్యముఁగనంబడ వాల్గరఁగంగఁజేసె నే
గతి రచియించిరేని సమకాలపువారలు మెచ్చరేకదా![31]

విజయవిలాసమునందిది యొకమనోహరపద్యరత్నము, ఇదియలంకార చమత్కారమునకాకరమై యలరారుచున్నది. లోకసామాన్యవిషయముచేత ప్రకృతవిశేషమిందు చమత్కారముగసమర్థింపఁబడినది. కవియిందు చంద్ర విజృంభణమును ప్రధానముగ వర్ణించినాఁడు.

*సామాన్యభావము* :— వసంతుఁడు భూమిపై మోడులను చిగిరింపఁ జేసి మకరందయుతములైన పుష్పములవాసనలను వ్యాపింపఁజేసినాఁడు. అట్లు వసంతుఁడుచేసిన ఘనకార్యమును మెచ్చక చంద్రుఁడాకాశమునుండియే ప్రసన్నతాసౌకుమార్యములను ప్రదర్శించి చంద్రకాంతశిలలను కరిగించినాఁడు. ఎవఁడెంతఘనకార్యముచేసినను సమకాలికులు మెచ్చకొనరుగదా!

ఈసామాన్యాభిప్రాయముతోపాటు "రసోపగుంభితపదవాసనల్" అనుచోట సిద్ధరసముపూయఁబడినపాదముల విన్యాసాత్మకస్పర్శలను నభిప్రాయమునుగూడ వేదము వేంకటరాయశాస్త్రిగారిచేత, బులుసు వేంకటరమణయ్యగారిచేతను వారి వ్యాఖ్యానములలో పేర్కొనఁబడినది. దానినొకచమత్కారార్థముగ భావింపనగును.

31 వి. వి. ప్ర. ఆ. ప. 145.

విశేషభావము :- వసంతుఁడనుకవియొకఁడు తనకవితాక్షేత్రమున రస భరితపదసంస్కారములతో మోడులవంటి మూర్ఖులను (రసజ్ఞత యేమా త్రము లేనివారిని) రంజింపఁజేయగ నదిమెచ్చక చంద్రుఁడనుమతొకకవి పై పైన ప్రసాదసౌకుమార్యకావ్యగుణములు స్ఫుటములగునట్లుగచేసి యర సికుల ఱాతిగుండెలనుగూడ కరిగించినాఁడు. ఒకఁడుచేసినపనిని మఱియొ కఁడు మెచ్చకుండుట లోకసహజముకాఁబోలును. ఒకఁడెంతగొప్పపనిచేసి నను సమకాలికులు మెచ్చుకొనరు. మానవహృదయదౌర్బల్యములలో నిది యొకటి

ఈవిశేషభావము ధ్వనించుట యిందలి చమత్కారాతిశయము. ఈ పద్ముఖపద్యహారములో "ఏగతిరచియించిరేని సమకాలమువారలు మెచ్చరేకదా" అనులోకోక్తి ముఖ్యమణివలె భాసించుచున్నది. ఎంతశ్రమ పడి యీకవీంద్రుఁడీ లోకోత్తరమైన లోకోక్తిని కూర్చినాఁడో కాని యది నేటికిని ప్రత్యక్షరసత్యమును నిరూపించుచున్నది. బహుశః చేమకూర వేంకటకవి కూడ మానసికముగ మిక్కిలి మథనపడి యీ పద్యమును కూర్చియుండును. వ్యథితహృదయమునుండియే యుత్తమకళ యావిర్భవిం చును, ఈపద్యమింత రసవంతముగ కూర్పఁబడుట కతని మానసికవ్యథయే కారణమైయుండును. వేంకటకవియొక్క కవిత్వమును గూడ సమకాలికులైన కొందఱు కవులు, పండితులును విమర్శించియుందురు. అతని సారంగధర చరిత్రము రసాభాసజుష్టమైనది, యప్రసిద్ధవస్తు నిర్మితమైనది, యచారిత్రక మైనదనియు, నతని విజయవిలాసమున వ్యాకరణవిరుద్ధప్రయోగము లధికముగనున్నవని, యాప్రబంధమునందు వస్త్వైక్యము దెబ్బతినినదని యును విమర్శలు నేటికిని వినవచ్చుచున్నవిగదా ! అట్టి విమర్శలనే యానాఁడతఁడువిని, యెంతశ్రమపడి యెట్టిరసవత్కావ్యమును రచించిననేమి

ఫలమని వెతఁజెంది నైరాశ్యముతో నీపద్యమును రచించినట్లుతోచును. మఱియు తన విజయవిలాసము రసోపసంభితపదవాసనలతో, ప్రసాద సౌకుమార్యకవితాగుణములతోను కూడియుండి యరసికులను గూడ రంజింపఁజేయగలదని యతఁడిందు చమత్కారముగ సూచించియున్నాఁడు. లోకసామాన్యముచేత ప్రకృతవిషయమిందు సమర్థింపఁబడినది గనుక నర్థాంతరన్యాసాలంకారముగలదు. ఈయర్థాంతరన్యాసమే యిందలి చమత్కారములకు మూలమైనది.

10. తే॥ అపుడు నృపుఁడు ప్రఫుల్లనవాంబుజ ప్ర
సన్నముఖుఁడయి మలయధ్వజక్షితీశ
కమలహితునకు మామకాగమనవార్తఁ
దెలుపు' మనుచు విశారదుఁబిలిచిపనిచె 2

ఇది యర్థచమత్కారమునకాటపట్టైన మనోహరపద్యము. పద్యము చిన్నదైన నర్జునుని తాత్కాలికమానసికగాంభీర్యమునకుఁ దగినట్లుగ ననేకార్థచమత్కారముల నిముడ్చుకొని గంభీరముగ కానవచ్చుచున్నది. సుందరాంగియగు చిత్రాంగదనుచూచి యర్జునుఁడు వలచి యామెను వివాహమాడగోరినాఁడు. చిత్రాంగద మలయధ్వజుని కుమార్తె. ఆ సుందరినే మాటిమాటికి తలఁచుకొనిన కారణమున సంతకుముఁడు గతించిన రాత్రి యతనికి నిద్ర పట్టలేదు. తెల్లవారఁగనే తనకోరిక నీడేర్చుకొనుట కతఁడు వికసితనవారవిందమువలె ప్రసన్నముఖుఁడైనాఁడు. తనకామెపై నెంతయనురాగము గలిగియున్నను బింకమువిడచి తానేముందు బయటపడుటకా రాజేంద్రుని రాజసత్వమంగీకరించుటలేదు. కాని యొకవైపున మన్మథుఁడు పెట్టుచున్న బాధకు తాళలేక తనభావమును మలయధ్వజున కెఱుకపఱుపఁదలఁచినాఁడు.

అట్టి ద్వైధీభావస్థితిలో నాత్మగౌరవమునకు హానికలుగకుండ, నాలోచించు కొనినచో తనహృద్గతభావము స్పష్టపడునట్లు తనరాక నర్జునుఁడు మలయధ్వజునకెఱుకపఱుపఁదలఁచినాఁడు, అట్టి నిర్ణయమునకువచ్చి విశారదుని పిలిచి యతఁడాత్మభావప్రతిబింబముగ మలయధ్వజక్షితీశకమలహితునకు మామకాగమనవార్తఁదెలుపుము" అనిచెప్పినాఁడు, సాధారణముగ సామాన్యులను లెక్కింపనట్టి యసహాయశూరుఁడగు నర్జునుఁడు మలయధ్వజు నిచ్చట"మలయధ్వజక్షితీశకమలహితుఁడు" అని పేర్కొనుటలో చమత్కారముగలదు, చిత్రాంగదనతఁడు వివాహమాడఁగోరినాఁడు కనుక నామె తండ్రియైనమలయధ్వజుఁడు తనకు కాఁబోవు మామగారు. అందుచేత నత నిని గౌరవపూర్వకముగ వ్యవహరించినాఁడు. ఈసమాసములో నుత్తర పదముగ వాడఁబడిన 'కమలహిత' పదమట్టి గౌరవాధిక్యసూచకముగ నున్నది. కమలహితుఁడనఁగా సూర్యుఁడని యర్థము. ఈపదమీ సమాసములో శ్రేష్ఠతావాచకముగ, నుపమానముగను గూడ నుపయోగపడు చున్నది. మలయధ్వజక్షితీశకమలహితుఁడన్నగా మలయధ్వజరాజ శ్రేష్ఠుఁడని, మలయధ్వజప్రభువనెడి సూర్యుఁడనియు నర్థములు స్ఫురించును. అర్జునుఁడు ప్రఫుల్లనవాంబుజ ప్రసన్నముఖుఁడగుటకు, మలయధ్వజుఁడు కమలహితుఁడగుటకును కార్యకారణభావముకలదు. సూర్యోదయమైన తరువాత సంతోషముతో నర్జునుఁడు మలయధ్వజునికడకు విశారదుని ద్వారా వార్తనంపుట యిచ్చుటి విశేషము. సూర్యోదయమగుటతోనే పద్మములు వికసించును. మలయధ్వజుఁడు తనకోరికను మన్నించి. యతనికుమార్తెను తనకిచ్చి వివాహముచేసి తనకు మామఁకాఁగలడను విమలవిశ్వాసముతో నర్జునుఁడపరిమితానందము నొందినాఁడు. మానవ మానసికభావసంపత్తికి ముఖమొక సూచికకాఁగలదు. అతని మానసికానందమునకు బాహ్యసూచికయే యతని ప్రఫుల్లనవాంబుజప్రసన్నముఖము. తనముఖాంబుజవికాసమునకు కారకుఁడైన మలయధ్వజుని కమలహితునిగ

పేర్కొనుట చమత్కారావహముగనున్నది. "మామకాగమనవార్త" అని యర్జునుఁడు సగంపేరముగ పలుకుటలో చమత్కారార్థములు తొంగిచూచుచున్నవి. ఇచ్చట 'మామక + ఆగమనవార్త' యని విడఁదీసినచో 'నారాకకు సంబంధించినవార్త' యను సామాన్యార్థము వచ్చును. 'మామ + ఆగమనవార్త' యనివిడఁదీసినచోఁ మామయగు మలయధ్వజునకు తనరాకకు సంబంధించినవార్త, యను చమత్కారార్థమువచ్చును. ఇంకను మలయధ్వజుఁడు తనకు మామ కాకపోయినను దగ్గరి భవిష్యత్తులో తప్పక మామకాఁగలఁడను నాత్మవిశ్వాసముతో నర్జునుఁడు పలికినమాటగా భావింపనగును. మఱియు 'మామ + కాగ + మనవార్త' అని విడఁదీసినచో 'మామయగునట్లు మనవార్త' యను మఱియొక చమత్కారార్థము వచ్చును. మలయధ్వజుఁడు తనకు మామయగునట్లు మాట్లాడిరమ్మని యర్జునుఁడు తన మాటలలో ధ్వనింపఁజేయుట చమత్కారాతిశయము. చమత్కారనిలయముగ నిట్టిపద్యములనుతీర్చిదిద్ది చేమకూరి వేంకటకవి యాంధ్రసాహిత్య చరిత్రలో శాశ్వతకీర్తి నార్జించినాఁడు.

11. తే॥ కలదులేదన నసియాడు కౌనుతీరుఁ
దఱుకు మొగమున కెగయు గుబ్బలబెడంగుఁ
జూచి యాతని నిడువాలుఁజూపులపుడు
నిండువేడుక మిన్నంది కొండఁదాఁకె. [33]

ఈపద్యమునందుఁ గూడ చక్కని యర్థచమత్కారవిశేషములు కానవచ్చును. చిత్రాంగదయొక్క యవయవసౌందర్యమును జూచి యామె యందనురక్తుఁడై యున్న యర్జునుఁడపరిమితానందమును పొందినట్లు వర్ణించుట యిందలి ప్రధానాంశము. ఆసరసుని యనురాగభావసంపత్తికి నతని వాలుఁజూపులు నిదర్శనము. వాలుఁజూపులనఁగా క్రేఁగంటి చూపులని

33 వి. వి. — ద్వి. ఆ, — ప, 20

యర్థము. శృంగారనిలయములు, సౌందర్యరాశులునైన యామె గుబ్బల నతఁడు క్రేఁగంటిచూపులతో చూచినట్లు భావింపనగును. ఎదుటి వస్తువుల స్థితిగతులను బట్టి తానుగూడ తదనుకూలవాతావరణములో మెలగుట విజ్ఞతామానవలక్షణము. ఆమె గుబ్బలబెడంగతని క్రేఁగంటిచూపులకు కారణమైనది. అభివృద్ధిదశలోనున్న యాగుబ్బలామె తళుకుమొగముపైకి వ్యాపించుచున్నవి. ముగ్ధయైన యాచిత్రాంగద సిగ్గరితనముచేత తన ముఖ మును వంచుకొనియుండఁగా నామె స్తనములు ముఖముపైకి వ్యాపించు చున్నట్లు కానవచ్చుచున్నవని గ్రహింపనగును. ఆ సుందరిపై నతని హృదయములో పేరుకొనిన యనురాగాతిశయము నతని వాలుఁజూపులు సూచించుచున్నవి. పరకాంతాకుచములను బాహాటముగ నిడుచూపులతో చూచుట యుత్తమలక్షణముకాదు. చిత్రాంగదను తన భార్యను చేసికొన వలెననెడి యాసక్తి యెంతయున్నను, తదనుబంధము తథ్యమను నాత్మ విశ్వాసమెంతగనున్నను ముందుగనే యామె కుచములను లజ్జారహిత ముగ, బాహాటముగ నిశితదృష్టితో చూచుట పాడిగాదు గనుక నాసరసుఁడా మర్యాదను గ్రహించి యామె సమున్నతకుచప్రదేశమును శృంగారాత్మ కముగ క్రేఁగంటితో చూచినాఁడను నభిప్రాయమును వ్యంజింపఁజేయుట యిందలి చమత్కారము. అతఁడు తన నిడుచూపులతో నామె నడుమును చూచినాఁడని భావించుట మఱియొక విశేషము. స్పష్టముగ కన్పింపకున్న వస్తువును నిశితదృష్టితో పరిశీలనాత్మకముగ చూచుట సహజము. అట్టి పరిస్థితిలో నావస్తువు దృగ్గోచరమగునంతవఱకు రెప్పవేయకుండ తదేక దృష్టితో చూచుటయు సహజమే చిత్రాంగదయొక్క నడుము సామాన్య దృష్టికి కనిపించుటలేదు గనుక నర్జునుఁడు పరిశీలనాత్మకముగ దీర్ఘ దృష్టితో చూచినాఁడు. ఉన్నదా లేదా యను సంశయాత్మక పరిస్థితిలో జవ్వాడుచు నామె నడుమతనికి కన్పట్టినది. ఆమె నడుమంతసన్నముగ నున్నదని సూచించుట యందలి సారాంశము, నాయికయొక్క సన్నని

నడుమును వర్ణించుట కాంధ్రకవులనేకచమత్కారపద్ధతుల నవలంబించిరి. కవిసార్వభౌముఁడు దమయంతి నడుమును వర్ణించుచు "అస్తినాస్తివిచికిత్సాహేతుశాతోదరిన్" 34 అని చెప్పియున్నాఁడు. ఆమె నడుమున్నదా లేదాయను సంశయమును కలిగించుచున్నదట

తే॥ ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిఁ జూచి
తరుణి తనుమధ్యమెచటికో తలఁగిపోయె
నుండెనేనియుఁ గనఁబడకున్నె యహహ
యుద్ధతుల మధ్యమునఁ బేదకుండఁదరమె 35

అనుపద్యములో సంకుసాల నృసింహకవి విమలాంగియొక్క నడుమును మనోహరముగ వర్ణించియున్నాఁడు. అట్లే యితరకవులును నడుమును వర్ణించు సన్నివేశములో చమత్కారకవితాప్రతిభను ప్రకటించియున్నారు. చిత్రాంగద నడుమును వర్ణించు సందర్భములో చేమకూర వేంకటకవి కడుంగడు చమత్కారమును ప్రదర్శించియున్నాఁడు ఈపద్యములో నామెనడుమును, కుచములను కలిపి వర్ణించినాఁడు. మొదటిపాదములో నామె కౌనుతీరును, రెండవపాదములో నామె గుబ్బల బెడంగును వర్ణించినాఁడు. మూఁడవపాదములో నర్జునుని చూపులు, నాల్గవపాదములో నతఁడుపొందిన యపరిమితానందమును క్రమాలంకారధోరణిలో వర్ణింపబడినవి. అతఁడు నిడుచూపులతో నామె నడుమును, హాలుచూపులతో నామె గుబ్బలను చూచినాఁడని క్రమపద్ధతిలో నన్వయించుకొనినచో నచ్చటి చమత్కారము గోచరమగును. ఉన్నదా లేదా యను సంశయాత్మక పరిస్థితిలో నసియాడుచున్నయామె నడుమును కనుగొనుటకతఁడు దీర్ఘదృష్టితో చూడవలసివచ్చినది. అట్టిదృష్టికామె నడుము కనిపించుట

34 శృ. నై. — శ్రీనాథుఁడు — ద్వి. ఆ. — ప. 21
35 కవికర్ణరసాయనము — సంకుసాల నృసింహకవి — ద్వి. ఆ. — ప. 25

తోడనే యతఁడు పొందిన యానందమునకు మేరయేలేకపోయినది. అట్లే ముఖమువైపు సమున్నతములుగ పెరుగుచున్న యామె గుబ్బలను వాలుఁ జూపుతోఁ జూచినాఁడు. నేత్రపర్వముగ కానవచ్చిన యామె గుబ్బలను చూచుటతోడనే కలిగిన యతని యానందమునకు నవధిలేకపోయినది. ఈసన్న వేశములో నీకవీంద్రుఁడు శ్లేషనాధారముగ చేసికొని యద్భుతమైన యర్థచమత్కారమును సాధించి తన యసమానకవితాపాటవమును ప్రకటించినాఁడు. అర్జునుని చూపులపుడు నిండువేడుకతో మిన్నంది కొండను తాకినట్లు చివరిపాదములో వర్ణింపఁబడినవి. మిన్నందుట, కొండఁదాకుట యనునవి సంతోషాతిశయసూచకములైన జాతీయపదములు. అవి యిచ్చట చమత్కారముకొఱకు శ్లేషార్థఘటితములైనవి. నడుమునాకాశముతోను, స్తనములను కొండలతోను పోల్చుట కవిసంప్రదాయము. "మిన్నంది కొండఁ దాఁకె" ననుచోట నర్జునుని చూపులు పరిపూర్ణమైన వేడుకతో మొదట చిత్రాంగదయొక్క నడుమును చూచి, యటుపైనామె గుబ్బలను తాకినవను రమణీయమగు నర్థాంతరము చెప్పుకొనినచో చమత్కారవిశేషము కానవచ్చును. ఇది క్రిందినుండి పైకి వర్ణించు మానవకాంతావర్ణనాక్రమపద్ధతి కనుగుణముగనుండుట విశేషము. ఆమె నడుము నాకాశముతో పోల్చుటవలన దాని శూన్యత్వము (సూక్ష్మత), గుబ్బలను కొండలతో పోల్చుటవలన దాని సమధికౌన్నత్యమును వ్యక్తములగుచున్నవి. ఇందు క్రమ, శ్లేషా, తిశయోక్త్యలంకారములు కన్పట్టుచున్నవి. ఇట్లీపద్యరత్నము చమత్కారార్థములకు నెలవై యలరారుచున్నది.

1?. మ॥ విహరించున్ మలయానిలంబిచటఁ దావింజిల్కి నెమ్మేనియా
విహరించున్ బికనాదముల్ చెవికిఁ గావించుంజవుల్ పోదమా
సహకారాళిపదంబుఁ జూడఁగ వయస్యాహాళి వాటిల్లెడున్
సహకారాళిపదంబుఁజూడఁగ వయస్యాహాళియానేకదా ! 36

36 వి, వి. .... ద్వి అ.

ఈపద్యమునందు శబ్దార్థచమత్కారములు రెండును కూర్పఁబడినవి, నందాచ్యప్సరసలు చతురోక్తులతో మలయానిలమును ప్రశంసించుచున్న సందర్భములో నీపద్యము చెప్పఁబడినది, ఆ వనములో మలయపవనము స్వేచ్ఛావిహారముసల్పును. ఆవనమున పరిమళమును వ్యాపింపఁజేయుచు శారీరకతాపమును పోఁగొట్టుచున్నది. తాపోపశమనమునకు చల్లఁదన మవసరము, మలయానిలము తాపమును హరించుచున్నదని చెప్పుటనుబట్టి యది చల్లఁగనున్నదని గ్రహింపనగును. మలయానిలమనుటవలన నది మలయపర్వతమునుండి వచ్చినదని తెలియుచున్నది మలయపర్వతము దక్షిణదిశయందుండును. అందు చందనతరువులుండుటను దక్షిణదిశనుండి వచ్చిన గాలి చల్లఁగనుండుట సహజము. చందనతరువులున్న మలయపర్వతమునుండి వచ్చుపవనమగుటచే దానికి శైత్యత్వముతోపాటు సౌరభత్వము గూడ సంక్రమించినది. పరిమళము సంహరించుట వాయుసహజస్వభావము గనుక వివిధపుష్పపరిమళములను గూడ నా పవనము సంగ్రహించి యున్నకారణమున నది వాసనావాసితమై రావింపఁగలిగినది. వాయువు పరిమళభరితమైయెంత చల్లఁగనున్నప్పటికి నడమెల్లఁగ వీచినకాని సుఖదాయకము కాఁజాలదు. మందమందసంచారముగూడ మలయపవనలక్షణమే, చల్లఁదనము, మెల్లఁదనము, తావియును కలిగియున్న కారణముననే యా మలయపవనము శారీరక తాపమును పోఁగొట్టఁగలుగుచున్నది. మఱియు నుత్తమకావ్యమందు పవనముయొక్క శైత్య, మాంద్యత్వ, సౌరభత్వములను వర్ణించవలెనను నాలంకారిక నియమము గలదు. ఆ నియమమునుగూడ పాటించినట్లే చేమకూర వేంకటకవి యిందు మలయానిలమును చమత్కారముగ వర్ణించినాఁడు. ప్రథమ ద్వితీయ పాదముల మొదట "విహరించున్" అను పదమును వాడుటవలన శబ్దచమత్కారము కానవచ్చుచున్నది. రెండవపాదములో మొదటనున్న "విహరించున్" అను చోట పూర్వపదసంబంధమును బట్టి "నెమ్మేని + ఆవి + హరించున్"

అని విడఁదీసికొని యర్థము చెప్పినచో నీచమత్కారము కానవచ్చును. అవి, యనఁగా నిచ్చట 'తాపము' అని యర్థము. నైఘంటికులు కూడ నీశబ్దమునకు తాపమను నర్థమునిచ్చి వేంకటకవియొక్క యీప్రయోగ మునే దృష్టాంతముగ నిచ్చియున్నారు.[37] ఇచ్చట "తా + విన్ + చిల్క, ఆ + వి + హరించున్" అని విరిచినచో మఱొక చమత్కార విశేషము కానవచ్చును. "విహరించున్" అనుచోట 'వి' యను నక్షర మును పరిత్యజించినచో 'హరించున్' అను పదము మిగులును. ఈ పద్య ములో మూఁడు నాల్గు పాదములందు విశేష చమత్కారము కన్పట్టు చున్నది. తృతీయపాదమునందలి చివరిపదముదప్ప మిగిలిన పదము లన్నియు చతుర్థపాదములో పునరుక్తములై చమత్కారార్థముల నిచ్చు చున్నవి. ఇచ్చట రమణీయశబ్దపునరుక్తివలన శబ్దచమత్కారము గోచ రించుచున్నది.

*మూఁడవపాదమునందలి పదముల యర్థములు :-*

సహకార = తియ్యమామిడి చెట్లయొక్క, ఆళి = సమూహముతో (పంక్తితో) కూడియున్న, పదంబున్ = స్థానమును (తోటను), చూడఁగ, వయస్యా = చెలీ ! హాళి = ఆసక్తి, పెంటిల్లెడున్ = కలుగును. అనఁగా తియ్యమామిడిచెట్ల వరుసలతో కూడియున్న తోటను చూడఁగ నాసక్తి కలుగునని యభిప్రాయము.

*నాల్గవపాదముయొక్కయర్థము :-*

స + హకార = హకారముతో కూడిన ఆళి + పదంబున్ = 'ఆళి' యను పదమును, చూడఁగ, వయస్యా = చెలీ !, హాళి + ఔనేకదా =

37 శ. ర. ... బహుజనపల్లి సీతారామాచార్యులుగారు .... పు. 63

'హాళి' యను పదమగునుగదా ! అనఁగా 'హ' యను నక్షరముతో కూడిన 'ఆళి' యను శబ్దము 'హాళి' యను పదమగునని యభిప్రాయము.

మఱొక యర్థము :-

సహకార = సహాయము చేయునట్టి, ఆళి = చెలికత్తెలయొక్క, పదంబున్ = స్థానమును, చూడఁగ, వయస్యా = చెలీ ! హాళి + ఔనే కదా = ఆనందము కలుగునుగదా ! అనఁగా సహకరించునట్టి చెలికత్తెల స్థానమును చూడఁగా నానందము కలుగునని యభిప్రాయము

ఇంకొక చమత్కారార్థము :-

సహకార = తియ్యమామిడి చెట్లయందలి, అళి = తుమ్మెదల యొక్క, పదంబున్ = పాటను (గానమును), చూడఁగ నానందము కలుగునుగదా ! తియ్యమామిడి చెట్లయందు సంచరించు తుమ్మెదల ఝుంకార నాద మానందదాయకముగ నున్నదని యభిప్రాయము. ఇందు శబ్దార్థ చమత్కారముల ప్రతినిధులై యమకశ్లేషాలంకారము లొప్పియున్నవి. దీనితరువాత నున్నపద్యములో "అని యితరేతర చతురోక్తి నిగుంఫన మెఱయ" అని చెప్పుటంబట్టి యీపద్యము చతురోక్తిమయమని తెలియు చున్నది. నంద, లలిత, పద్మ, సౌరభేయి, సమీచియను నప్సరసలు పరస్పరము మేలములాడుకొనుటను వర్ణించు నన్నివేశములో నొక్కొక్క రొక్కొక్క వాక్యము మాట్లాడినట్లైదుగురికి నైదువాక్యముల నీపద్యములో కూర్చుట మఱొకవిశేషము. ఇట్టియుత్తమపద్యము చమత్కారకేంద్ర మనఁ దగియున్నది.

13 ఉ॥ కన్నులుదీర్ఘముల్; నగుమొగంబపురా! తలకట్టు తమ్మిపూ
పున్నమచందమామలకు: బొక్కిలిచక్కఁదనంబుఁజెప్పఁగా
సున్నదె? మేలుబంతులుపయోధరముల్; మఱికౌనుసున్నయౌ
నెన్నికకెక్కఁబ్రాఁతఫలమవ్వరవర్ణినికిన్ నిజంబుగన్ [38]

చేమకూర వేంకటకవియొక్క చమత్కారయుక్తకవితాప్రతిభకీ పద్య మొక చక్కనినిదర్శనము. ఇంగవిచారితరమణీయమైన చమత్కారము కానవచ్చుచున్నది. ఇందువాడఁబడిన కొన్ని సుప్రసిద్ధపదములకు సామాన్య విశేషార్థములురెండును వచ్చుటయొకచమత్కారము. ఇట్టిశ్లేషచమత్కారము లను సమర్థులైన కవులు సామాన్యముగసాధింతురు. అట్టి ప్రసిద్ధశబ్దముల కిచ్చట రెండర్థములను లోకప్రసిద్ధములైనవానిని సాధించుట మఱింతచమ త్కారము. సుందరాంగియగు సుభద్రయొక్క వివిధావయవములను మనో హరములగునుపమానములతో కవియిందు చక్కఁగ వర్ణించియున్నాఁడు. ఆమె నేత్రములు పొడవుగ, నగుమొగముపద్మమువలె పూర్ణిమాచంద్రుని వలెను, నాభిచక్కఁగను, కుచములు బంతులవలె, నడుము శూన్యమైయున్న వనియీవర్ణనముయొక్కసారాంశము. ఇందుదీర్ఘము, తలకట్టు, పొక్కిలి, బంతి, సున్న, వర్ణిని యనుప్రసిద్ధపదములు శ్లేషించినవి. కన్నులుదీర్ఘము లనుటవలననామె యాకర్ణాయతనేత్రయని తెలియనగును. తలకట్టనఁగా తలపైచుట్టఁబడిన వస్త్రముయొక్కకట్టనియర్థము. తలపాగయనియభిప్రా యము. ఆమెనగుమొగము తమ్మిపూవును పున్నమచందమామనుమించి యున్నదని యీపదప్రయోగమునుబట్టితెలియుచున్నది, నవ్వినప్పుడు ముఖము వికసించినట్లుకానవచ్చును. కనుకనగుమొగమును వికసితారవిందము తోను, పున్నమచందురునితోను పోల్చుటలో చమత్కారవిశేషము కానవచ్చు చున్నది. ఆ వరవర్ణినికి బ్రహ్మవ్రాసిన వ్రాఁతఫలము నిజముగ గణనీయ

38 వి.వి. ద్వి. ఆ. ప. 104.

మైనదని చివరిపాదములో చెప్పఁబడిన యభిప్రాయమునకనుకూలముగ పై మూఁడుపాదములును కూర్పఁబడినవి. ఆంధ్రభాషావర్ణములకుచెందిన సంప్రదాయసిద్ధలేఖనపద్ధతి యర్థాంతరముచే నిందుకొంతవఱకు చక్కఁగ సూచింపఁబడినది. దీర్ఘము, తలకట్టు, పొక్కిలి (గుడి), మేలుబంతులు (పంక్తులు), సున్న యనునవి వ్రాఁతకుసంబంధించినవిశేషములుగ గ్రహింపనగును. దీర్ఘములు, తలకట్టులు, గుడులు. అనుస్వారములు మున్నగు వానిని గుండ్రనియక్షరములకుచేర్చి యొరవడివ్రాఁతను పంక్తులుగ తీర్చి దిద్దుట మనసంప్రదాయము. సున్నను శూన్యమునకుచిహ్నముగ భావింతురు. లేదు అనునర్థములో సున్నను నిత్యవ్యవహారములోకూడవాడుచున్నాము. వర్ణశబ్దమునకు రంగు, అక్షరమునను ప్రసిద్ధార్థములు రెండును గలవు. వరవర్ణినియనఁగా శ్రేష్ఠమైన శారీరకచ్ఛాయగలదనియొక యర్థము, శ్రేష్ఠములైనయక్షరములతోఁగూడిన నామముగలదని రెండవయర్థము, సుభద్ర వరవర్ణినిఁగనుకనే బ్రహ్మవ్రాసినవ్రాఁతఫలమామెకతిశయించినది. ఆ వరవర్ణాంచితమైనవ్రాఁత యామెనేత్రాద్యవయవములలో దీర్ఘాదులరూపమున భంగ్యంతరముచేత కానవచ్చునట్లుచేయుట యిచ్చటిచమత్కారాతిశయము. ఈచమత్కారవిశేషములను విన్యసింపఁజేయుచున్న శబ్దములిందుప్రసిద్ధములైన ప్రకృతాప్రకృతార్థములనిచ్చునట్లు కూర్పఁబడుట మఱొకవిశేషము, ఈచమత్కారార్థములవిచారితస్థాయిలోనే యిచ్చట గోచరించుచున్నవి. ఇందు దీర్ఘాదిశబ్దములు శ్లేషించుటవలన శ్లేషాలంకారముకలదు. అర్థాంతరములో కన్నులకు దీర్ఘములకు, పయోధరములకు బంతులకు. కౌనునకు సున్నకును భేదవర్ణనముచేయఁబడుటచేత రూపకాలంకారము కలదనవచ్చును. ఇట్టిచమత్కారావహరచనాపాటవమువలన సుభద్రాసహజసౌందర్యము రాశీభూతమై నిరుపమస్థాయిలోనియేకైకపద్యమునందు కానవచ్చుచున్నది.

4 తే॥ భ్రమరకమనోహరంబౌటఁబద్మమగును,
తారకాహృద్యమగుట సుధానిధియగు,
రెంటిజగడాలు మోముసనంటియుంట
నబ్జముఖియంతలెస్సయీయలరుఁబోఁడి. 39

వేంకటకవియొక్క యమృతలేఖినినుండి వెలువడిన చతురచమత్కార యుతపద్యరాజములలో నిదియొకటి. రూపముననిది చిన్నదైనను గుణమున మిన్నయైయున్నది. కవియిందు సుభద్రాముఖమును చమత్కారముగ వర్ణించినాఁడు. ఇందుశబ్దార్థచమత్కారములు రెండునిమిడియున్నవి. ఆమె ముఖము పద్మము, చంద్రుఁడునై యున్నది తుమ్మెదలచేమనోహరముగ నున్నకారణమున నది పద్మమగును. ముఖమేపద్మమైనచో తుమ్మెదలైన వేవి ? యనుసంశయము కలుగును. ఆసంశయమును తొలగించుటకై శ్లేషఘటితమైన భ్రమరక, శబ్దమునుకవివాడినాఁడు. భ్రమరకశబ్దమునకు తుమ్మెదలు, ముంగురులనను రెండర్థములుగలవు. ఈయర్థాంతరమువలన ముంగురులే తుమ్మెదలైనవని భావింపవగును. ముంగురులను తుమ్మెదల తోపోల్చి వర్ణించుట కవిలోకమర్యాదయైయున్నది తుమ్మెదలవలె ముంగురులటునిటు సయ్యాటలాడుచు ముఖపద్మమునకందముఁ జేకూర్చుచున్నవి. ఇట్లు భ్రమరకములచే మనోహరమైయున్నకారణమున నామెముఖము పద్మమైయున్నది. మఱియు నక్షత్రములకు మనోహరమైయున్నకారణమున నది చంద్రుఁడుకూడనైయున్నది, నక్షత్రములకు ముఖమునకును సంబంధమేమున్నదనుసందేహమిచ్చుటకలుగును. కనుకనే 'తారకా' శబ్దమునువాడి యర్థాంతరముచేత తత్సంశయనివారణముకావించినాఁడు. తారకాశబ్దమునకు నక్షత్రము, కంటినల్లగ్రుడ్డు ననునర్థములుగలవు. ఈకనీనికలే నక్షత్రములుగ భాసించుచున్న కారణమున ముఖచంద్రుఁడు తారకాహృద్యుఁడైనాఁడు.

39 వి. వి. ద్వి. ఆ. ప. 105.

ఇచ్చటఁ 'సుధానిధి' యని ప్రయోగించుటవలన చంద్రుఁడమృతమునకు నిధియైనట్లే యామెముఖముకూడ నధరామృతమునకు నిలయమైనట్లు ధ్వనించుచున్నది. ఆమెముఖమేపద్మము, చంద్రుఁడునై నట్లుచెప్పఁబడినది. ఈయిరువురికి సహజవిరోధముకలదు. చంద్రోదయమగుసరికి పద్మము ముకుళించును పద్మవికాససమయమగుసరికి చంద్రుఁడ స్తమించును. ఇద్దరుశత్రువులొకచోట సమరసభావముతోనుండలేక జగడములాడుటసహజము. అట్లే సహజవైరముున్నకారణమున నిచ్చట పద్మచంద్రులిరువురును జగడములాడఁజొచ్చిరి. సుభద్రను పద్మముఖియనవలెనని పద్మము, చంద్రముఖియనవలెనని చంద్రుఁడును వాదులాడఁజొచ్చిరి అట్లారెండిటి జగడాలామెమోమున నంటియున్నవి. ఇందుఁజగడాలు, అనుచోట 'జగ+డాలు' అని విడఁగొట్టుకొనినచో సభంగశ్లేషవలన 'ఉత్కృష్టమైనకాంతి' యను చమత్కారార్థమువచ్చును. పద్మచంద్రులిరువురియొక్క యుత్కృష్ట కాంతులామె ముఖమునంటియున్నవని యభిప్రాయము. ఆరెండిటితగవులాటను తీర్చుటకై యామెముఖమును 'అబ్జముఖి' యనుటలెస్సయని కవి చివరిపాదములో పేర్కొనియున్నాఁడు. పద్మమును, చంద్రునికూడ దృష్టిలోనిడుకొని యిందు 'అబ్జ' శబ్దమును ప్రయోగించినాఁడు. అబ్జమనఁగా పద్మమని ప్రసిద్ధార్థము. 'నీటినుండిపుట్టినది' (అప్+జ) యను యౌగికార్థమునుబట్టి యీయబ్జశబ్దము చంద్రునిఁగూడ సూచించుచున్నది. చంద్రుఁడుకూడ నీటినుండియేపుట్టినాఁడుగనుక నబ్జశబ్దమతనికికూడ నిచ్చట వర్తించును. అట్లాపద్మచంద్రులిరువురికిని సరిపడునట్లు చెప్పుటవలన జగడములు సమసిపోయినవి. ఇట్టి మహోన్నతచమత్కారవిలసితముగ 'అబ్జముఖి' యను ప్రయోగముచేసి యాత్మకవితావిఖ్యాతికి కారకుఁడైనాఁడు. ఈ పద్యములో భ్రమరకలారికాశబ్దములు, జగడాలు, అబ్జముఖ యను శబ్దములను చక్కఁగా శ్లేషించుటచేత శ్లేషాలంకారము, తృతీయ చతుర్థపాదములలో పూర్ణబిందు పూర్వకటవర్ణము చమత్కారజనకముగ

మాటిమాటికి వచ్చిన కారణమున వృత్త్యనుప్రాసమను శబ్దాలంకారమును గలవు. ఇట్టీపద్యము చమత్కారములకు నెలవై వెలయుచున్నది.

15. ఉ॥ చక్కెరకెంపు మోవిఁగని సారెకుఁజిల్క మొగంబువేఁడగాఁ
జొక్కపుఁ జిల్వ కప్పుజడఁజూచి మయూరములఱ్ఱుసాఁపఁగాఁ
జక్కని తమ్మిపూవడుగుజాడలఁ గన్గొని రాజహంసముల్
త్రొక్కుడుపాటు చెందఁగ వధూమణి వచ్చుటలెంచు
నెమ్మదిన్. 40

ఈ పద్యమునందలి చమత్కారము విచారితరమణీయస్థితిలో కానవచ్చుచున్నది. పరిశీలనాత్మక దృష్టితో కొంచెమాలోచించిన నిందలి చమత్కారాతిశయము వ్యక్తమగును. సుభద్రపెంపుడుచిలుక యామె యొక్క యరుణమైన మధురాధరమును చూచి యామె ముఖమును వేఁడఁ జొచ్చినది. చిలుకకు దొండపండుపై ప్రీతిమెండు. ఆమె పెదవినిఁజూచి దొండపండను భ్రాంతితో దానిని తినఁగోరి యాచిలుక యామెముఖమును వేడ కొనినది. 'చక్కెరకెంపు' అనుచోట నెర్రచక్కెరయను నర్థమును వేదము వేంకటరాయశాస్త్రిగారు, బులుసు వేంకటరమణయ్యగారును తమ విజయవిలాసవ్యాఖ్యలలో వ్రాసియున్నారు. ఆమెపెదవి చక్కెరవలె మధురముగను, దొండపండువలె నెఱ్ఱగను నున్నదని ధ్వనింపఁజేయుట చమత్కారము. నీలమైన యామె నల్లజడను చూచి నల్లత్రాచను భ్రాంతితో దానిని తినఁగోరి నెమలి మెడచాచినది. మయూరమునకు నల్లత్రాచిష్టమైన యాహారము. 'చిల్వకప్పుజడ' యనఁగా త్రాచువలె నల్లఁగనున్న జడ యని యర్థము. కేవలము రంగులోనేకాక దీర్ఘాకృతిలోను, వక్రచాలనము లోఁగూడ నామె వేణి చిల్వను పోలియున్నది. కనుకనే దానిని చూచుట

40 వి. వి. — తృ ఆ. — ప. 7

తోడనే మయూరమునకు సర్పభ్రాంతి కలిగి తినవలెనను కోరిక గలిగినది. ఆ సుందరాంగియొక్క పద్మములవంటి పాదముల జాడలను చూచి రాయంచలు త్రొక్కుడు పడినవి. అవి యామె కోమలపాదములను చూచి పద్మములను భ్రాంతితో వానిని తినుటకై త్రొక్కువడఁజొచ్చినవి రాజహంసలకు పద్మము ప్రీతికరమైన యాహారము. అట్టి చక్కని యాహారము కనిపించినపుడు దానిననుభవించుట కొఱకు త్రొక్కుడువడుట సహజము. ఆమె పాదములు పద్మముల, నామె నడకలు రాయంచల నడకలను బోలియున్నవని సూచించుట యిందలి చమత్కారము. "తమ్మిపూవడుగు జాడలఁ గన్గొని" యని వర్ణించుటను బట్టి యామె పాదములు పద్మచిహ్నములతో కూడియున్నవని తెలియుచున్నది. ఉన్నతవంశసంజాతలకట్టి పాదచిహ్నము లుండునని కవులు వర్ణింతురు సుభద్ర పద్మినీజాతి స్త్రీయని, యర్జునుఁడు చేఁబట్టుటకామె యోగ్యురాలనియు నిచ్చట చమత్కారముగ ధ్వనింపఁజేసినాఁడు. చిలుకవేడుట, మయూరము లఱ్ఱులుసాచుట, రాయంచలు త్రొక్కుఁడువడుట యను సంచలనాత్మకసన్నివేశములను బట్టి యర్జునుఁడామె రాకలనెంచినాఁడు. అతఁడామెను స్మరించుచు నామె రాక కెదురుచూచుచున్నాఁడని యభిప్రాయము. ఈ పద్యములో మొగంబు వేడుట యఱ్ఱుసాచుట, త్రొక్కుడుపాటు చెందుట, యను ప్రయోగములు సాభిప్రాయములుగ వాడఁబడుట మఱొక చమత్కారము. మాట్లాడఁ గలిగినప్పుడే వేడుకొనవీలగును. చిలక చక్కఁగ పలుకఁగలదు గనుక నది వేడుకొనినట్లు చెప్పఁబడినది. అసలు చిలుకల యందము వాని పలుకులలో కానవచ్చును. మెడలు నిగిడించుట మయూరముల స్వభావము. మెడలు నిగిడించినపుడే వానియందములు కానవచ్చును గనుక నవియఱ్ఱులు సాచినట్లు చెప్పఁబడినది. అట్లే త్రొక్కుళ్లువడుట రాయంచల స్వభావము. త్రొక్కుడు పడుచున్నప్పుడే వానియందములు కానవచ్చునుగనుక నవి త్రొక్కుడుపాటు చెందినట్లు చెప్పఁబడినది. ఈ చమత్కారములాలోచన వలన గోచరించును

గనుకనివి విచారితరమణీయములై యలరారుచున్నవి. ఇందు భ్రాంతిమద లంకారముగలదు.

మఱియు తృతీయాశ్వాసమునందు చెప్పఁబడిన మన్మథ, మలయానిల, చంద్ర, కోకిలాద్యుపాలంభనాత్మకపద్యములన్నియు నేదోయొక విధమగు చమత్కారముతో కూడియున్నవి. అవి చమత్కారమయములని యాపద్యముల తరువాతనున్న వచనములో "అని బహూకారని కారమమకార చమత్కారంబులు కానంబడ"41 అని గ్రాకవీంద్రుఁడే సూచించియున్నాఁడు. విజయవిలాసము నందలి పద్యములన్నియు చమత్కారభరితములై యున్నవి. "ప్రతిపద్యమునందుఁజమత్కృతి గలుగం జెప్పనేర్తువు" అని కృతికర్తయు, సరసకవియునైన రఘునాథనాయకుఁడు చేమకూర వేంకట కవిని గూర్చిచేసిన ప్రశంస సత్యసముదంచిమైయున్నది. స్థాలీపులాకన్యాయముగకొన్ని పద్యములను మాత్రమిందు పరిశీలించియున్నాను.

## శ్లేష యమక వ్యంగ్య రీతులు

చేమకూర వేంకటకవి తన విజయవిలాసమును శ్లేష యమక వ్యంగ్యరీతులతో నింపియున్నాఁడు. శ్లేషగాని, యమకముగావి, వ్యంగ్యము కాని లేని పద్యమొక్కటియు విజయవిలాసమున లేదనిచెప్పుట యతిశయోక్తి గానేరదు. శ్లేషయమకరీతులందతఁడు చూపిన నైపుణ్యము నిరుపమానమైనది. కనుకనే శ్లేషయమకచక్రివర్తియను పండితప్రశంస యతనికి సార్థకమైనది. అతని సుభంధసుందరికారెండలంకారములు ననుమభూషణములై యలరారుచున్నవి. అతఁడు సరసరీతులలో సాధించిన శబ్దార్థచమత్కారములకవి పూలకందకములైనవి. ఆ కవీంద్రుని మనోహరకవితా శిల్పమున కవి యపూర్వశోభను జేకూర్చినవి. అతనికిఁ బూర్వము పదు

41. వి. వి. .... తృ. ఆ. — వ. 60.

నాలవ శతాబ్దములో భట్టుమూర్తి యా రెండలంకారములను దనవసుచరిత్రలో సర్వాంగసుందరముగఁ జిత్రించి శ్లేషయమకచక్రవర్తి యను ప్రఖ్యాతినిఁబడిసియున్నాఁడు. కొన్ని సన్నివేశముల యందతనికి మించిన స్థాయిలో నాయలంకారముల యొడుపులను దేటతెనుఁగు పదములలో విచిత్రముగఁ బ్రదర్శించి తత్తుల్యప్రశంసకుఁ బాత్రుఁడైనాఁడు.

శ్లేష :- ఇది యర్థాలంకారములలో ముఖ్యమైనది. కవుల పాండితీ ప్రకర్షకిది యొకనిదర్శనము. పాఠకుల యవగాహనశక్తిపై దీనివిలువలాధారపడియుండును. భోజుఁడు దీనిని శబ్దాలంకారముగఁ బరిగణించియున్నాఁడు. "శ్లిష్టమిష్టమనేకార్థమేకరూపాన్వితంవచః" [1] అని దండిశ్లేషాలంకారలక్షణమును దెల్పియున్నాఁడు. ఇష్టమై యనేకార్థప్రతిపాదకమై, యేకరూపయుతమైన వాక్కు శ్లేష మనఁబడునని యతని యభిప్రాయము.

"ప్రకృతాప్రకృతోభయగతముక్తంచే చ్ఛబ్దమాత్ర సాధర్మ్యమ్
శ్లేషోఽయం శ్లిష్టత్వం సర్వత్రాప్రివ్యత్వయేనాస్త్యే" [2]

అనివిద్యానాథుఁడు శ్లేషలక్షణమును జెప్పియున్నాఁడు. కేవలప్రకృతములకుఁ గాని కేవలాప్రకృతములకుఁ గాని శబ్దమాత్రసామ్యనముంచుటయని యభిప్రాయము. ప్రకృతశ్లేషయందు, అప్రకృతశ్లేషయందును విశేషణవిశేష్యములు రెండును శ్లేషించును. ఉభయశ్లేషయందు విశేషణములు మాత్రమే శ్లేషించును. ఒచ్చట విశేష్యముఁ గూడ శ్లేషించినచో శబ్దశక్తిమూలధ్వని యగును. దీనినిబట్టి శ్లేషాలంకారము ప్రకృతశ్లేష, అప్రకృతశ్లేష, ఉభయశ్లేషఅని మూఁడువిధములుగ విభజింపఁబడినట్లు తెలియుచున్నది. "శ్లేషోఽనేకార్థ కథనం పదేనైకేన కథ్యతే, పదక్రియాకారకైః స్యాద్భిన్నైర్నైః సషడ్విధః" [3]

1. కా. ద. — దండి ద్వి. ప. — శ్లో 310
2. ప్ర. రు. — వి. నా అ. ప్ర. ... P. 314
3. స. కం. భ .... — చ ప. — శ్లో. 85

అని భోజుఁడు దీని లక్షణమును స్పష్టప్రతిపత్తితోఁ జెప్పి దీని నాలువిధములుగ విభజించియున్నాఁడు ఒకపదముచేత ననేకార్థములు చెప్పఁబడుటను శ్లేషఅందురని యతని యభిప్రాయము. అతఁడు పేర్కొనిన షడ్విధశ్లేషలు :- 1. భిన్నపదశ్లేష 2. అభిన్నపదశ్లేష 3. భిన్నక్రియాశ్లేష 4. అభిన్నక్రియాశ్లేష 5. భిన్నకారకశ్లేష 6. అభిన్నకారకశ్లేష. "స్వభావముచేత నేకార్థకములైన శబ్దములచే ననేకార్థములను వచించుటశ్లేష" 4 అని వేదము వేంకటరాయశాస్త్రిగారు చెప్పియున్నారు సహజముగ నేకార్థబోధకములైన శబ్దములచేత ననేకార్థములను జెప్పుటయని శాస్త్రిగారి యభిప్రాయము

"ప్రకృతము లప్రితంబులుఁ
బ్రికృతాప్రితములు శబ్దపాటవమాత్ర
ప్రకటిత సామ్యముఁజెందిన
నకలంకత శ్లేషమయ్యె .... .... 5

అని భట్టుమూర్తి శ్లేషలక్షణమును జెప్పియున్నాఁడు. ప్రకృతములుగాని యప్రకృతములుగాని, ప్రికృతాప్రతములుగాని శ్లేషించుట శ్లేషమనఁబడునని యతని యభిప్రాయము. దీనినాంగ్లభాషలో Pun, paronomasia అను పదములతో వ్యవహరింతురు. It was the banner of their talents"6 అని యీ యలంకారమును గవుల కవితాసామర్థ్యములకెత్తిన పతాకముగా రాఘవన్‌గారు పరిశంసించియున్నారు.

శ్లేషః పుష్ణాతి సర్వాసుప్రాయో వక్రోక్తిషు శ్రియమ్" 7 అని దండి

4. ఆం. సా. ద. .... వే. వే. శా. .... ద. వ. P. 333 .... కారిక 707
5. కా. అ. సం. — భ. మూ. — వం. అ. — వ. 161
6. S. C. A. S. Dr. RaghaVan P. 78
7. కా. ద. — దండి — ద్వి. ప — శ్లే. 268

యీ యలంకారము సమాసోక్త్యనుల్లసితమైన శ్లేషాలంకారములలో నుత్కృష్టమైనదను నభిప్రాయమును ప్రకటించియున్నాఁడు. "శ్లేషోఽక్లిష్టః" అని బాణుఁడు తన హర్షచరిత్రమునందుఁ జెప్పిన పద్ధతినిబట్టి శ్లేషప్రభావము వలన వచ్చు ననేకార్థములు సులభముగ స్ఫురింపవలెనని తెలియుచున్నది.

"ఒకటి వినుట చేత ననేకార్థములను ప్రతిపాదించుట శ్లేషము, అదియును ననేకధర్మపురస్కారముచేత, నేకధర్మపురస్కారముచేతను రెండు విధములు. అందు మొదటిది రెండువిధములు. అనేక శబ్దప్రతిభానద్వారాను. ఏకశబ్దప్రతిభానద్వారాను అని. ఇట్టి శ్లేషములో రెండువిధములు అందు మొదటి దానిని సభంగశ్లేష అనియు. రెండవదానిని అభంగశ్లేష అనియు నందురు. మూఁడవది శుద్ధశ్లేష. ఇట్లు ఇవి మూఁడు విధములైనను ప్రకృతమాత్రములు అప్రకృతమాత్రములు, ప్రకృతాప్రకృతోభయములను ఆశ్రయించుటచేత మరల మూఁడువిధములు. అందు ప్రకృతమాత్రాశ్రితశ్లేషలోను, అప్రకృతమాత్రాశ్రితశ్లేషలోను విశేష్యవాచకపదము శ్లేషయుక్తముగా వచ్చును కాకపోవచ్చును కూడ. ప్రకృతాప్రకృతోభయాశ్రయములలో మాత్రము విశేషణవాచకపదములే శ్లేషయుక్తము కావలయును గాని విశేష్యవాచక పదము శ్లేషయుక్తము కారాదు అట్లైనచో శబ్దశక్తిమూలధ్వని యుచ్ఛిన్నము కావలసివచ్చును. విశేషణములు మాత్రము శ్లిష్టములుగా నున్నదానికిఁ గూడఁ బ్రకృతాప్రకృత ధర్మములను స్వీకరించినప్పుడే శ్లేషము. ప్రకృతధర్మినిమాత్రము స్వీకరించినప్పుడైతే అది సమాసోక్తికే విషయము. ఇట్లు ఎక్కడ ప్రకృతమాత్ర విశేష్యకానేకార్థవిశేషణము ఉండునో అదియొకటి ఇట్లు అప్రకృతమాత్రవిశేష్యకానేకార్థవిశేషణమున్నచోట రెండవది. వేఱుగా నుపాత్తమైన ప్రకృతాప్రకృతోభయ విశేష్యకనానార్థవిశేషణమున్నది మూఁడవది." [8] అని శ్లేషలక్షణమును,

8 సా, సౌం, ద, .... చ, గ, శాస్త్రి, ... పే. 654

పీయములో సభంగసంస్కృతశబ్దశ్లేషను, సభంగాంధ్రశబ్దశ్లేషను, సభంగోభయభాషాశబ్దశ్లేషను, సంస్కృతభాషార్థశ్లేషను, నాంధ్రభాషార్థశ్లేషను విరివిగా వాడియున్నాఁడు. కొన్ని సందర్భములలో శబ్దార్థ శ్లేషలతో నిమిత్తము లేకుండ శబ్దార్థాన్వయభేద సంగతులను బట్టి యీ సూరనార్యుఁడు విచిత్రశ్లేషలను వెలయించినాఁడు. మొత్తముమీద నీపద్యములో నతఁడాఱు శ్లేషలను బేర్కొనియున్నాఁడు. భట్టుమూర్తి తన వసుచరిత్రలోను, చేమకూర వేంకటకవి తన విజయవిలాసములోను శ్లేషచమత్కారవిశేషముల నతివేలస్థాయిలోఁ బ్రదర్శించియున్నారు.

రసపుష్టికి, కథాగతికి, నౌచిత్యమునకును భంగము గలుగకుండ వేంకటకవి తన విజయవిలాసములో శ్లేషచమత్కారముల నతిసులభముగ సాధించియున్నాఁడు. అది యతని మహనీయకవితాశక్తికి నిదర్శనము ఇతరులకుఁ బ్రయత్నసాధ్యములైన శ్లేషరీతులతని కప్రయత్నసాధ్యములైనట్లు కానవచ్చును. రామరాజభూషణాదికవీంద్రులు సంస్కృత పదములందధికశ్లేషచమత్కారములను బ్రదర్శింపఁగా నితఁడచ్చతెనుఁగు పదముల విరుపులలో విచిత్రశ్లేషలను సాధించి తన యద్వితీయకవితా సామర్థ్యమును బ్రకటించుకొనినాఁడు. శ్లేషను దనవశము గావించుకొని తాననుకొనిన పద్ధతిలో దానిచే నాకర్షకవిన్యాసములు వెలయింపఁ జేసినాఁడు. విజయవిలాసమునందుఁ గానవచ్చు శ్లేషలను గొన్నిటినిఁ బరిలింతము.

1. ఉ॥ నీసరియైన దేవతటినిం గలఁగించెద నీవడంపుమా

.... .... .... ...

.... .... .... ...

.... విష్ణుపదమున్ బలిపేతము ముట్ట నేటికిన్. 10

10 వి, వి, — ప్ర: ఆ. — ప. 5

అని విజయవిలాసకారుఁడు కోటకొమ్మలను, కందకమును వర్ణించిన సందర్భములో యుక్తియుక్తముగా వాడఁబడిన విష్ణుపద, బలిపీఠ శబ్దములు శ్లేషించినవి. విష్ణుపదము = విష్ణువుయొక్క పాదము, ఆకాశము. బలిపీఠము = దేవాలయములలోఁ గానవచ్చు బలిహారణపీఠము, పాతాళలోకము. ఔన్నత్యమునఁ గోటకొమ్మలాకాశమును, బాసలు చేసికొన్నపుడు సంప్రదాయానుగుణముగ దేవాలయమునందలి విష్ణుపాదమును ముట్టుటయు, నట్లే గాంభీర్యమునందుఁ గందకములు పాతాళలోకమును, బాసలు చేసికొన్నపుడు దేవాలయమునందలి బలిహారణపీఠమును ముట్టుకొనుటయును (రెండును) కేవలప్రస్తుతవిషయములే యైనవిగనుక దీనిని ప్రకృతశ్లేషగా భావింపనగును.

2, ఉ॥ ప్రాయపునాయకుల్ వెలనెపానసెగాదిగఁజూడ నేర్పులా
రాయిని ... .... .... ... .... .. ,, 11

అను పద్యమును శ్లేషమయముగ గావించినాఁడు. ఇందుఁబుష్పలావికల కంమువమాటలర్థాంతరస్ఫూర్తులతోఁ బొందుపఱుపఁబడినవి. పుష్పలావికలుపూలనమ్మెడు పాట్లాడిన తీరంతయు శ్లేషగర్భితమై చమత్కారావహముగనున్నది ఇందునాయకులు, వెల, దండ, సరసములను శబ్దములు శ్లేషించినవి. నాయకులు = రసికులైనవిటులు, ప్రభువులు, నాయకరాజులు. వెల = పూలదండయొక్కధర, సంగమమునకుఁదీసికొను వెల. దండ=పూలమాల, యాలింగనము సరసము = రససహితము, ప్రేమమయము, చౌక. తమకడకువచ్చిన విటుల సరసత్వమునకుఁ దగినట్లు సంగమసుఖములను దామిచ్చి సంతృప్తిఁ గలిగింతుమను పుష్పలావికల భావరహస్యమునిట శ్లేషాభాసముగఁ జేసికొని యీకవీంద్రుఁడు సూచించినాఁడు.

11. వి. వి. — ప్ర. ఆ. — ప. 14.

మఱియు నీపద్యములో మొదటి పాదామునందు "ఎగాదిగఁజూడ + నేర్పులు, ఎగాదిగఁజూడన్ + ఏప్పుల" అని రెండు విధములుగ విడఁదీసి చమత్కారార్థములు చెప్పుకొనుటకు వీలుగా సభగంశ్లేషగూడఁ గానవచ్చుచున్నది.

3. ఉ॥ ప్రాయపుఁ దెక్కెసన్ .... ... .... ....
నేయెడ నింపుగావు గణియింప సుభద్రయౌవిలాసముల్. 12

అను పద్యములో నుపమేయములుగఁ జెప్పఁబడిన సుభద్రయొక్క పలుకులకు, నేత్రములకు, స్తనములకు, నడకలకు, నుపమానములుగఁ జెప్పఁబడిన చిలుకలకు, చకోరములకు, చక్రవాకములకు, హంసలకును దగినట్లు చివరి లోకోక్తిలో 'వయః' అను శబ్దము శ్లేషగర్భితముగ వాడఁబడినది విశేషార్థసమన్వితమైన యాశబ్దమే యీ పద్యమునకుఁ బటుత్వమును చేకూర్చినది. వయః = వయస్సు, పక్షి. ఈ యర్థద్వయమునిచ్చు నీశబ్దము నిచ్చుటఁ గూర్చుటవలన సుభద్రాయౌవనవిలాసము, శుకచకోరాది పక్షుల విలాసములును సహసప్రతిపత్తితో వ్యక్తములగుచున్నవి.

4. చ॥ అతివనుచంబులున్ మెఱుఁగుటారును, వేనలియున్ ధరాధిపోన్నతియు నహీనభూతి కలసంబు ఘనాభ్యుదయంబు. 13

అను పద్యములో ధరాధిపాహీనఘనశబ్దములు శ్లేషించినవి. ధరాధిప + ఉన్నతి = రాజుయొక్క యున్నతి, పర్వతరాజుయొక్క యౌన్నత్యము; అహీనభూతి (న + హీనభూతి) = అధికైశ్వర్యము, అహి + ఇన + భూతి = సర్పరాజుయొక్క యైశ్వర్యము; ఘన + అభ్యుదయము = గొప్పదైన యభివృద్ధి, మేఘముయొక్క శోభయను నర్థవిశేష

12 ,, - ప, 33.
13 వి, వి, ప్ర, ఆ, ప, 34

ములను శ్లేషవలన సాధించి ప్రకృతవస్తువర్ణనమును శోభాయమానము గావించినాఁడు మఱియు నిటశ్లేష కాటపట్టులైన శబ్దముల నుపమాన బోధకములుగ వాడి యుపమేయవస్తువుల కపూర్వమైన పుష్టినిఁ జేకూర్చి నాఁడు. సుభద్రయొక్క కుచములు పర్వతరాజువలె సమున్నతములై యున్నవని, నూగారు సర్పరాజువలె నున్నదని, కొప్పు మేఘమువలె నున్నదనియును శ్లేషనాధారముగఁ జేసికొని సూచించియున్నాఁడు. 'అహీన' అనుచోట సభంగశ్లేష, మిగిలినచోట్ల శబ్దశ్లేషయుఁ గానవచ్చును.

5. క॥ చనుదెంచిన హా ! యనియ
జ్జననాయకుఁడలరుచున్ పిశారదుఁ గని యీ
యనుకూల మారుతాగతిఁ
గనుఁగొన నామోదసూచకం బైనదిగా. 14

అను పద్యమునందు శబ్దార్థశ్లేషలు రెండును గన్పట్టుచున్నవి.

అనుకూలమారుతాగతి = అర్జునుని కోరికకుఁ దగినట్లు లేక యలసటదీరుటకుఁ దగిన విధముగా గాలియొక్కరాక, గంగానది యొడ్డులనొరసికొనుచు వచ్చువాయువు; కనుఁగొనన్ = చూడఁగా, నేత్రముయొక్క చివరిభాగమునందు; ఆమోదసూచకము = సంతోషసూచకముగా, నంగీకారసూచకముగా, పరిమళసూచకముగా. ఈ చిన్నిపద్యము నందలి శ్లేషఘటితములైన యల్పపదములను బట్టి యనల్పార్థములను సాధించుచున్నాఁడు. శైత్యమాంద్యసౌరభాంచితవాయువే ప్రాణికోటికి హాయినిఁ జేకూర్పఁగలదు. అట్టి వాయువుగనుకనే యర్జునునిసంతోషమునకుఁగారణమైనది. గంగానదిమీదుగా వచ్చుచున్న కారణమున నా మారుతమునకు శైత్యత్వము, దానియొడ్డులను దాకివీచుచున్న కారణమున మాంద్యత్వము, నామోదసూచకమైనదని

14 ,, — ,, — ,, 53

చెప్పుటవలన సౌరభ్యము నున్నట్లు తెలియుచున్నది. ఈ త్రిగుణయుక్త మైనవాయువును ప్రబంధగౌరవము కొఱకు వర్ణింపవలసియున్నది గనుక నీసమయములోఁ గవియాపని గూడఁ దీరినాఁడు. ఈ విశేషార్థ సంపత్తి నంతను తన యసమానశ్లేషకవితాసామర్థ్యము వలన సాధించినాఁడు. ఆమోదశబ్దముకడ నర్థశేష, మిగిలినచోట్ల శబ్దశ్లేషమును గానవచ్చు చున్నవి.

6. ఉ॥ నాయమెనీకు మేల్పడిన నాతినలంచుట ...

తీయఁగఁ బంచదార వెనుతీయఁగఁబల్కినసున్

ద్వితీయఁగన్. 15

అను పద్యములో పంచదార, ద్వితీయయను శబ్దములు శ్లేషించియు లూచీ హృద్గతాభిప్రాయమును జక్కఁగ వ్యక్తీకరించుచున్నవి. పంచదార = చక్కెర, ద్రౌపది. ద్వితీయ = రెండవది, భార్య. పంచదార శబ్దము శ్లేషించుటలో నొక వైచిత్ర్యము గానవచ్చుచున్నది. ఈ పదమునందలి చకారమును దంత్యముగ నుచ్చరించినపుడు, చక్కెర యను నర్థము, తాలవ్యముగ నుచ్చరించినపుడు 'పంచపాండవుల భార్యయైన ద్రౌపది, యను నర్థమును వచ్చును ఈ చకారమును దంత్యముగ నుచ్చరించినపుడది తెనుఁగుపదము, తాలవ్యముగ నుచ్చరించినపుడు సంస్కృత పదమునగును. తెనుఁగుపదముగ నున్నపుడొక యర్థమును, సంస్కృత పదముగ నున్నపుడు మఱొకయర్థము నిచ్చుచున్నదిగనుక దీనిని సూర నార్యుఁడు చెప్పిన యాంధ్రసంస్కృతాభి భాషాశ్లేషగా భావింపవచ్చును.

7 మ. తనకుంగౌఁగిలి యీవొకప్పుడును నాథా : .... 16

అను పద్యములో శ్లేషచిత్రణము మనోహరముగఁ జేయఁబడినది

15 వి వి — ప్ర. ఆ. — వ. 94

16 వి. వి. .... ప్ర. ఆ. ... వ. 139

పద్మసూర్యుల సంబంధమును నాయికానాయకుల యనురాగముగ సుత్రేక్షించి తద్రూపమున చిత్రాంగదపై నర్జునున కేర్పడిన శృంగారభావమును సూచించుట కిందలి శ్లేష మిక్కిలి తోడ్పడినది. ఇందు కర, పద్మినీ, ద్విరేఫశబ్దములు శ్లేషించినవి. కరము = హస్తము, కిరణము. పద్మిని = తామరతీగ, పద్మినీజాతిస్త్రీ. ద్విరేఫములు = తుమ్మెదలు, రెండురేఫలు. 'ద్విరేఫాద్యంత దీర్ఘధ్వనుల్' అనుచోట శ్లేషప్రభావమువలన ద్విరేఫ దీర్ఘధ్వనులే (తుమ్మెదల దీర్ఘనినాదములే, రెండురేఫల దీర్ఘములే) 'రా, రా!, యను పిలుపుగఁ దోచినట్లు ఉత్ప్రేక్షించుటకుఁ జక్కని యవకాశము లభించినది. ఇట్లు వేంకటకవి కొన్ని సందర్భములలో శ్లేషచేత నితరాలంకారముల నుజ్జీవింపఁజేసినాఁడు.

8. చ॥ నెలయుదయించు నప్పుడల నీరజముల్ కుముదంబులౌను రేల్
కలువలదాయ రాకకుఁ బగల్ కుముదంబులు నీరజంబులౌ. 17

అను పద్యములోఁ బైపైకిఁ గానవచ్చు విరోధమునకు శ్లేషచేత నాభాసము గల్పించినాఁడు. ఇచ్చట నీరజ, కుముదశబ్దములు శ్లేషించినవి. నీరజములు = పద్మములు, పుప్పొడిలేనివి (ముకుళించుకొనిపోవునవి). కుముదములు = కలువలు, సంతోషహీనములైనవి. (ముడుచుకొనినవి). చంద్రుఁడు వచ్చినప్పుడు పద్మములు కలువలగుట, సూర్యోదయమైనపుడు కలువలు పద్మములగుటయును బరస్పర విరోధముగఁ గానవచ్చునుగాని కవియిచ్చట శ్లేషనాశ్రయించి యావిరోధమున కాభాసము గల్పించినాఁడు.

9. తే॥ కలదు లేదన నసియాడు కౌనుతీగఁ
దళుకు మొగమున కెగయు గుబ్బల బెడంగుఁ
జూచి యతని నిడు వాలుఁ జూపులపుడు
నిండు వేడుక మిన్నంది కొండఁ దాకె 18

17 ,, .... ,, .... ,, 142
18. వి. వి. — ద్వి. ఆ. .... ప. 20.

అను పద్యములోఁ జివరిపాదమునందు సూరనార్యుఁడు చెప్పిన యర్థాన్వయ భేదరూప శ్లేషగానవచ్చుచున్నది. అందును నచ్చతెనుఁగుశబ్దములలో నట్టి శ్లేషను సాధించుట యతని ప్రయోజకత్వమునకు నిదర్శనము. ఇచ్చట మిన్ను, కొండ యనుశబ్దములట్టి శ్లేష కాటపట్టులైయున్నవి. మిన్ను=ఆకాశము, కొండ=పర్వతము అని యాశబ్దముల సామాన్యార్థములు. కాని యవి 'మిన్నంది' కొండఁదాకె, అనిజాతీయములుగ వాడుటవలననవి యానందాతిశయమును సూచించుచున్నవి. వివాహసమయములో చిత్రాంగదను జూచు చున్న యర్జునునిఁ జూపులను వర్ణించుచుఁ జెప్పిన పద్యమగుటచే నా సందర్భమును బట్టి యతని చూపులు ముందుగ నాకాశమువలె శూన్యముగ నున్న యామె నడుమును, దరువాతఁ గొండవలె నెత్తైయున్నయామె కుచములను జూచినవని యభిప్రాయము. ఇందు శబ్దముల యర్థములు మారలేదు గాని తదన్వయ భేదముచేత నీశ్లేష చమత్కారము గోచరించు చున్నది.

10. ఉ॥ కన్నులు దీర్ఘముల్ నగుమొగంబవురా తలకట్టు ...... [19]

అనుపద్యము శ్లేషనిర్భరముగఁ గానవచ్చుచున్నది. ఇందు దీర్ఘము, తలకట్టు, బంతులు, సున్నయను శబ్దములు శ్లేషించినవి.

దీర్ఘము = పొడవు, దీర్ఘాక్షరము. తలకట్టు = తలపాగ, యక్షరముల పైఁగానవచ్చు తలకట్టను 'అ' కారచిహ్నము. బంతులు = కందుకములు, పంక్తులు. సున్న = శూన్యము, పూర్ణానుస్వారము. ఇట్లు సుభద్రయొక్క యవయవసౌందర్యవర్ణనాత్మకసన్నివేశములో వాడఁబడిన పదములు శ్లేషసామర్థ్యముచేత నాంధ్రవర్ణమాలాచిహ్నములను గొన్నిటిని వ్యక్తములు గావించుటయేగాక యామెనుగూర్చి బ్రహ్మ వ్రాసిన వ్రాఁత కక్షర

19. ప. 104.

రూపములై నిలచియున్నవి. ఇందర్థశ్లేష చిత్రింపఁబడినది.

11. తే॥ భ్రమరక మనోహరంబౌటఁ బద్మమగును
తారకాహృద్యమగుట సుధానిధియగు
రెంటి జగడాలు మోమున నంటియుంట
నబ్జముఖియంట లెస్స యీ యలరుఁబోఁడి. [20]

అను పద్యమునందు వేంకటకవియొక్క శ్లేషశేముషీపటిమ పతాకస్థాయి నందుకొనినది. పద్మ చంద్రుల జగడాల నీశ్లేషవలననే చమత్కారముగఁ దీర్చినాఁడు. సుభద్రయొక్క ముఖము భ్రమరకముచే మనోహరమై యుండుటవలనఁ బద్మమగునని. తారకలచే మనోహరమై యుండుటవలనఁ జంద్రుఁడగుననియు వివాదము చెలరేగిన కారణమున నారెంటి జగడాలను దీర్చుటకామె యబ్జముఖియనుట లెస్సయని మనోహరముగ సమర్థించి నాఁడు. ఇచ్చట భ్రమరకములు, తారకలు, జగడాలు, నబ్జముఖియను పదములు శ్లేషించినవి. భ్రమరకములు = తుమ్మెదలు, ముంగురులు. తారకలు=నక్షత్రములు, కనుపాపలు జగడాలు=పోరాటములు, (జగ + డాలు) ప్రసిద్ధములైన కాంతులు. అబ్జముఖి = పద్మముఖి, చంద్రముఖి. అబ్జశబ్దము పద్మచంద్రుల కిరువురకును సరిపడినదిగనుక నబ్జముఖియ నుటవలన నాయిరువురి వివాదములు సమసిపోయినవి, పింగళిసూరన చెప్పిన సభంగాంధ్రశబ్దశ్లేషయిందుఁ జగడాలు. అనుచోటఁ గానవచ్చు చున్నది. భ్రమరక తారకా బ్జశబ్దములందు నర్థశ్లేష గన్పట్టుచున్నది.

12 తే॥ భావమోమున వ్రేలు రూపంబుఁజూచి
ముదితయెదఁ బాయకుండెడు మూర్తిఁదలచి
రమణి మైసగమైన విగ్రహమునెంచి
ప్రోవుమని వేఁడుకొను దేవపూజవేళ. [21]

20. వి. వి. .... తృ ఆ — ప. 105
21, వి వి. .... ద్వి. ఆ. — ప. 136

ఈపద్యముగూడ నాకవీంద్రుని శ్లేషకవితానైపుణ్యమునకుఁ జక్కని నిదర్శనము. ఇందొక్కొక్క పాదమొక్కొక్క రూపమున శ్లేషించుచున్నది. సరస్వతి ముఖమునందు బ్రేలాడు రూపముగా బ్రహ్మనుజూచి (తన కన్నులందు వ్రేలాడు సుభద్రయొక్క రూపమునుజూచి), లక్ష్మివక్షస్స్థలమును విడువకుండెడు నాకారముగల విష్ణుమూర్తినిఁ దలంచి (తన హృదయమును విడువకుండెడు సుభద్రయొక్క యాకారమును దలచి), పార్వతి శరీరములో సగభాగము నాక్రమించుకొని యున్న యాకృతిగల పరమేశ్వరునెంచి (తన శరీరములో సగమైన సుభద్రయొక్క యాకారమునెంచి-కృశించిన సుభద్రయొక్క యాకారమునెంచి) ఆసురీతిగ నీపాదములు శ్లేషించుచున్నవి. ఇందుఁగూడ సర్వశ్లేషయే గానవచ్చుచున్నది.

13. తే॥ వెలఁదికెమ్మోవిఁ గని జపావృత్తి మఱచెఁ
దరుణిలేఁగౌనుఁగని హరిస్మరణ మఱచె 22

అను పద్యములో 'జపావృత్తి' హరిస్మరణ, అనుచోట శ్లేషగానవచ్చుచున్నది. జపా + వృత్తి = జపాకుసుమ మను తలఁపు. జప + ఆవృత్తి = జపముయొక్క యావృత్తి. హరిస్మరణ = విష్ణుధ్యానము, సింహస్మరణము. జపాకుసుమము వంటి సుభద్రయొక్క పెదవినిఁజూచి యర్జునుఁడు దన జపమును మఱచినాడని, సింహముయొక్క నడుమువంటి యామె సన్నని నడుమునుజూచి విష్ణుధ్యానమును విస్మరించినాఁడని చెప్పుటనే యీ శ్లేషసారాంశముగ భావించునది. జపావృత్తి (జప + ఆవృత్తి) యను చోట సంభగశ్లేషగానవచ్చును.

4. "కృష్ణ కృష్ణా! యటంచు నాకీరవాణి
రామ రామా యటంచు నారాజసుతుఁడు ... " 23

22 ,, — ,, .... ,, 148.
23 వి. వి. .... తృ. ఆ. .... ప, 25

వేంకటకవి తన విజయవిలాసమున సందిట్లనేక శ్లేషలను గూర్చి తన కవిత్వమునకు నూతనదీప్తిఁ జేకూర్చినాఁడు.

యమకము :-

శబ్దాలంకారములలో నిది ప్రముఖమైనది. విచిత్రధ్వనిసమంచితమై హృదయాకర్షకముగ నుండును. కావ్యములందలి కొన్ని గద్యపద్యములలోఁ గానవచ్చు తాళయాన్విత గతివిశేషములకిది బాగుగఁ దోడ్పడును. తగిన మోతాదులలోఁ జిత్రింపఁబడినచో నిది కావ్యశోభ నినుమడింపఁజేయును. అతిక్రమించినచో నిది కావ్యాపకర్ష హేతువగును "యమ ఏవ ప్రకృతి ర్యస్యతద్యమకం" అని దీనికి వ్యుత్పత్తి చెప్పఁబడినది. స్వరవ్యంజనములజంటయే ప్రకృతిగాఁగలదని దానియభిప్రాయము.

సాధారణముగ పద్యభేదములలోఁ గూడిన శబ్దపునరుక్తిని యమకమందురు. ఈయభిప్రాయమునే "Repetition in the same stanza of words or syllables similar in sound, but different in meaning, a kind of rhyme" 26 అను నాంగ్లవాక్యములో నాప్టేపండితుఁడు సూచించియున్నాఁడు.

"ఆవృత్తిం వర్ణసంఘాతగోచరాం యమకం విదుః" 27 అని దండి యమక లక్షణమును పేర్కొనియున్నాఁడు. వర్ణసంఘాతముయొక్క యావృత్తి యమకమనఁబడునని యతని యభిప్రాయము. వర్ణసంఘాతమనఁగా నితని దృష్టిలో స్వరవ్యంజన సమూహము.

"అవ్యపేత వ్యపేతాత్మా వ్యావృత్తిర్వర్ణసంహతేః
యమకం తచ్చ పాదానామాది మధ్యాంతగోచరమ్" 28

26 Samskrit English Dictionary — V. S Apte— P. 455.
27 కా, ద, — దండి — ప్ర, ప, శ్లో, 61
28 ,, — ,, — తృ, ప, ,, 1

అను శ్లోకములో నతఁడు యమక లక్షణముఁ బివరించియున్నాఁడుఁ అది పద్యపాదములలో వర్ణసమూహముయొక్క వ్యవధానావ్యవధానాత్మక వ్యావృత్తిరూపమున నుండునని యతని యభిప్రాయము. ప్రథమపాద యమకము, ద్వితీయ పాదయమకము, తృతీయపాదయమకము, చతుర్థ పాదయమకము. నాదిమధ్యాన్తపాదయమకము, మధ్యాన్తపాదయమకము. నాదిమధ్యపాదయమకము. నాద్యన్తయమకము, సర్వపాదయమకము మొద లగు ననేకయమకభేదములను దండి పేర్కొనియున్నాఁడు. మఱియు నా యాలంకారికప్రముఖుఁడు మహాయమక ప్రతిలోమ యమకములను గూడఁ జెప్పియున్నాఁడు.

''ఏకాకారచతుష్పాదం తన్మహాయమకాహ్వయమ్''
"ఆవృత్తిః ప్రాతిలోమ్యేన పాదార్ధ శ్లోకగోచరా
యమకం ప్రతిలోమత్వాత్ ప్రతిలోమమితిస్మృతమ్" 29

అని యా రెండిటి లక్షణములను జెప్పియున్నాఁడు. నాల్గుపాదముల నేకాకారములోఁ గూర్చినచో మహాయమకమని; పాదముగాని, పాదార్ధముగాని, శ్లోకమంతయుఁగాని ప్రతిలోమరూపమున నావృత్తమైనచోఁ బ్రతిలోమయకమనియు నతని యభిప్రాయము,

"విభిన్నార్థైక రూపాయాయావృత్తిర్వర్ణ సంహతేః
అవ్యపేతవ్యపేతాత్మా యమకం తన్నిగద్యతే" 30

అని భోజుఁడుగూడ దండిచెప్పిన ధోరణిలోనే యమకలక్షణమును, భేదావళినిఁ బేర్కొనియున్నాఁడు.

29 ,, — ,, — ,, — ,, 70, 73
30 స. కం. భ. — భోజుడు — ద్వి ప. — శ్లో. 58

"యమకం పౌనరుక్త్యేతు స్వరవ్యంజన యుగ్మయోః" 31

అని విద్యానాథుఁడు యమక లక్షణమును సంగ్రహముగ జెప్పియున్నాఁడు. స్వరసహితములైన వ్యంజనములయొక్క యావృత్తియే యమకమని యతని యభిప్రాయము. ఛేకానుప్రాసవృత్త్యనుప్రాసముల యందు కేవలము వ్యంజన పునరుక్తికే ప్రాధాన్యముగాని స్వరపౌనరుక్త్యమునకుఁ బ్రాధాన్యములేదు. యమకమునందు స్వరములయొక్క, వ్యంజనములయొక్కయు నావృత్తికిఁ బ్రాధాన్యముండును.

"అర్థము ఉన్న యెడల వేఱర్థమున స్వరవ్యంజన సంహతిని అక్రమముననే ఆవర్తించుట యమకమనఁబడును" 32 అని వేదమువారు యమకమును గూర్చి చెప్పియున్నారు.

"సమవర్ణయుగాధికమై
యమరిన నిలయమంబు యమకమగు. 33

అని భట్టుమూర్తి యమకలక్షణమును స్పష్టముగఁ జెప్పియున్నాఁడు. సమానవర్ణముల జంటగాని, సమూహముగాని యావృత్తి యగుటయని యతని యభిప్రాయము.

ఇది పాదయమకము, పాదభాగయమకమని రెండువిధములు. ఇందు పాదయమకము పదునొకండు విధములుగఁ గానవచ్చును.

*1. ముఖయమకము :-* ప్రథమద్వితీయ పాదములు తుల్యములై యుండుట

---

31 ప్ర. రు. — వి. నా. — శ. అ. ప్ర — పే. 249
32 ఆ సా. ద. — వే. వేం. రా. శా. — ద. ప. — పే. 277
33 కా. అ. నం. — భ మూ. — చ. ఆ. — ప. 78

2. సందంశయమకము :- ప్రథమతృతీయపాదములు తుల్యములై యుండుట.

3. అవృత్తియమకము :- ప్రథమచతుర్థపాదములు తుల్యములై యుండుట.

4. గర్భయమకము :- ద్వితీయతృతీయపాదములు తుల్యములై యుండుట.

5. సందష్టయమకము -: ద్వితీయచతుర్థపాదములు తుల్యములై యుండుట.

6. పుచ్ఛయమకము :- తృతీయచతుర్థపాదములు తుల్యములై యుండుట.

7. పంక్తియమకము : నాల్గుపాదములును దుల్యములై యుండుట.

8. పరివృత్తియమకము :- ప్రథమచతుర్థ పాదములు, ద్వితీయ తృతీయ పాదములును దుల్యములై యుండుట.

9. యుగ్మయమకము :- ప్రథమద్వితీయపాదములు, తృతీయ చతుర్థ పాదములును దుల్యములై యుండుట.

10. సముద్గక (సంపుట) యమకము :- పూర్వార్థోత్తరార్థములు తుల్యములై యుండుట.

11. మహాయమకము :- శ్లోకద్వయము తుల్యముగా నుండుట.

పాదభాగయమకము లనేకములు గలవు. ఏతత్పాద, పాదభాగ యమక భేదములను నన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు వివరించి యున్నారు. 34

34 కా. సం వ్యాఖ్య — స సూ. శా. ... పే. 547, 548

## విజయవిలాసానుశీలనము

చేమకూర వేంకటకవి విచిత్రయమకరీతులను వాడి తన విజయ విలాసమునకమితశోభాగౌరవములను జేకూర్చియున్నాఁడు. రసాను గుణగతివిశేషములను సాధించుటకొఱకు, ప్రస్తుతభావవిశేషమును సూచించుటకు, రమణీయ లయధర్మములను బెంపొందించుటకు నీకవీంద్రుఁడు యమకరీతుల నమితముగ వాడియున్నట్లు తోచును. ఇట్టి చమత్కారశబ్ద చిత్రణము వలన రసమునకుఁ బుష్టి చేకూరినదేకాని నష్టము గలుగలేదు. విజయవిలాసమునందలి యుదాహరణములను బరిశీలించినచో నీవిషయము దేటపడఁగలదు.

విజయవిలాసమునందు వాడఁబడిన రమణీయయమకములు :

1. శా॥ రాజున్ భోగియు సౌమ్యుఁడున్ గవియు సర్వజ్ఞుండు నీడౌనన్
దేజఃప్రౌఢవచోవివేకనయభూతిశ్లాఘులన్ మించునౌ
రాజున్ భోగియు సౌమ్యుఁడున్ గవియు సర్వజ్ఞుండు
నెబ్భంగులన్ .... 34 A

ఆనుపద్యమునందుఁ బ్రథమ తృతీయ పాదములు తుల్యములుగ నున్నవిగనుక సందంశయమకము గలదనవచ్చును. ఆపాదములలోని చివరిపదములు మాత్రము కొంచెము భేదించినవి.

*పాదభాగయమకములు (వ్యవధానాత్మకములు) :-*

2. తే॥ పాఱఁజూచినఁ బరసేన పాఱఁజూచు
వింటికొరగిన రిపురాజి వింటికొరగు 35

34 కా. అ. సం. వ్యాఖ్య — స. సూ. శా. పే. 547, 548
34 A వి. వి. అవతారిక — ప. 22
35 వి. వి. .... ప్ర. ఆ — ప 28

3. ఆ॥ నలినలీల నంచు నలిని గావించు
నింపుమించు లాడు నింపుమించు
లేమనగవు జూపు లేమనసగు బాపు!
జగమెఱుంగు దాని జగమెఱుంగు 36

4. క॥ అయ్యారే చెలువెక్కడ
నయ్యారే గెలువఁజాలు నంగజునారిన్ 37

5. క॥ మునుకలు గంగానదిలో
నొనరించుటకన్న భాగ్యమున్నదె యనుచున్
మును కలుగంగా దిగి .... .... 38

ఇందు ప్రథమపాదము కొని తుది వర్ణములు మూఁడు గూడఁ దృతీయ పాదములో నావృత్తి నొందినచో సందంశయమకమై యుండెడిది.

6. క॥ యమునానదిఁ గూడిన తో
యమునానది తనరె ... 39

7. ఉ॥ దానములెన్నియే .... .. .. డెం
దానందమ్ము .. .... .... నిత్యముం
దానము చేయుచున్ — — — —.నం
దా ః ముచి — —. — — — — 40

36 ,, — ,, — ,, 36
37 ,, — ,, .... ,, 38
38 ,, .... ,, — ,, 55
39 ,, — ,, — ,, 56
40 ,, .... ,, — ,, 57

8, క॥ రాకొామరు నెఱు౯ నీలపు
రాకొామరు నిరాకరించు — 41

9. "అమ్మకచెల్ల ! నాహృదయ మమ్మకచెల్లదు వీనికియ్యెడన్" 42

10. క॥ అన్నన్న ! మొగమువెన్నని
యన్నన్న జయించుఁ గన్నులన్నన్నలినా
సన్నములు నడుము మిక్కిలి
సన్నము మాటలు సుధాప్రసన్నములెన్నన్, 43

అను పద్యములను యమకమయములు గావించినాఁడు. సుభద్రాసౌంద ర్యమును వర్ణించుటకుఁ దగిన సుందరశైలి నిందు శబ్దచమత్కారవిన్యాస ములవలన సాధించినాఁడు.

11. ఉ॥ నావుడుమోమునన్ .... .... ...
తీవికెఁగా నటించుక నటించు కవుంగిలిపింప —
— యోనుతగుణా తగునా యిటు లానతీయఁగన్, 44
ఇందవ్యవధానాత్మక పాదభాగ యమకము గన్పట్టుచున్నది

12. "తీయఁగఁ బంచదార వెనుతీయఁగఁ బల్కినను్
ద్వితీయఁగన్" 45

13. చిలువ చెఱవంపుఁ బల్కుఁ జిఱువచెలువ. 46

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 41 | ,, | .... | ,, | — | ,, | 65 |
| 42 | వి. వి. | .... | ప్ర. అ, | .... | వ, | 70 |
| 43 | ,, | .... | ,, | ... | ,, | 83 |
| 44 | ,, | ... | ,, | ... | ,, | 89 |
| 45 | ,, | ... | ,, | ... | ,, | 94 |
| 46 | ,, | ... | ,, | ... | ,, | 100 |

14. క॥ ఆభోగము తద్వస్తుచ
యాభోగమునెందుఁ గన్నయవి గావునమీ
నాభోగపురమునరియౌ
నాభోగవతీ పురంబు సార్థంబయ్యెన్, 47

15, తే॥ ఈ వెలంది యొడల్ పైడిలో వెలంది
యీనెలంత లలాటంబు లేనెలంత
యీసుహాణి రదశ్రేణియే సుహాణి
యీబిడారు మృగీమదశ్రీబిడారు, 48

అను పద్యమునందలి మనోహర యమకభంగిమ లతని లలితశైలికి మధురగతులను గూర్చినవి,

16. క॥ మధులిట్టులు మలయానిల
మధులిట్టులు .... .... 49

17. మ॥ విహరించున్ మలయానిలంబిచట .... .... యా
విహరించున్ ........ ........ పోదమా
సహకారాళిపదంబుఁజూడఁగవయస్యాహాళివాటిల్లెడున్
సహకారాళిపదంబుఁజూడఁగవయస్యాహాళియౌనేకదా ; 50

ఇందుఁ బ్రథమద్వితీయపాదములలోఁ బాదభాగయమకము, తృతీయచతుర్థపాదములు సమానములై యున్న కారణమున పుచ్ఛయమకమును గలవని చెప్పవచ్చును చతుర్థపాదము చివరనున్న క్రియమాత్రము

47 „ ... „ ... „ 123
48 „ ... „ ... 130
49 „ — ప్ర. ఆ, — ప. 148
50 „ — ద్వి. ఆ. — 53

కొంచెము భేదించినది ప్రథమాశ్వాసమునందలి యమకములను గొన్నిటి నింతవఱకు నుదాహరించియున్నాను. మిగిలిన యాశ్వాసములందలి యమకములు సంఖ్యారూపమున సూచింపఁబడినవి. విజయవిలాసమునందుఁ గానవచ్చు యమకముల సంఖ్య:-

| | | |
|---|---|---|
| అవతారిక | — | 6 |
| ప్రథమాశ్వాసము | — | 29 |
| ద్వితీయాశ్వాసము | — | 28 |
| తృతీయాశ్వాసము | — | 22 |
| మొత్తము | | 85 |

విజయవిలాసమునందలి యమకగమకములు వేంకటకవి యారాధించిన శబ్దసౌందర్యముయొక్క పరాకాష్ఠదశను సూచించుచున్నవి. అట్టి చతుర శబ్దచిత్రణాత్మక సన్నివేశములనుబట్టి విజయవిలాసకారుఁడు యమకములకిచ్చిన ప్రాధాన్యము వ్యక్తమగుచున్నది. కనుకనే యతనిని యమకచక్రవర్తియని విశ్వనాథ సత్యనారాయణగారు ప్రశంసించియున్నారు. [51]

*వ్యంగ్యము :-*

కావ్యగౌరవము వ్యంగ్యముపై నాధారపడియున్నది. వ్యంజనచేఁ దెలియఁదగిన యర్థము వ్యంగ్యమందురు ఇది వాచ్యార్థముకంటె రమణీయమై యుండును.

అభిధ, లక్షణ, వ్యంజన యని శబ్దవృత్తులు మూఁడువిధములుగ

51 (ఏమెస్కో) — పీఠిక — పే. 35
ప్రతి

విభజింపఁబడినవి. "తత్రసంకేతితార్థగోచరః శబ్దవ్యాపారోఽభిధా" 52 అని యభిధాలక్షణమును విద్యానాథుఁడు చెప్పియున్నాఁడు. సంకేతితార్థమును బోధించు శబ్దవ్యాపారమభిధయనఁబడును. "వాచ్యార్థానుపపత్త్యా తత్సంబంధిన్యారోపితః శబ్దవ్యాపారోలక్షణా'' 53 అని యతఁడు లక్షణావృత్తినిఁ గూర్చి చెప్పియున్నాఁడు. ముఖ్యార్థమునకు బాధకలుగుటవలనఁ దత్సంబంధ విషయమునందారోపింపఁబడిన శబ్దవ్యాపారము లక్షణయనఁబడును. "అన్వితేషుపదార్థేషువాక్యార్థోపస్కారార్థమర్థాంతరవిషయః శబ్దవ్యాపారోవ్యంజనావృత్తిః" 56 అని వ్యంజనాలక్షణమును జెప్పియున్నాఁడు. పదార్థముల పరస్పర సంబంధమువలన వచ్చు వాచ్యార్థముకంటె రమణీయమగు నర్థమును స్ఫురింపఁజేయు శబ్దవ్యాపారము వ్యంజనయనఁబడును. అభిధా, లక్షణా, వ్యంజనాశక్తులవలనఁ గ్రమముగ వాచ్య, లక్ష్య, వ్యంగ్యార్థములు వచ్చును. పూలకుఁ దావివలె పదములకీ వ్యంగ్యార్థము శోభను జేకూర్చుచు సహృదయ హృదయానంద దాయకమై యుండును. కొందఱు భావించిన తాత్పర్యార్థము వ్యంగ్యార్థము నభిన్నములని "తాత్పర్యార్థోఽపివ్యంగ్యార్థఏవ" అను వాక్యములో విద్యానాథుఁడు దెల్పియున్నాడు.

కావ్యమునందు వ్యంగ్యము ప్రముఖపాత్ర వహించును. వ్యంగ్యరహితమైన కావ్యము ప్రాణములేని శరీరమువలెఁ గళావిహీనమగును. కనుకనే వ్యంగ్యప్రధానమైన కావ్యముత్తమమని, గుణీభూతవ్యంగ్యమైన కావ్యముమధ్యమమని, యస్ఫుటవ్యంగ్యమైన కావ్యమధమమనియు నాలంకారికులు చెప్పియున్నారు. "వ్యంగ్యస్యప్రాధాన్యే ఉత్తమంకావ్యంధ్వనిరితి

---

52 ప్ర.రు — వి. నా. — 'కా ప్ర. పే. 35
53 ,, — ,, — ,, ,, 36
54 ,, — ,, — ,, 38

వ్యపదిశ్యతే; అప్రాధాన్యే మధ్యమంగుణీభూతవ్యంగ్యమితిగీయతే; వ్యంగ్య స్యాస్ఫుటత్వేఽధమంకావ్యం చిత్రమితిగీయతే, [55] అని విద్యానాథుఁడు త్తమ, మధ్యమాధమ కావ్యభేదములను స్పష్టపఱచియున్నాఁడు.

వ్యంగ్యార్థమునే ధ్వనియందురు. కావ్యమునందు శబ్దార్థములకంటె, నలంకారాదులకంటెను నిదియే ప్రాధాన్యము వహించును. ఇది రస, వస్త్వలంకార రూపముల ననుసరించి మూఁడువిధములుగ నుండును. వీనిలో రసధ్వనియే ముఖ్యమైనది. ధ్వనివ్యంగ్యములు పర్యాయపదములు. ధ్వనియే కావ్యాత్మయని యానందవర్ధనుఁడు సిద్ధాంతీకరించియున్నాఁడు. ఆతని ధ్వని ప్రధానవాదము బహుపండితామోదము నొందినది.

"అయమేవహిమహాకవేర్ముఖ్యోవ్యాపారః యద్రసాదీనేవ ముఖ్య తయాకావ్యార్థీకృత్యతద్వ్యక్త్యనుగుణత్వేన శబ్దానాముపనిబంధనమ్'' [56] అని యానందవర్ధనుఁడు కావ్యమునందు ధ్వని ప్రాధాన్యము నుగ్గడించి యున్నాఁడు. ఆధ్వనియే మహాకవియొక్క ముఖ్యవ్యాపారము; దానిని వ్యక్తీకరించుటకుఁ దగినరీతిలో శబ్దములను గూర్చవలెను.

ఆధ్వనికారమతము నామోదించిన విద్యానాథుఁడు ''జీవితం వ్యంగ్య వైభవమ్" [57] అని ధ్వనిని కావ్యజీవితముగఁ బేర్కొనియున్నాఁడు.

సాధారణముగ నర్థము వాచ్యము, ప్రతీయమానమునని రెండువిధ ములుగ నుండును. ప్రతీయమానార్థమునే వ్యంగ్యార్థమందురు. మహాకవి వాక్యములందు వాచ్యార్థముకంటె భిన్నమైన రమణీయవ్యంగ్యార్థము స్ఫురించును. వ్యంగ్యము ప్రాధాన్యము వహించినపుడు ధ్వనియనఁబడును.

---

55 ప్రతా రు, ... వి, నా, ... కా, ప్ర, ... పే. 41
56 ధ్వ. ఆ. ... ఆ, వ ... 111 ... కా 32
57 ప్ర, రు' ... వి, నా, ... కా, ప్ర, ... శ్లో, 2

వ్యంగ్యార్థము దీనియందు ధ్వనింపఁబడును గనుక దీనికి ధ్వనియను వ్యవహారము సార్థకమైనది. అట్టి ధ్వని రసార్ద్రహృదయులను రంజింపఁజేయును.

సంస్కృతకవులవలె నాంధ్రకవులుగూడ వ్యంగ్యవైశిష్ట్యమును గుర్తించి తమ కావ్యములను వ్యంగ్యప్రధానములుగ సంతరించియున్నారు. అట్లే చేమకూర వేంకటకవిగూడఁ దన విజయవిలాసమును వ్యంగ్యప్రధానముఁ గావించి దానికుత్తమకావ్యగౌరవము లభింపఁజేసినాఁడు. విజయవిలాసమునందలి కొన్ని వ్యంగ్యవిశేషములు :-

1. ఉ॥ రేలమృతాంశులో శశము రెమ్మ దమంచుఁ దలంచి .... 58

అను పద్యములో నింద్రప్రస్థపురసౌధముల యౌన్నత్యము వ్యంగ్యమర్యాదచే సూచింపఁబడినది.

2. తే॥ పోఁకమ్రాఁకులమహిమ కప్పురపుటనఁటి
యాకుఁదోటల సౌభాగ్యమందెకలదు — 59

అను పద్యములో నింద్రప్రస్థపుర వనసంపదను వర్ణించుచు పోఁక చెట్లకు, నరఁటితోటలకుఁ, దమలపాకుల తోటలకును, బ్రసిద్ధిఁగాంచిన తంజాపురప్రాంత వనసంపదను ధ్వనింపఁజేసినాఁడు.

3. తే॥ పాఱఁజూచినఁ బరసేన పాఱఁజూచు
వింటికొరగిన రిపురాజి వింటికొరగు
వేయునేటికి నల పాండవేయుసాటి
వీరుఁ డిలలేఁడు ప్రతిరఘువీరుఁడొకఁడు 60

58 వి. వి. ... ప్ర అ ... ప. 6
59 ,, ... ,, ... ప. 17
60 వి. వి. .... ప్ర. అ. — ప. 29

ఈ పద్యములో నర్జునుని యసమాన పరాక్రమమును వర్ణించుచు నీకవీంద్రుఁడు దన కృతిభర్తయైన రఘునాథనాయకుని శౌర్యధైర్యములను వ్యంజింపఁజేసినాఁడు. మఱియుఁ జివరిపాదములో "ప్రతిరఘువీరుఁ డొకఁడు" అనుచోట వీరవరుఁడైన రఘునాథనాయకునిఁ గూడ సూచించి నాఁడు.

4. ఉ॥ అంగము జాళువాపసిఁడియంగము క్రొన్నెలవంక
నెన్నొసల్ ... 61

అను పద్యములో సుభద్రాసౌందర్యమును వర్ణించుచు నామె యవయవముల తీరు సాముద్రికశాస్త్రలక్షణానుగుణముగ నున్నదని సూచించుచు, నట్టి సకలశుభలక్షణాన్వితయైన యాసుందరాంగిని వివాహమాడినవాఁడు ముజ్జగముల నేలఁగలఁడని ధ్వనింపఁజేసినాఁడు.

5. చ॥ పరిణయమౌటకేఁగుగతిఁ బౌరులనేకులు వెంటరా
శుభోత్తరముగ నయ్యెడంగదలి .... 62

అని యర్జునుని తీర్థయాత్రాప్రయాణమును బరిణయప్రయాణముతో సమయోచితముగఁ బోల్చి యామాన్యుఁడు క్రమముగా నులూచీ చిత్రాంగదాసుభద్రలను వివాహమాడు విశిష్ట సన్నివేశములను సూచించి యున్నాఁడు.

6. "అనుకూలమారుతాగతిఁ
గనుఁగొన నామోదసూచకంబె నదిగా" 63

61 వి. వి. — ప్ర. ఆ. ప. 40
62 ,, ,, 46
,, 58

అని యర్జునుఁడు విశారదునితో నానందపూర్వకముగఁ జెప్పుటలో నాహాయుపతని బావిశుభములకు సూచకముగ నున్నదను విషయము ధ్వనించుచున్నది. కార్యసాధనకు బయలుదేరువారికి మందపవన మెదురగుట శుభసూచనగా నేఁటికిని పరిగణింతురు.

7. ... .... కంటసరిగంటు కస్తురికమ్మవలపు .... .... 64

అనుచోట 'కంటసరి' యను పదప్రయోగవిశేషముచేత నులూచి యొక్క కన్యాత్వము ధ్వనించుచున్నది. కంటసరి యనఁగా కుత్తిగంటని యర్థము. ఈకుత్తిగంటను నాభరణ విశేషము నవివాహితస్త్రీలు ధరింతురు. ఆయాభరణమును గన్యాత్వచిహ్నముగ గ్రహింపనగును. అది కంఠము నంటిపెట్టుకొని యుండును. అట్టి కన్యాత్వసూచకాభరణవిశేషమును భట్టుమూర్తి "రూపు" అని పేర్కొనియున్నాఁడు.

ఉ॥ స్వైరవిహార ధీరలగు సారసలోచనలున్నచోటికిన్
.... .... లతాంగి రూపుక
న్నారఁగఁ గాంచివచ్చితి .... .... 65

ఈపద్యమును వ్యాఖ్యానించుచు పుట్టపర్తి నారాయణాచార్యులుగారు వివాహిత స్త్రీలు మెడలో 'రూపు' అను నొక యాభరణమును ధరింతురని చెప్పియున్నారు. 66

విజయవిలాసకారుఁడు వాడిన 'కంటసరి' యను పదములోని వ్యంగ్యస్ఫూర్తిని తాపీ ధర్మారావుగారు వెలికిఁదీసినారు. 67

64 ,, — ,, — ,, 76
65 ప చ ... భ మూ. ... ద్వి. ఆ — వ. 55
66 వ. చ. సా. సౌ .... పు. నా. — పే 30
67 వి. వి. ... వ్యా. వ్యా. .... పే. 235

8 "కాముకుఁడఁగాక వ్రతినై 68

అని యర్జునుఁడు తాను గాముకుఁడను గానని చెప్పిన వ్యంగ్యాంత రముచేత నతఁడు కాముకుఁడని సూచించియున్నాఁడు. అర్జునుఁడు లూచీ మనస్తత్త్వమును, దనపై నామెకుఁగల యనురాగాతిశయమును దెలిసికొనఁ గోరి యట్లు పలికినాఁడేగాని యూజవరాలిపై నతనికిఁ గాంక్షిలేకపోలేదు.

"గీతి సాహితీ మోహనవాణులు చెవులుపట్టి యాడింపఁగాఁ గాము కుఁడను గానని పలుకుట తగదని" యులూచియు, "నావ్రతము చందమును దెల్పితి నంతెకాని నీచక్కఁదనంబుఁ గన్న నిముసంబయినన్ నిలుపోప శక్యమే" అని యర్జునుఁడును బలికిన పలుకులను బట్టి యతఁడు గాముకుఁ డని తేటపడుచున్నది.

9. "నిను గీతి సాహితీ మో
హన వాణులు చెవులుపట్టి యాడింపంగా .... ....69

అను పద్యములో రఘునాథనాయకుని సంగీత సాహితీ కళాభి మానము ధ్వనించుచున్నది. మఱియుఁ గళారసికుఁడైన యారాజేంద్రుని కాముకతగూడ సూచింపఁబడినది.

10. ఉ॥ కన్నియఁగాని వేఱొకతెఁగాను మనోహరరూప నీకు నే
జన్నియవట్టియుంటి నెలజవ్వనమంతయు నేఁటిదాఁక నా
కన్నులయాన నావలపు కస్తురి నామముతోడు . .... 70

అను పద్యము వ్యంగ్యమున కాటపట్టై యలరారుచున్నది. "కన్ని

68 వి, వి. .... ప్ర. ఆ. ... ప, 88
69 ,, ... ప్ర. ఆ. ... ప. 90
70 వి, వి. .... ప్ర. ఆ. ... ప. 97

యనుగాని వేఱొకతెఁగాను" అని యులూచి చెప్పుకొనుటవలన నామె యవివాహితయని, మఱొకని సాంగత్యము నపేక్షించినది గాదని, యన్య భావన లేనిదనియును దెలియుచున్నది. మఱియు నాసుందరి యర్జునుని కొఱకే కనిపెట్టుకొని యున్నదని, యామె మనస్సులో నర్జునుఁడుదప్ప వేఱొకఁడు లేఁడని, యామనోహరునిఁ గలిసి యానందము నొందుటయే యామె జన్మకు సాఫల్యమనియు సూచింపఁబడినది. ఆమె పెట్టుకొనిన యొట్లలో నొక విశేషార్థము స్ఫురింపుచున్నది. తన మనస్సు కలుషిత మైనచో, తాను జెప్పినది నిజముగానిచో నంధత్వము దనకుఁ బ్రాపించు నని, తన మాంగల్యము మంటఁగలియుననియు ధ్వనింపఁజేసినది. ఈధో రణి యామె యకళంక శీలమున కనుపమ కవచమై యమరినది.

11. మ॥ తనకుంగౌఁగిలి యీవొకప్పుడును నాథా నీకరస్పర్శనం
బునగిల్గింతలె ... ... 71

అను పద్యము రమణీయమగు వ్యంగ్యార్థము ను స్ఫురింపఁజేయు చున్నది. అర్జునుఁడు విశారదునితోఁ జెప్పినట్లు కవి ప్రాకృతిక శోభ నుత్ప్రేక్షాబద్ధముగ వర్ణించుచుఁ జెప్పిన పద్యమిది. చిత్రాంగదను జూచిన తరువాత నామెను గలిసి సుఖించవలెనను కాంక్ష యర్జునునకుఁ గలిగినది. అనుకొనినవెంటనే యామెను గలిసికొనుట కవకాశములేదు. అప్పటి వఱకు శారీరకముగ, మానసికముగను దూరముగనున్న యాయిరువురు నామెతండ్రియైన మలయధ్వజుని యనుమతిపై వివాహమైనతరువాతఁ గలిసి సుఖించుట కవకాశమున్నది. ఈలోపున నతని రాగమయ హృద యము సంగమ సుఖమున కారాటపడుచున్నది. అర్జునుఁడు దనను సూర్యు నిగను, జిత్రాంగదను పద్మినిగను భావించినాఁడు. సూర్యకిరణ స్పర్శ వలన పద్మము వికసించి మందపవన ప్రభావమున నందలిరేకు లటునిటుఁ

71 ,, .... ,, ... ,, 139

గదలుచున్నవి, ఆత్మభావానుకూలముగనున్న యాపరిస్థితిని తిలకించి యర్జునుఁడు కదలుచున్న రేకులనెడి వ్రేళ్ళతోఁగూడిన హస్తముతో సంజ్ఞ చేయుచుఁ బద్మిని ద్విరేఫధ్వనులతో రారమ్మని తన ప్రియుఁడైన సూర్యునిఁ బిలుచుచున్నట్లూహించినాఁడు అట్లు చిత్రాంగదతో సంగమ సుఖము నర్జునుఁడనుభవింపఁ గోరుచున్నాఁడను విషయమును మనోహరముగ నిందు ధ్వనింపఁజేసినాఁడు.

12. ఉ॥ నావినిహావ భావ పరిణామవిదుండు .. ...
.... ... ... .... వే
రావలె శోభనోత్సవ పరంపర లిప్పుడుచూడుఁడంచునె
త్తావులదీవులై తనరుతామర మొగ్గలు రెండొసంగినన్ 72

ఇచ్చట విశారదుని హావభావ పరిణామవేతృత్వమును సూచించుటకుఁ దగిన సన్నివేశము నికవీంద్రుఁడు గల్పించియున్నాఁడు. చేమకూరవాని యపూర్వ కవితాసృష్టిలో విశారదపాత్ర విశిష్టస్థానము నాక్రమించినది. విశారదుఁడుపరేంగితావగాహి. అర్జునుఁడు చిత్రాంగదను జూచినప్పటి నుండి యతనిలోఁ గానవచ్చుచున్న హావభావ పరిణామములను బట్టి యతఁడాసుందరియందు బద్ధానురాగుఁడై యున్నట్లు విశారదుఁడు గ్రహించినాఁడు, తన ప్రభువుయొక్క వాంఛాసిద్ధికొఱకు ప్రయత్నించు నాప్రజ్ఞాశాలి భావిశోభనోత్సవ పరంపరలను సూచించు శుభశకునములైనవని తెల్పుచు రెండు తామరమొగ్గల నర్జునునకిచ్చినాఁడు. అర్జునుని కోరికకనుగుణముగఁ బ్రయత్నించి చిత్రాంగద సతికిఁ గూర్చుటను విశారదుని మాన్య మానసిక నిర్ణయమున కది బహ్యాభివ్యక్తము. మఱియు శోభనోత్సవ పరంపరలనుటవలనఁ గేవలము చిత్రాంగదా వివాహమేగాక సుభద్రా

72 వి. వి. ప్ర. ఆ. ప, 141

వివాహముగూడ సూచింపఁబడినది. మఱియు నేత్రావుల కొన్నదముల్లైన శామరమొగ్గల నిచ్చుటలో నతనికి ద్వరలో చందనసురభిళాంచిత స్తనద్వయము లభించునను విషయము ధ్వనించుచున్నది. ఇట్టి శుభసన్నివేశములు రెండు సమకూరునను విషయముగూడ నిట ధ్వనించుచున్నది, రెండు పుష్పముల నిచ్చుటకూడ నొక శుభసూచనమే ఇట్టి యనంత భావ సంపత్తి నీపద్యమిముడ్చుకొని యున్నది.

13. చ॥ క్షితిపయి వట్టు భ్రమాఁకులుఁ జిగిర్పవసంతుఁడు .... ....

— — — — — నే

గతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరేగదా 73

వేంకటకవి వ్యంగ్యార్థస్ఫోరకముగ నీమనోహరపద్యమును గూర్చి యున్నాఁడు. వసంతచంద్రవిజృంభణములను బరస్పరస్పర్థతోఁ గూడి యున్నట్లు వర్ణించుచు స్పర్ధతోఁగూడిన నాఁటికవులిద్దరియొక్క కవితాప్రభావములను ధ్వనింపఁజేసినాఁడు. భ్రమోడులవంటి రసహీనులహృదయములను గూడ నొక కవి (వసంతుడు) తన రసభరిత పదజాలముతో రంజింపఁజేసినాఁడని, యతనిపైఁ గల స్పర్ధతో నతని కవిత్వమును మఱొక కవి (చంద్రుడు) మెచ్చక ప్రసన్నతాసౌకుమార్య గుణములతోఁ గూడిన తనకవిత్వము యొక్క ప్రభావముచేతఁ గఠినాత్ముల హృదయములను గరిగించినాఁడనియు ధ్వనింపఁజేసినాఁడు. చివరిలోకోక్తినిఁబట్టి సమకాలికులైన యా కవులిరువురు నొకని కవిత్వము మఱొకఁడు మెచ్చుకొనకుండిన పరిస్థితియేగాక వేంకటకవి కవిత్వముగూడ నట్టిస్పర్ధకు గుఱియై సమకాలికుల మెప్పును బొందలేదను విషయము గూడ ధ్వనించుచున్నది. ఆవసంత చంద్రులవంటి కవులతని కవిత్వము విమర్శింపియుందురు. అట్టినైరాశ్య

73 „ — „ — „ 145

గావస్ఫోరకముగ నాలోకోక్తిగూర్పఁబడినట్లు భావింపనగును.

14. "నదుఃఖంపంచభిస్సహ" 74 అను సంస్కృత లోకోక్తి వ్యంగ్యార్థ స్ఫోరకముగ వాడఁబడి ది. ఐదుగురితోఁ గలిసియున్నపుడు దుఃఖముండదని వాచ్యార్థము. నంద, లలిత, పద్మ, సౌరభేయి, సమీచియను నప్సరసలైదుగురును మునిశాపమూల దుఃఖమునకుఁ దాత్కాలికముగ గురియైనను సౌభద్రాది పావనపంచతీర్థముల నాశ్రయించి, యర్జునుని వలన శాపవిముక్తి నొంది దుఃఖమును పోఁగొట్టుకొనగలరను విషయము ధ్వనించుచున్నది.

15. తే॥ నీకుఁగల్యాణమౌరమణీయరూప!
నీకువంశాభివృద్ధియౌ నృపకలాప!
నీకు జయమగు సాహస నీతిభరిత!
నీకు సామ్రాజ్యమౌ మహనీయ చరిత! 75

అను పద్యములో నొక్కొక్క పాదమొక్కొక్క రమణీయార్థమును ధ్వనింపఁజేయుచున్నది తమకు శాపవిముక్తినిఁ గలిగించినందులకు నందాద్యప్సరసలు కృతజ్ఞతాసూచకముగ నిండు మనంబులతో నర్జునునాశీర్వదించిన సన్నివేశమి పద్యమునందు వర్ణింపఁబడినది. ఇందు మొదటి పాదములో నర్జునునకు సుభద్రతో వివాహము కాఁగలదను విషయము, ద్వితీయపాదములో నాదంపతుల కభిమన్యుఁడుదయించునను విషయము, తృతీయ పాదములో మహాభారత సంగ్రామములో విజయుఁడు విజయము నొందునను విషయము, తత్ఫలితముగ విశాలసామ్రాజ్యము లభించునని చతుర్థ పాదమునందును ధ్వనించుచున్నవి.

74 వి. వి. — ప్ర. ఆ, — ప్ర. 64
75 వి. వి. .... ద్వి. ఆ. .... వ. 75

16) తే॥ వయసువాడును జక్కనివాఁడువీఁడు
మనసుమర్మంబులేవియు మనకుఁదెలిసి
యున్న యవిగావు సేవకునుపఁదగునె
కన్నె ? నదియేమొ తెలిసికొమ్ము....[76]

అని యర్జునునిఁగూర్చి కృష్ణుఁడు బలరామునితోఁ బలికినపలుకులు వ్యంగ్యగర్భితములై యున్నవి యతివేషములోవచ్చిన యర్జునుఁడు దనను సేవించుటకు నియమింపఁబడిన సుభద్రను దీసికొనిపోయి వివాహమాడు నను విషయమిట స్ఫురించుచున్నది.

17. క॥ మీరింద్రప్రస్థముఁగని
నారా ? ... .... .... .... .... .... ....
... ... వీరాగ్రగణ్యునరునెఱుఁగుదురా ? [77]

అని సుభద్ర ప్రత్యేకముగ నర్జునునిఁ గూర్చి యతివేషమున నున్న యర్జును నడుగుటలో నతనిపై నామెకుఁగల యనురాగాతిశయము ధ్వనించుచున్నది. అనంతరమావీరుని "ఎగుబుజంబులవాఁడు" అని సాంగో పాంగముగఁజేసిన వర్ణనలో నామెకా మోహనాకారునిపైఁ గల ప్రేమాతి శయము వ్యక్తము గావింపబడినది.

మఱియునామె "మీరందందునరుఁగనరుఁగానరుగా ?" అని "ఎచ్చ టఁగంటిరో విజయునిక్కువ నిక్కువమౌనె ? రాఁడుగా యిచ్చటికి" అని యుత్సుకతతో నర్జునునిఁగూర్చి యా మౌనిని ప్రశ్నించుటలో నాప్రియతమ మూర్తినిఁ జూడ వలెనను నామె కాంక్షసూచింపఁబడినది.

---

76 .... „ „ 119.
77 వి. వి. — ద్వి. ఆ. — ప. 163.

18. తే॥ మేరలాయివి మీయంతవారలకును
బెద్దలున్నారెఱిఁగి వారె పెండ్లిసేయఁ
గలరు వేగిరపాటింత వలదటంచు
విన్నపముచేయరాదె యోముద్దుచిలక. 78

అను మాటల తెరల సందులందామె ముగ్ధహృదయము దోబూచు లాడుచున్నది. సుభద్రకర్జునునిపైఁగల ప్రేమభావమపారమైనది. కాని యర్జునుని వలెనామె బయటపడదు. గంభీరహృదయ. అతనివలెనామె గూడ త్వరగా వివాహము జరుగవలెనని కోరుచున్నది. కాని యా యా వేగములోఁ బెద్దలను. సంప్రదాయమును విస్మరింపరాదని యామె యభిప్రాయము. కనుకనే వేగిరపాటు వలదని హెచ్చరించినది. సలక్షణ వివాహరూపమునఁ ద్వరలోఁ గోరికలు నెరవేరఁగలవని యామె యాత్మస్థైర్యముతో సూచించినది. ఈ భావవిశేషములన్నియు నిటవ్యంగ్యముగ స్ఫురించుచున్నవి.

19. క॥ చెలులు ప్రసంగవశంబున
నలరెంగడు విజయభవనమనినన్ 79

అను పద్యములో రఘునాథనాయకుని విజయభవనము సూచింపఁబడినది. ఆనాయకాగ్రగణ్యుఁడు సాధించిన విఖ్యాతవిజయములకుఁ జిహ్నముగ నీ భవనరాజమును దంజావూరు కోటలో నిర్మించినాఁడు. ఆ విజయభవనము నందే యా రాజేంద్రుఁడు విజయవిలాసకృతినందుకొనినాఁడని చెప్పుదురు. ఈ ప్రబంధనకు విజయవిలాసమను పేరిడుటకిది యొకకారణమని భావించుచున్నారు.

78 వి. వి. — ద్వి. ఆ. — ప. 189
79 ,, — తృ. ఆ. — ప. 26
వి. — తృ. ఆ. — ప. 91

గుణసనాథమైన సరసకవిత్వమును బట్టి, యితరకవుల కవిత్వములపై నతని కవిత్వము చూపిన ప్రభావమును బట్టియు దక్షిణాంధ్రియుగము నతని పేరిట వ్యవహరించినచో సమంజసముగ నుండునని పించును.

## వేంకటకవి యనుకరించిన సన్నివేశములు

1. "అఖండంపుణ్యానాం ఫలమివచ తద్రూపమనఘం
న జానే భోక్తారం కమిహసముపస్థాస్యతి విధిః" 1

అను కాళిదాస శ్లోకభాగభావచ్ఛాయతో వేంకటకవి

"ఇంతచక్కఁదన మెందుఁగానమీజవ్వనిం
బెండ్లాడంగలవాఁడు చేసినదినుమీ భాగ్యమూహింపఁగన్" 2

అను పద్యభాగమును గూర్చియున్నాఁడు. కవికులతిలకుని యాలోకోత్తర శ్లోకభావలీలను దన పద్యములో సూచించి వేంకటకవి ప్రశంసాపాత్రుఁడైనాఁడు.

2. "యాత్యేకతోఽస్తశిఖరం పతిరోషధీనా
మావిష్కృతారుణ పురస్సర ఏకతోఽర్కః
తేజోద్వయస్య యుగపద్వ్యసనోదయాభ్యాం
లోకోనియమ్యత ఇవాత్మదశాంతరేషు" 3

---

1 అ, శా. — కాళిదాసు — ద్వి. అం. — శ్లో, 10
2 వి, వి, — ప్ర, ఆ, — ప, 184
3 అ, శా, — కాళిదాసు — చ అం, శ్లో, 2

అను కాళిదాస రసవత్తర శ్లోకము ననుసరించి యతడు

క॥ ఒకమెట్టు తరణిదిగ్గిన
నొకమెట్టు శశాంకుఁడెక్కు నుర్వీస్థలిలో
నొకరాజు సన్నగిల్లిన
నొకరాజంతంతకున్ మహోన్నతిఁగనఁడే [4]

అను మనోహర పద్యమును సంతరించి యాకవికుల తిలకునిపైఁ దనకున్న యాదరాభిమానములను బ్రకటించినాఁడు.

3. ''అస్తినాస్తి విచికిత్సాహేతు శాతోదరిన్'' [5] అని శ్రీనాథుఁడు దమయంతి నడుమును వర్ణించినతీరు ననుసరించి యితఁడు "కలదు లేదన నసియాడు కౌనుతీరు" [6] అని చిత్రాంగద నడుమును వర్ణించినాఁడు.

4. "ఆళియుఁబోలె నిప్పుడువనాళి [7] — — — —

అను పద్యములోఁ గవిసార్వభౌముఁడు ప్రవాళహస్త సంజ్ఞలు, వన ప్రియకంఠహుంకారములును జేయింపఁగా నితఁడు ''తనకుంగొఁగిలి యీ వొకప్పుడను [8] — — —

అను పద్యములోఁ బల్లవశాంగు ళులతో సంజ్ఞలుచేయించి, ద్విరేఫదీర్ఘ ధ్వనులతోఁ బిలిపించినాఁడు.

---

4 వి. వి. — ప. అ. — ప. 144
5 శృం. నై. ... శ్రీ. నా. -- ద్వి ఆ. — ప. 21
6. వి. వి. — ద్వి. ఆ. ... ప. 20.
7 శృం. నై. ... శ్రీ. నా. ... ద్వి. ఆ. ... ,, 43.
8 వి. వి. ... — — ... ప్ర. ఆ. — ,, 139.

పెద్దన ననుసరించిన ఘట్టములు :-

5, సీ॥ అచటి విప్రులు మెచ్చరఖిల విద్యాప్రౌఢి
ముదిమది దప్పిన మొదటివేల్పు 9 —

సీ ॥ తడఁబాటుగలదు వేదముల నాతని కంచుఁ
బరమేష్ఠి మెచ్చరు ధరణిసురులు — — 10

6, ఉ॥ అపురిఁబాయకుండు — — — 11

ఉ, అపురమేలు .... .... ... .... 12

7, శా॥ ఏయే దేశములం జరించితిరి .... — — 13

"ఎయ్యవికన్గొంటిరి పుణ్యభూములట రాజ్యంబుల్ మనోజ్ఞంబులె
య్యవి యేయే పురముల్ గనంబడియె .... — — 14

8, "మీటిన విచ్చు గుబ్బచనుమిట్టల — 15

"మీటినవిచ్చు చనుదోయి ... .... 16

మొదలగునవి.

9. "నాళీకముఖికి నెన్నడుముగానఁగనయ్యె ... 17

అనుపద్యములో భట్టుమూర్తి చేసిన గర్భిణీ వర్ణనననుసరించి

---

9 మ, చ. — — ఆ. పె. ... ప్ర, ఆ. — ,, 50.

10 వి, వి. — ... .... ప్ర. ఆ. ... ,, 4.

11 మ, చ. ... — ఆ. పె. ,, .... ,, 51.

12 వి, వి, — — ,, ,, 19.

13 మ. న, — ... ఆ. పె. — ,, — ,, 68.

14 వి, వి, — ద్వి, ఆ, — — ,, 162,

15 మ. చ, .... ఆ- పె, .... ద్వి , ఆ, .... ప॰ 70.

16 వి, వి, ... ... తృ, ఆ, .... ,, 216,

17 వ, చ, ... భ, మూ, .... తృ, ఆ, ... ,, 20,

''మించెన్‌బో రుచికౌరికల్ గడు విజృంభించెన్ [18]

అను పద్యములో చిత్రాంగద గర్భ పరిణామములను మనోజ్ఞముగ వర్ణించి యున్నాఁడు.

10, మ॥ నిను భాగ్యాక్షరపంక్తి గాఁదలఁతునో....
ప్రియాపయోధరవిహారాహార వంశోత్తమా!

అని విరహవ్యథార్తుఁడై వసురాజు తన ప్రియురాలి ముక్తాహారమును ప్రశంసించినట్లు చేసిన భట్టుమూర్తి మనోహర వర్ణనము ననుసరించి

మ॥ రతికిన్ భారతికిన్ — ... ....
ముద్దుఁగీరమ సుధాబంధూ భవద్గీరమా! [20]

అను చక్కని పద్యములో విరహతాప సంతప్తుఁడై యున్న యర్జునునిచే చిలుకను ప్రశంసింపఁజేసినాఁడు.

11, "వెలఁది యీనీదండ వెలయెంత? నాదండ
కొను వెలఁబెట్ట నెవ్వనితరంబు [21]

అను రాయఁ పుష్పలావికావర్ణనముఁబట్టి యితఁడు

''ప్రాయపు నాయకుల్ వెలనెపాన [22] ... —

అనుపద్యములోఁబుష్పలావికా వర్ణనచేసినట్లు గానవచ్చును.

---

18 వి, వి, .... ద్వి, ఆ, ... ,, 36,
19 వ, చ, — భ, మూ, — చ, ఆ, — ,, 101,
20 వి, వి, .... ద్వి, ఆ — ,, 184.
21 ఆ, మా, .... కృ, రా, .... ద్వి, ఆ, ... ,, 19,
22 వి, వి, ...., ప్ర, ఆ, — ,, 14.

12. గీ॥ ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తిఁజూచి
తరుణి తనుమధ్యమెచటికో తలఁగిపోయె
నుండెనేనియుఁగనఁబడకున్నె యహహ
యుద్ధతులమధ్యమునఁ బేదకుండఁదరమె. 23

అను సంకుసాల నృసింహకవి యొక్క పద్యము ననుసరించి

క॥ కడుహెచ్చుకొప్పు ; దానిన్
గడవన్ జనుదోయిహెచ్చు కటియన్నిటికిన్
గడుహెచ్చు ; హెచ్చులన్నియు ;
నడుమే పసలేదుగాని నారీమణికిన్. 24

అను పద్యమును గూర్చినట్లు గన్పట్టును.

13. ఉ॥ కమ్మని కుందనంబుకనుఁగందని — 25

అను పెద్దన పద్యధోరణిలోనే యితఁడు

ఉ॥ కమ్మని జాళువానొరయఁ గ్గిన .... 26

అను పద్యమును రచించినాఁడు

14. "సామాన్యప్రతిపత్తి" 27

అనుకాళిదాసోక్తిలోని శ్లేష చమత్కారము (సామాన్య, సా + మాన్య, (సా + మా + అన్య) ననుసరించి

"మామకాగమనవార్త 28

---

23 క, క, ర. — సం. నృ. ... తృ. ఆ. .... ప, 25.
24 వి వి ప్రఅ ... ,, 39.
25 పె చ. ... అ. పె, .... తృ ఆ .... ,, 6,
26 వి. వి. — ప్ర. ఆ, ... ,, 70
27 అ, శా ... కాళిదాసు — చ. ఆం — ,, శ్లో. 17
28 వి. వి, ... ... ప్ర అ — వ 152.

మామక + ఆగమన, మామకు + ఆగమన, మామ + కాగ + మన) అను చమత్కార వాక్యమును గూర్చినాఁడు.

15. "గరుడ గంధర్వ యక్ష కిన్నరులఁ గన్నఁ జెవులు వట్టియాడించు.[29]

(తిక్కన)

"నిను గీతసాహితీ మోహన వాణులు చెవులు వట్టియాడింపఁగా."

"చిన్ని ప్రాయపు లేడిచెవులు వట్టాడించు ..." [30] (చేమకూర)

16. ''తీయనివింటనే వెనుక తీయనిబీరము ... .... '' [31]

(చరికొండ ధర్మన)

"తియ్యనివింటివాని వెనుతియ్యక .... .... [32] (చేమకూర)

సుప్రసిద్ధ సంకీర్తనాచార్యుఁడుగ క్రీ॥ శ॥ 1450 ప్రాంతమున ప్రఖ్యాతిఁగాంచిన తాళ్ళపాక యన్నమాచార్యుల భార్యయగు తిమ్మక్క సుభద్రాకళ్యాణమును ద్విపదకావ్యముగ రచించినది. ఆకావ్యమును తిరుపతి దేవస్థానమువారు ప్రకటించియున్నారు. ''ఈసుభద్రాకళ్యాణమును తాళ్లపాక తిమ్మక్క రచించెను. తాళ్లపాక యన్నమాచార్యునకు తిమ్మక్క, యక్కలమ్మయను నిరువురుభార్యలుండిరి. అందు పెద్దభార్యయగు తిమ్మక్కయే యీగేయకృతికి రచయిత్రి సంగీత సాహిత్య చతురయగు నీయిల్లాలినేలిన యన్నమాచార్యుఁడదృష్టవంతుఁడు. ఇది ద్విపదమంజరీ వికారమనఁదగిన గేయరచన. ఈపాటలోని పలుకుబళ్లుకొన్ని చేమకూర వేంకటకవి విజయవిలాసమునఁ జేరినవి. ఈగ్రంధకర్త్రి యతనికి న్నూరేండ్లకుఁ బూర్వకాలమున వర్తిల్లినదికాన దీనిలోని పలుకుబళ్లు చేము

29 ని. రా. .... తిక్కన .... చ, ఆ, .... వ 25,
30 వి, వి .... .... ప్ర, ఆ, .... వ 90,
ద్వి, ఆ, .... వ 106.
31 చి, భా, — చ, ధ, — ద్వి ఆ, — వ, 80
32 వి, వి, — ప్ర, ఆ, — ,, 78

కూరకవి యుక్తరించె నవలెను"[33] అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సుభద్రా కళ్యాణపీఠికయందుఁ బేర్కొనియున్నారు. ఆసుభద్రాకళ్యాణమును విజయ విలాసమును దులనాత్మకముగ పరిశీలించినచోఁ గొన్ని సన్నివేశములందు సాదృశ్యములు గానవచ్చుచున్నవి.

కొన్ని సాదృశ్యములు :-

1. మం॥ ద్వి॥ ఎగుబుజంబులవాఁడు మృగరాజునడుము
నడచిపుచ్చుకొను సెన్నడుముగలవాఁడు ..
గరగరసివాఁడు చక్కనివాఁడునతఁడు
గొప్పకన్నులవాఁడు కోదండగుణకి
ణాంకంబులౌ బాహులమరినవాఁడు
వెన్నుసమచ్ఛగల విభవంబువాఁడు
బవిరిగడ్డమువాఁడు పన్నిదంబిడిన
వెన్నుపగడ సాలపెసనాడవచ్చు
చిగురొత్తుచంద్రిక చెలగుపాదములు [34] (తిమ్మక్క)

సీ॥ ఎగుబుజంబులవాఁడు మృగరాజమధ్యంబు
పుడికిపుచ్చుకొను నెన్నడుమువాఁడు — [35] (వెంకటకవి)

2. "అయ్యమీరేదేశ మరసిచూచితిరా ?
యెయ్యదిమీనామ ? మెచటనుండుదురొ ? — [36] (తిమ్మక్క)

---

33 సు, క, — తా, తిమ్మక్క — పీఠిక — పే, 3, 4
34 సు. క — తా. తి. ... పే 32 ... 19 నుండి 21 లైనువఱకు
35 వి. వి. .... ద్వి. ఆ. ... ప, 164
36 సు. క. .... తా. తి. .... పే. 28 .... 3 నుండి 16 లైనువరకు

"అప్పుగా మీరిట ముస్నిగన్గొనిస . .
''మీరింద్ర ప్రస్థముగని.సారా ! ——
''తడవాయె భూప్రదక్షిణమడరింపఁగ .37 (వేంకటకవి)

3. "అమరఁగాఁబలికెను సతివతోనపుడు
కోమలి యిద్దరము గోకర్ణమందు
కూడియేయుంటిమి కొన్నాళులచట —— 38 (తిమ్మక్క)

"కోమలియాగతిన్ మదిఁదగుల్పడఁబల్కిన
''తీర్థములనుగ్రుంకి దేవతా సేవలు —— " 39 (వేంకటకవి)

ఇట్లు తిమ్మక్క సుభద్రాకళ్యాణమునకు, వేంకటకవి విజయవిలాసమునకును గొన్ని సందర్భములందు పదగుంఫనములో, వాక్యనిర్మాణ రీతులలో, భావగతులలో, వర్ణనములందును సన్నిహిత సాదృశ్యములు గానవచ్చుచున్నవి. అట్టి సాదృశ్యములను దృష్టిలోనిడుకొని, తిమ్మక్క యొక్క పూర్వకాలికస్థితినిఁబట్టి యాసన్నివేశములందుఁ జెమకూర వేంకటకవి తిమ్మక్కననుకరించినట్లు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, నిడదవోలు వెంకటరావుగారు, పింగళి లక్ష్మీకాంతముగారు, చాగంటి శేషయ్యగారు, దివాకర్ల వెంకటావధానిగారు, తిరుమల రామచంద్రగారు, తిమ్మావఝ్ఝల కోదండరామయ్యగారు మొదలగువారు భావించియున్నారు.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁబడి, తిరుపతి దేవస్థానమువారిచేఁ బ్రకటింపఁబడిన సుభద్రాకళ్యాణమునందుఁ జివర

37 వి. వి. — ద్వి. ఆ. ప. 162, 163, 165

38 సు. క. .... తా. తి. .... పే. 31 (చివరి మూడు లైనులు), 32 (1నుండి 4 లైనువరకు)

39 వి. వి. .... ద్వి. ఆ. ప. 168, 169

"అవనిలో తాళ్ళపాకన్నయ్యగారి
తరుణితిమ్మకచెప్పె దానుసుభద్ర
కళ్యాణమనుపాట కడుమంచితేట
పలుకులన్ — — — " 40

అని చెప్పఁబడిన తీరునుబట్టి యది తాళ్ళపాక తిమ్మక్కచేత రచింపఁబడినట్లు స్పష్టపడుచున్నది.

"తిమ్మక్క స్త్రీజనోపయుక్తమగునట్లుగా సుభద్రాకళ్యాణమను పాటను మంజరీద్విపదలో వ్రాసెను. ఆమె చక్కనిశయ్యలో కోమలమగు రచనచేయఁగల సమర్థురాలు. కథమొత్తముమీద శృంగార రసోచితముగా నడిచినది. గుజలీప్రతులలో చాల తప్పులున్నవి. "వెలయకృష్ణునిపేర విఖ్యాతిగాను, ప్రబల పార్థునిపేర అంకితంబుగను, వరకవితాళ్ళపాక తిమ్మప్ప, చెప్పెను విష్ణుకథ జగతిలోపలను" అని తప్పుగా కాకినాడ కమలాముద్రాక్షరశాలవారచ్చువేసిరి. కాని కీ. శే. వేటూరి ప్రభాకర శాస్త్రిగారు 1950లో నొక ప్రాతతాళపత్రిగ్రంథమును సంపాదించి పరిష్కరించి ప్రకటించినారు. దీనిలో "అవనిలో తాళ్ళపాకన్నయ్యగారి, తరుణి తిమ్మక చెప్పెతాను సుభద్ర, కళ్యాణమనుపాట కడుమంచితేట'' యని కలదు. శ్రీ ప్రభాకరశాస్త్రిగారు 1910లో అచ్చైన గుజలీప్రతిని చూచిరోలేదో తెలియదు. ... .... ఈవిషయము లెట్లున్నను పాట ఒకటి యేయనియు, రచయిత్రి తాళ్ళపాక తిమ్మక్కయేయనియు నిశ్చయముగా భావింపవచ్చును. స్త్రీల నోళ్ళప్రచారమందున్న గేయముతో మార్పులు కూర్పులు సంభవమేకనుక గుజలీప్రతులందు మూలాతిశాయి విషయములు కొన్నిగలవు. చేమకూర వెంకటరాజీపదముకు చూచి యుండు. విజయవిలాసమునందక్కడక్కడ సుభద్రాకళ్యాణపు పోలిక

40 సు, క. — తా. తి. — పే. 54

లున్నవి'' 41 అని డా. బి. రామరాజుగారు తిమ్మక్కయొక్క సుభద్రా కళ్యాణ కర్తృత్వము, వేంకటకవి దానిననుకరించిన విషయమును నిశ్చయించియున్నారు.

తిమ్మక్క సుభద్రాకళ్యాణమునకు విజయవిలాసములోని కొన్ని పద్యములకును పోలికలున్నవని యార్ద్రగారు దెల్పియున్నారు. 42 కాకినాడవారు 1910లో బ్రకటించిన సుభద్రాకళ్యాణము ప్రతిలో దత్కర్త తాళ్ళపాక తిమ్మప్పయని చెప్పఁబడియుండుటచేత తిమ్మప్పయను పురుషునిచేతనే రచియింపఁబడినదని, యతఁడు చేమకూర వేంకటకవి కర్వాచీనుఁడై యుండుననియు తాపీ ధర్మారావుగారు భావించి వేటూరి ప్రభాకర శాస్త్రి మున్నగువారి యభిప్రాయములను ఖండించియున్నారు. మఱియు నాస్త్రీలపాటను తిమ్మక్క రచించినను, తిమ్మప్ప రచించినను రచనా ధోరణిని పరిశీలించినచో నది 17వ శతాబ్దము తరువాతనే రచింపఁబడినట్లు, విజయవిలాస విశేషానుకరణములతో నదికూర్పఁబడినట్లును దేటపడుచున్నదని తాపీవారు దెల్పియున్నారు. 43

ఈసందర్భములో తాపీవారి యభిప్రాయములను బలపఱచుటకు, గొన్ని యాధారముల నారుద్రగారు సూచించియున్నారు. 44 తాళ్ళపాక తిమ్మాచార్యులను నతఁడు పంజ వెంకటరెడ్డికి రంగనాథరామాయణమును 1740 ప్రాంతమున కాపీచేసియిచ్చినాఁడఁట. ఆతిమ్మాచార్యులకుఁ జెందిన కొన్ని విషయము లాంధ్రసాహిత్య పరిషత్తులోనున్న 2610 నంబరు మైరావణ చరిత్రయందున్నట్లు పరిషత్పత్రికయందుఁ దెలుపఁబడినది. 45

41 జా. గే, సా. — బి. రా. — పే. 109, 110

42 స, ఆం, సా. — తొలిరాయలయుగం — ఆరుద్ర — పే. 181

43 హృదయోల్లాసపీఠిక — తా, ధ, రా — పే. 49, 50, 51, 52

44 స. ఆం. సా. — 10వ సం. — ఆరుద్ర — పే. 122

45 ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక .... సం. 6 పే. 238 .... 240

అతాళ్ళపాక తిమ్మాచార్యులే యీ ప్రబంధ సుభద్రాకళ్యాణమును రచించి యున్నచో వివాదముల కవకాశమేయుండదు.

ఆంధ్రసారస్వతపరిషత్తువారు ప్రకటించిన స్త్రీలపాటలలోని సుభద్రా కళ్యాణపు బాటచివర

"ధరణిలో హేమాద్రి తనయు డప్పన్న
గురుభక్తి తిమ్మక్క మధుభక్తి రతియు
మలయుపూర్ణ సుభద్రావివాహ " 46

అనిచెప్పఁబడియుండుటచేబట్టి హేమాద్రితనయుఁడగునప్పన్నకు సంబంధించిన తిమ్మక్క యీ సుభద్రాకళ్యాణమును రచించినట్లు తెలియుచున్నది. దీనినిబట్టి తాళ్లపాక తిమ్మక్కయు నీ తిమ్మక్కయు భిన్నలని తెలియు చున్నది. ఈ తిమ్మక్క చేమకూర కర్వాచీనురాలని, యామె యతని విజయ విలాసము ననుకరించినదనియు భావించుటలో నేవిధమైనవిప్రతిపత్తియు నుండదు.

"విజయవిలాసంలో తిమ్మక్కగారిని కాకపోయినా ఇతరులను స్పష్టంగా వెంకటరాజుగారు అనుసరించారు. అయితే అందువల్ల వారికి వచ్చిన న్యూనత ఏమీలేదు. ఎక్కడనుంచి ముడిసరకు తీసుకున్నా దానిని పుటంపెట్టిశుద్ధిచేసి ఎన్నోనగిషీలు చెక్కందే వెంకటరాజుగారు కావ్యంలో పొదగరు. సారంగధర చరిత్రలో మక్కికిమక్కి అనుసరిస్తున్నతావులలో కూడా తావులు విరజిమ్మినప్రతిభాశాలి ఆయన" 47 అని యీరుద్ర గారే మహాకవియొక్క కవితాప్రతిభకక్షరనీరాజనముపట్టినారు.

46 స్త్రీలపౌరాణికపు పాటలు — ఆం. సా. ప. ప్రచురణ — పే. 228.
47 స. ఆం. సా. ... సం. 10 ... ఆరుద్ర ... పే. 123.

చేమకూర వేంకటకవి బయటపడకుండ పూర్వకవులననుకరించునని, యట్టి యనుకరణలోఁ గూడ స్వాతంత్ర్యమును బ్రదర్శించునని తాపీవారు చెప్పియున్నారు.[48]

"సుభద్రాకళ్యాణమనే పాట వేంకటకవి విజయవిలాసము ననుసరించి వ్రాసినట్లున్నది దీని వ్రాసినకవి తాళ్లపాక తిమ్మక్క" [49] అని చింతాదీక్షితులుగారు చెప్పియున్నారు.

జీరెడ్డిచెన్నారెడ్డిగారు తమ "తిమ్మక్క సుభద్రాకళ్యాణము" అను వ్యాసములో వేటూరివారి వాదమునే బలపఱచినారు.[50]

"తాళ్ళపాక అన్నమాచార్యులపెద్దభార్యయగు తిమ్మక్కయే యీ గేయకృతికి రచయిత్రి. అది ద్విపదమంజరీ ఏకారమనఁ దగిన గేయరచన. స్త్రీ బాలపామరులు కంఠపాఠముగా నేర్వఁదగినది పాడఁదగినది. ఈ పాటలోని పలుకుబళ్లు కొన్ని చేమకూర విజయవిలాసమునఁజేరినవి. ఈ గ్రంథకర్త్రి యతనికి ఇన్నూరేండ్లకు పూర్వకాలమున వర్ధిల్లినది. కాన దీనిలోని పలుకుబళ్లు చేమకూరకవి యనుకరించెననవలెను" [51]
అని తిరుమల రామచంద్రగారు వేటూరివారి యభిప్రాయము ననుసరించి చెప్పియున్నారు.

"తిమ్మక్క తేటమాటలకు విజయవిలాసకర్త ముచ్చటపడి యుంటాడు. దీనిని అనుసరించే అతఁడు తనకావ్యమును వ్రాసినాఁడని యనలేము. కాని యతఁడామె పాటలను తప్పక విని యుండును. లేకున్న

48 విజ్ఞానసర్వస్వము — తెలుఁగుభాషాసమితి ... సం 3 – పే 1106, 1107

49 ప్రజావాఙ్మయము — స్త్రీలసారస్వతము —. చింతాదీక్షితులు — పే. 17

50 కావ్యము — సమీక్ష — జీరెడ్డి చెన్నారెడ్డి — పే. 15 నుండి 34

51 కిన్నెర — ఏరినముత్యాలు — తి రా. — జనవరి, 1951

ఆరెంటికి పోలికలుండి యుండవు" 52 అని బాణగిరి రాజమ్మగారుదాహరణపూర్వకముగఁ బేర్కొనియున్నారు.

ఆయుధాలీ, పులాచి, యేమికార్యము, పొబ్బట్లు, బాలింతరాండ్లు, మోముకు, యవ్వనమా, ముత్తేల, దారబంధము, పొప్పెన, కార్యానికోసమే, నడచేటి, మూసేవె, వంచేవె, ఆదరాన, ముత్యరత్నములు, బుజ్జగించేటి, కలిగుండు, బడవేతుము, కృష్ణుకు, మొదలగు వ్యాకరణ విరుద్ధప్రయోగములు ; నమరకము, తోతొక్కలాడు, ఘడియారము, గండుకోవెల. సవతాడ, ఉమెత్తపువ్వువలె నుతికినమడత, పట్టభద్రుడుః గుబులీకొను, గసగసాలు మొదలగు నాధునిక వ్యవహారములును సుభద్రా కళ్యాణముయొక్క ప్రాచీనతను, తాళ్లపాక తిమ్మక్కయొక్క కర్తృత్వమును శంకింపఁజేయుచున్నవి.

మొత్తముమీఁద నాసాదృశ్యములు యాదృచ్ఛికములని, వానివలన చేమకూర వ్యక్తిత్వమునకు భంగముగలుగదనియు భావించుటలెస్స.

## చేమకూర ననుకరించిన కవులు

చేమకూర వేంకటకవి యితరులననుకరించినట్లే యనంతరదశలో నతని విజయవిలాస కవితారీతుల నితరకవులనుకరించియున్నారు. కొందఱు విజయవిలాసకారుని రమణీయ కవితావిన్యాసములను మక్కికి మక్కియనుకరించియున్నారు. మఱికొందఱు ఛాయారూపమున ననుకరించినారు. అట్టి విజయవిలాసానుకరణములనుబట్టి చేమకూరతరువాత వెలువడిన సాహిత్యముపై నతని ప్రభావమధికముగఁ బడినట్లు స్పష్టపడుచున్నది. భట్టుమూర్తి వసుచరిత్రకవితా ప్రభావమధికముగఁ బడిన ప్రబంధములను పిల్లవసు

52 పరిశోధన — తొలితెలుఁగుకవయిత్రి బాణగిరి రాజమ్మ — ఆగస్టు - సెప్టెంబరు1954

# విజయవిలాసానుశీలనము

చరిత్రలని వ్యవహరించినట్లు చేమకూర కవితా ప్రభావమునకు గుఱియైన ప్రబంధములను పిల్లవిజయవిలాసములని వ్యవహరింపవచ్చును.

తత్కవితావైభవ ప్రభావిత ప్రబంధములలో విజయనందన విలాసము, సుభద్రాపరిణయము, చంద్రికాపరిణయము మున్నగునవి ముఖ్యములైనవి.

*1. విజయనందనవిలాసము :-*

ఇది మంగళగిరి యానందకవిచే రచింపఁబడినది. దాట్ల వేంకట కృష్ణనృపాలున కంకితము గావింపఁబడినది. ఈకవి నియోగిబ్రాహ్మణుఁడని, తిమ్మయామాత్యతనయుఁడని, యాత్రేయగోత్రుడని, గోదావరీ మండలమునందలి ధర్మవర నివాసియనియు నాగ్రంథపీఠికలోఁ జెప్పఁబడినది. అతడు 1700 ప్రాంతమువాఁడని బ్రౌన్‌దొర చెప్పియున్నను కృతిపతినిఁబట్టి 19వ శతాబ్దమువాఁడుగఁ బరిగణింపఁబడినాఁడు.

ఆయానందకవి తన విజయనందన విలాసమును చేమకూర వేంకట కవియొక్క విజయవిలాస కవిత్వము ననేక సందర్భములలో ననుకరించుచు రచించినట్లు స్పష్టపడుచున్నది.

ఈరెండు ప్రబంధనామములకుఁ బోలికలున్నవి. అది విజయుని విలాసములను జిత్రించు ప్రబంధము. ఇది విజయనందనుని (అభిమన్యుని) విలాసములను జిత్రించు ప్రబంధము. విజయవిలాసమువలె నిదియు మూఁడాశ్వాసముల ప్రబంధముగఁ దీర్చిదిద్దబడినది. అతనివలె నితఁడును మృదుమధుర పదభూయిష్ఠమైనశైలి నారాధించినాఁడు.

## కొన్ని యనుకరణలు

*1.* లయవిభాతి :-

చలువలోనఁగెనే సంగజెలువయపుడొక్క-రితె
వలతితనమొప్ప నొకపోలఁతితడిమొత్తెన్ .... ... [53]

(విజయవిలాసము)

సీ॥ కలికియొక్క-త్తె మ్రోల నిలువుటద్దముఁజూప
పసిడిబాగాలొక్క- పణతియొసఁగె [54]

(విజయనందనవిలాసము)

2, పంచచామరము :- కనన్‌సుభద్రకున్ సమంబుగాఁగ [55] ....

(విజయవిలాసము.)

పంచచామరము :- సురాధినాయకాత్మజోక్త సూక్తులన్ని [56]

(విజయనందనవిలాసము)

3, సీ॥ అవలఁబోయిన వెన్క-నాడు పెన్నడులేదు
మొగము ముందఱనంట మొదలెలేదు ....
కిరీ విసరుండు పాండవాగ్రేసరుండు [57]

53 వి. వి .... తృ ఆ. ... ప. ..
54 వి. నం. వి. ... మం. ఆ. కవి. ... పే. 30 ... ప్ర. ఆ.
55 వి. వి. .... ప్ర. ఆ. .... ప. 32
56 వి నం. వి. .. ,, — పే. 31
57 వి. వి. .... ,, — ప. 21

సీ॥ వ్రాయించె నేరాజు వర్ణితజయశుభా
క్షరపంక్తి దిక్తట స్తంభరాశి....
నతఁడు సుగుణాంబునిధి పాండవాగ్రజుండు. 58

4. సీ॥ ఎగుబుజంబులవాఁడు మృగరాజు మధ్యంబు
పుడికిపుచ్చుకొను నెన్నడుమువాఁడు .... 59

సీ॥ మొగులు చాయలవానిఁబగడంబు జగడంబుఁ
దెగఁడు కెమ్మోవి సోయగమువాని . . 60

5. ఆ॥ .... ...
మనసుభద్రసుకృతమహిమయేమనవచ్చు
మనసుభద్రమయ్యెమనకు నెల్ల .... 61

మనసుభద్రసుతునకును సుతనొసఁగిన
మనసు భద్రిమగుసుమాహలాంక ! 62

ఇట్టివిజయవిలాసానుకరణములనేకములిందుఁ గాననగును.

*2. సుభద్రాపరిణయము :-*

ఇదికూచిమంచి జగ్గకవి ప్రణీతము ఆఱాశ్వాసముల ప్రబంధము. ఇఁతడుతన ప్రబంధమును కేవలము వేంకటకవి విజయవిలాసము నెదుటనిడు కొని రచించినట్లుగానవచ్చును. విజయవిలాసానుకరణములనేకము లిందడు

58 వి. నం. వి. .... ప్ర. ఆ. ... పే. 36
59 వి. వి. ... ద్వి. ఆ. .... ప. 164
60 వి. నం. వి. ... ,, .... పే. 70
61 వి. వి. — తృ. ఆ. — ప. 88
62 వి. నం. వి. పే. 76

గడుగునను గన్పట్టును. రెండిటియందు నితివృత్తమొక్కటే. ఇతనిరచనా ప్రణాళికయంతయు నతని పద్ధతిలోనే సాగినది. చేమకూరపోకడలు, పలుకుబడులు, చమత్కారములు, వ్యంగ్యరీతులు, వర్ణనాత్మకధోరణులు, వృత్తవిన్యాసములు, కథాకథనక్రమ పద్ధతిమొదలగు వానిననేక సన్నివేశములలో జగ్గకవి యథాతథముగ ననుకరించినాఁడు. ఈ ప్రబంధమునందు మూఁడాశ్వాసములధికముగనున్నను మొత్తము పద్యములసంఖ్య కొంచె మించుగ నీరెండు గ్రంథములయందు సమానముగానున్నది.

## కొన్నియనుకరణలు

1. శా॥ చంద్రప్రస్థరసౌధఖేలనపర .... 63 (వి. వి.)

2. మ॥ వెలయున్ సర్వపురాధి రాజములలో .... 64 (సు. ప.)

ఈ రెండు పద్యములయందును రెండున్నరపాదము లేక సమాసములో నడుపఁబడినవి.

2. ఉ॥ రేలమృతాంశులో శశముఠెమ్మెదమంచు ... 65

చ॥ మెఱుఁగు కడాని బంగరపుమేడల 66

3. ఉ॥ ఆపురమేలుమేలు బళియంచు .... 67

॥ ఆనగరమేలుమేలుగ .... 68

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 63 | వి. వి. | — | ప్ర. ఆ, | — | ప. 1 | |
| 64 | సు, ప, | — | కూ. జ | — | ప్ర. ఆ. | .. ప, 27 |
| 65 | వి. వి. | — | ప్ర ఆ. | — | ప, 6 | |
| 66 | సు. ప. | | ,, | — | ప. 31 | |
| 67 | వి వి | | ,, | — | ప, 19 | |
| 68 | సు. ప. | .... | ,, | ... | ప, 44 | |

4, ఎత్తుగీతి :- కలఁడెయిటువంటిరాజులోకమునఁనెందు .... 69
,, ఖళిరయాతఁడురాజుగా కిలనొకండు .... 70

5. చ॥ ''అనవిని పాఁపపూపజవరాలెదలో ... ... " 71
"అనిన నప్పాపరాజపరాలు .... .. " 72

6. "ఈజగంబు పాతాళము నేనులూచియ ఖదాన ... ... '' 73
"ఈజగంబు రసాతలంబేనులూచి
యను భుజంగమ రాజకన్యకను ... .... " 74

7. ఉ॥ కన్నియఁగాని వేఱొకతెఁగాను మనోహరరూప .... '' 75
గీ॥ "కన్నియనుగాని వేఱొండుగాదునీకు .... .... " 76

8. సీ॥ ''ఎగుబుజంబులవాఁడు ... .... '' 77
సీ॥ "ఇంద్రనీలపుడాలు నేలుచామనచాయ ... .... " 78

మఱియు "ఈతకు మిక్కిలి లోతుగల్గునే'' మొదలగు జాతీయములను, "మోక్షంబునకుఁబోవ మొసలెత్తుకొనిపోయె" మొదలగు సామెతలను జగ్గకవి విజయవిలాసముసుండి యథాతథముగ గ్రహించినాఁడు.

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 69 | వి. వి. | .... | ప్ర. ఆ. | .... | ప | 22 |
| 70 | సు. ప. | — | ప్ర. ఆ. | .... | వ | 46 |
| 71 | వి. వి. | — | ప్ర. ఆ. | .... | ప | 96 |
| 72 | సు. ప. | .... | ద్వి. ఆ. | .... | వ | 81 |
| 73 | వి. వి. | .... | ప్ర. ఆ. | ... | ప. | 79 |
| 74 | సు. ప. | — | ద్వి. ఆ. | ... | ప. | 88 |
| 75 | వి. వి | — | ప్ర. ఆ. | .... | ప. | 97 |
| 76 | సు. ప. | — | ద్వి. ఆ | .... | ప | 94 |
| 77 | వి. వి. | --- | ,, | .... | ప | 164 |
| 78 | సు. ప. | — | చ. ఆ. | .... | ప | 96 |

ఇట్టి విజయవిలాసాను కరణములనేకములిందుఁ గానవచ్చును.

*3. చంద్రికాపరిణయము :-*

ఈప్రౌఢ ప్రబంధము సురభిమాధవరాయ ప్రణీతము. ఇది శ్లేష భంగిమలతో, రసభరిత వర్ణనలతో, నకుంఠితశైలితో, మృదుమధుర పదజాలముతోను మనోహర ప్రబంధముగ నలరారుచున్నది.

దీనిపై వసుచరిత్ర, విజయవిలాసముల ప్రభావము లధికముగఁ బడినవి. శ్లేషగమకములందు, రసపోషణమునందు, సుందరశైలియందును విజయవిలాసానుసరణము లిందుఁ గానవచ్చును. ఈచంద్రికాపరిణయము వసుచరిత్రకన్న శ్లేషగాంభీర్యముగల్గి, రసనిష్యందంబున విజయవిలాసం బుంబురిణించుచు, కల్పనాప్రౌఢియందాముక్తమాల్యదందలపోయుచు, నట నటన్యాయవైశేషికాది శాస్త్రమర్యాదల ననుసంధించుచున్న యతిప్రౌఢ ప్రబంధము" అని వేదమువారీ ప్రబంధమును ప్రశంసించియున్నారు. ఇట్టి ప్రశంసావాగ్విశేషములీ ప్రబంధము ముందుభాగములోఁ బొందుపఱుపఁ బడినవి.

విజయవిలాస కవితావైభవముచేఁ బ్రభావితములైన యిట్టి ప్రబంధ ములు గొన్ని వేంకటకవి తరువాత వెలసి యాంధ్రవాఙ్మయములో విజయ విలాస ప్రబంధవైశిష్ట్యమును వేనోళ్ళఁ జాటుచున్నవి.

గంటి సుబ్రహ్మణ్యశర్మ, కంభంపాటి గోపాలకృష్ణమూర్తి విజయ విలాసమును గద్యకావ్యములుగ సంతరించియున్నారు. వారు వేంకటకవి విజయవిలాసమునే గద్యరూపమున మార్చినారు. మఱియు నీప్రబంధమును "విలాసార్జునము" అను పేరుతో నాటకరూపమున తాపీ ధర్మారావుగారు మలచియున్నారు. అట్లే దీనిని ముదిగొండ నాగవీరయ్యశాస్త్రిగారుకూడ

"సుభద్రాకళ్యాణము" అను పేర నాటకముగ మార్చియున్నారు. ఇవి యన్నియు విజయవిలాస విలాసరేఖలుగ విలసిల్లుచున్నవి.

## ప్రాయోగికదోషములు

కవితాగుణఖనియగు విజయవిలాసము నందచ్చటచ్చట లక్షణ విరుద్ధములగు ప్రయోగములు గొన్ని కానవచ్చుచున్నవి. పరిణామ శీల మైన జీవద్భాషలోఁ గాలక్రమాను గుణజన వ్యవహారరీతుల ననుసరించి నూతన ధోరణులు గానవచ్చును ఆనూతనధోరణుల ప్రభావమువలన క్రొంగ్రొత్త ప్రయోగములు తలలెత్తుచుండును అవి నిరంతర వ్యవహార బలముచే స్థిరపడి క్రమముగఁ గాలాంతరమున గ్రంథస్థములగును. కవి ప్రయోగమువలన నట్టివానికొక ప్రతిపత్తి యేర్పడును, పూర్వనియమము లనుబట్టి చూచినచో నట్టి ప్రయోగములు లక్షణవిరుద్ధములుగఁ గన్పట్టును. కాని దశాంతరములో మఱొక వ్యాకర్త యట్టి ప్రామాణిక ప్రయోగము లను గుర్తించి వానికి సూత్రబద్ధమైన సద్గతి కల్పించినచో నవి సాధువులే యగును. సంస్కారవంతములైన వ్యావహారిక రూపములకుఁ గవులు తమ కావ్యములందు సరసస్థానములు గల్పింపఁగా నట్టి ప్రయోగములకు వ్యాకర్తలు లక్షణయుక్తములైన లావణ్యముద్రలు వేయుదురు ఒకనాఁటి వ్యాకరణ నియమములకు విరుద్ధములుగనున్న ప్రయోగములు మఱొక దశలో నవవ్యాకరణ బద్ధములు కావచ్చును. అట్టి వ్యాకరణ విరుద్ధ ప్రయోగములకు "ఆర్యవ్యవహారముల దృష్టంబుగ్రాహ్యంబు" 79 అను సూత్రముతోఁ జిన్నయసూరి సంస్కారముద్ర వేసినాఁడు ప్రాణగొడ్డము, కపిలకన్నులు మొదలగు దుష్టసమాసములకు నూరె సూత్రముద్రవలన ననింద్యకక్ష యేర్పడినది నన్నయాది కవీంద్రుల గ్రంథములందుఁగూడ నట్టి ప్రయోగములు గానవచ్చును.

79 బా, వా, ... చి, సూ, — సం, ప, ... సూ, 23

ఒకనాఁటి వ్యాకరణమును దృష్టిలోనిడుకొని చూచినచో విజయ విలాసమునందు విరుద్ధ ప్రయోగములు గన్పట్టును. ఆప్రయోగములు బాల వ్యాకరణ నియమములకు విరుద్ధములుగఁ గన్పట్టును. వానిని చాలవఱకు ప్రౌఢవ్యాకరణ నియమములనుబట్టి సాధింపవచ్చును.

అత్వేత్వములకు సంధిచేయకూడనిచోట సంధిచేయుట, క్త్వార్థకేకార సంధి, కువర్ణకము పరమగునపుడు నగాగమము చేయకుండుట, యను చితస్వర లోపముచేయుట, దుష్టసమాసములు, నాత్మనేపదక్రియల కను ప్రయుక్తమగు 'కొను' ధాతువునకు బదులుగ కవర్ణమును వాడుట, లఘ్వలఘురేఫలకు మైత్రిపాటించుట, రసమును వాచ్యముచేయుట, షష్ఠీ సమాసమునందు నుగాగమము చేయకుండుట మొదలగు వ్యాకరణ విరుద్ధ వ్యవహారములు విజయవిలాసమునందుఁ గానవచ్చును.

1, క్త్వార్థకేకారమునకు సంధిచేసినరూపములు :-

అడిగిచ్చు, అనవలసంటి, అటుఁజూపిటు, చెవులుపట్టాడించు, ఒన ర్చిటు, వరియించిట, అనిట మొదలగునవి

2, చేయకూడనిచోట నత్వసంధి చేసినరూపములు :-

ఈ బిడారు, తేనెలంత, పచ్చితురకొఁగద, మక్కువున్న మొదల గునవి.

3, విరుద్ధముగ నిత్యసంధి చేసిన రూపములు :-

వ అదింత, బంతనున్, మొసలెత్తుకొనిపోయె, బంతిది మొదలగునవి.

4, నగాగమరహితరూపములు :-

సిగ్గుకు, వాదుకు, మంతుకు మొదలగునవి.

5. చేయకూడని స్వరలోపముచేసిన రూపములు :-
చాల్నిలు మొదలగునవి.

6. దుష్టసమాసములు :-
దినచలువలు, జీవగఱ్ఱ మొదలగునవి.

7. నుగాగమరహిత షష్ఠీసమాసరూపములు :-
మొగమందము, అన్నన్న మొదలగునవి.

8. అత్మనే పదార్థకమగు 'కొను' అనుదానికి బదులు 'క' అనుదానిని ప్రయోగించిన రూపములు :-
కట్టుక, తెప్పించుక, ఊదుక మొదలగునవి.

9. లఘ్వలఘురేఫమైత్రిని పాటించిన సన్నివేశము :-
ఉ॥ కోపమొకింతలేదు. ....
రూపము తారతమ్యము లెఱుంగు స్వతంత్రుఁడు నూతనప్రియా 80
క॥ కురువీర : వసింపఁగనీ, కుఱువీర .... 81

10. రసమును వాచ్యముచేసిన సన్నివేశములు :-
1. ఎత్తుగీతి :- శాంతసరమెల్లనుట్టిపడఁగ .... 82
2. తే॥ గీ॥ అంతిపురమున ....
.... .... శృంగారరస .... 83

80 వి. వి. ... ప్ర. ఆ. ... ప. 23 (ద్వితీయపాఠము)
81 వి. వి. .... ప్ర. ఆ. — ప. 80
82 వి. వి. — ద్వి. ఆ. — ప. 81
83 వి. వి .... తృ ఆ. .... ప. 11

ప్రయోగ పరామర్శ :-

1. "క్త్వార్థంబైన యిత్తునకు సంధిలేదు" అని బాలవ్యాకర్త నిషేధించుట వలన క్త్వార్థకేకారసంధివ్యాకరణ విరుద్ధముగఁ బరిగణింపఁబడుచున్నది. కాని "అందిమ్మి (భార విరా, వ 4ఆ 112), వెఱచిట్లు (నిర్వ ఉ. రా. 5ఆ, 88.), ఎఱిఁగెఱింగి (భాగ. 9స్కం. 515) చెప్పంబడే (ప్రబో ప్ర. 4ఆ. 146)" మొ॥ లగు తిక్కన, పోతన, సూరనాది ప్రాచీనకవి ప్రయోగములు గానవచ్చుటచేఁ బ్రౌఢవ్యాకర్త "ఇప్రత్యయాంతావ్యయమునకు సంధియుఁ జూపట్టెడి" [84] అను సూత్రము చెప్పి యట్టిప్రయోగములకు గతికల్పించినాఁడు. ఆ ప్రౌఢవ్యాకరణ నియమానుసారము చేమకూర చేసిన క్త్వార్థకేకార సంధులన్నియు సాధువులేయగును.

2. "షష్ఠీసమాసమునందుకారఋకారములు కచ్చుపరంబగునపుడు నుగాగమంబగును" అను బాలవ్యాకరణ నియమమునుబట్టి నుగాగమరహిత షష్ఠీసమాసరూపములు నియమబాహ్యములుగఁ గానవచ్చును. "గోరుం మిల్లులు (హరి పూ 5ఆ. 203), బర్చ్చుం (పాండు 3ఆ 16), శిరసంపంబు (కళా, 7ఆ 126)" అను నెల్లూరి, రామకృష్ణ, సూరనాది ప్రామాణిక కవుల ప్రయోగములు గ న్పట్టుచున్న కారణమున "కొన్నిచోట్ల షష్ఠీసమాసమునందుకారాంతంబున కచ్చుపరంబగునపుడు నుగాగమంబునకు లోపంబునగు" [85] అను సూత్రమును గల్పించి ప్రౌఢవ్యాకర్త యట్టివానిని వ్యాకరణశుద్ధములు గావించినాఁడు. విజయవిలాసకారుని ప్రయోగములీనియమమునుబట్టి వ్యాకరణశుద్ధి నొందినవి.

3. "కువర్ణకంబు పరంబగునపుడు కారఋకారములకు నుగాగమంబగు"

---

84 ప్రౌ వ్యా — బ. పీ. .... సంధిప. — సూ. 2.

85 ప్రౌ. వ్యా — బ. సీ. — సంధిప, సూ. 12.

అను బాలవ్యాకరణ సూత్రమునుబట్టి యట్టి సన్నివేశములందు నగాగమ రహితరూపములు లక్షణవిరుద్ధములుగఁ బరిగణింపఁబడుచున్నవి. "ఉత్సవముకేఁగెడు (హరి. 6ఆ. 140), బచ్చుకున్ (శృం. నై. 6ఆ. 115), నగుఁబాటుకోర్చి (భోజ. 5ఆ. 95) మొదలగు ప్రామాణికకవి ప్రయోగములను సాధించుటకై ప్రౌఢవ్యాకర్త "కువర్ణకంబు పరంబగునపుడు కవిత్రయంబువారి ప్రయోగంబులందక్కఁ దక్కిన మహాకవి ప్రయోగంబులందు నంగొన్నియెడల నగాగమంబు చూపట్టదు" [86] అను సూత్రమును గల్పించినాఁడు. దీనినిబట్టి చేమకూరవాని నగాగమరహితరూపములు సాధువులేయగును.

4. అత్వసంధిబహుళముగ, నిత్వసంధివికల్పముగను జెప్పఁబడుట వలన శ్రుతికటువులుగాని యాసంధిరూపము లామోదయోగ్యములగును.

5. ప్రామాణికకవులు ప్రయోగించిన వైరిసమాసముల కనింద్యగ్రామ్యములను పేర బాలవ్యాకర్తయే స్థిరముద్రవేసినాడు. తద్రూపమున వేంకటకవి వాడిన వైరిసమాసములకుఁగూడ లక్షణశుద్ధి యేర్పడినట్లు భావింపనగును.

6. "పదాంతంబులై యసంయుక్తంబులైన ములురుల యుత్వమునకు లోపంబు బహుళమ్ముగానగు" [87] అను సూరిసూత్రమునుబట్టి 'చాల్నిలు' వంటి చేమకూర రూపములను సరిపుచ్చుకొనవచ్చును.

7. పోతనాదులు పాటించిన లఘ్వలఘురేఫమైత్రిని వేంకటకవి యొండురెండుచోట్లఁ దనకవితాప్రవాహములో దొర్లించుట దోషముగాదని భావింపనగును.

,, శ, ప, 19

87 బా. వ్యా. చి. సూ. ప్ర. ప. 16

8. కవులచ్చటచ్చట రసమును వాచ్యము చేసియున్న సన్నివేశము లనుబట్టి యితఁడుగూడఁ దన విజయవిలాసమునందు రెండు సన్నివేశము లలో రసమును వాచ్యము చేయుటయంత లోపముగఁ గానరాదు.

9. "కొను" నకు బదులు 'క' ను వాడుట సంస్కారసముపేత సామా జికవ్యవహారప్రభావమని గ్రహింపనగును. అట్టి ప్రయోగములు దక్షి ణాంధ్రయుగమునకుఁ జెందిన గ్రంథములందుఁ దఱచుగఁ గానవచ్చును.

అట్టి విజయవిలాస కవితారసప్రవాహములో నీయల్పాల్ప దోష ములు గణనీయములుగావు. "ఏకోహిదోషో గుణసన్నిపాతే నిమజ్జతీందోః కిరణేష్వివాంకః" అని కాళిదాసు చెప్పినట్లు గుణప్రవాహములో నల్పదోష ములు నిమగ్నములగును. కొన్ని సందర్భములందు శబ్దచమత్కారముల కొఱకు, మఱికొన్ని సందర్భములందు భాషాసౌలభ్యముకొఱకు నట్టి ప్రయోగములను వేంకటకవి చేసినాఁడని భావించుట లెస్స. ఆదోషము లైనను పంౘడెండుకంటె మించి కానరావు శివకవులిట్టి ప్రయోగములనేక ములు చేసియున్నారు. "అవి సరదాకు చేసిన తప్పులు" 88 అని విశ్వ నాథవారు చెప్పియున్నారు.

అప్పకవి, లింగమగుంట తిమ్మన. కూచిమంచి తిమ్మన మొదలగు లాక్షణికులు చేమకూర వేంకటకవిని ప్రామాణికునిగఁ బరిగణించి యతని పద్యములను గొన్నిటి నుదాహరించియున్నారు. ముఖ్యమైన రసమును, చమత్కారములను, సరసములైన సామెతలను, జాతీయములను, తదితర కవితాగుణములను దృష్టిలోనిడుకొని పరిలించినచో విజయవిలాసముత్కృష్ట ప్రబంధముగ గోచరించును.

88 వి. వి. పీఠిక (ఎమెస్కో) — వి. న. ... పే. 32

## లోకోక్తులు, జాతీయములు, సామెతలు.

విజయవిలాసము లోకోక్తులతో, జాతీయములతో, సామెతలతోను నిండియున్నది. వేంకటకవి లోకోక్తులలో నతని లోకజ్ఞాన సంపన్నత్వము, విశాలభావ విశేషములు, నీతిమయ వాగ్ధోరణి, విశ్వకళ్యాణనిరతియు వ్యక్తములగును. ఈకవీంద్రుఁడు ప్రకృత విషయములను సమర్థించుటకై చెప్పిన లోకసామాన్యోక్తులన్నియు లోకోక్తుల పరిధిలోనికిఁ దీసికొని రాఁబడినవి. సాధారణముగ నర్థాంతరన్యాసాలంకార సన్నివేశములందీ లోకసామాన్యోక్తులు గానవచ్చును. అట్టి లోకోక్తులతని భావములకు జీవము పోసి, చేవనుజేకూర్చినవి. అట్టి సులభావిష్కారములైన లోకోక్తులతని కవితాలతాంగి కవధులులేని విశ్వవిఖ్యాత నిర్మలకీర్తి నార్జించి పెట్టినవి.

అట్లే విజయవిలాసమునందలి జాతీయములు, సామెతలు నాకవీంద్రుని భాషాపాటవమును, సంప్రదాయజ్ఞతను, వ్యావహారిక ప్రయోగ గౌరవమును, లోకానుభవమును, జాత్యభిమానమును వ్యక్తముగావించు చున్నవి. భావగంభీరములైన జాతీయముల నెన్నుకొనుటలో, సమయానుకూలములైన సామెతలను సరసభావ ప్రోద్బోధకములుగ వాడుటలో నతనికిఁగల సామర్థ్యము సాటిలేనిదని చెప్పవచ్చును.

లోకోక్తులు మానవహృదయమును సంస్కరించి కవులకు లోకోత్తరఖ్యాతి నార్జించిపెట్టును. మహాకవుల కీర్తిసౌధములకవి మూలస్తంభములు.

జాతీయములు, సామెతలును సహృదయులకు సూటిగా హత్తుకొని యొకవిధమగు నాత్మీయతను బెంపొందించును. వేంకటకవి యట్టి లోకోక్తులను, జాతీయములను, సామెతలను వాడి యపూర్వకీర్తి నార్జించుకొనినాఁడు.

## లోకోక్తులు

1. ఏయెడ నింపుగావు గణియింప నసఃపీవయోవిలాసముల్ (1-33)
2. క్షితినటుగాదె యొక్కొ-రికిన్ నడుమంత్రపుఁగల్మికల్గినన్ (1-34)
3. ఎంత ఘనసాహసమింతులకు ? (1-87)
4. ప్రాణదానంబుకన్న సం ప్రశమగలదె ? (1-93)
5. పరసతి నెనయుట రాజులకు ధర్మమే ? (1-95)
6. ఎయ్యెడమేలెచూతురు, గ్రహింపరు జాణలు జాఁబుపాటులన్ (1-107)
7. అట్లొగద యెట్టివారలకు నగ్గలపుందమి గల్గియుండినన్ (1-108)
8. ఉర్వీస్థలిలో నొకరాజు సన్నగిల్లిన నొకరాజుంతంతకున్ మహోన్నతిఁగనఁడే ! (1-144)
9. ఏగతి రచియించిరేని సమకాలము వారలు మెచ్చరేకదా! (1-145)
10. అర్థమే యిట్టిబాధ బింబాధరలకు (2-61)
11. యతులకు విధేయులగుదురు యాదవులు (2-80)
12. తలంపెఱుంగకే కలయఁగఁజూచుటల్ తగవుగాదు (2-145)
13. నేరములె యెంచెదమటన్న నేరికైనఁగలవు పరికించిచూడ (3-17)
14. మనమునసున్నది మొగమునఁగనిపించున్ (3-27)
15. స్వకపోలకల్పిత మనోజ్ఞ కళాగతికెట్టులౌనుసరిఛాయా చోరకరుచిసందర్భంబు ? (3-91)
16. ఆఁడుఁబుట్టువు పుట్టింటికానపడును (3-133)
17. ఇటువంటివె రాచవారితోఁ బొందులు (3-148)
18. తెగరానిచోట సైరణతగదా ! (3-168)
19. తొలుతఁదమునేఁచువారలె కొలిచియుండు వేడ్క-కన్నను మఱివేఱె వేడ్క-గలదె ? (3-226)
20. నదుఃఖం పంచభిస్సహ (2-64)

మొదలగునవి విజయవిలాసమునందు ముఖ్యలోకోక్తులుగఁ గాన వచ్చుచున్నవి.

## జాతీయములు

1) పెట్టనికోట (1-9),
2) ఉక్కుతుక్కులు (1-10),
3) వేయునోళ్ళ (1-11),
4) జీవగఱ్ఱ (1-19),
5) కొంగుపసిండి (1-23),
6) నిక్కెడు; నీల్గెడు, విఱ్ఱవీఁగెడున్ (1-34),
7) తోఁసిరాజు (1-37),
8) శిలాక్షరములు (1-54),
9) ఏనుఁగుపాడి (1-54)
10) పంచబంగారమై పాఱఁదఱిమె (1-57),
11) తలపై నెక్కించుకొను (1-49),
12) చెవులు పట్టియాడించు (1-90,)
13) జాదులను బ్రసాదము (2-10),
14) కాయోపండోపోయినపని (2-141)
15) చెట్టువట్టు (2-159),
16) కాలుద్రోఁక్క (2-159),
17) మిట్టమీసైపడు (3-12),
18) కృష్ణ ! కృష్ణా ! రామ ! రామా! (3-25),
19) కన్గిలుపుట (3-28),
20) మాటలువచ్చున్ (3-58),
21) తాఁగుతలఁబోసికొమ్ము (3-53),

22) తెఱచిరాజు (3-114).
23) కడుపు చుమ్మలుచుట్టు (3-135).
24) చేతికిఁగన్నులుగలవు (3-154).
25) దొరకునన్నానము (3-162)

మొదలగు జాతీయములతో నాంధ్రభాషాజీవశక్తి జాలువాఱుచున్నది.

## సామెతలు

1. వంటయింటి కుందేలిది యెందుఁబోఁగలదు. (1-6)
2. ఏటికివచ్చెనమ్మ యీ పిలువని పేరటంబు. (1-13)
3. నిత్యకల్యాణముఁ బచ్చతోరణము.(1-18)
4. ఈఁతకు మిక్కిలిలోఁతుగల్గునే. (1-102)
5. సిగ్గుకు సిగ్గులేదు. (2-30)
6 మోక్షమునకుఁబోవ మొసలెత్తుకొనిపోయె (2-43)
7. చేసినయది జపమున్ మఱివేసినయది గాలమున్. (2-135)
8. పెద్దలున్నారెఱిఁగి వారె పెండ్లిసేయఁగలరు (2-187)
9. ఈఁదాడన్నను మదనుఁడు కోఁదాడనువాఁడు. (2-192)
10. చదువఁబెట్టఁగనున్న మతియుఁబోయె. (3-10)
11. చంకలబిడ్డలూడిపడ. (3-34)
12. విండ్లమ్ములు గలవారికిఁ దోడు చల్లకడవ-వారే. (3-44)
13. అందినన్ సిగయు నందకయున్నను గాళ్లుఁ బట్టుకొను. (3-51)
14. నాగవలిలోపల నిష్ఠురమేల పల్కఁగన్ (3-171)

మొదలగునవి

విజయవిలాసమిట్లనేక లోకోక్తులకు, జాతీయములకు, సామెతలకు నాటపట్టై, యాంధ్రజాతియొక్క యనుపమ చైతన్యశక్తి కాలవాలమై యలరారుచున్నది.

## సమకాలిక సాంఘిక రాజకీయాది పరిస్థితులు

సామాజిక జీవనవ్యవస్థలో కవి వహించు పాత్ర చాల ప్రముఖమైనది. సంఘమునకు వ్యక్తికి నవినాభావసంబంధముగలదు. కవిగూడ సంఘములో నొకడై ప్రతిభాసమన్వితకవితాశక్తితో కళాసేవచేయుచుండును. అది పరోక్ష ప్రజాసేవగాఁబరిగణింపఁబడును. అతని రసమయ కవితాసృష్టిలోఁ బ్రకృతియంతయు చైతన్యవంతమై నిత్యనూతనశోభతో విరాజిల్లుచుండును. జడపదార్థములనుగూడ తనకమనీయకవితాస్పర్శచేఁ జైతన్యగుణయుతోఁదేజరిల్లఁజేయుశక్తి కవికిమాత్రమేగలదు. కనుకనే యితరకళాకారులకంటెఁగవి కడువిశిష్టుఁడుగఁ బరిగణింపఁబడుచున్నాఁడు. సంఘములోఁదానొకఁడై జీవయాత్ర సాగించుచున్న కారణముచేతఁగవి యొక్క-యమలినమనస్తత్త్వము సమకాలికసాంఘికపరిస్థితులప్రభావమునకు గుఱికాకతప్పదు. కనుకనే యతని కావ్యములో నాఁటిసాంఘిక రాజకీయాది పరిస్థితులు ప్రతిబింబించును. కవులు తమకావ్యములలో తమకు పరిచితములుగాని స్వర్గపాతాళలోకసంబంధములైన యితివృత్తములు స్వీకరించినను, గతయుగవిశేషములను వివరించినను సమకాలిక పరిస్థితుల ప్రభావములకవి గుఱికాకతప్పదు. ప్రపంచములోనేజాతికిఁజెందిన సాహిత్యమునకైననిది సహజలక్షణముగఁగానవచ్చును. ప్రాచ్యపాశ్చాత్యసారస్వత విమర్శకులీవిషయమునసేకాభిప్రాయము గలిగియున్నారు. "Literature is intimately related to society. Society influences literature in manyways and the connections of litirature with society are integral and pervasive. Literature is the finest expression of Contemporary feelings. Those who understand literature Can learan from it the most about the thought of the period" 1 అని డాక్టర్ బి. ఆర్. మల్లిక్‌గారు వాఙ్మయమునకు సంఘమునకునుగల

1. Principles and history of literary criticism —
Dr. B. R. Mallik — P. 14

# విజయవిలాసానుశీలనము

సన్నిహితసంబంధమును వాఙ్మయముపైఁగల సంఘప్రభావమును స్పష్ట పఱచియున్నారు. సమకాలికభావములను సాహిత్యము చక్కఁగాఁ బ్రకటించునని యాయాంగ్లవిమర్శకోత్తముల యభిప్రాయము. కొందఱు కవులు ప్రయత్నపూర్వకముగ సమకాలిక స్థితిగతులను సందర్భానుగుణముగ వ్యంజింపఁజేయుదురు. మఱికొందఱి కావ్యములలోనవి యప్రయత్నపతిత ములైనట్లు కానవచ్చును. శ్రీనాథాదికవీంద్రుల గ్రంథములలోనట్టి సాంఘిక చైతన్యస్ఫూర్తి యతిదేశస్థాయిలోఁగానవచ్చును. కనుకనే "జాతీయకవి" యను కతపత్త్రము ప్రాచీనకవులలో నొక్క శ్రీనాథునకే లభించినది.

చేమకూర వేంకటకవియొక్క కృతులలోఁగూడ నాఁటిసాంఘిక రాజకీయాది పరిస్థితులు చక్కఁగా బ్రతిబింబించుచున్నవి. అతని విజయవిలాసము సమకాలిక సాంఘికచైతన్యసరిత్సంతతిగ నలరారుచున్నది. 17వ శతాబ్దమున వెలసిన యీ మధురకావ్యములో నాఁటి యాంధ్రుల యాచారవ్యవహారములు, వేషభాషలు, ఉత్సవములు, నాటపాటలు, సంగీతనాట్యాది కళా ప్రతిభలు, ప్రభువుల పరిపాలనారీతులు, దానధర్మములు, వివిధవాద్యవిశేషములు, వైవాహికవైభవములు; వియ్యాలవారి మర్యాదలు, వారి సయ్యాటలు, పడకటింటిముచ్చట్లు, విలాసవస్తువులు, నాయుధవిశేషములు, పుణ్యతీర్థములు మున్నగునవి సందర్భోచితపద్ధతులలో మనోహరముగ సూచింపఁబడినవి. తమిళదేశమందున్న తంజావూరు ప్రాంతము నేలిన రఘునాథ నాయకు నాస్థానకవియైయున్నను చేమకూరవేంకటకవి యాంధ్రుఁడై జాత్యభిమానము గలిగియున్న కారణమున తన విజయవిలాసమును స్వజాతీయ సంస్కృతి కాటపట్టుగాఁ జేసినాఁడు.

*మత పరిస్థితులు* : తంజావూరు నాయకరాజులైన చెవ్వప్ప, యచ్యుతప్ప, రఘునాథ, విజయరాఘవనాయకులు వైష్ణవమతాభిమానులుగ వాసికెక్కిరి. తాను ప్రత్యేకముగ రామాయణమును రచించి, శ్రీరామ

విలాసాది సుందరభవనములను రామాలయములను నిర్మించి రఘునాథ నాయకుడు స్వనామాంకిత దైవమునారాధించి తరించినాడు. అతడు వైష్ణవము నభిమానించినను పరమతములను నిరసింపలేదు, మతపరమార్థము గ్రహించిన మాన్యుడగుటచే నారాజోత్తముడు విష్ణుశంభు మతములను రెండిటినితుల్యప్రాధాన్యముతో గౌరవించినాడు[2] "Raghunatha Nayak Maintained Strict religious neutrality though a Vaishnavait and honoured the Madhva saint Sudhindra with Kanakabhisheka"[3] అని రఘునాథుని సర్వమత సమభావము నాధునిక పండితులు ప్రశంసించి యున్నారు. విజయ విలాసావతారికయందలి తొలిమూడు పద్యములలో జేమకూర వేంకటకవి క్రమముగ శ్రీరాముని, రంగనాథుని, వేంకటేశ్వర స్వామిని వర్ణించియుండుటను బట్టి యాకాలములో వైష్ణవమతము రాజాదరణమును బొంది ప్రజాభిమానమును జూరగొన్నదని తెలియుచున్నది. చెవ్వప్ప మొదలగు నాయకరాజులుచేసిన యాలయగోపురావణాదినిర్మాణములనుబట్టి, దానధర్మములనుబట్టియు నాటి ప్రభువుల పారమార్థికదృష్టి, ధార్మిక బుద్ధియు వ్యక్తములగుచున్నవి.[4] మణీతుల, తులాపురుషాది మహాదానములు నాడువ్యాప్తిలోనున్నట్లు తెలియుచున్నది.[5] దేవాలయములందు, రాజప్రాసాదాంతర్గత దేవతామూర్తులకడ, సంస్కారవంతుల గృహములందలి దేవప్రతిమలవద్దను నిత్యము జరిపెడి ధూపదీపనైవేద్య విధానము నాటియాంధ్రుల యాస్తికతాబుద్ధిని, పారమార్థికదృష్టిని, నియమనిష్ఠలను సూచించుచున్నది. హైందవ పవిత్ర సంస్కృతికాటపట్టులైన గోబ్రాహ్మణులపై నాటి ప్రభువులు. ప్రజలు నధికభక్తివిశ్వాస

2. వి. వి. అవతారిక — ప. 7

3. A Descriptive Catalogue of the Telugu Manuscripts (T. M. S. S. M. Library, Tanjore) P.P.S. Sastry (Editor) P. 11

4. వి. వి. అవతారిక — ప, 10, 14, 15, 21.

5. ,, — ప. 15, ప. 128 (ప్ర. ఆ.)

ములు గలిగియుండెడివారు [6] రఘునాథనాయకుఁడు బ్రాహ్మణులపై నపార భక్తిభావముగలవాఁడై నిరతాన్నదానముతో, నగ్రహారాది దానముల తోను వారిని సంతృప్తిపఱచినాఁడు. [7] రాజులు, ప్రముఖాధికారులును తీర్థయాత్రలకేగునపుడు పరిణయమునకేగినట్లు బంధుమిత్ర పురోహిత పరివారసమేతముగ వెళ్ళెడివారు.[8] అర్జునుని తీర్థయాత్రా ప్రకారమును వర్ణించునెపమున వేంకటకవి నాఁడు ప్రసిద్ధినొందిన ద్రాక్షారామాంతర్వేది శ్రీశైల తిరుపతి కాళహస్త్యాద్యాంధ్రపుణ్యక్షేత్రముల, నాయాక్షేత్రపాలకస్వాములను బేర్కొనియున్నాఁడు.[9] ఆసందర్భములో నర్జునుఁడు రఘువీర భూరభుజ భుజాదర్పదర్పణంబగు రామాయణమును పారాయణముచేసినట్లు ప్రత్యేక శ్రద్ధతోఁజెప్పుటవలన రఘునాథనాయకుని రామాయణ రచనయు, పవిత్ర రామాయణపారాయణముచేయు నాంధ్రులసదభ్యాస సంపత్తియును ధ్వనించు చున్నవి. మఱియు నీకవీంద్రుఁడు పుణ్యక్షేత్ర వర్ణనాత్మకమగు నీ వచనములో శైవ వైష్ణవక్షేత్రములను సమాప్రతిపత్తితోఁ బేర్కొని విజయనగరప్రభువుల నాదర్శముగఁగైకొని పరిపాలనారీతిని సాగించిన రఘునాథ నాయకునియొక్క, తదధికారవర్గముయొక్క, సామాన్యప్రజలయొక్కయు మాన్యమతసహనప్రధానమును సూచించియున్నాఁడు. ఈవిషయము నీకవియే యీగ్రంథావతారికలోఁ బ్రత్యక్షముగఁ బేర్కొనియున్నాఁడు. [10]

"గోవధమారించుఁ బెంపడరి లతాంగి! పచ్చితురకౌఁ గద యమ్మదనుండు చూడఁగన్" [11] అని మదనోపాలంభనాత్మక వర్ణనములోఁ జెప్పఁ

6. వి. వి. — ప్ర. ఆ. — ప. 44.
7. వా. చ. — రఘునాథనాయకుఁడు — ఆశ్వాసాంతగద్యము,
8. వి. వి. — ప్ర. ఆ. — ప. 45, 46.
9. ,, — ,, — ప. 128.
10. వి. వి. — అవతారిక — ప. 7.
11. ,, — తృ ఆ, — ప, 66

బడిన వాక్యము వలన నాటి తురకలవ్యాప్తి, కఠినహృదయులై వారుచేసిన దురాగతములు, గోవధలును సూచింపబడినవి మఱియు నీసన్నివేశములో తురకసైనికులు మదుపానమత్తులై, యాయుధపాణులై, యశ్వములపై నధిరోహించి భయంకరముగ సంచరించెడివారను విషయముగూడ సూచింపఁ బడినది. తాళికోట యుద్ధములో విజయము సాధించిన తరువాత తురకలు దక్షిణహిందూదేశమున నిరాఘాటవిరవిహారములు సల్పిరి. వారి ఘాతుక చర్యలకు మేరలేకపోయినది. వారికి స్వమతముపై నత్యంతాభిమానము, పరమతముపై విపరీత ద్వేషము నుండెడివి. అట్టి మతద్వేషముతో నాతురకలు హిందూదేవాలయములను ఎడఁగొట్టి, విగ్రహములను పగులగొట్టి, తరతరములనుండి పేరుకొనియున్న పురాతన భారతీయ సంస్కృతిని నాశనము గావింపఁబ్రయత్నించిరి. హిందువులకుఁ బూజనియములైన గోవులను వధింప జొచ్చిరి. వారి దుష్కార్యములను గొన్నిటిని చేమకూర వేంకటకవి ప్రత్యక్షముగఁజూచి, మఱికొన్నిటినివినియున్నకారణమున వానిని సందర్భానుగుణముగ నీ పద్యములో ధ్వనింపఁజేసినాఁడు. ఇందు "తురక" యను శబ్దమునకు "పచ్చి" యను విశేషణముతో తురకల కర్కశ స్వభావమును, పాశవిక ప్రవృత్తిని వ్యంజింపఁజేసినాఁడు.

వైష్ణవమతముతో పాటు శైవమతము గూడ నారోజులలోఁ గొంత వ్యాప్తినందినట్లు తెలియుచున్నది. బలరామాదులు పశుపతినిఁ బూజించుట కంతర్ద్వీపమున కేగినట్లు వర్ణించుటనుబట్టి నాఁటి ప్రజల మాహేశ్వరపూజా తత్పరత వ్యక్తమగుచున్నది. [12] ఆశ్వాసములో సింధుధరోత్సవము నిరువది రోజులు చేసెడివారని వేంకటకవి యీ సందర్భములో సూచించియున్నాఁడు. తంజావూరి నాయకరాజులు మౌలికముగ వైష్ణవమునభిమానించినను పరమతమునుద్వేషింపని కారణమున ప్రజలు స్వేచ్ఛగా తమయారాధ్యదైవముల

12 వి. వి .... తృ. ఆ ... ప. 70, 71, 72.

నరమరికలు లేకుండఁ బూజించినారనియు నీ సన్నివేశమును బట్టి తెలియు చున్నది. దేవతపేరిట నేడాదికొకపర్యాయము భక్తిశ్రద్ధలతో జాతరచేయు నాంధ్రుల ప్రాచీనసంప్రదాయము గూడ నీఘట్టములో సూచింపఁబడినది. ఈ జాతరలు ప్రాచీనద్రావిడ నాగరకతా ప్రత్యేకచిహ్నములుగఁ బరిగణింపఁబడుచున్నవి.

రఘునాథనాయకుని పరిపాలనా సమయమున మహమ్మదీయ క్రైస్తవ మతములు గూడఁ గొంత వ్యాప్తినొందినవి. నాఁడామాస్వామూర్తియొక్క ప్రోత్సాహమున వెలసిన క్రైస్తవాలయములు, మసీదులు నితని నిరుపమ మత సహనశీలమును బ్రకటించుచున్నవి,

నాఁటి ప్రభువులు, ప్రజలును వైదికమతాచారములను బాటించి యుండుటను బట్టి వైష్ణవమతముతోపాటు వైదికమతముగూడ వ్యాప్తినంది నట్లు తెలియుచున్నది. తంజావూరినాయకరాజులు వైదికమతముపైఁ నభిమానముగలవారై కృష్ణా గోదావరీ ప్రాంతములనుండి వేదపండితులను రప్పించి వారిచే యజ్ఞయాగాదులు చేయించెడివారు. రఘునాథనాయకుఁడు నిత్యము మహాయజ్ఞములు చేసెడివాఁడఁట. "వన్నెగాఁబౌండరీక వాజపేయాదులైన జన్నములెల్లనేసి" [13] అని తాతాచార్యులను విజయరాఘవుఁడు వర్ణించి యుండుటచేబట్టి నాఁటి ప్రముఖవైష్ణవులు గూడ యజ్ఞయాగములు చేసెడివారని తెలియుచున్నది. రఘునాథనాయకునిచేఁ బోషింపఁబడిన గోవింద దీక్షితయజ్ఞనారాయణదీక్షితాదులు, విజయరాఘవనాయకునిచేఁ బోషింపఁబడిన పురుషోత్తమదీక్షితుఁడు, కోనేటిదీక్షితుఁడు కామరసు వేంకటపతి సోమయాజి మొదలగువారు వైదికమతాభిమానులై యజ్ఞయాగాదులు చేసినవారుగఁగాన వచ్చుచున్నారు, త్రేతాగ్ని ధూమములతో వీథులు, వాకిళ్ళు నిండియుండెడి

13. రఘునాథాభ్యుదయము ... విజయరాఘవుఁడు ... P. 4,

వని నాఁటి పండితుఁడైన ధర్మాధ్వరి తన తత్త్వచింతామణిప్రకాశనివృత్తి యందు వర్ణించియున్నాఁడు.

చెవ్వప్పనాయకుఁడు శ్రీశైలములోఁ బ్రాకారసోపానములను, వృద్ధాచలములోఁ బ్రాసాదమంటపములను, నరుణాచలములో సమున్నత గోపురమును నిర్మించుటనుబట్టి, యచ్యుతప్ప నాయకుఁడు శ్రీరంగేశునకు సువర్ణ సింహాసనపర్యంక రత్నాంగద కిరీటాభయహస్తములను జేయించుటను బట్టియు నాయకరాజుల శివకేశవాభేదభావములు వ్యక్తములగుచున్నవి. 14 సేవాధర్మముయి శరణాగతియను ప్రపత్తి, ప్రకృతిపురుష ప్రేమ భావ మున్నగు వైష్ణవ సంప్రదాయములు నాఁటి గ్రంథజాలములో వర్ణింపఁబడుటను బట్టి నాఁటి సాహిత్యముపైఁగల వైష్ణవమతప్రభావము వ్యక్తమగుచున్నది, ముద్దుపళని రాధికా సాంత్వనములో, సారంగుతమ్మయ వైజయంతీ విలాసములో, క్షేత్రయ్యపదములలోను నట్టి వైష్ణవమత ప్రభావముగానవచ్చును. మొత్తముమీద నాఁటి సామాజిక జీవనవ్యవస్థతో శైవ వైష్ణవధర్మములు పెనవేసికొనియున్నవని తెలియనగును.

## జనుల వేషములు

నాఁటిజనుల వేషధారణము చాలవఱకు స్వజాతీయ సంప్రదాయానుగుణముగ నుండెడిది. రాజుల వేషములు రాచఠీవిని ప్రదర్శించుచుండెడివి. పసిడికుళ్ళాయి, హురుముంజిముత్యాలహారములు, పీతాంబరము, గండపెండేరము మున్నగునవి నాఁటి రాజభూషణములుగఁ బేర్కొనఁబడినవి. 15 హురుముంజి ప్రాంతము నఁ భించిన ముత్యములను హురుముంజి ముత్యములని వ్యవహరించెడివారు. ఆముత్యములు శ్రేష్ఠములైనవిగాఁ బరిగ

14 వి. వి. అవతారిక వ. 10,13

15 వి వి అవతారిక వ. 36

ణింపఁబడెడివి. ఆనాఁటి రాజులవేషమును పాలవేకకదిరీపతి బాగుగ వర్ణించి యున్నాఁడు.[16] రాజులు సిగలో తాయెతులు, నెత్తిపై కుళ్ళాయి, చెవులలో పోగులు. కంఠమున ముత్యాలహారములు బంగరుగట్టికమ్ములు వలెనె దుప్పటిని వలెవాటుగను ధరించెడివారని యీపద్యములలో నాకవీంద్రుఁడు వర్ణించియున్నాఁడు. ఈవిషయమును సురవరము ప్రతాపరెడ్డిగారుకూడఁ బ్రస్తావించియున్నారు.[17] ఆకాలములో పురుషులుగూడ స్త్రీలవలె శిరోజము లను పొడవుగఁ బెంచి, సిగఁజుట్టి పూలతో సలంకరించుకొనెడివారు. నొసటఁ గస్తూరీతిలకమును పెట్టుకొనెడివారు.[18] రాజులు, రసికులు, భోగపరాయణులును గోవజవాజి, మంచిగంధము, కస్తూరి మొదలగు పరిమళ ద్రవ్యములను దమదేహములకుఁ బూసికొనెడివారు. సుందరీ మణులు తమ ముక్కులను ముత్తెపుముంగరలతో, సుకుమారహస్తములను పసిడిగాజులతో, పచ్చలు పొదగఁబడిన కడియములతోను సలంకరించు కొనెడివారు.[19]

అర్జునుని సన్యాసివేషమును వర్ణించిన సందర్భములో నీకవీంద్రుఁడు తనకాలమునాఁటి సామాన్య సన్న్యాసివేషమును గన్నులకుఁ గట్టినట్లు చిత్రించినాఁడు.[20] లలాటమున నూర్ధ్వపుండ్రము, కటీరమునఁ గాషాయ వస్త్రము, కుడిచేతియందుఁ ద్రిదండము, డాకేల గమండలువును ధరించి యుండుట నాఁటి సన్న్యాసుల బాహ్యవేషముగఁ దెలియుచున్నది. పురు షులు నడుమునకు వస్త్రముఁ జుట్టుకొనెడివారు. రాజులు, ధనికులును బంగరు జరీతోఁగూడిన సన్నవస్త్రమును నడుమునకుఁ జుట్టుకొని మెడలో

16. శు. స. .... పాలవేక కదిరీపతి — ఆ. 1, ప. 116, 249
17 ఆం. సాం. చ — సు. ప్ర. రెడ్డి — పే. 301
18 వి. వి. — ప్ర. ఆ. .... ప 64
19 ,, — ,, .... ప 79, ద్వి. ఆ. ప. 161
20 వి. వి — ది. ఆ. ... ప 81

మణిహారములు ముత్యాలహారములను ధరించెడివారు.[21] రైవతకోత్సవమునకేగు రేవతీబలరాములను వర్ణించిన సందర్భములో రాణుల యలంకరణ విధానమును, రాజుల వేషధారణ విశేషములను గొన్నిటిని సూచించియున్నాఁడు. [22] రాణులయొక్క, సంపన్నగృహిణులయొక్కయు కుచములపై, చెక్కిళ్ళపైన లత్తుకతో మకరికాది పత్త్రిరేఖలను దీర్చెడివారు. రాజులు తమ శరీరములపై మంచిగంధము పూసికొని మేలువస్త్రమును వలె వాటుగ వేసికొనెడివారు. మునివేషముననున్న యర్జునుని సేవించుటకు వచ్చిన సుభద్రను వర్ణించిన సందర్భములో నామె చందురుకావి పావడ, సరిగంచుచీరను ధరించినట్లు వర్ణించుటనుబట్టి నాఁటి యువతులు సిందూరవర్ణములోనున్న పావడలను, జలతారు చీరలను ధరించెడివారని తెలియుచున్నది. [23] పావడయను శబ్దమునకు స్త్రీలు మొలఁగట్టుకొనెడు వస్త్రవిశేషము, ధౌతవస్త్రము, వస్త్రమునను నర్థములను నిఘంటుకారులిచ్చియున్నారు. [24]

సుభద్ర యలంకరించుకొనివచ్చిన తీరు వర్ణింపఁబడిన సన్నివేశములో నాఁటి సుందరీమణుల యలంకరణ విధానము సూచింపఁబడినది. [25] ఆకాలమునందలి కాంతలు కంగులుదీర్చిన పైఠిణీఱవికఁ దొడిగికొని, మృదుశిరోజములను జక్కఁగఁ గొప్పువెట్టుకొని, దానిపైఁ జెంగల్వలను మనోహరముగఁ దుఱుముకొని, పాదములను బంగారందియల నలంకరించుకొని, ముద్దుఁజిల్కను జేఁదోడువాదోడుగఁ జేసికొని శృంగారరసాధిదేవతలవలెఁ గానవచ్చెడివారని యీవర్ణనమునుబట్టి తెలియుచున్నది.

21 వి. వి. — ,, — ప. 84
22 ,, — ,, — ప. 93, 94
23 ,, — ,, — ప. 130
24 శ. ర. — ఆ. పీ రా. — పే. 489
25 వి. వి. .... ద్వి. ఆ. — ప. 157

ఈసందర్భమునందు వాడఁబడిన "పైఠిణీఅవిక" యను పదమునకుఁ గొంత చారిత్రక ప్రాధాన్యమున్నట్లు దోచును. పైఠాన్ (ప్రతిష్ఠాన) పుర సంప్రదాయమును బట్టి తయారైన అవికను పైఠిణీఅవిక యందురు. ఈవిషయమును తాపీ ధర్మారావుగారు తమ వ్యాఖ్యలోఁ బ్రస్తావించియున్నారు.[26] పైఠన్‌పట్టణమందు సిద్ధమైన అవిక పైఠాణిఅవిక యనఁబడునని సురవరము ప్రతాపరెడ్డిగారుగూడఁ జెప్పియున్నారు.[27] ఈపదమును గదిరీపతి గూడఁ దన ప్రబంధములో వాడియున్నాఁడు.[28] "మంజీరాఘోషము మెఱయ"[29] అని సుభద్రానూపుర నినాదమును వర్ణించు పట్టునప్పటి విలాసవతుల మనోహర మంజీరానినాద భంగిమాంచితములైన యొయ్యారపు నడకలను ధ్వనింపఁజేసినాఁడు. మఱియు నిచ్చట గోదావరి కుపనదియైన మంజీరానదియొక్క ప్రవాహధ్వని విశేషము సూచింపబడినది.

"వలిపంబుఁ దాల్చివచ్చినకీవి"[30] యని సుభద్రవచ్చిన తీరును వేంకటకవి వర్ణించిన సందర్భములో నాఁటి యాంధ్రవనితల కభిమానపాత్రమైన తెల్లచీర సూచింపఁబడినది మఱియు నీసన్నివేశములో సుభద్ర కీల్గంటువైచికొని, జడయల్లుకొనియు వచ్చిన పద్ధతులను వర్ణించుటలో నాఁటియాంధ్రకాంతల మోహనకబరీభరము, వేణీవిలాసాతిశయమును సూచింపఁబడినవి. కీల్గంటనఁగా జాఱుగాముడిచిన వెండ్రుకల దూముడియను నర్థము నిఘంటువులలోఁ గానవచ్చును.[31]

విరహతాపోపశమనార్థము సుభద్రకామె చెలులు చేసిన శైత్యోప

26 హ్యా వ్యా, — తా, ధ, ... పే. 478
27 ఆం, సాం. ... సు. ప్ర. ... పే. 351
28 శు. స — పా, క, ... ప్ర, ఆ, ... ప, 226
29 వి. వి. — ద్వి. ఆ — ప. 201
30 వి. వి. — తృ. ఆ. — ప 18
31 శ. ర .... పే. 178

చారముల తీరుతెన్నులను బట్టి యప్పటి యంతఃపురస్త్రీలు, సంపన్న గృహిణులును పన్నీటిస్నానములఁ జేసి చలువలు గట్టుకొనెడివారని, శరీర మందంతటను మంచిగంధము పూసికొనెడివారని, కర్పూరముతో నామము తీర్చికొనెడివారని, కొప్పుమ్మడిపైఁ బూలదండ నలంకరించికొనెడివారని, కంఠసీమలందు ముత్యాలహారములు ధరించెడివారనియు దెలియుచు న్నది. 32 ఈసన్నివేశములోఁ బేర్కొనఁబడిన వస్తువులన్నియుఁ జల్లఁ దనమును గలిగించునవై యున్నవి. కాలానుగుణములైన వస్తువులను వాడుటకుఁ దగిన విజ్ఞానవివేకములు నాఁటినుండియు నాంధ్రులకుఁ గల వను విషయమీసందర్భమునందుఁ దెల్లమగుచున్నది. కిరీటిని బాగుగ నలంకరించి పెండ్లికొడుకును గావించినట్లు చేసిన వర్ణనలో పెండ్లికుమా రుల నలంకరించెడి పద్ధతియంతయు సూచింపఁబడినది.33 ఆయలంకరణ విధానమంతయు స్త్రీలే నడిపినట్లు వర్ణించియుండుటనుబట్టి నాఁటి సామాజిక వ్యవస్థలో స్త్రీలు వహించిన పాత్ర వ్యక్తమగుచున్నది. మఱియు నొక్కొక్క విధమగు నలంకరణమున కొక్కొక్కకాంత నియమింపఁ బడినట్లు చెప్పుటనుబట్టి యప్పటి యాంధ్రవనితల యలంకరణ కౌశలము తెలియుచున్నది.

అర్జునుని మీసములతీరును వర్ణించిన సందర్భములో నీకవి నాఁటి రాజులు, సధికారులును మీసములను బెంచుకొనిన పద్ధతిని సూచించి యున్నాఁడు. 34 అవి వారి పౌరుషమునకు, గాంభీర్యమునకు, ఠీవికి, నందచందములకును చిహ్నములుగ నుండెడివి. వివాహసమయమందు వరుఁడు వధువుమెడలోఁ దాళిబొట్టు గట్టు నాచారము చిత్రాంగదార్జునుల వివాహసందర్భములో, సుభద్రార్జునుల వివాహసందర్భములోను సూచింపఁ

32 వి. వి. — తృ ఆ. .... ప. 38
33 ,, .... ,, .... ప. 79, 80, 81
34 ,, ,, — ప. 85

జడినది. 35 మాంగళ్యచిహ్నమైన యాతాళిబొట్టు వధువుల గళసీమల కలంకారమై యలరారుటయేగాక పవిత్ర భారతీయ దాంపత్య జీవితవిశేష చిహ్నముగఁ గన్పట్టును. "చంద్రికపూవన్నియజిల్గుఁజేలకటినెంతేగట్టిగాఁ జుట్టి" 36 యని వివాహసమయమున సుభద్ర నడుమునకుఁ గట్టిన వస్త్ర మును వర్ణించుటనుబట్టి యాకాలములోఁ బెండ్లికుమార్తె నడుమునకు నెఱ్ఱని వస్త్రమును బిగువుగఁజుట్టెడి యాచారముగలదని తెలియుచున్నది. ఇట్లు విజయవిలాసకారుఁడే వేషమును వర్ణించిన, నేయలంకరణ విధాన మును బేర్కొనినను వానియందు సమకాలికమైన యాంధ్రతాముద్ర కన్పట్టును.

## ప్రజాజీవనము

తంజావూరి నాయకరాజులు సుసంఘటిత సాంఘికవ్యవస్థను సంరక్షించి, ప్రాచీనసంస్కృతిని కాపాడినారు. వర్ణాశ్రమధర్మములు, తత్తదుచితాచారసంప్రదాయములు, కులవృత్తులును గ్రమముదప్పకుండ రఘునాథ నాయకునిచేఁ గాపాడఁబడినట్లు వేంకటకవి సూచించియున్నాఁడు.37 వర్ణాశ్రమ ధర్మరక్షణమే దండనీతికిఁ బ్రధాన ఫలమని పుట్టపర్తి నారాయణాచార్యులు గారు చెప్పియున్నారు.37A ఆనాఁటి ప్రజలు గ్రాసవాసోదైన్యము లేకుండ తమ జీవయాత్రలను సక్రమముగ సాగించిరి. భౌతికజీవితము నిస్సంశయముగ, నిరాటంకముగ, నిరుపద్రవముగ సాగినపుడే మానవుని మేధస్సు శక్తి సమన్వితమై మహోన్నతపథములో పురోగమించును. అట్టిమేధశ్శక్తి సమన్వితుల నిర్విరామ కృషిఫలితముగ శాస్త్రములు, కళలును సముత్పన్న

35 ,, — ద్వి. ఆ. .... వ. 22, — తృ. ఆ. — వ. 94
36 వి. వి. — తృ. ఆ. వ. 138
37 వి. వి. ... ప్ర. ఆ. ... వ. 4
37A వి. సా. చ. .... పు. నా. — పే. 233

ములై బుద్ధివికాసమునుఁ హృదయసంస్కారమును గలిగించును. సరస హృదయులైన నాయకరాజుల పరిపాలనాకాలములో లలితకళలు బాగుగా వర్ధిల్లి ప్రజాహృదయవికాసమున కెనలేని దోహదముగావించినవి. అట్టిలలిత కళావికాసమై ఖరి ననేక సందర్భములలో సూచించియున్నాఁడు. [38] నాఁటి పట్టణమునందలి వారకాంతావాటికలు విటుల సనిలాసవిహారములతో విలసిల్లు చుండెడివి తంజాపురవారకాంతామణుల నెఱజాణతనమును, విటవిహారము లను, కాముకుల బేరసారముల మర్మములు గ్రహించిన పుష్పలావికల నర్మ గర్భోక్తులను సమయానుకూలముగ నీకవీంద్రుఁడు పేర్కొనియున్నాఁడు. [39] ఆంధ్రదేశమునందు, తంజావూరుప్రాంతమునందు ను విరివిగాఁ బెంచఁ బడెడి కర్పూరపుటరటి తోఁటలు, పోఁకమ్రాఁకులును సూచింపఁబడినవి. [40] అవి కనులపండువుగనుండి ప్రజలయవసరములుదీర్చుటయే గాక సుఖ శాంతులకు నాలవాలమైయుండెడివి. ఇంద్రప్రస్థపురమును వర్ణించిన సంద ర్భములో నాఁటి గృహిణులు తమ ముంగిలివాకిళ్ళను ముత్యాలముగ్గులతోఁ దీర్చి గృహములను దీపికాశ్రేణులతో నలంకరించెడి విధానమును, ధూప వాసనలతో మంగళవాయిద్యఘోషలతోను నిత్యకళ్యాణము పచ్చతోరణముగ నుండెడి గృహవాతావరణము నీకవి సూచించియున్నాఁడు. [41] మనోహరముగ ముగ్గులుదీర్చుటయందాంధ్రవనితలకుఁగల యసమాన కౌశలమునిట సూచిం చినాఁడు. ఆంధ్రులుతమ శరీరముల నలంకరించుకొనునట్లే తమగృహము లను, దత్పరిసరములను మనోరముగ నలంకరింతురు ఇది యారోగ్యకర మైన సదాచారము. వారి యంతశ్శుద్ధికిని యొక బాహ్యానిదర్శనము.

38 ,, .... తృ. ఆ. — ప. 201
39 ,, — ప్ర. ఆ. — ప. 14, 16
40 వి. వి. — ప్ర. ఆ. — ప. 17
41 ,, — ,, — ప. 18

నాఁటి కుటుంబ జీవన విధానము సాధారణముగ సమష్టి పద్ధతి లోనే సాగింపఁబడినట్లు తెలియుచున్నది. పెద్దల మాటలను పిన్నలు పాటించెడి వారు. అగ్రజుని యాజ్ఞ ననుజులతిక్రమించెడి వారుకారు. పొరపొచ్చెములు లేకుండ నన్నదమ్ములన్యోన్యాను బంధముతో నలరారెడివారు. పాండవుల సరాగ సంపత్తిని వర్ణించిన సన్నివేశములో నిట్టి సమరస కుటుంబవ్యవస్థను వేంకటకవి వ్యంజింపఁజేసినాడు. [42] అగర్భ శ్రీమంతులు నిరాడంబరులై యణఁకువగ నుండెడివారు. కాసి నడుమంత్రపుసిరి గల్గిన వారు నిక్కుచు, నీల్గుచు, విఱ్ఱవీఁగుచు నంచరించెడివారు. సుభద్ర యొక్క నవయౌవన విలాసమును వర్ణించు సందర్భములో వాడఁబడిన లోకోక్తిలో నీవిషయము ధ్వనించుచున్నది. [43] అట్లు మిడిసిపడు వారు నేఁటికిని కన్పట్టుచున్నారు. నాఁటి ప్రజలకు శకునములపై విశ్వాసమధికముగా నుండెడిది. శకునము లను బట్టి యాత్మ కార్యానుకూలాననుకూల పరిస్థితుల నూహించు కొనగల్గెడి వారు. "ఈయనుకూల మారుతాగతిఁగనుగొన నామోద సూచకంబైనదిగా" అనునర్జునుని మాటలలో ననుకూల మారుతాగతి నొక శుభశకునముగాఁబరి గణించునాంధ్రుల సదాచారమును సూచించినాఁడు. అట్టి శకున ప్రస్తావన నితర సన్నివేశములందును సమయానుకూలముగఁజేసి యున్నాఁడు. [44] కండ చక్కెర, పంచదార యను పదములు విజయవిలాసము లో మాటి మాటికిని వాడఁబడుటను బట్టి నాఁటి ప్రజలు పటిక బెల్లమును, పంచదారను నధికముగ నుత్పత్తి చేసి విరివిగా వాడెడివారని తెలియుచున్నది. [45] కస్తూరి, కర్పూ రము, మంచిగంధము, కుంకుమ, జవాది, పన్నీరు మొదలగు పరిమళ ద్రవ్యముల ననేక పర్యాయములు విజయవిలాసములో వాడియుండుటనుబట్టి

42 ,, — ,, .... ప. 25, 26

43. వి. వి. — ప్ర. ఆ. — ప. 34

44. ,, — ,, — ప. 53, 140, 141.

45. ,, — ,, — ప. 71, 94.

యానాటి ప్రజల భోగమయ జీవితములు వ్యక్తములగుచున్నవి. 46 రాజులు నధికారులు, సంపన్న గృహస్థులు నానుగంధ ద్రవ్యములలో మునిగి తేలెడి వారు. గోవా నుండి దిగుమతి యైన జవాది, కాశ్మీరమునకుఁ జెందిన కుంకుమ ద్రవ్యమును నాఁడు మిక్కిలి ప్రసిద్ధిఁ గాంచినవి. కనుకనే వానిని గోవ జవాది, కాశ్మీర కుంకుమ యని వేంకటకవి వ్యవహరించి యున్నాఁడు. పోఁక చెక్కలు, కర్పూరము మొదలగు సుగంధ ద్రవ్యములను జేర్చిన తాంబూలమును సేవించెడివారు. 47 అతిథులకు భోజనానంతరము, శుభసమయములందు విచ్చేసిన బంధుమిత్రులకుఁ దచ్ఛుభ సూచకముగను తాంబూలము నిచ్చుట యాంధ్రుల యాచారము. తమ యాస్థానములకు విచ్చేసిన విదేశవు రాయబారులకును, యాత్రికులకును గౌరవ సూచకముగ నాఁటి రాజులు తాంబూలము నిచ్చెడివారు. అప్పటి నాయకరాజు తాంబూల సువర్ణాభరణాదుల నిచ్చి తనను గౌరవించినట్లు ఫాదర్ నికోలాస్ పిమెంటా యను పాశ్చాత్య యాత్రికుఁడు చెప్పియున్నాడు 48

అర్జునుఁడు, నతని పరివారజనులును మాపటివేళ నిశ్చేష్టులైయున్న పరిస్థితిని వర్ణించిన సందర్భములో "చొక్కుఁజల్లిన యనువున" అని వ్యవహరించుటను బట్టి పరవశీకరణము కొఱకు నాఁరోజులలో మంత్రభస్మమును జల్లెడి సంప్రదాయమున్నట్లు తెలియుచున్నది. 49 ఈవ్యవహారమునే యీయభిప్రాయములో పెన్నెలకంటి సూరన్న తన గ్రంథములోఁ జేసియున్నాఁడు. 50 రసవాదము, వాగ్బంధము, రాజవశ్యవిద్య మొదలగు క్షుద్రవిద్యలానాఁడు వ్యాప్తిలోనున్నట్లు తెలియుచున్నది. 50A "నాక

46. ,, — ,, — ప. 75, 76. — తృ. ఆ. -ప. 38, 81, 192
47. ,, — ,, — ప 106
48. Purchas; — His piligrims. — Vol x, P. 205
49 వి. వి. .... ప్ర. ఆ .... ప. 72
50 వి. పు. .... వె. సూ ... 7, ఆ. .... 3.
50A వి. వి, ... అవతారిక .... ప. 18

నులయాన, నావలపుఁగస్తురి నామముతోడు" అని యర్జునునికడ ను లూచి ప్రాథేయపూర్వకముగఁ బలికిన పలుకులనెపమున నీకవి తన కాలము నాఁటి యాంధ్రుల యొట్టులుపెట్టు నాచారమును సూచించియున్నాఁడు [51]

విజయవిలాసమునందు వర్ణింపఁబడిన వైవాహిక సన్నివేశములలో మంగళస్నానము చేయించుట, పాదములు కడుగుట, తెరనమర్చుట, మంగళసూత్రముగట్టుట, తలఁబ్రాలువోయుట, ధవళములుపాడుట, బువ్వాన భుజియించుట (పంక్తిభోజనముచేయుట) మున్నగు నాంధ్రుల పెండ్లివేడు కలు మనోహరఫణితులలో సూచింపఁబడినవి. [52] ధవళములనగాఁ బెండ్లి పాటలని సురవరము ప్రతాపరెడ్డిగారు దెల్పియున్నారు [53]

సుభద్రార్జునుల వైవాహిక కార్యమును వర్ణించిన పద్ధతినిఁబట్టి నాటి యాంధ్రుల వైవాహిక సంప్రదాయములు చక్కఁగ వ్యక్తములగు చున్నవి. వివాహ మండప సమీపమునఁ గులదేవతా విగ్రహమును నిలుపుట, ముత్తైదువలు పాటలుపాడుచు నైరేనికుండలను దెచ్చుట. పరిశుభ్రములైన ముత్యముల్తో బాసికములు గట్టుట, తలఁబ్రాలకై మంచి ముత్యములను బంగరు పళ్ళెరములలో నింపియుంచుట, పణవము, శంఖము, ఢక్క, తప్పెట, బాకా మున్నగు మంగళవాద్య విశేషములను వివాహోత్సవ సూచకముగ ప్రయోగించుట, దివ్వెటీలు పట్టుట, యుభయ పార్శ్వములనుండి వింజామరలు వీచుట, ద్విజకాంతలు ముత్తెపునేసలు జల్లుట, కన్యాప్రదాత యల్లునకు మధుపర్కమునిచ్చుట, మంగళ నీరాజనములిచ్చి వధూవరుల నాశీర్వదించుట మున్నగు వైవాహిక సంప్రతి

51 వి. వి. ... ప్ర. ఆ. ... ప. 97
52 ,, .... ,, — ప, 129, తృతీ.ఆ. ... ప. 110, 111, 116
53 ఆం, సాం, చ. ... ప్ర. 3 — పే. 138

దాయము లీసందర్భములో సూచింపఁబడినవి.[54] వియ్యంకులు, వియ్యపు రాండ్రు నితర బంధువర్గమును గలిసి బువ్వాన భోజనముచేయుట కర్పూరపుఁ దాంబూలమును బట్టువస్త్రమును బెండ్లికుమారుని తండ్రికి మర్యాదాపూర్వకముగ నిచ్చుట, ప్రయాణసమయమున వియ్యంకులు పరస్పరము చేతులు పట్టుకొని కొంతదూరము నడిచి "దయచేసియుండుఁడిఁకరావలదు" అని మనఃపూర్వకముగ వీడ్కోలువచనములు పలుకుట మొదలగు వివాహానంతర మర్యాదలుగూడ నీసందర్భములోఁ బేర్కొనఁబడినవి.[55] బువ్వపు భోజనపద్ధతిఁ యానాటి సాంఘిక సమైక్యభావమును జక్కఁగ సూచించుచున్నది. పెండ్లిసమయమునందు నాల్గవనాఁడు జరిపించు నాగవలియను శుభకార్యవిశేషముగూడ నీసందర్భములో సూచింపఁబడినది.[56] నాఁటి ప్రజలు తమ సిరిసంపదలకుఁ దగినట్లు పెండ్లివేడుకల నైదురోజులు సాగించెడివారని తెలియనగును.

సాధారణముగ నాటి కవులు, పండితులు నీర్ష్యా ద్వేషములచే స్పర్ధలు పెంచుకొని తఱచు పరస్పర విమర్శలకుఁ బాల్పడెడివారు. ఒకని యభివృద్ధిని వేఱొకఁడు సహింపఁజాలక యతనిని కించపఱచుటకై కువిమర్శనేసెడివాఁడు. ఒక కవియెంతరసవంతముగఁగావ్యరచన చేసినను సమకాలికులు మెచ్చుకొనక పోవుటయేగాక యతని కవిత్వమును పలు విధముల విమర్శింతురు. కులహీనుఁడైన కవిని మఱింత నీచముగ విమర్శింతురు. "బోద్ధారో మత్సరగ్రస్తాః" అని పెద్దలనినట్లు నాఁటి మత్సరగ్రస్తమైన కవి పండిత సమాజములో నట్టి విపరీత విమర్శనాత్మకధోరణి యధికముగ నుండెడిదని తెలియుచున్నది. చేమకూర వేంకటకవి కవిత్వముగూడ నట్లే సమకాలికుల విమర్శలకు గుఱియైయుండును. తన తొలిగ్రంథమైన సారంగ

54 వి. వి. — తృ. ఆ ప. 98, 102, 104, 105, 110, 111, 115
55 వ. 123
56 వ. 130

ధరచరిత్ర వలన నంతగా సంతృప్తిఁ జెందనివారినిఁ దృప్తిపఱచుటకై యా కవీంద్రుఁ డెంత శ్రమపడి, తన సకల కవితాశక్తిని వినియోగించి విజయ విలాసమును రసనిర్భరముగరచించినను మెచ్చుకొనక యతని కవిత్వమును కొందఱు విమర్శించియుందురు. అట్టి కుమర్శలకు వెతఁజెంది యాకవి తల్లజుఁడు వసంత చంద్రివిజృంభణాత్మక వర్ణనలోఁ జెప్పిన "ఏగతి రచియించి రేని సమకాలము వారలు మెచ్చరేకదా"[57] అను మనోహర లోకోక్తి యందాత్మ నైరాశ్యమును వ్యంజింపఁజేసినాఁడు. అట్టి వ్యధితహృదయము నుండి స్పందనాత్మకముగ వెలువడిన యీ పద్యరత్నమొక కళాఖండికయై యాంధ్రికవితాసుందరి కనర్ఘభూషణమై యొప్పినది.

అర్జునుఁడు మలయధ్వజునిల్లటపల్లుఁడైనట్లు వర్ణించుటనుబట్టి యిల్లఱికపు పద్ధతి యానాఁటికే యాంధ్ర జాతిలో బాగుగ వ్యాపించినట్లు తెలియుచున్నది.[58] పురుషుల తోపాటుస్త్రీలు గూడ నుత్సవములలోఁ బాల్గొని తమ దైనందిన కార్యకలాపముల వలనఁ గల్గిన శారీరక మానసిక శ్రమలను దొలఁగించుకొని యానందించెడివారు. గర్భిణీ స్త్రీకి సీమంతోత్సవము జరిపెడి యాచారమారోజులలో నుండెడిది.[59] ఉత్సవ సమయము లలో పందిళ్లు వేసి వానికి వట్టి వేళ్ల, చాందినీలు మున్నగు వానినిఁ గట్టి చక్కఁగ నలంకరించి కపురంపు గిన్నెలు, కస్తురి కాయలు, గంధ మాల్యములు, మున్నగువానిని రాశులుగ నుంచెడివారు.[60] ఈసుగంధ ద్రవ్యములు. భోగ్యవస్తువులును నాఁటి యాంధ్రిజాతియొక్క భోగమయ జీవిత విధానము లను, సిరిసందలను నాగరకతాభివృద్ధిని సూచించుచున్నవి. సుభద్ర నవ రత్న హేమ రచిత పల్యంకిక నెక్కి రైవతకోత్సవమునకు వచ్చినట్లు

57 వి. వి. — ప్ర ఆ. — ప. 145.
58 వి. వి. .... ద్వి. ఆ. ప. 35
59 ,, .... ,, ప. 37
60 ,, .... ,, ప. 89, 90, 91, 95

వర్ణించుటను బట్టి నాఁటి యంతఃపుర కాంతలు పల్లకీలలో ప్రయాణములు చేసెడివారని తెలియుచున్నది.[61] సుభద్ర యొక్క యవయవ వర్ణన చేసిన సందర్భములో నీకవీంద్రుఁడు తన కాలము నందు వ్యవహారము లోనున్న దీర్ఘము, తలకట్టు పొక్కిలి, (గుడి), బంతులు (పంక్తులు), సున్న యను లేఖనచిహ్నములను గొన్నిటిని భంగ్యంతరముగ సూచించియున్నాడు.[62]

సన్న్యాసివేషమున ద్వారకానగరమునకు వచ్చిన యర్జునుని యునికికై యొక యుప్పరిగ నేర్పఱచినట్లు చెప్పుటను బట్టి యాకాలములో నుప్పరిగ యను నొక విధమగు గృహ నిర్మాణము చేయఁబడుచున్నట్లు తెలియుచున్నది.[63] ఈ శబ్దమునకు నైఘంటికులు మిద్దె మీది కట్టడము, మేడ యను నర్థముల నిచ్చియున్నారు.[64] నేఁడు మనము చల్లఁదనము కొఱకు నీటిలో నైసుగడ్డలు వేయునట్లే నాఁడు నీటిలో మంచు గడ్డలు వేసెడివారని, చంద్రకాంత శిలలతో పాత్రలను దయారు చేసెడివారని దెలియుచున్నది.[65] "చేసిన యది జపమున్ మఱి వేసిన యది గాలము" అను లోకోక్తిని సందర్భాను గుణముగా వాడుటను బట్టి నాఁడు బకజపములు చేసెడి సన్న్యాసులున్నారని సూచించుటయే గాక గాలము వేసి చేపలను బట్టు కొను పద్ధతి గూడ వ్యాప్తిలో నున్నట్లు దెలిపినాఁడు.[66]

"వలపువడ్డికిఁబాఱన్" [67] అని వర్ణించుటలో నాఁటిసంఘములో వ్యాప్తినందియున్న వడ్డీవ్యాపారము సూచింపఁబడినది. సుభద్రను దనప

61 వి. వి. .... ద్వి. ఆ. ప. 97
62 ,, .... ,, వ. 104
63 ,, .... ,, ప. 127
64 శ. ర. .... పే. 92
65 వి. వి. — ద్వి. ఆ. ప. 133
66 ,, .... ,, వ. 135
67 ,, — ,, ప. 171

గూర్చుమని యర్జునుఁడు చిలుకనర్థించు సందర్భములో "నిన్నుఁదనిపింతుఁ జుమీ! చెలినన్నుఁ నేలినన్" 68 అని యాశఁజూపుచుఁ బలుకుటను బట్టి నాఁడు లంచములిచ్చి పనులు చేయించుకొను నలవాటున్నట్లు తెలియుచున్నది. "నన్ను గాంధర్వంబునను బెండ్లియాడవే" 69 అని యర్జునుఁడు సుభద్రనర్థించినట్లు వర్ణించుటనుబట్టి యారోజులలో గాంధర్వ వివాహము గూడఁ బ్రచారములో నున్నట్లు తెలియుచున్నది. వధూవరులు పరస్పరేచ్ఛతో నమంత్రకముగఁ జేసికొను వివాహమును గాంధర్వమందురు. శాస్త్రబద్ధములైన బ్రాహ్మరాక్షసాద్యష్టవిధవివాహములలో నిదియొకటి." పెద్దలున్నారెఱిఁగి వారె పెండ్లి సేయఁగలరు, వేగిరపాటింతవలదు"70 అని సుభద్ర పలికిన పలుకులనుబట్టి యప్పటి కన్యకలనురాగపూర్వక కార్యకలాపములలో, వైవాహిక వ్యవహారములందును స్వేచ్ఛయుండెడిదికాదని. కొంత నిగ్రహశక్తి గలిగి తల్లిదండ్రులకుఁ బెద్దలకును వారు విధేయలై యుండెడివారనియును దెలియుచున్నది. ఆకాలములో వెలువడినట్లు చెప్పఁబడుచున్న-

మ॥ వనజాతాంబకుఁడేయు సాయకములన్ వారింపఁ గారాదు. నూ
తనబాల్యాధికయౌవనంబు మదికిన్ ధైర్యంబురానీయది
ట్లనురక్తిన్ మిముబోంట్లకున్ దెలుపనాహాసిగ్గుమైకోదు, పా
వన వంశంబు స్వతంత్రమీయదు సఖీ! వాంఛల్ తుదల్ముట్టునే

అను నజ్ఞాతకర్తృకచాటుపద్యమునుబట్టియు నాఁటికన్యలకుఁ బ్రణయ కలాపములందు స్వేచ్ఛలేదను విషయము స్పష్టపడుచున్నది.

వి. వి, ద్వి. ఆ. ప, 185
ప. 190
70 ప. 187

ఆరోజులలో తంజావూరు ప్రాంతమునందు వ్యాపించియున్న కర్పూరపుటరంటితోటలు, ద్రాక్షతోటలు, చెంగల్వబావులు, క్రీడాసరస్సులు, వట్టివేళ్ళ చప్పరములు మొదలగువానినీకవి యొక వచనములో సూచించియున్నాఁడు.[71] నాఁటి ప్రాకృతికశోభకివి నిదర్శనములు. తత్ప్రాంత భూసారమును, రైతులశ్రద్ధనుగూడ నాతోటలు సూచించుచున్నవి. క్రీడా సరస్సులు మున్నగునవి నాఁటిరాజులచే వారి భోగములకు జీవితములకనుకూలముగ నేర్పఱచుకొనఁబడినవని తెలియుచున్నది. కోపాతిరేకముచే హృదయకవాటములు బంధించుకొని శారీరకముగను, మానసికముగను దూరులైన యాత్మీయులను బెదరించి దగ్గరకుఁ జేర్చువారిని, యనురాగ బంధములను సడలించుకొని, పట్టుదలలు పెంచుకొని కలయికలేకుండ నేకాంతజీవయాత్ర సాగించువారిని మమతాబంధముతో నొకచోటికిఁ జేర్చువారిని, యువతీయువకులకు వివాహములు గూర్చువారిని మహోపకారులుగ నాఁడు భావించెడివారు. [72] ''చదువఁబెట్టగనున్న మతియుఁబోయె'' ననులోకోక్తినివాడి యప్పటిచదువరుల మతిభ్రమణ పరిస్థితులను సూచించియున్నాఁడు. [73] ఈలోకోక్తి నేఁటికి నాంధ్రజనవ్యవహారములో నిలిచియున్నది. ఏమానవుఁడును బరిపూర్ణుఁడుగాఁడని, యేదోయొకలోపము ప్రతిమానవునిలోను గానవచ్చునని, యట్టిలోపలేశమును విడనాడి గుణాధిక్యమును మెచ్చుకొనవలెననియును "నేరములెయెంచెదమటన్న నేరికైనఁ గలవు పరికించిచూడ" అను లోకోక్తిరూపమున నాఁటి సమాజమునకీకవి సందేశమిచ్చినట్లు తోచును. [74] రంధ్రాన్వేషణతత్పరత్వ ముత్తమమానవ లక్షణము గాదని సూచించినాఁడు. మఱియు లోపాన్వేషణాత్మక దృష్టితోఁ

71 ,, ... ,, వ. 200
72 వి. వి. — ద్వి. ఆ. — వ. 208
73 ,, — తృ. ఆ. — వ. 10
74 ,, — ,, — వ. 17

బరికించి చూచినచోఁ దనకవిత్వమునందు గూడఁ గొన్నిలోపములు గానవచ్చునని, యట్టి యల్పదోషములను ద్రోసిపుచ్చి తన రసవత్కవితాగుణములను సరసహృదయులు పరిగ్రహించుట సమంజసమనియు నీకవీంద్రుఁడీసందర్భములోఁ బ్రత్యేకముగ సూచించినట్లు కానవచ్చును. ఈసందర్భములో "ఏకోహిదోషోగుణసన్నిపాతే నిమజ్జతీందోఃకిరణేష్వివాంకః'' అను కాళిదాస లోకోక్తిని దృష్టికిఁ దెచ్చుచున్నట్లు తోఁచును.

తాపోపశమనార్థము పంచదారపానకమును ద్రాగెడియలవాటు నాఁటి ప్రజలకుండెడిదని తెలియుచున్నది. 75 ''కలదొయేమొసోఁకుడు'' అని 76 చెప్పుటనుబట్టి నాఁడు స్త్రీలను దయ్యములుపట్టి పీడించెడివని, తద్బాధా నివారణార్థము భూతవైద్యముచేయించు నాచారాముండెడిదనియును దెలియుచున్నది. 'సోఁకుడు' అను శబ్దమునకు 'పిశాచావేశమ'ను నర్థమునిచ్చి యీ విజయవిలాస ప్రయోగమునే బహుజనపల్లి సీతారామాచార్యులుగారు తమ నిఘంటువులో నుదాహరించియున్నారు. 77 ఆంధ్రులకుఁ బ్రీతికరమైన 'పొంగలి' యను మధురపదార్థము,(పాలు బియ్యమును గలిపిపొంగునట్లుడికించి యీ పదార్థమును దయారుచేయు పద్ధతియు నీ ప్రబంధములో సూచింపఁబడినవి.78 చంద్రోపాలంభన సన్నివేశములోఁ జేయఁబడినవర్ణనమును బట్టి నాఁటి సమాజములోఁ గూడ సందెనచోటట్టు, సందపిచో కాళ్ళను బట్టుకొనెడివారు, నేయందకాగొడుగు పట్టెడివారును నుండిరని దెలియుచున్నది.79 నాఁడు వాడుకలోనున్న నవాతునక్కెరనీకం పేర్కొనియున్నాఁడు. 80

75 వి. వి. — తృ ఆ. — వ. 23
76 ,, .... ,, — వ. 35
77 శ. ర. .... .... పే. 801
78 వి. వి. .... తృ. ఆ. వ. 41
79 ,, .... ,, వ. 51
80 ,, .... ,, వ. 56

